ప్రథమ పుష్పము ౧

సకలార్థ సహకార గ్రంథమాల.

# సకలార్థసహకారసంఘములు నిర్మాణము నిర్వహణము ఎందుకు ?



గ్రంథకర్త

శ్రీ నరసింహదేవర సత్యనారాయణ,

ఆలమూరు.

1951

వెల రు. 10-0-0

# అంకితము.

నాకు సహకార గురువర్యులును, పూజ్యులగు
"శ్రీ వేమవరపు రామదాసుపంతులుగారికి"



శ్రీ నరసింహదేవర సత్యనారాయణ, గ్రంథకర్త.

# ప రి చ య ము

అనాదినుండియు, గ్రంథకర్తలు తాము వ్రాసిన గ్రంథములను ప్రచురించుటలో అనేక కష్టములు పడుతూ వుండినమాట అందరమూ యెరిగిన విషయమే. గ్రంథము ప్రచురింప బడితేనేగాని దాని విలువ తెలియదు. విలువ తెలుసుకో గలిగిన వారుంటేనేగాని ప్రచురము గాదు. ఈ రెంటికి సహాయ భూతముగా పీఠిక అనియు ఉపోద్ఘాత మనియు, యిటీవల తొలుపలుకనియు వివిధ శీర్షికలక్రింద గ్రంథకర్తను, వీరి గ్రంథమును అందలి ముఖ్యమైన విషయములను పాఠకులకు, సమగ్రముగను, సంక్షిప్తముగను మధ్యస్థులు సూచించుట ఆచారమై వచ్చుచున్నది. ఏ తదాచారానుసరణముగా శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు నన్ను రెండు ముక్కలు వ్రాసి తనను, తనగ్రంథమును, లోకమున కెరిగింప వలసినదిగా కోరుటవల్ల యీ రెండు మూడు పుటలు వ్రాయుట తటస్థించింది. కాని ఒకరు నొకరు యితరులకు పరిచయము చేయునపుడు యెరిగించువారు, యెరిగింప బడువారికంటె పేరుప్రతిష్టలు గలవారై యుండవలెను. తద్విరుద్ధముగా యీ సందర్భములో సహకార లోకమునకు గ్రంథకర్తగారు చిరకాల పరిచితులై యుండుటే గాక అనంతసేవ చేసిన వారై

యుండుటచే వీరిపుస్తకమునకు నేను తొలిపలుకు వ్రాయుట అంతసమంజసముగ లేదు. 25 సంవత్సరముల నుంచి నేను యీ ఉద్యమమునందు పాల్గొనుట చాలించినాను 30 సంవత్సరముల నుంచి వీరి సహకార క్షేత్రములందు, దుబ్బు తీయుట మొదలు పంట పండేవరకు అన్నివ్యవసాయ కార్యములను స్వయముగా చేసి గ్రంథ పఠనము వల్లనేగాక స్వానుభవాలను ఉద్యమము నందలి రహస్యములను ఉద్యమముయొక్క సిద్ధాంతములను మన ప్రాచీన సంప్రదాయముతోను ఆధునిక ఆవశ్యకములతోను సమన్వయ పరచి స్థిరమైన పునాదిమీద సహకార భవనమును చిరస్థాయిగా నిర్మించిన మహాశిల్పి వీరు.

ఆనాడు పాండవులకై, మయుడు కట్టిన 'సుధర్మ' యను ప్రాసాదము యెట్లు శోభితమై యుండెనో అట్లే ప్రథమమున ఏకశిలగా గ్రామ సహకార సంఘము నిర్మింప బడియు అనంతరము బహూన్ముఖమైన సహకార మందిరము వీరిచే తమ గ్రామమునందును, తమ జిల్లాయందును, నిర్మింపబడి ఇది ఆధునిక సహకార ప్రపంచమునకు నమూనాగా (Model) ప్రవర్తించుచున్నది.

వీరిచే స్థాపింప బడిన పరిమితిలేని పూచీగల ఆలమూరు గ్రామ సహకార సంఘమైతేనేమి, ఆలమూరు

భూమి తనఖా బ్యాంకు అయితేనేమి వీటి కన్నిటికీ గోప్పరముగా అనంతరము యేర్పాటు చేయబడిన సకలార్థ సహకార సంఘమైతేనేమి ఒకదానికంటె నొకటి యెక్కువ ఉన్నతమై యెక్కువ ఉపయోగకరమై యెక్కువ ఆకర్షణీయముగను, అనుకరణీయముగను, మార్గదర్శిగను పనిచేయుచున్నవి.

కాంగ్రెసు యొక్క నూతన శకమునందు అనగా పరిపూర్ణ స్వాతంత్ర్య సంపాదనా నంతరము దేశము యొక్క పరమావధి (Co-operative Common wealth) అని స్థిరపరుప బడినదిగదా! ఇందుకు ప్రతి రాజ ధానియు, సజీవమైన అంగములుగా నుండునట్లు చేయుట కాంగ్రెసు సభ్యుల కర్తవ్యము. రాజధాని యొక్క ఉత్కృష్టమును అభ్యుదయము, మండలముల యొక్క అభివృద్ధిని బట్టియు మండలముల యొక్క పురోగమనము గ్రామముల యొక్కయు, గ్రామ పరిసర ప్రదేశముల యొక్కయు, స్వప్రయత్న పూర్వకమగు సంస్థలపై ఆధార పడియు ఉంటూ ఉండవలెను. పంటలనండి, ఉత్పత్తి అనండి, వీని రవానా పంపిణీ అనండి, వీని క్రయ విక్రయము లనండీ వ్యక్తి రూపకముగా గాక సహకార సంస్థలద్వారా యెప్పుడైతే జరుగునో అప్పుడే పంటల యొక్క ఒడిదుడుకును, రవానా (Transport)

యొక్క అనిశ్చయమును, క్రియ విక్రియముల యొక్క అవినీతియు అంత్యమగును. ఇట్టి సాధనములతోడను, యిట్టి సంస్థలతోను శోభాయమాన మగు రాజ్యమే సార్థకమైన ప్రజారాజ్య మగును. వీని నిర్మాణము యింకను ప్రాతి పదిక దశలో నుండుట శోచనీయము. కాని పునాదులుగనుండెడి యిట్టి సంస్థలు, సుస్థిరముగనూ, చిరంజీవులుగనూ, యెట్లు నిర్మింప బడవలెనో అట్టిరహస్య ములను సూత్రములను నేర్పరి తనమునూ, లోకానుభవ మునూ,పొందవలెనన్న సత్యనారాయణ గారిచే నిర్మింప బడిన సంస్థలనూ, గావింపబడిన సేవయు, యిందులకు సాహాయభూతములై ఆధునిక భారత చరిత్రలో ముఖ్య మైన అధ్యాయమగునని నిస్సంశయముగా చెప్పగలను.

న్యూఢిల్లీ
1-4-1951

ఇట్లు
డా. పట్టాభి సీతారామయ్య



అఖిలభారత కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకటారావుగారు.

# భూ మి క

1920 ఏప్రియలు మేనెల మధ్య నను జ్ఞాపకము. మా సెంట్రిలు డెల్టా కాలువలను మూసిన రోజులు. రాజమండ్రిలో జరుగనున్న జాతీయ మహాసభకు వెళ్ళుచు ఒక సాయంత్రము ఆలమూరు చేరితిమి. అచ్చటనున్న గ్రామ చావడిలో మకాము చేసితిమి. రాత్రి 9 గంటలవేళ, శ్రీ. పేరిశాస్త్రిలుగారు (అప్పుడు అపరిచితులు) వచ్చి, తమయింటికి భోజనమునకు రమ్మనమని పట్టుపట్టిరి. వెళ్ళక తీరినదిగాదు. తరువాత శ్రీ. శాస్త్రిగారు నిరతాన్న దాతలని తెలిసినది. ఆనాటి రాత్రియే శ్రీ. నరసింహదేవర సత్యనారాయణ గారి పరిచయ మైనది. ఆపరిచయము స్నేహముగా వర్ధిల్లి, రాజకీయ రంగములోను, సహకార రంగము లోను, మా కన్యోన్య గాఢమైత్రిగా పరిఢవిల్లినది.

శ్రీ సత్యనారాయణగారు రచించిన యీ గ్రంథము ఉత్తమ శ్రేణిలోనిది. ఆలమూరు సకలార్థ సహకార సంఘము పేరుతో రచింపబడినను, యీ పుస్తకము సహకారోద్యమము యొక్కయు తదనుబంధ విషయముల యొక్కయు సమగ్రముగు చరిత్రము యున్నది. సహకారోద్యమమునకు సంబంధించిన రెండు మూడు ప్రధాన సిద్ధాంతము లున్నవి. అందులో

ప్రధానమైనది, పరిమితమైన పూచీ. మనరాష్ట్రములో సహకారోద్యమమును స్థాపించునపుడు గ్రామ సహకార పరపతి సంఘము లన్నియు పరిమితిలేని పూచీగల సంఘములుగా స్థాపింపబడినవి. గత ఏబది సంవత్సరములలో ఆపద్ధతియే అమలులో నున్నది. సహకారోద్యమ పురోభి వృద్ధికి పరిమితిలేని పూచీపద్ధతి కొంత అవరోధము కల్గించినదని నానమ్మకము. కాని యీవాదన అధికార వర్గ సహకారులకు నచ్చలేదు. అందు వలన యెన్ని సహకార విచారణ సంఘములు విచారణలను సలిపి, మార్పును సిఫార్సు చేసినను, పెడచెవిని బెట్టిరి. ఎంతో పట్టుదలమీద పరిమితిగల పూచీమీద ఆలమూరు సకలార్థ సహకార సంఘ స్థాపన జరిగినది. ఎన్నియో ప్రత్యేక షరతులు విధింపబడినవి. ఈసంఘము కొలదికాలములో "లిక్విడేషను" జరుగునని పలువురు అధికారులు అనధికారులు తలచిరి. కాని ఆనాడు నాటబడిన యీ సంఘము బాలారిష్టములను విమర్శనలను అడ్డంకులను దాటి "ఇంతింతై వటుడింతయై, నభోవీధిపై నంతై" నేడు విమర్శకుల ప్రశంసలకును, సమర్థకుల సంతోషము నకును, సహకార వాదుల కాదర్శముగను, వెలుగొందు చున్నది. ఈ సంఘముయొక్క విజయ గాధకు, నిర్మాత కారకుడు బోధకుడు పోషకుడు నరసింహా దేవరయే.

ఈ పుస్తకము రెండు ఖండములుగా వ్రాయబడి నది. మొదటి భాగములో సహకార సిద్ధాంతములు జాతీయముగను, అంతర్జాతీయముగను, సవిమర్శముగ సరళ ముగా, విపులముగ చర్చింపబడినవి. శ్రీసత్యనారాయణగారి అభిప్రాయములతో నాకు సహమతము గలదు. రెండవ భాగములో గ్రంథమునకు మాతృకయగు ఆలమూరు సక లార్థ సహకార సంఘముయొక్క చరిత్ర, స్వరూపము, చేసినకృషి, సాధించిన విషయములు, సాధింపనున్న ఆదర్శ ములు, కార్యక్రమములు, కన్నులకు కట్టినట్లు వ్రాయబడి నవి. ఈ సంగతులను నేను తిరిగి పీఠికలో ఎత్తిచూప నక్కరలేదు. సంఘముయొక్క పురోభి వృద్ధిని కాంక్షిం చుటయే మనపని.

ఇటువంటి వుపయుక్త గ్రంథమును సరళ భాషలో రచియించి, ఆంధ్ర పాఠకులకు నందించిన నామిత్రులు సత్యనారాయణగారికి కృతజ్ఞతను ప్రకటించుటయే నాతుది వాక్యము.

(Sd.) కళా వెంకటారావు
25_3_51

## ఆ శీ శ్సు లు

నాచిర మిత్రుడు సహకార కల్పద్రుమ శ్రీనర సింహదేవర సత్యనారాయణగారు రచించి ప్రచురించిన "సకలార్థ సహకార సంఘములు" అనే గ్రంథాన్ని సాకల్యంగా చదివితిని

"సహనావవతు సహనౌ భునక్తుసహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥"

అని తానునుదినమును పఠించు యీ వేదోక్త శాంతి పాఠమునుండియే ఉత్సాహ ప్రభుమంత్ర శక్తి త్రయము నెప్పటికప్పుడు తనలో తానే పూరించుకొంటూ ఆప్రకారం తదేక దీక్షతో చిరకాలం ఈ సహకార శక్త్యుపాసనజేసి దాని విశ్వరూపాన్ని సాక్షాత్కరింప జేసికొన్న యోగసిద్ధుడు మా సత్యనారాయణగారు. 'పాసీయంబులుద్రావుచున్ గుడుచుచున్......... సహకారోద్యమ ధ్యానమే యీయనకు 'యేయథామాంప్ర పద్యంతే'...' అన్నట్లు సాధకుల సాధనాలక్షణములు విభిన్నమైన నామ రూప కర్మక్షేత్రములందు ప్రవర్తిల్లినను తుదకు జీవిత పరమార్థమగు ఆత్మోపలబ్ధిగాని ఈశ్వరానుభూతిగాని వారి వారి ధ్యేయ మూర్తులయందే వారికి ప్రత్యక్షము కాగలవు. సత్యనారాయణగారి గ్రంథములో సిద్ధాంత రాద్ధాంత విమర్శల కంటె ఆ

చరణానుభవ పూర్వకమైన ప్రత్యక్ష నిదర్శనములనే యెక్కువగా చూపించి ఆకార్యరంగములో పని జేయు వారికి సార్థకంగా మార్గదర్శి అయ్యేను. గ్రామవా సుల సర్వతోముఖాభ్యుదయానికి సహకార సంఘా లెన్ని విధాలతోడ్పడగలవో ఆయన ప్రత్యక్షంగా చూపి స్తున్నారు. ఆయన వలెనే నిష్కామ సేవాతత్పరత్వ బుద్ధితో యీ తపోనిష్ఠను బూని కృషి జేసినయడల కొంతలో కొంతైనా గ్రామాన్ని పేదప్రజానీకానికి వుపకారం కలుగకపోదు. దేశంలో యే సత్కార్యాని కైనను కుశలవంతులు సమర్థులైన సేవాపరులే కరువుగా వున్నది. మన విద్యావంతులందరు నెలజీతపు మ నోవృత్తి వుద్యోగాలకెగబడుట మాని యిట్టి కర్మక్షే త్రములలో ప్రవేశించినచో సుఖజీవనం జేస్తూ దేశసేవ చేయుట కెంతో అవకాశంవున్నది.

సర్వే సర్వత్రా ధనిక ప్రాబల్యమే ప్రధానంగా గల యీ రోజుల్లో యీ సహకార కల్పలత మహా వృక్షము నీడను పెరిగే చిన్న పూలమొక్క వలె నిరంతర కృత్రిమ రక్షణ దోహదములను గోరుచున్నది. నిజంగా మా సత్యనారాయణగారు సంకల్పించి నట్టిది పేదజనుల పాలిటి పెన్నిదిగా నుండవలెనంటె వ్యక్తిగత ధనిక వైభ వప్రాభవముల నంతులేకుండా పెంపొందించే విధానాలు, సిద్ధాంతాలు, విశ్వాశాలు, సంస్థలు, సంప్రదాయాలు

మున్నగు ప్రజానర్థక మార్గములన్నీ ముందు రాజశాసన పూర్వకంగా నిషేధింప బడవలెను. దేహేంద్రియా ధన బుద్ధులైన స్వప్రయోజనపరు లెంతటి మేధావులైనను యెంతటి ధనాఢ్యులైనను సంఘములోగాని రాజ్యాంగము లోగాని వారికి నాయకత్వమేమి వుండరాదు. వ్యక్తిగత ధనాఢ్యత్వమును పెంపొందించే ప్రయివేటు వడ్డీవ్యాపారాలు నిషేధించాలి. ప్రయివేటు బ్యాంకులు, భీమా కంపెనీలు, సినీమాలు, మోటారుసర్వీసులు, పరిశ్రమలు, పెద్దయెత్తు యెగుమతి దిగుమతి వ్యాపారాలు ప్రభుత్వాధీనం గాని సహకార సంఘాధీనం గానికావాలి.

అద్దెలకిచ్చే గృహములన్నీ వ్యక్తులకు గాక గ్రామ సమిష్టికో, మ్యునిసిపాలిటీలకో, మాత్రమే చెందివుండాలి. ఒక గ్రామం తాలూకు గుడి కట్టి వ్యవసాయం అంతా అక్కడి సహకార సంఘం ఆధీనంలో వుండి గ్రాసు అవసరములను ముందు వుత్పత్తి జేసి గ్రామస్థుల కందజేయ వలెను. కాయకష్టాలకు సంబధించిన కంట్రాక్టు పనులన్నీ కూలీల సహకార సంఘాలద్వారానే జరుగ వలెను. అందరము కష్టపడి అందరము సుఖపడుదామనే సహకార సిద్ధాంతము సర్వమత ధర్మంగా వ్యాప్తి నొందాలి. నిరర్థకమైన దురర్థకమైనసోమరి వృత్తి వ్యాపారములను నిషేదించాలి.

వెండి బంగారాదుల నెవ్వరు ఆస్తిగా ప్రోగుచేసి కోరాదు. నేడు సహకార సంఘాలద్వారా నిర్మించ బడుచున్న, గృహ నిర్మాణ సౌకర్యా లన్నీ బస్తీవాసుల కున్ను మధ్యతరగతి పై తరగతుల వారికిన్నీ మాత్రమే వుపకరించు చున్నవి. అగ్నిభయంలేని చిన్న గృహాలు గ్రామాల్లో పేదవారికి ముందు నిర్మించే ప్రణాళికలు వెంటనే రావాలి. గ్రామాల్లో వుత్పత్తియగు ఆహార పదార్థాలన్నీ పాలు, పెరుగు, వెన్న, నెయి, మొదలైన వానితోసహా ముందు ఆయా గ్రామ వాసుల వుపయోగ మునకు సరిపోయినవి, అక్కడనే వుపయోగించి మిగిలి నవి మాత్రమే బస్తీల కెగుమతి చేయించాలి.

ఈ సహకార సంఘాలలోని సభ్యులందరు ప్రతి నెల తల 1కి రు 0_4_0 లు, 0_8_0 రు 1_0_0 చొప్పున నిర్బంధముగా డిపోజిట్లులిచ్చే, పద్ధతి అమలులో పెట్టుకొంటే కొంత కాలానికి వారికి కావలసిన పెట్టుబడి అంతా యితరులవద్ద వడ్డీకి అప్పుజేయ నక్కర లేకుండా తమ స్వంత పెట్టుబడితోనే వ్యవహరించుకో వచ్చును. సహకార పద్ధతినికూడా అప్పుజేయు అవుసరము నానాటికి తగ్గిపోయి నప్పుడే యీసంస్థ చరితార్థము పొందినట్లు. గ్రామ వాసుల దారిద్ర్యానికి కారణ భూతములైన చుట్ట, బీడి, సిగరెట్లు, వుపయోగాన్ని వేలం వెర్రిగా పెరిగి పోతున్న సినీమా వ్యసనాన్ని కాఫీ, టీ, పానీ యాలను

నిరుత్సాహ పరచే సర్వ ప్రయత్నాలు గ్రామాభ్యుదయము కోరేవారందరు యేటి కెదురీతగా నైనా చేస్తూ వుండాలి. ఈ సహకార సంస్థలు ముఖ్యంగా సమిష్టి వుత్పత్తి కొనుగోలు విక్రయాల కుపయోగ పడనలెను. ఆసందర్భములో కావలసిన సమిష్టి పరపతి ఋణాలకు కూడా వీని నుపయోగించుకో వచ్చును. అప్పుడే వ్యక్తి సంఘానికి సంఘం వ్యక్తికి అన్యోన్యా శ్రయములై సమవృద్ధి నొంది లోక కల్యాణము సిద్ధించ గలదు. సర్వేజనా స్సుఖినోభవంతు.

చె॥ వెం॥ నరసింహము.

## School of Ecnomics and Socialogy
## University of Bombay.

శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు సహకార సంఘములగురించి వ్రాసిన అత్యుత్తమ గ్రంథమును చదువ భాగ్యమునాకు లభించినది. ఆగ్రంథములోని రెండు మూడు విశేషములు పేర్కొనదగి యున్నది. మొదటి భాగములో వారు సహకారఉద్యమతత్వమును గురించి విపులముగ వివరించియున్నారు. ఈ వివరణములో వారు ఇతరుల గ్రంథములను మాత్రమే ఆధారముచేసుకొనక, వానికి తోడు స్వానుభవ

మునుకే ఆధారము చేసుకొనిరి. సహకార ఉద్యమము ఏవిధమున పరిణామము గాంచెనో, ఎట్టిమార్పులు అందు అవసరమగుచున్నవో, వారు బహుచక్కగ విమర్శించి యున్నారు. సహకారము ఒక ఆర్థిక విషయములలో నేగాక, జాతీయ జీవితమునకు సంబంధించిన విషయము లన్నిటిలో ఏవిధముగ ఉపచరింపగలదో వారు సమగ్ర ముగ తెలిపిరి. గ్రంథములోని విశేషములో నిది రెండ వది. గ్రంథములోని రెండవభాగములో, "ఆలమూరు సకలార్థ సహకార సంఘము" నకు సంబంధించిన చరిత్ర, నిబంధనలు, లెఖలు, పరిపూర్ణముగ తెలుపబడి యున్నది. సహకారోద్యమమును గురించి తెలిసికొన దలచినవారందరికి ఇది కల్పవృక్షమని చెప్పుటలో అతి శయోక్తిలేదు. దీనిని ఆంధ్రులందరు చదివి కృతార్థు లుకావలయునని నేను ఆశించుచున్నాను.

(Sd) మామిడిపూడి వెంకటరంగయ్య

Bombay }
29–3–51 }

"సకలార్థ సహకార సంఘముల నిర్మాణ, నిర్వహణము ఎందుకు?"
అనుగ్రంథముమీాద శ్రీమాగంటి బాపినీడు ఎం. ఎల్. ఎ గవర్నమెంటుగారి అభిప్రాయము.

1923 వ సంవత్సరంలో నేను అమెరికానుంచి తిరిగి వచ్చిన ఒకటి రెండు నెలల్లో ఆలమూరులో గ్రామ పునర్నిర్మాణ శిక్షణ తరగతులను నడుపతల పెట్టి శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు ఆ తరగతులను ప్రారంభించుటకు నన్నాహ్వానించగా నేను వెళ్లాను. 1915 ప్రాంతంలో కాకినాడ కాలేజీలో కలుసుకున్న తరువాత తిరిగి శ్రీ సత్యనారాయణగారిని ఆసందర్భంలో ఆలమూరులో నేను కలుసు కున్నాను. మాజిక్ లాంతరు ప్రదర్శనుద్వారా అమెరికా, జపాన్, భారత దేశాలను గూర్చి ఆనాడు నేను చేసిన ప్రసంగానికి శ్రీసత్యనారాయణగారు ఎంతో సంతోష పడ్డారు.

గ్రామ పునరుద్ధరణ కార్యక్రమం విషయంలో ఆయనకు ఎంత ఆసక్తి ఆతురతా, ఆవేదనా, ఉన్నదీ ఆరోజున నాకు బాగాఅర్థమైంది. నాటినుంచి ఈ 23 సంవత్సరాలూ కూడా విసుగు విరామములు లేకుండా ఆయన నిరంతరాయంగా సహకారోద్యమ వ్యాప్తి కోసం కృషి చేస్తూనే వచ్చారు. పత్రికల ద్వారానూ, గ్రంథాలద్వారానూ, సంఘముల స్థాపన ద్వారానూ,

సహకారోద్యమాభివృద్ధికి తదేక దీక్షతో ఆయన సాగిస్తూన్నారు. శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారి అనంతరం శ్రీ సత్యనారాయణగారే సహకారోద్యమానికి సంబంధించిన సర్వవిషయాలూ క్షుణ్ణంగా తెలిసినవారు.

మహాత్ముని నిర్మాణ కార్యక్రమంలో ఒక అంశంగా ఈ సహకారోద్యమాన్ని భావించి శ్రీ సత్యనారాయణగారు ఎట్టి స్వార్థముగాని ఉద్యోగాపేక్ష లేకుండా దేశసేవ చేశారు. ప్రజలు ఆర్థికముగాను, నైతికముగాను, సాంఘికముగాను, కూడా సర్వతోముఖమైన పురోభివృద్ధి పొందడానికి సహకారోద్యమము మూలకందమని ధృడంగా విశ్వసించేవారిలో శ్రీ సత్యనారాయణగారు ప్రధానులు. కేవలం అప్పులు మాత్రమిచ్చే సహకార సంఘాల వలన కంటె సకలార్థ సహకార సంఘాల వలన కలుగగల మేలును గుర్తించి ఆలమూరులో ఆయన అట్టి సకలార్థ సహకారసంఘాన్ని ఒక దాన్ని స్థాపించి, నిపుణుల సహాయంతో చక్కని ఆదర్శకమైన సంస్థగా ఆయన దానిని తీర్చిదిద్దారు. అసంసా నిర్వహణలో ఆయన గడించియుండిన అనుభవంయొక్క ఫలితమే ఈ గ్రంథరూపమున ఈ నాడు వెలువడింది. ఇట్టి గ్రంథాన్ని వ్రాయటానికి సర్వవిధాలా శ్రీ సత్యనారాయణగారే అర్హులు. ఇట్టి గ్రంథానికి పీఠిక వ్రాయటానికి సహకారోద్యమ

ములో సవ్యసాచి, నేటి అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారే సర్వవిధముల అర్హులు.

శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు వ్రాసిన గ్రంథం మీద శ్రీకళా వెంకటావుగారు పీఠిక వ్రాసినతరువాత సహకార సంస్థలతో ఎట్టి ప్రత్యక్ష సంబంధమూలేని నేను అభిప్రాయమును ప్రకటింప బూనటం సాహసమే కాగలదు. ఇట్టి సమగ్రమైన గ్రంథమును వ్రాసిన ఈ గ్రంథకర్తా, అట్టి గ్రంథాన్ని ప్రచురించిన ఆలమూరు కో-ఆపరేటివు రూరలు బ్యాంకు వారూ సహకారోద్యమపట్ల ఆదరాభిమానాలుగల ఆంధ్రులందరకూ అభివందనీయులు అని మాత్రం నేను చెప్పగలను. మంచి కాగితము మీద ఆకర్షకముగా ముద్రితమైన ఈ సంపుటి చూడ ముచ్చటిగా నున్నది.

సహకారోద్యమము పట్ల నాకుగల శ్రద్ధాసక్తులను వెల్లడిచేసే ఈ సదవకాశాన్ని నాకు కలిపించిన శ్రీనరసింహదేవర సత్యనారాయణగారికి అనేక కృతజ్ఞతాపూర్వక వందనములు.

Fort. St. George
Madras 30-3-51

(Sd) మా. బాపినీడు

## V. Jagannadham M. A. BL. M. Litt-
## Lecturer. Andhra University Waltair

శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు వ్రాసిన సకలార్థ సహకార సంఘముల నిర్మాణ, నిర్వహణము ఎందుకు? అను గ్రంథమును పూర్తిగా చదివి ఆనందించితిని. శ్రీ సత్యనారాయణగారు సహకార లోకమున సుప్రసిద్ధ నాయకులు. సహకార పత్రికా పాఠకులకు వారి అభిప్రాయములు చిరపరిచితములే. వారి విజ్ఞానానుభవములను గ్రంథరూపమున పొందు పరచి ఆంధ్ర లోకమునకు సేవ చేసిరనుటకు సందేహము లేదు. సహకారమును గూర్చి, అందులో సకలార్థ సహకార సంఘములను గూర్చి ఆంగ్లమున గాని ఆంధ్రమునగాని వ్రాయుట కన్నివిధముల వారు తగినవారు. ఈ విషయమును గూర్చి తెలుగులో వ్రాయుటకు ఆంధ్రిలోకంలో సత్యనారాయణ గారికంటె అర్హతగల వారింకెవ్వరు లేరనుట అతిశయోక్తి కాదు. ఇది శత ధా సత్యమనుటకు యీ గ్రంథములో మొదటి భాగమందలి సహకారమును గూర్చిన శాస్త్ర చర్చయు, రెండవ భాగములోని అనుభవ విశేషములు సాక్ష్యములు.

నేడు మానవ సంఘము కేపిటలిస్టు, కమ్యూనిష్టులను, సుందోపసుందుల వైరములో అట్టుడికి నట్లుడికి పోవుచున్నది. సాయుధ బలము సాధనముగాగల ఈ

వైరములో నిస్సహాయులణగి మణగి పోవుచున్నారు. ఈ వైరము వైదొలగ వలెనన్న సహకారోద్యమ మధ్యే మార్గమే శరణ్యమని శ్రీ సత్యనారాయణగారు మొదటి నుండి చివర వరకు తేటతెల్లముగా వర్ణించిరి. ఈ సందర్భమున సహకారోద్యమమును, జాతీయ కాంగ్రెసు యొక్క సహకార సామ్రాజ్య లక్ష్యముతోను, మహాత్ముని నిర్మాణ కార్యక్రమ విధానముతోను సమన్వయించిరి.

సహకారోద్యమ లక్ష్యము సరియైనదైనను అనుసరించు విధానము తదనుకూలముగ లేనిచో గమనము కుంటుపడును. మన దేశములో ఇట్టి ఉపద్రవము కొంత వరకు సంభవించినది. పాశ్చాత్య దేశములలోవలె మన దేశములోగూడ 'ఏకైక లక్ష్య సంఘము ప్రతి గ్రామమున పరిమితిలేని పూచీ పద్ధతిపై నడుపింప నుద్యమింపబడెను. గోక్లే మున్నగువారీ పద్ధతి మన దేశమునకను కూలించదని సలహా నిచ్చిరి. ప్రభుత్వమిది పెడచెవిని పెట్టెను. అందుచే, సహకారోద్యమమును పంజరములోని చిలుకవలె ప్రభుత్వమే పెంచినది. దీని వలన కల్గిన ముప్పును ప్రముఖులు అభిప్రాయముల ఆధారముతో కమిటీ రిపోర్టుల సాక్ష్య బలముతో తమ స్వంత అనుభవముతో నివేదించి నిరూపించిరి. పై పద్ధతికి బదులుగా పరిమితి పూచీగల విధానముపై బహు గ్రామ

ముల కొఱకు సంఘముగా ఐచ్ఛిక సేవా పరాయణులగు ప్రజోత్సాహముపై నాధారపడు సకలార్థ సంఘముల నిర్మాణ, నిర్వహణ ప్రయోజనమును బహు విపులముగ వర్ణించిరి. అట్టిసంఘము నొక్క పుష్కరకాలము స్వయముగ నిర్వహించి, ఆసంఘము యొక్క అభివృద్ధి విజయ విశేషములను విస్పష్టముగ రెండవ భాగమున వర్ణించిరి.

శ్రీ సత్యనారాయణ గారు ఉద్యమ లక్ష్యముల నుల్లంఘింపకయే నిర్వహణ విధానమున తమ వ్యక్తి ప్రతిభా విశేషముల జొన్పి క్రొత్తమార్గముల ద్రొక్కుచుందురు. రూరలు బ్యాంకును స్థాపించుటలో నిది విదితము. ఆ బ్యాంకు వారి పొదుపు చీట్ల అమ్మకపు పద్ధతి సహకార లోకమునకు చింతామణి వంటిది. ఆపద్ధతి వలన బీదసాదలెల్లరు పొదుపు నేర్చుకొని వ్యర్థ వ్యయము నరికట్టుకొనగలరు. ఈ విధానము నిమ్న జాతి కుటుంబముల నుద్ధరించినదనుటకు వారి మెంబరుషిప్పు సంఖ్యయే ప్రబల సాక్ష్యము.

ఈ గ్రంథములో మరియొక విశేషమేమనగా విషయము జటులమైనను భాష సులభము. సజాతీయము జాతీయతకుదాహరణగ తూట్లుపడిన బంతిలో గాలి ఎంతకొట్టిన లాభమేమి? '199 వ పేజీ' అంగట్లో

అన్నియున్నవి, అల్లుని నోట్లో శని' (265 పేజీ) మున్నగునవి పేర్కొన వచ్చును.

ఆలమూరు, తత్పరిసర ప్రాంతములును సహకార జీవనమున కాలవాలము. ఉద్యమ లక్ష్యములను కార్యరూపమున కనువదించిన శ్రీ సత్యనారాయణగారి వ్యక్తిత్వమనుపమానము. మూడు దశలనుండి నిరవధిక సేవా దీక్షతో నడుపుచున్న సహకారోద్యమ మందలి లోపాలోపములను గ్రహించి సకలార్థ సహకార సంఘములే భారత జాత్యుద్ధరణకు సరిపడు సంస్థలని తమ పరిపక్వానుభవ విజ్ఞానమును జాను తెనుగున రంగరించి పిన్న పెద్దలెల్లరకు సులభముగ నర్థమగునట్లు తమ గ్రంథమును తీర్చి దిద్దిరి. బహుకార్య నిమగ్నులైనను తమ విజ్ఞానానుభవములను గ్రంథరూపమున ప్రసాదించి నందులకు శ్రీ సత్యనారాయణగారికాంధ్రలోకము ధన్యవాదము లర్పించును.

"సకలార్థ సహకార సంఘముల

నిర్మాణ నిర్వహణ మెందుకు?" అను ప్రశ్నకు—

ప్రత్యుత్తరముగా ఆలమూరు సకలార్థ సహకార సంఘ చరిత్రము నుదాహరణముగా నిచ్చుచు శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు రచించిన గ్రంథమును జదువు భాగ్యము నాకలవడినది. శ్రీ సత్యనారాయణ

గారు జగమెఱింగిన బ్రాహ్మణులు. సహకార తత్త్వార్థమును బూర్తిగ తెలిసికొనుటయేగాక దాని నాచరణలోఁబెట్టి వివిధమార్గముల నడిపించుచు నాదర్శకులైన వారు శ్రీసత్యనారాయణగారు. వారి లేఖినుండి వెలువడిన యీ గంద్రము యొక్క యుపయోగమును గూర్చి విశేషము వ్రాయ నక్కఱలేదు. దాదాపు అయిదు వందల పుటలుగల యీగ్రంథమున మొదటిభాగమున సహకార సంఘముల యావశ్యకమును గూర్చియు అందుగల భేదములను గూర్చియు వానివలన గలుగు నుపయోగములను గూర్చియు అనుభవజ్ఞులగు స్వదేశీయ విదేశీయసహకార శాస్త్రజ్ఞుల యభిప్రాయముల నుదాహరించుచు మనదేశముననెట్టి సహకార సంఘము లావశ్యకములో వానినెట్లు నడుపవలయునో నిరూపించి యుండిరి.

రెండవ భాగమునందు, మొదటి భాగమున నిరూపించిన సూత్రముల కనుగుణముగ ఆలమూరున దాము స్థాపించిన రూరల్ బ్యాంకుయొక్క చరిత్రను వ్రాసియున్నారు. ఆబ్యాంకు స్థాపించినది మొదలు క్రమక్రమముగ నెట్లు భివృద్ధి నొందినదియు, నెన్నెన్ని విధముల నాబ్యాంకు వలన ప్రజలు లాభములును బడసినదియు చక్కఁగా వివరించియున్నారు. ఇట్టి సహకార సంఘముల వలన రాజకీయముననను, ఆరోగ్యపరిస్థితులందును, వ్యవసాయము నందును, పరిశ్రమలయందును

ప్రజలు ఎట్లు అభివృద్ధినందఁగలరో దృష్టాంతపూర్వకముగ నంకెలతోఁగూడ ఆలమూరు బ్యాంకు చేసిన చేయుచున్న పనిని జూపియున్నారు.

సహకారాభివృద్ధికై తమ జీవితమును ధారవోసి కేవల వాఙ్మాత్రముచేగాక క్రియాపూర్వకముగ పనిచేసి చూపుచున్న గ్రంథకర్తగారి యనుభవజ్ఞానమంతయు నిందు దెలుపుచు, నీగ్రంథమును వ్రాయుటచే, వీరు లోకమున కెంతయో యుపకార మొనర్చినవారైరి.

గ్రంథ మందలి శైలి సులభమై యాకర్షణీయమై చక్కగా నున్నది. ముద్రణమును బయిండును సుందరముగానున్నవి.

కేవల సహకార విషయములేగాక రాజకీయ, ఆర్థిక, నైతిక, ఆరోగ్యాది విషయము లిందు సందర్భాను సారముగఁ దెలుపఁబడి యుండుటచే ఆంధ్ర దేశమందలి ప్రజ లీగ్రంథమును జదివి, విని, గ్రహించి కృషిచేసి, యభివృద్ధి నొందుదురని యాశించుచున్నాఁడను.

చాగంటి శేషయ్య

8-4-51

Dr. B. V. NarayanaswamyNaidu,
M.A., Ph.D., B.Com., Bar-at-law,
Member: Indian Tarriff Board.

Ministry of Commerce,
'Contractor Building'
Nicol Road, Ballard Estate,
BOMBAY,
21th March 1951

This exhaustive book on co-operation by Sri N. Satyanarayana consists of two parts. In the first part, after a thorough discussion of the basic principles of co-operation and its importance, the dangers of unlimited liability, the pros and cons of single-purpose societies and of multi-purpose societies, the author has made a powerful plea for a change of outlook among our people with a view to harnessing the movement for the all round betterment of the countryside. A very convincing and learned attempt is made in this book to prove that co-operation is the most practicable ideolegy for our country in the existing circumstances.

A detailed account of the history and development of the Alamuru Multi-purpose Co-operative society of Alamuru in East Godavari District is given in the second

part. In this part, the author also traces in a very interesting manner the continuous and striking development of the society since its inception in 1918.

Mr. N. Satyanarayana is exceedingly competent to deal with the intricate subject which he has chosen for this book. He is the President of the Co-operative Rural Bank Ltd., of Alamuru. He has been a very active co-operator for a number of years and as President of the Society, he has had occasion to test the soundness of co-operative principles in practice. With this experience, he combines a gifted method of narration which goes to make the book eminently readable. I have, therefore, no doubt that this book will be a valuable addition to the literature on co-operation and a very useful guide to all co-operators. The fact that the book is written in Telugu should make it all the more acceptable to those whom it intends to serve.

(sd.) B. V. Narayanaswamy

/ True copy /

The Madras Provincial Co-operative Union
(The Madras Journal of Co-operation)

Viswanadham Tekumalla
M.A., B Ed., F.R. Econ.s
(London)
Associate Editor

379, Netaji Road,
M.P.C. Bank Buildings,
Madras 29th March 1951

I read with great intrest the book entitled "How to organise and Run multipurpose Co-operatives" written in Telugu by Sri Narasimhadevara Satyanarayana Garu of Alamuru. Sri Satyanarayana Garu is one of the few veterans in the field of co-operation in our State. Vigorous and enthusiastic in public work, he was deeply interested in the reconstruction of the countryside. He felt convinced of the usefullness the co-operative movement in such work and therefore sought to promote it as a socio-econoimc movement in his area of work. Despite the predominant position occupied by "credit" in the movement, he aimed at building up a rural co-operative which could touch the entire life of the village and the villager. Himself the president of the Alamuru Credit society, he watched carefully the growth of the rural societies in the Alamuru Local Co-operative Union area during the post war boom and their decline during the economic

depression which followed. His experience convinced him that for the rehabilitation of the rural co-operative Movement some change from the orthadox lines was essential. He saw that the prospects of the success of rural co-operatives lay in organising a rural co-operative for an area of operation comprising some villages, with multipurpose objective and limited liability. A voracious reader of co-operative literature, he found support for his ideas in the publications of the Reserve Bank of India. He felt bold to conduct an experiment on novel lines.

He convinced the then Congress Ministry and in 1938, organised the Alamuru Co-operative Rural Bank Ltd., as an experiment in rural banking. The Bank is a multipurpose co-operative with limited liability and operating over an area comprising no less than twelve villages around Alamuru village.

Sri N. Satyanarayana's ambition has always been to make the rural bank self-sufficient in funds and useful even to the poor man. The confidence of the depositors and the honesty of the borowing

members are the key to the success of any banking institution. By his patient endeavours Sri Satyanarayana garu has succeeded to a very remarkable extent in attracting deposits even from non-members and in making even landless labourers creditworthy by finding employment for them. By and large he has introduced various new features into the Alamuru Rural Bank such as enlisting of women and labour classes as members, encouragement of thrift by the institution of thrift labels, taking of Lanka lands on lease for the landless labourers, lending on "ever-continuity bonds," provision of food and clothing to the labour members on credit during the off-season and supply of credit to several artisans and small dealers.

During a period of a little ever a decade, he has demonstrated that it is not impossible to run a Rural financing institution on excellent lines and has dispelled the fears of many an orthadox co-operator. The "Alamuru Rural Bank,' has become a familiar term in co-operative parlance and, with it, its founder-president a familiar name to all Co.operators in the country.

His present book is a story of his experiences, his aspirations, his struggles for achieving them, and his ultimate success in his efforts. It also shows like a mirror the march of time and the changing ideologies in the field of Co-operation and their reaction on the author.

It is a strong plea for the organisation of a multipurpose co-operative based on limited liability and operating over an area comprising some villages. It is also a graphic description of the circumstances in which the Alamuru Rural Bank came into being and the various activities which have characterised its progress through over a decade. Statistical Statements are aeppnded to it to enable the readers to have a fairly correct idea of its progress.

The style is lucid and simple and at the same time impressive. The expression is homely.

The book has charm as the presentation of his own case by an ardent woker.

Its publication is timely since in these days of multipurpose co-operative activity, Co-operators could draw inspiration and confidence from the author and his institution.

(sd.) Viswanadhan Tekumalla
ASSOCIATE EDITOR
/ True copy /

Deputy Minister For Food
Government of India

11, Akbar Road
New Delhi

4th April, 1951.

My dear Satyanarayana Garu,

I have received your book on Co-operation, in Telugu. It is a comprehensive and exhaustive on the subject, which I am sure will be very useful to a large number of people interested in the Co-operative Movement.

I congratulate you on your effort.

I trust you are keeping well.

Yours sincerely,
(Sd) (M. Thirumala Rao.)

Sri N. Satyanarayana Garu
ALAMURU.

# పీఠిక

ఈ గ్రంథము వ్రాయుటకు నన్ను ఆలమూరు కో-ఆపరేటివ్ రూరలు బ్యాంకు పాలక మండలి సభ్యులు, మహాజనసభవారు, తీర్మాన పూర్వకముగ ప్రేరేపించిరి. వారి ఆజ్ఞానుసారము ఆలమూరు సకలార్థ సహకార సంఘము యొక్క ఆదర్శకములను ఉద్దేశ్యములను నిర్మాణ, నిర్వహణ చరిత్రను వ్రాసితిని.

ఈ సంఘ ప్రతిష్ఠాపనకు 1937 సంవత్సరంలో నేను పూనుకొంటిని. ఆర్థిక మాంద్యముచే గ్రామా దులలోని రైతాంగము ధనాభావముచే వాయిదాలు కట్టుకొనలేక, బకాయీలు పెట్టిరి. గ్రామ సహకార సంఘముల వ్యాపారము స్తంభించిపోయినది. రైతు లకు పరపతి పుట్టుటలేదు. ఇట్టి పరిస్థితులలో, మెత్త డిన, సహకారోద్యమమును లేవనెత్తుటకు తగిన ప్రణా ళికవైచిన గాని తిరిగి యుద్యమము ప్రజలలో వ్యాప్తి యగుట కష్టసాధ్యమని తలంచి నా యుద్దేశ్యములను భావములను సహకార గురుపీఠమనదగు శ్రీ వేమవరపు రామదాసు పంతులు గార్కి నివేదించితిని. వారు నా అభిప్రాయములతో యేకీభవించి నూతన పద్ధతిని సక లార్థ సహకార సంఘమును ఆలమూరులో స్థాపించుటకు

ప్రోత్సహించిరి. ప్రత్యేక నిబంధనలను వ్రాసి పెట్టిరి. నిబంధనలను అప్పుడు సహకార శాఖామాత్యులగు శ్రీ.వి.వి. గిరిగారికి తెలియజేసితిని. గ్రామ సీమలలోని సహకారోద్యమమును పునరుద్ధరించుటకు, నూతన పద్ధతిని, నూతన సకలార్థ సహకార సంఘమును విరివిగా స్థాపించి ప్రోత్సహించ వలసినదిగా కోరితిని.

నేను చిరకాలమునుంచి యుద్యమములో సేవ చేసినందున నాపట్ల వారు గౌరవముతోను, యుద్యము పట్ల అభిమానముతోను, నూతన పద్ధతులపై ఆదర్శకముగ ఆలమూరులో సకలార్థ సహకార సంఘమును స్థాపించుటకు రాష్ట్రీయ సహకార రిజిస్ట్రారగు శ్రీ ఆస్టిన్ దొరగారికి ఉత్తరువు చేసిరి. శ్రీ ఆస్టిన్ దొరగారు ప్రభుత్వమువారి వద్ద ప్రత్యేకపు టుత్తరువు తీసుకొని ఆలమూరు సకలార్థ సహకార సంఘమును పరిమితి గల పూచీపై 12 గ్రామముల విస్తీర్ణ ప్రదేశమునకు వ్యవహరించుటకు యీ సంఘమును రూరలు బ్యాంకు (Rural Bank) అనుపేరుతో రాజమండ్రి కో-ఆపరేటివు డిప్యూటీ రిజిస్ట్రారు వారికి రిజిష్టరు చేయుటకు అనుజ్ఞ నొసంగిరి. సంఘము స్థాపించిన నాటి నేటివరకు 12 సంవత్సరములలో బ్యాంకు కావించిన వివిధ వ్యాపారములను గ్రంథ రూపమున పొందుపరచబడినది.

ఈ గ్రంథము ప్రథమ భాగములో సహకారో ద్యమ తత్వము, పరిణామము, ఆదర్శకములు, సహకార జండాలోని రంగుల ప్రత్యేక విశిష్టత, మహాత్మా గాంధీ గారిచే ప్రకటింపబడిన నిర్మాణ కార్యక్రమమునకు, సకలార్థ సహకార సంఘములు యెట్లు తోడ్పడ గలవో వివరింప బడినవి.

ఈ గ్రంథము 2 వ భాగములో ఆలమూరు రూరలు బ్యాంకు వార్షిక నివేదికల పట్టి చరిత్ర వ్రాయ బడినది. ఈ బ్యాంకు స్థాపించినది మొదలు నేటివరకు యెన్ని విఘ్నములు, అవాంతరములు సంఘటిల్లి నను, దినదినాభి వృద్ధిని గాంచి, రైతుల వివిధ అక్కరలకు సకాలములో ఎట్లు తోడ్పడి గ్రామ సమగ్ర పురోభి వృద్ధికి దోహద మొసగు చున్నదో వివరించి తెలుపబడినది.

మచ్చునకు (Experimental) ప్రస్తుతము అమలులోనున్న పద్ధతులకు విరుద్ధముగ, యీ రూరలు బ్యాంకును నిర్మాణముచేసి నిర్వహించుటకు నాకు ప్రత్యేక అవకాశమును మద్రాసు రాష్ట్ర ప్రభుత్వమువారు, శ్రీ వి. వి. గిరిగారు సహకార శాఖా మాత్యులుగా నుండు హయాములో వుత్తరువులు జారీ చేసిరి. ఆంధ్ర

కేశరి పత్రికాశం పంతులుగారు రిజిస్ట్రా శాఖామాత్యు లుగా నుండి యీ బ్యాంకును ప్రారంభోత్సవము జరిపించి తమ శుభ ఆశీస్సుల నొసగిరి. మొదటినుంచి నేటివరకు యీ బ్యాంకునకు నేను అధ్యక్షుడుగా నుండి కార్య నిర్వ హణము కొనసాగించు చున్నాను. డిపార్టుమెంటువారు, సహకార శాఖోద్యోగులు సెంట్రలు బ్యాంకువారు, డిపాజిటర్లు, యిందుచేరిన సభ్యులు, పాలక మండలివారు, యిందు పనిచేయుచున్న సిబ్బంది నాకు చేయూత నొసగి యీ బ్యాంకును నేటి పునోభివృద్ధికి తెచ్చిరి. ఇందుకు నేను వారికి కృతజ్ఞుడను. ఈ సంస్థ ద్వారా ఆలమూరు చుట్టుపట్ల ప్రాంతములో సహకార సేవ చేయుటకు మహాద వకాశము నాకు కలిగినది. ఇది నా అదృష్టము, మహా భాగ్యమని సంతసించుచున్నాను.

ఈ గ్రంథమునకు అడిగిన వెంటనే యీ 'పరిచయము' వ్రాసిపెట్టిన శ్రీభోగరాజు పట్టాభిసీతారా మయ్యగారికి, యీ భూమిక వ్రాసిన శ్రీ కళా వెంక ట్రావు గారికి, ఆశీస్సులు పంపిన మిత్రులకు నాకృతజ్ఞత తెలుపుచున్నాను.

నాకు సహకరించిన వింజరంకారస్తులు శ్రీ వెంకటేశ్వర వేదశాస్త్ర పాఠశాల ప్రధానోపాధ్యాయులగు ఓలేటి సూర్యనారాయణమూర్తి శాస్త్రిగారికిన్నీ, చిత్తులను, సాఫు

లను, వ్రాసిబెట్టిన ఆలమూరు ల్యాండుమార్గేజి బ్యాంకు సూపరవైజరగు శ్రీ కామవరపు నరసింహామూర్తి గారికిన్నీ ఆలమూరు షూరలు బ్యాంకు గుమస్తాయగు శ్రీ ఆలమూరు అచ్యుతరామయ్య గారికిని, నేనెంతయు కృతజ్ఞుడను.

ఇట్లు.

(Sd) న. సత్యనారాయణ.

# ఆలమూరు సకలార్థ సహకార సంఘము

## ప్రికరణముల పట్టిక

## రెండవ భాగము.

## మొదటి ప్రకరణము

# సహకారోద్యమము

భారతభూమి పరప్రభుత్వ పరిపాలనా దాస్యము నుండి విడుదలైనది. పరిపాలనము ప్రజాప్రతినిధుల హస్తగతమైనది. రాజకీయ స్వాతంత్ర్యము లభించినది. అయితే రాజకీయముగా పరదేశ ప్రభుత్వ శృంఖలా బంధము నుండి విముక్తిబడినను ఆర్థిక సాంఘిక విషయముల దేశ మింకను స్వాతంత్ర్యమును బడయలేదు. ఆర్థికముగా ప్రజలు దైన్య స్థితి యందున్నారు. సాంఘికముగా జాతి మత కుల కక్షలచే నణగద్రొక్కబడి యున్నారు. రాజకీయ స్వాతంత్ర్యముతో బాటు ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యములు ప్రజలు బడయ గలిగినపుడే దేశ మౌన్నత్యము గాంచును. సర్వతో ముఖాభి వృద్ధి చెందును. నేడు దేశమునకు పర దేశ పరిపాలనము వదలి స్వాతంత్ర్యము కల్గి నందున ప్రజా సముదాయమునకు ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యములు కల్గుటకు వివిధ మార్గముల కృషి సలుప వలసి యున్నది.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

స్వరాజ్యము వచ్చినదే కాని స్వాతంత్ర్యము రాలేదు. ప్రజలకు కడుపు నిండ తిండి, ఒంటి నిండ బట్ట, తల దాచు కొనుటకై యిల్లు దేశములో నందరికి లభించి నపుడే స్వరాజ్యము వచ్చినట్లగును. కేవలము రాజకీయ స్వాతంత్ర్యము వలన ప్రజలు సుఖింప జాలరు. రాజకీయ స్వాతంత్ర్యము బడసిన దేశములలో ప్రజా సముదాయమునకు ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యములు కలుగ జేయుటకు వివిధ ప్రణాళికలు వైచి ప్రజల సర్వతోముఖాభి వృద్ధికి కృషి ప్రభుత్వములు సల్పినవి.

లక్ష్య మందరిది ఒకటేను. కాని దృక్పథములు వేరు. మార్గములు వేరు. రాజకీయముగ ప్రజా స్వాతంత్ర్యము పొందిన దేశములలో కూడ ఆర్థిక సాంఘిక నిమ్నోన్నతములు విశేషముగా కనబడు చున్నవి.

అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశము లలో ప్రజలు ముందుగా రాజకీయ విప్లవముల ద్వారా స్వాతంత్ర్యము బడసిరి. అధిక సంఖ్యాకులగు ప్రజలు వోటు హక్కు ద్వారా రాజ్యాంగ విధానములో అధి

కారమును పొంద గలిగిరి. ఇందు మూలమున వ్యక్తి స్వాతంత్ర్యము ప్రజా సముదాయమునకు కల్గినది. ఆర్థిక స్వాతంత్ర్యము, సాంఘిక స్వాతంత్ర్యము వెను వెంటనే లభించినవి.

అయితే వర్తక వాణిజ్య వ్యాపార వ్యవహార విషయములలో యీ వ్యక్తి స్వాతంత్ర్యము పలువిధ ములగు దుర్వినియోగములకు దారి చూపినది. లాభమే ప్రధానముగా పెట్టుకొని వ్యాపారమును వ్యక్తి లాభము కొరకు నిర్వహించుట మూలమున ఆర్థిక వ్యత్యాసము లకు, సాంఘిక నిమ్నోన్నతములకు తావొసగినది. ధనవంతు లింకను ధన వంతులై, ఆగర్భ శ్రీమంతులగు టకును, దరిద్రు లింకను దరిద్రులై దుర్భర దారిద్ర్య పీడితు లగుటకును, యీ వ్యక్తి, ధనిక వాద పద్ధతి దారి చూపినది. ఈ ఆర్థిక అసాధారణ వ్యత్యాసములే సాంఘిక హెచ్చు తగ్గులకు కారణ భూతము లయ్యెను. ఈ ఆర్థిక సాంఘిక హెచ్చు తగ్గులను రూపుమాపుటకు నూతన మార్గముల ఆర్థిక సాంఘిక పద్ధతులు పరిణామము చెంద వలసి వచ్చెను. పాత పద్ధతులు ధనికవాదము (Capitalism) అనే పేరుతో యింత వరకు వృద్ధి

పొందినవి. ఈ ధనికవాద (Capitalistic) పద్ధతులు రూపు మాపి ప్రజాసముదాయములో ఆర్థిక సాంఘిక పరి వర్తనము కలుగజేయుటకే సామ్యవాద(Communistic) సిద్ధాంతము లేక సాఘింక (Socialistic) సిద్ధాంతములు బయలు దేరినవి.

ధనికవాద (Capitalistic) సిద్ధాంతములు గత మూడు లేక నాల్గు శతాబ్దముల నుంచి వర్ధిల్లినవి. వర్తక వాణిజ్య వ్యాపారము లీ సిద్ధాంత ప్రకారము వ్యక్తి లాభము కొరకు వృద్ధి పొందినవి. ప్రపంచములో ధన మెక్కువగా సంపాదింప బడినది. ఈ అధిక ధన ప్రాప్తితో నూతన శాస్త్ర పరిశోధనలు వృద్ధి యైనవి. ఈ శాస్త్ర పరిశోధన వలన ఆధునిక ప్రకృతి విజ్ఞానము పెంపొందినది. సుఖ సంపదలు, భోగ లాలసత్వము హెచ్చినవి. నూతన శాస్త్ర జన్య జ్ఞానముచే భౌతిక విజ్ఞానము వికసిల్లి పంచ భూతములను నేడు మానవుడు వశీకరణ మొనర్చు కొను చున్నాడు. పక్షులవలె ఆకాశమున విహరింప గలుగు చున్నాడు. మత్స్యములవలె నీట మునుగ గలుగుచున్నాడు. పృథ్వి నంతను ఒక్క త్రుటిలో చుట్టు ముట్టి రాగలుగు చున్నాడు. ప్రపంచము నంతను నూతన దూరదృష్టి

యంత్రసాహాయ్యమున చూడ గలుగు చున్నాడు. శబ్ద గ్రాహక యంత్రమున వినగల్గు చున్నాడు.

ఈ భౌతిక విజ్ఞాన మంతయు నేడు శాస్త్రజ్ఞులు పడయగల్గుటకు ధనికు లిచ్చెడి ప్రోత్సాహామేను. ఇది ధనిక యుగము. ఈ సుఖ సంపదలనుభవించుటకు కొలది మంది ధనికులకే అవకాశము కలుగు చున్నది. అయితే అధిక సంఖ్యాకులగు ప్రజలు దుర్భర దారిద్ర్య దుస్థితిలో నుండి యధోగతి పాలగు చున్నారు. ప్రజానీకమున కంతకు సర్వతో ముఖాభివృద్ధి కలుగ జేయవలె నన్న నేడు చెల రేగుచున్న ధనిక విధానమునకు స్వస్తి చెప్పవలెను.

ఈ ధనిక విధానమును భగ్నము చేసి ప్రపంచము లోని సర్వ సంపదలయందు అందరికి సమాన హక్కు కలుగ జేయుటకే నూతన సాంఘిక విప్లవ విధానము చెల రేగు చున్నది. ఈ విధానమున కారల్ మార్క్సు (Carl Marx) ప్రధానాచార్యుడు. ఈ విధానమును, గత ప్రథమ ప్రపంచ యుద్ధా నంతరము, రష్యా దేశమనుసరించినది. లెనిన్(Lenin) మహాశయుడు రష్యా దేశములో నీ

సాంఘిక విప్లవ విధానమును రాజకీయముగ సాధించి ఆర్థిక సాంఘిక వ్యవహారములలో అమలు పెట్టెను. సాంఘిక విప్లవమును కలుగజేసెను. ఈ విధానము సర్వతో ముఖ మానవాభ్యుదయమునకు దారి చూపుచున్నది. ఈ విధానము నేడు సామ్యవాదము (Communism) అనే పేరుతో వ్యవహరింప బడుచున్నది. లెనిన్ అనంతరము సోవియట్ రష్యాలో నీ పద్ధతి చిరస్థాయిగా చేయుటకు స్టాలిన్ ఆధ్వర్యము వహించి రష్యా దేశము నంతను ఒక్క త్రాటిని నడిపించి రెండవ ప్రపంచ సంగ్రామములో హిట్లరు, యాజమాన్యమున విజృంభించిన ఫ్యాసిస్టుల (Fascist)ఔద్ధత్యము నణగ ద్రొక్కెను.

నేడు ధనికవాద (Capitalistic) విధానమునకు సామ్యవాద (Communistic or Socialistic) విధానమునకు ప్రపంచము నందంతట తీవ్ర సంఘర్షణము జరుగు చున్నది. బలాబలములు చూచుకొను చున్నారు. నూతన పరిశోధనా జ్ఞానముచే సంపాదింప బడిన యాధునిక ప్రకృతి శాస్త్ర విజ్ఞాన మంతయు నూతన మారణ యంత్రముల తయారు చేయుట కుపయోగ పడుచున్నది. ఇరుపక్షముల వారు సుందోపసుందుల వలె పాత మారు

టకుద్వేగ పడుచున్నారు. హింసా కాండకు వెర చుట లేదు. ఉభయ పక్షముల వారి యావేశములు చూచిన మానవాభ్యుదయమునకు మారు వీరి చర్యలు ప్రపంచ విలయమునకే తోడ్పడు చున్నవి.

ధనికవాదను (Capitalism) వలన స్పర్థ, పోటీ యెక్కువై వ్యక్తి లాభ కాంక్ష హద్దుమీరి యాత్మ వినాశనమునకు దారి చూపుచున్నది. సామ్య వాదము (Communism) సర్వ మానవాభ్యుదయము కోరుచున్నను, వ్యక్తి స్వాతంత్ర్యము నణగద్రొక్కి సాంఘిక మాత్సర్యము పెంపొందించి నియంతృత్వమునకు దారి చూపు చున్నది. సర్వ నాశనమునకు తోడ్పడు చున్నది. ప్రజారక్షణ కల్గుట లేదు. ధనికవాద(Capitalistic)పద్ధతి సామ్యవాద (Communistic) పద్ధతి కూడ ప్రపంచక శాంతికి ప్రయోజన కారిగ లేవు. లోక కల్యాణమునకు మార్గదర్శక మగుట లేదు. ఉభయ వాదులకు నాశన కరమైన పశు బల ప్రయోగమే యంత్య శరణ్యము. పశు బల ప్రయోగము యుద్ధములకు దారి తీయును. ఇందు మూలమున నిరపరాధులగు జను లెందరో హతమగు చున్నారు. పాడిపంటలు బూడిద పాలగు చున్నవి.

ఈ రెండు వాదములలోని చెడుగులను తొలగించి పశు బలమును విసర్జించి, సర్వ మానవ సౌభాతృత్వము ద్వారా ప్రజలలో శాంతి సుఖ సంపదలు చేకూర్చుటకే నూతన సహకారోద్యమ ముద్భవించినది. జర్మనీ, ఇంగ్లాండు దేశములలోని ప్రజా సామాన్యము నుండి గత శతాబ్దములో సహకార సిద్ధాంతములు బయలు వెడలినవి.

ఈ దేశములలో 1844-45 సం॥ ప్రాంతములో క్షామము పట్టినది. జర్మనీ దేశము వ్యావసాయిక దేశము. క్షామము వలన కార్మికులు, కర్షకులు క్షోభపడిరి. భూస్వాముల ఒత్తిడికి కార్మిక కర్షకులు నలిగిపోయిరి. చిన్న రైతాంగమును వ్యవసాయ కూలీలను సంరక్షించుటకు సహకారోద్యమమే శరణ్యమని 'రైఫేసిన్' (Raiffesian) మహాశయుడు జర్మనీ దేశములో శంఖారావము చేసెను. ప్రజా సామాన్యమును ఆర్థిక దైన్యము నుండి కాపాడుటకు, సాంఘిక ఔన్నత్యము కలుగ జేయుటకు సహకారోద్యమమే శరణ్యమని యీ మహనీయుడు రుజువు చేసెను.

ఇంగ్లండులో కూడ యీ 1844-45 సం॥లో పారిశ్రామిక కూలీలు క్షామ బాధా పీడితులై పెట్టుబడి

దార్ల యొక్కయు, మధ్యదళారీ వ్యాపారస్థులయొక్కయు చేతులలోనల్గి ఆర్థిక దాస్యమున కృంగి పోవుచుండిరి. ఈ వ్యాపారస్థుల చేతుల నుండి తప్పించుటకై (Rochdale Pioneers) రోకడేలు పైనీర్సు అనుసర్చిన వ్యాపార పద్ధతిని సహకార కొనుగోలు సంఘములను స్థాపించి నూతన ఆర్థిక విధానమునకు మార్గదర్శకులైరి. వర్తక వ్యాపార సరళిలో యీ సహకార పద్ధతి విప్లవ మార్గము చేకూర్చినది.

ఈసహకార సిద్ధాంతములు, జర్మనీ, యింగ్లాండు దేశముల నుండి ఆధునిక ప్రపంచమున కంతటను నొక శతాబ్దములో వ్యాప్తమయ్యెను. రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగములలో నూతన పరిణామము చేకూర్చెను. ఒక వైపున (Capitalistic) ధనికవాద సిద్ధాంతములను, మరి యొక వైపున (Communistic ) సామ్యవాద సిద్ధాంతములను ప్రతిఘటించెను. సహకార సిద్ధాంతములలో ప్రధానసూత్రము(Each for all and all for each) ప్రతి యొక్కరు సంఘము కొరకును, సంఘము ప్రతి యొక్కరి క్షేమము కొరకును కృషిసలుప వలెను. సాంఘిక ప్రణాళికలు వైచి ఆర్థిక సాంఘిక నిర్మాణ్యస్థితులను

తొలగించి "సర్వే జనాః సుఖినో భవంతు" సర్వ జనుల క్షేమము కొరకు కృషి సల్పుట యే యీ యుద్యమ తత్వము. నూతన ప్రపంచ ఆర్ధిక, సాంఘిక విధానము లకు పునాది వైచి ప్రపంచమున శాంతి సామరస్యములు చేకూర్చుట యీ యుద్యమ గమ్యస్ధానము. వ్యక్తులకు, వ్యక్తులకు, జాతులకు జాతులకు, వృత్తులకు వృత్తులకు సంఘర్షణ లేకుండ సామరస్యముతో వ్యక్తి స్వాతం త్ర్యము కాపాడి, సంఘ సమిష్టి బాధ్యత, పెంపొందించి మానవాభ్యుదయమునకు కృషి సల్పుట సహకారోద్య మముయొక్క యేకైక లక్ష్యము.

ఈ సహకార విధానము నాచరణలో పెట్టి డెన్మార్కు, ఐర్లండు దేశములలోని కర్షక, కార్మికులు సాంఘిక, ఆర్ధిక, ఔన్నత్యమును పొంద గలుగు చున్నారు. కెనడా, యునైటెడ్ స్టేట్లలో మూడు వంతులు వర్తక వ్యాపార సరళి నేడు సహకార పద్ధతులపై సాగింప బడు చున్నది. ఇగ్లాండులో కొనుగోలు వ్యాపారము, వస్తు సేకరణము సగటున మూడు వంతులు పై విధానముననే ప్రజాసామాన్యములో వ్యాపించినది. స్పర్ధలు, పోటీలు,

వ్యాపారములో లేకుండ, లాభముల పంపకము, అంద రికి కొనుగోలును బట్టి వ్యాప్తి చేయ బడుచున్నది.

రష్యా దేశములో వేల కొలది యకరములు సమిష్టిగా వ్యవసాయము సహకార పద్ధతులపై నిర్వ హింప బడుచున్నది. సహకారోద్యమ సిద్ధాంతముల పరిణామము ప్రపంచములో సంఘర్షణలు వైరములు లేని (Co-operative Common wealth) సహకార సామ్రాజ్యమును స్థాపించుటయేను. ఇదియే యీయుద్యమ ముయొక్క ఆదర్శకము, లక్ష్యము, గమ్యస్థానము.

సోవియటు రష్యా సంస్థాపకుడగు లెనిన్ మహా శయుడు సహకారోద్యమ ప్రాశస్త్యమును గుర్తించియే రష్యా దేశమందలి పల్లెలలోను పట్నములలోను సహ కార సంఘములను విరివిగా వ్యాప్తిచేసి స్త్రీ పురుషులను సభ్యులుగా చేయుటకు ప్రోత్సహించి ప్రభుత్వ వ్యాపార వ్యవహారముల నన్నిటిని, యీ సహకార సంస్థలద్వారా నిర్వహింప జేసెను. సోవియట్ రష్యా యేకైక నాయ కుడగు స్టాలిన్, లెనిన్ మార్గమునే అనుసరించి దేశము

సంపత్సమృద్ధిగ చేయుటకు యీ సహకారోద్యమమును బహుళవ్యాప్తి కావించు చున్నాడు.

భారతదేశములో కూడ సహకారోద్యమము బ్రిటిష్ ప్రభుత్వమువారి అధికారమున నుద్యోగుల ప్రాబల్యముతో కొంత వ్యాప్తి గాంచినది. అయితే మొదటినుంచి ప్రభుత్వోద్యోగుల ప్రాబల్యముననే పెంపొందింప బడుటచే ప్రజా సామాన్యమునకు దీని ప్రాశస్త్య మంతగా వెల్లడి కాలేదు. పంజరములోని చిలుకవలె కుండీలోని మొక్కవలె శృంఖలా బద్ధమై అణగి మణగి యున్నది. మూడు సంవత్సరములై స్వాతంత్ర్యము దేశమునకు లభించినను అధికార ప్రాబల్యముననే యుద్యమము కొనసాగు చున్నది. సంపూర్ణ ప్రజా సానుభూతి ఆదరణ యింకను కలుగ లేదు.

భారత స్వాతంత్ర్య సంస్థాపనాచార్యుడగు శ్రీ గాంధీ మహాత్ముడు సహకారోద్యమము గ్రామ పునర్నిర్మాణమున కుత్తమ మార్గమని పలుసారులు "యంగ్ ఇండియా" (young India) పత్రికలో వ్రాసెను. వీరి అనుచరులగు శ్రీ అగర్‌వాలా గారు ( Gandhian

way) అను గ్రంథములో ఆర్థిక స్వాతంత్ర్యమునకు సహకారోద్యమమే శరణ్యమని మహాత్ముని అభిప్రాయమును వ్యక్తపరచెను.

దేశీయ మహాజనసభ (Congress)యొక్క ప్రధానాదర్శకము దేశమంతటిలోను సహకార సామ్రాజ్యము (Co-operative Co-mmon wealth) నెలకొల్పుటయే యని ప్రకటింప బడినది. భారత సాంప్రదాయమునకు తగినట్లు మహాత్ముని అహింసా సిద్దాంతములకు అనువగు నట్లు ప్రజల రాజకీయ ఆర్థిక, సాంఘిక, నైతిక పురోభి వృద్ధికై సహకార సిద్ధాంతముల ననుసరించుట ఆవశ్యకము. ఇందుమూలముననే భారతదేశ భావి భాగ్యోదయము కలుగును.

# రెండవ ప్రకరణము

## సహకారోద్యమ ప్రతిష్ఠ

బ్రిటిష్ పరిపాలనలో భారతదేశమున క్షామములు వృద్ధి యయ్యెను. ఏదో యొక రాష్ట్రములో యేటేటను ప్రజలు క్షామ పీడితు లగుట రివాజ య్యెను. రైతాంగము క్షామములచే ఋణగ్రస్తమై భూముల అన్యాక్రాంతము చేయుట సంభవించుచుండెను. వడ్డీ వ్యాపారస్తులు రైతుల యవసరమును కనిపెట్టి హెచ్చు వడ్డీ రేట్లకు అప్పులిచ్చి రైతుభూముల నాక్రమించుకొనుచుండిరి. అధిక వడ్డీ రేట్ల నుంచియు క్షామ పరిస్థితుల నుంచియు బీద రైతాంగమును సంరక్షించుటకు బ్రిటిష్ ప్రభుత్వము వారు యీదేశమున సహకార పరపతి సంఘములను, స్థాపించిరి. 1904 సం॥లో కేంద్ర ప్రభుత్వమువారు సహకార శాసనమును కావించిరి. ఈ శాసనము భారత దేశములోని అన్ని రాష్ట్రములలో నమలులో పెట్టబడినది. ప్రతిరాష్ట్రములోని సహకార సంఘముల పరిపాలించుట కొరకు సహకార రిజిష్ట్రారు తగు సిబ్బందితో నియోగింపబడెను. 1904

నుంచి 1919 వరకు 15 సం॥లు కేంద్ర ప్రభుత్వ శాస నముక్రింద వివిధ రాష్ట్రములలో సహకారోద్యమము వ్యాప్తి కావింప బడినది.

ఈ కాలములో ముఖ్యముగా సహకార పర పతి సంఘములే వృద్ధియైనవి. ఈసంఘముల ద్వారా రైతులకు స్వల్ప వాయిదా అప్పులు ముఖ్యముగా వ్యవసాయ పెట్టుబడికి, సర్కారు పన్నులకు, కుటుంబ ఖర్చులకై అప్పు లీయబడినవి. పట్టణములలో స్వల్పా దాయపరులకు డబ్బు సరఫరా చేయుటకై అర్బను బ్యాంకులు వెలసినవి. సభ్యుల వాటా ధనముతోను, స్థానిక డిపాజిట్లతో నీ సంఘములు చాల నెమ్మదిగా ప్రథమ దశలో పెంపొందినవి. తగినంత ధనస్థోమతు విరివిగా నీసంఘములకు లభింపక పోవుట మూలమున సెంట్రల్ బ్యాంకుల స్థాపన యేర్పడినది.

అందుచే           సం॥ పు శాసనము మార్పు చేయబడినది. 1912 సం॥లో కేంద్ర ప్రభుత్వము వారు నూతన శాసనము నమలులో పెట్టిరి. ఇందు మూలమున కేంద్ర సంస్థల నిర్మాణమున కవకాశ మేర్ప

డినది. సెంట్రల్ బ్యాంకులు నిర్మాణమునకై గ్రామ సహకార సంఘములకు డబ్బు విరివిగా సరఫరా చేయ కలిగినవి. జిల్లా కేంద్ర సహకార బ్యాంకుల వృద్ధితో పాటు వివిధ రాష్ట్రములలో కేంద్ర రాష్ట్రీయ బ్యాంకుల నిర్మాణ మావశ్యక మయ్యెను. ధనాభావము కల్గిన జిల్లా బ్యాంకులకు డబ్బు సరఫరా చేయుటకు ధనము విస్తారముగా గల్గిన జిల్లా బ్యాంకులలోని డబ్బు తీసుకొను టకు రాష్ట్రీయబ్యాంకులు యుపచరించి యుద్యమ సక్రమ వ్యాప్తికి తోడ్పడినవి. సహకార పరపతి వ్యాపారము గ్రామ సీమల నుండి పట్టణములకు పట్టణముల నుండి రాష్ట్రము వరకు నియమ బద్ధమై వ్యాపించి రైతులకు డబ్బు చేకూర్చుటకు చక్కటి సహకార పరపతి సంస్థల నిర్మాణము చేయగల్గినది. సహకారోద్యమ ప్రారంభ దశలో పరపతి వ్యాపారము ద్వారా రైతులకు మహోప కారము కలిగినది. ఈ సహకార పరపతి సౌధమునకు పునాది గ్రామ సహకార పరపతి సంఘము. మొదటి అంతస్తు సెంట్రల్ బ్యాంకులు, చివర అంతస్తు రాష్ట్రీయ బ్యాంకు. ఈ నిర్మాణ మొక పిరమిడ్డు (Pyrmaid) తో పోలి యున్నది. గ్రామ సహకార సంఘమునకు కావల సిన డబ్బు సెంట్రల్ బ్యాంకులు సరఫరా చేయు చున్నవి.

సెంట్రల్ బ్యాంకులకు కావలసిన డబ్బు రాష్ట్రీయ బ్యాంకు సరఫరా చేయుచున్నది. గ్రామ సహకార సంఘములో చేరిన సభ్యులందరు అప్పుకావలసిన వారేను. ఈ అప్పులు తీయు సభ్యులే సంఘ పంచాయితీ దార్లుగా యెన్నుకోబడి సంఘ నిర్వాహకులగు చున్నారు. ఈఅప్పు తీయు సంఘ ప్రతి నిధులే జిల్లా కేంద్ర బ్యాంకు నిర్వాహణమునకు సభ్యులగు చున్నారు. వీరే యీ బ్యాంకు పరిపాలనా వర్గము నెన్నుకొనెదరు. ఈ సెంట్రల్ బ్యాంకుల ప్రతినిధులే రాష్ట్ర సహకార బ్యాంకు నిర్వాహణమునకు సభ్యులగు చున్నారు. వీరిలో నుండియే పాలక మండలి వారినుండి కార్య నిర్వాహక వర్గము రాష్ట్రీయ బ్యాంకులో నేర్పడు చున్నది. ఈ నిర్మాణము వలన పల్లెటూరు మొదలు కేంద్ర బ్యాంకు వరకు అప్పు దారులే యీ సంస్థల నిర్వాహకు లగుచున్నారు. ఈ నిర్వాహకుల నిర్మాణ నిర్వహణ చాకచక్యము మీదనే ఈ సహకార పరపతి సంఘముల యుద్యమము పూర్తిగా ఆధారపడి యున్నది.

ధనవంతులు తమ ధనమును యీ బ్యాంకులలో ధారాళముగా నిలువ జేసు కొనుచున్నారు. రాష్ట్రీయ

బ్యాంకులలోను సెంట్రల్ బ్యాంకులలోను డిపోజిట్లు విస్తారముగా స్వీకరింపబడుచున్నవి. గ్రామ సంఘము లలో అంతగా డిపాజిట్లు వచ్చుట లేదు. ఉద్యమ మంతయు కేంద్రసంఘము డబ్బు సరఫరా మీద గ్రామ సంఘము లాధారపడి యున్నవి. కేంద్ర సంఘములలో ధనాభావము వచ్చిన, గ్రామ సహకార సంఘము లెండి పోయిన చెరువులోని చేపలవలె తేలిపోవలసినదేను. గ్రామ సహకార పరపతి సంఘములు స్వయం పోషకత్వము కల్గినపుడే యీ సహకార పరపతి సౌధము దృఢముగా నిలబడగలదు. లేని-చో తల బరువై యుద్యమము కూలిపోవును.

గత అర్ధ శతాబ్దమునుండి, భారత దేశములో సహకార పరపతి సంఘవ్యాపారము వృద్ధిపొంది కోట్ల కొలది రైతాంగమునకు మహోపకార మొనర్చినది. రైతును హెచ్చు వడ్డీ రేట్లనుంచి కాపాడు చున్నది. షావు కార్ల యొత్తిడి, క్రూర్య పద్ధతి నుంచి తొల గించి, ఆర్థిక దాస్యమునుండి కొంత వరకు విడిపించి నది. అయితే యీయుద్యమము రైతునకు సక్రమముగా

## రెండవ ప్రకరణము.

తోడ్పడవలెనన్న బహువిధముల సర్వతోముఖముగ వ్యాప్తి కావలెను. ఇందుకు సహకారులు తమ అనుభవములను యీ అర్ధ శతాబ్దమునుండి సింహావలోకనము చేసికొని, నూతన మార్గమున నీయుద్యమము విజృంభింప జేయుటకు ఆయత్త పడుచున్నారు.

—)o(—

మూడవ ప్రకరణము

# పరిమితిలేనిపూచీ

ఉద్యమ ప్రారంభ దశలో సహకార పరపతి సంఘములు దేశమంతట ముందుగా వ్యాప్తి కావింప బడినవి. ఈ గ్రామపరపతి సంఘములు పరిమితిలేని పూచీ పద్ధతిని నెల కొల్పబడినవి. ఈ పద్ధతి జర్మనీలో రైఫేసియన్ మొదట ప్రారంభించెను. సంఘములో చేరిన ప్రతి ఒక్కరు, సంఘములో చేరిన అందరి మెంబ ర్ల యొక్క అప్పులకు బాధ్యులు. ఈ సమిష్టి బాధ్యత మూలముననే సంఘము నకు పరపతి గల్గి పెట్టుబడి దార్ల వద్దనుంచి ధనము తెచ్చు కొనుటకు సులువుగా అవకాశ మేర్పడు చున్నది. పరిమితి లేని పూచీ పద్ధతి గ్రామ పరపతి సంఘములకు ఆయువు పట్టు. రైఫేసియన్ పద్ధతి వివిధ దేశములలో నూతన పరిణామ ము చెంది విభిన్న మార్గముల వృద్ధి పొందుచున్నది. మన దేశములో కూడ యనుభవము మీద యీ పరిమితి లేని పూచీ మార్గము సడలింప బడుచున్నది. కొన్ని సంఘములలో స్వలాభ పరులు బయలు దేరి

ధనాపహారణము గావించి, తమ అప్పులు యెగ బెట్టి యందరి నెత్తిమీద యీఋణములు పడవైచిరి. ఇందుమూలమున పరిమితిలేని పూచీ గల సంఘము లలో యాస్తిపరులు, ధన వంతులును మెంబర్లుగాచేర వెరచుచున్నారు. పరిమితి లేని పూచీగల సంఘ వ్యవ హార్తలు నిక్కచ్చిగా వ్యవహరింపక నిబంధనలు సడ లింపుచేసి, అప్పులు సులభముగా బట్వాడా చేయుటచే సంఘములు ధన నష్టము పాలైనవి. ఏకొలది మంది పెద్దల మీదనో యీఋణ భారము పడుటచే యీ సంఘముల పట్ల పలువురకు విముఖత కల్గెను.

మరియు గ్రామసీమలలో చదువు కొనగలిగి వ్యవ హార దక్షత గల ప్రజలు బహు కొలదిగా నున్నారు. నిరక్షరాస్యులగు సభ్యుల నీసంఘ వ్యవహారికులు మోస గించి పరిమితి లేని పూచీ పద్ధతి అందరి నెత్తిన రుద్దుటకు కుట్రలు చేయుటచే నమాయకులగు ప్రజలు కొన్ని చోట్ల నష్టముల పాలైరి.

భారత దేశ ప్రజల పరిస్థితులు బాగుగ నవగాహన చేసికొన్న శ్రీగోఖలేపండితుడు1904న సహకార శాసనము

చేయునపుడు క్రింద శాసన సభలో పర్మితిలేని పూచీ పద్ధతి భారత దేశమునకు పనికిరాదని ఘంటా పథముగా చెప్పెను. వారు శాసన సభలో కావించిన యుపన్యాస వాక్యము లిందు పొందు పరుపబడినవి.

" Unlimited liability no doubt strengthens the position of the societies greatly in the money market; but it is a principle which our ryots in many parts of our India cannot understand. Each member to be liable in all his property for his society's debts — this is to them an entirely foreign idea, and in most parts, it is to be feared would diter people from joining such societies".

గోక్లే పండితుడు దాదాపు అర్ధశతాబ్దము క్రింద పలికిన, వాక్యములు నేడు యదార్థము లైనవి. పరిమితి లేని పూచీ సంఘములలో ప్రజలసంఖ్యాకులుగా చేరుటకు వెరచు చున్నారు. ప్రతి ఒక్కరు తమ యావదాస్తిని సంఘము యొక్క అప్పులకు పూచీ పడుట భారత దేశములో లేని సాంప్రదాయము. పర్మితి లేని పూచీ

సంఘములు, పరిమితి గల పూచీ సంఘములు నేడు దేశములో విస్తారముగా వ్యాపించి యున్నవి. వ్యవహారికముగ, పరిమితి లేని పూచీ సంఘములలో, డబ్బు సురక్షితముగా నుండ గలదను కున్నను, అనుభవములో నీ సంఘములకు విస్తారముగా డిపాజిట్లు చేకూరుట లేదు. పట్టణములలోని పరిమితిగల పూచీ సంఘములలోనే విస్తారము డిపాజిట్లు ఆకర్షింప బడుచున్నవి. కట్టు దిట్టముగా నిర్వహింప బడుచున్నవి. నిర్వహణ సామర్థ్యము గల నిర్వాహకులే పరిమితి గల పూచీ సంఘములలో వ్యవహరించు చున్నారు. దేశమొత్తము మీద దాదాపు 50సం॥ల అనుభవములో సహకారోద్యమములో పని చేయు అగ్రనాయకులు పరిమితిలేని పూచీ పద్ధతి తొలగించి పరిమితి గల పూచీ పద్ధతియే సంఘ సకలార్థ వ్యవహారములకు అనుగుణ్యమైనదని అభిప్రాయ పడుచున్నారు.

మదాసు రాజధానిలో విజయ రాఘవాచారి కమిటీలోని అధిక సంఖ్యాక సభ్యుల నివేదికలో గ్రామ సహకార సంఘములను పరిమితిగల పూచీ మీదనే నెల కొల్పుట శ్రేయోదాయకమని వ్యక్తపరచిరి. యునైటెడ్ ప్రావిన్సెస్, మైసూరు మొదలుగాగల ప్రాంతములలో పరిమితిలేని పూచీ పద్ధతి మార్చి పరిమితి గల పూచీ

సంఘములు విరివిగా వ్యాప్తి చేయబడు చున్నవి. సహకారోద్యమమున విశేషానుభవము గల అన్వారు ఇక్బల్ క్వరాషీ (Anwar Iqbal Qureshi) అను పండితుడు యీవిధముగా పేర్కొనెను.

"Unlimited liability has proved more a hindrance than an asset. It is therefore highly desirable that multiple-purpose societies with limited liability and a responsible amount of share capital should take the place of single purpose credit societies which have unlimited liability. In my opinion, co-operative societies in the villages should be of the multiple type and their liability should be limited".

అఖిల భారత సహకార కమిటీ (Sariaya Committee) వారు కూడ ఈ దిగువ అభిప్రాయమును పొందు పరచిరి.

In most provinces, unlimited liability has not been very helpful to the progress of co- operative credit. Responsible people were kept out of the movement

by it and also it was largely illusory as long as there was no bar on the alienation of property by its members.

అనుభవముమీద పరిమితిలేని పూచీ గ్రామాదులలో ఆకర్షణీయముగా లేదు. ప్రజాభిప్రాయ మిందుకు విముఖముగ నున్నది. ఉద్యమ నిర్వాహకులలో నీ విషయమై భేదాభి ప్రాయములున్నను మొత్తము మీద పర్మితిలేని పూచీ క్రమముగా విడనాడుటే శ్రేయస్కరమని ప్రముఖ సహకారుల అభిప్రాయము వ్యక్తమగు చున్నది. అయితే సెంట్రల్ బ్యాంకుల, రాష్ట్రీయ బ్యాంకుల నిర్వాహకులు పర్మితిలేని పూచీ విడనాడుట కొప్పుకొనరు. దేశమున కంతకును బ్యాంకింగు వ్యాపార పద్ధతిలో సలహాదారులైన రిజర్వు బ్యాంకు వారు గ్రామ సహకార సంఘములకు పర్మితిలేని పూచీయే యుండవలెనని ఖచ్చితముగా చెప్పుచున్నారు. అనుభవ మిందుకు భిన్నముగా నున్నది. మద్రాసు రాష్ట్రములో రిజిష్ట్రారు సహకార శాఖామాత్యులు పరిమితిలేని పూచీ విధాయకముగా పల్లెటూళ్ళ సంఘములలో వుండవలెనని ఖాయపరచిరి.

పదియేండ్ల క్రిందటనే మచ్చునకు ఆలమూరులో పర్మితిలేని పూచీ పద్ధతి విడనాడి పర్మితిగల పూచీ

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

పైని ఆలమూరు చుట్టు ప్రక్కల గ్రామములకు రూరల్ బ్యాంకు అను పేరుతో ఆలమూరులో సకలార్ధ సహకార సంఘము రిజిష్టరైనది. ఇది మామూలు పద్ధతికి విరుద్ధమే యైనను గత 10సం॥ ల నుండి యీ సంఘము వృద్ధియై బహు జనోపయోగముగ నున్నది. పశ్చిమ గోదావరి జిల్లాలో పశ్వివేదల గ్రామ పరిసర ప్రాంతముల కీరీతిగనే ఒక సకలార్ధ సహకార సంఘము రిజిష్టరయినది. ఆ సంఘము కూడ దినదినాభి వృద్ధి గాంచి అభ్యున్నతి గాంచుచున్నది. 1939 సం॥లో జరిగిన 13 వ సహకార రిజిష్ట్రార్ల కాన్ఫరెన్సులోని 12,—13 తీర్మానము లలో ప్రత్యేకముగా గ్రామ పరపతి సహకార సంఘములు ముందు యెట్లు నిర్మాణము చేయవలసినదియు సూచన చేయబడినది. సర్వసాధారణముగా గ్రామ సహకార సంఘములు పర్మితిలేని పూచీపైననే రిజిష్టరు చేయబడవలెననియు, అయితే ఆదర్శకముగా పనిచేసి చూపుటకు పరిమితిగల పూచీపైని ప్రత్యేకముగా సంఘములు రిజిష్టరు చేయబడవచ్చుననియు సూచన చేయబడినది. 1939 సం॥ నాటికే ప్రజాభిప్రాయము పరిమితిలేని పూచీ పద్ధతి విషయమై వ్యతిరేకముగా నుండెను. ఈ వ్యతిరేకాభిప్రాయుల వాదము నంగీకరించుటకు రాష్ట్రీయ

రిజిష్ట్రార్ల సమావేశములో పరిమితిగల పూచీ సంఘముల రిజిష్ట్రి చేయు వాద మంగీకరింప బడినది.

ఆలమూరు, పశ్వివేదల గ్రామములలో రిజిష్ట్రి కాబడిన పరిమితిగల పూచీ సంఘములే యిందుకు తార్కాణము. 10 స॥ లయినతరువాత 1948 సం॥మున మదరాసులో జరిగిన రాష్ట్రీయ రిజిష్ట్రార్ల సహకార సభలో పరిమితి లేని పూచీపద్ధతి చాలా రాష్ట్రములలో సహకారోద్యమ పురోభివృద్ధికి తోడ్పాటుగా లేదని అంగీకరింప బడినది. పర్మితిగల పూచీ పద్ధతి వైపునకే అభిప్రాయము మొగ్గుచున్నదని అంగీకరించిరి.

Res. 15:- "In most provinces unlimited liability has not been very helpful to the progress of Co-operative Credit & the trend of thought is in favour of limited liability."

మద్రాసు రాజ ధానిలో సహకారోద్యమములో విశేషానుభవము కలిగి నేడు కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింప బడు ఆహార శాఖయందు ఉన్న

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

శ్రోద్యోగమునందున్న ఎస్. వై. కృష్ణస్వామి I.C.S.గారు మద్రాసులోని పల్లెటూరి సమస్యలు అను గ్రంధములో పరిమితి లేని పూచీ విషయమై తమ అభిప్రాయమును వ్యక్త పరచిరి. చిన్న కుగ్రామములకు ఒక్క కులమువారే నివసించుచున్న ప్రదేశములలో పరిమితిలేని పూచీ ఉపయుక్తమనిరి. విశేష మార్గ సౌకర్యములు కలిగిన యీరోజులలో 20మైళ్ల ప్రదేశములోని చిన్న కుగ్రామములు కలిపి ఒక సహకార ప్రాథమిక సంఘము పనిచేయవలెనని సూచించిరి. పలుగ్రామములకు ఉపకరించే సంఘము పరిమితిగల పూచీ పద్ధతి మీదనే ఏర్పాటు కావలెనని వ్యక్త పరచిరి. ఇవి వారు వ్రాసిన వాక్యములు.

"The unlimited liability society is suitable only for a small homogeneous village community. With the improvement in communications and the consequent ease with which a villager can travel a distance of more than 20 miles and back within forenoon, there is need for making a group of villages, the unit for a Co-operative Bank of the limited liability type".

## మూడవ ప్రకరణము.

తెనాలిలో జరిగిన 17 వ ఆంధ్రసహకార మహా జనసభకు అధ్యక్షత వహించుచూ సుప్రసిద్ధసహకార్లును అఖిలభారత కాంగ్రెసుకు కార్యదర్శియగు శ్రీ కళా వెంకటారావుగారు సకలార్థ సహకార సంఘములు పరిమితి గల పూచీపైననే స్థాపింపబడ వలెను గాని, పరిమితిలేని పూచీ పైని స్థాపింప కూడదని విస్పష్ట పరచిరి. వారి వాక్యము లిందు పొందు పర్చడమైనది.

"One important thing I would like to lay stress upon is about limited liabilty. This idea accepted by a majority of co-operators in general is being put into cold storage. The co-operative credit societies based on unlimited liability have served their day. Perhaps unlimited liability was good to some extent when the soci-ties functioned merely as instruments of chief credit. But our endeavour to-day is that co-operation must be made to serve the needs of the masses not only for their credit facilities but also for production, consumption and distribution. We have to broad-base the existing co-operative credit society and change it into a multi-

purpose society. A multipurpose society cannot but be on a limited liability basis. I don't agree with the idea that the multipurpose and unlimted liability can be made to go together our ideas have to change radically in this matter."

అధికారులలోను అనధికార సహకారులలోను క్రమముగా పరిమితిలేని పూచీ పద్ధతి పట్ల విముఖత్వము కలుగుచున్నది. పరిమితి గల పూచీ పద్ధతియే నూతన పరిస్థితులకు అనుగుణ్యముగ నుండగలదనే నిశ్చితాభిప్రాయ మేర్పడుచున్నది.

రిజర్వు బ్యాంకు అధికారులు గ్రామ సహకారసంఘములు సకలార్థ సహకార సంఘములుగా నుండవలసినవే కాని కేవల పరపతి సంఘములుగా నుండి అప్పులిచ్చి పుచ్చుకోవడముతోనే సమాప్తి కాగూడదని ఒక తరనుంచి శంఖారావము చేయుచున్నారు.

వారి హితోపదేశము ప్రకారము చాల రాష్ట్రములలో సహకార పరపతి సంఘములు సకలార్థ సహకార

సంఘములుగా మారినవి. సంఘములు బహుళ వ్యాపారములలోనికి ప్రవేశించినప్పుడు పరిమితిలేని పూచీ అనర్థదాయకము. వ్యాపార నష్టము, కొన్ని వ్యవహారములలో కలిగి నప్పుడు, ఆనష్టము నంతను, పరిమితి లేని పూచీ పద్ధతి ప్రకారము అందరి సభ్యులపై కట్ట వలసి వచ్చును. ఆస్థిపరులగు సభ్యులు యిట్టి సంఘములలో చేరుటకు అంగీకరించరు. అందుకనే నూతనముగా స్థాపింపబోవు గ్రామ సమూహములకుచెందు సకలార్థ సహకార సంఘములు పరిమితి గలపూచీపై నిర్మింప బడుచున్నవి. సంయుక్తరాష్ట్రములలోను, ప్రసూరులోను, స్థాపించెడి సకలార్థ సహకార సంఘములు, పరిమితి గల పూచీపైననే స్థాపింప బడుచున్నవి. మద్రాసు, బొంబాయి, రాష్ట్రములలో మాత్రము పరిమితి లేని పూచీ సకలార్థ సహకార సంఘములకు నిర్బంధింప బడుచున్నవి. Eleanor. M. Hough. అనువిదుషీమణి తమ Co- operative movemont అనే గ్రంథములో గ్రామ సమూహములకు చెందిన సకలార్థ సహకార సంఘములలో పరిమితిగల పూచీ పద్ధతియే ఉండవలెనని అభిప్రాయము వ్యక్తపరచింది. నూతన పరిస్థితులకు తగినట్లుగా నుండుటకు అనగా సహకార సంఘములు

కేవలము అప్పు లిచ్చి పుచ్చుకొనుటయే గాక రైతులకు కావలసిన అన్ని అక్కర్లకు సంఘము సప్రయోజనకారి కావలెనన్నచో గ్రామములలో నివసించు అన్ని వృత్తుల వారికి సంఘము అందుబాటులో నుండి తోడ్పడుటకై పరిమితి లేని పూచీ పద్ధతి నిర్బంధముగా నెత్తిని చుట్టుట న్యాయము కాదు. పరిమితి గల పూచీ పద్దతియే అనుగుణ్యమైన పద్ధతి.



నాల్గవ ప్రకరణము.

# సంఘ విస్తీర్ణ ప్రదేశము

గ్రామ సహకార సంఘములు మన దేశములో జర్మనీలోని రైఫీసియన్ పద్ధతిని నిర్మాణము చేయబడినవి. 'ఒకగ్రామమునకు ఒక సంఘము' అను పద్ధతి అనుసరింపబడినది. గ్రామములో నుండెడి ప్రజల పరిస్థితులు బాగుగా తెలుసు కొనుటకును, అవగాహన చేసు కొనుటకును మంచి చెడ్డలు నిర్ణయించు కొనుటకును సులభముగా నుండునని ప్రతి గ్రామమున కొక్కొక సంఘము స్థాపించుట శ్రేయస్కరమని రైఫీసియన్ ఉద్యమారంభ దశలోనే నిర్ణయించెను. ఈ పద్ధతినే భారత దేశములో కూడ ప్రభుత్వము వారనుసరించి పరపతి సంఘములను వివిధ రాష్ట్రములలో వ్యాప్తి చేసిరి. 1915 సం॥లో సహకార సంఘములు పరిశీలించుట కేర్పడిన మేక్లిగన్ కమిటీవారు దేశమంతట పర్యటనము గావించి రైఫీసియన్ పద్ధతి అనగా "ఒక గ్రామమునకు ఒకసంఘము" అనుగుణముగా నున్నదని అభిప్రాయమును వెలిబుచ్చిరి.

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

The field of the society should be sufficently restricted to allow members to be mutually acquainted and to be in a position to exercise an effective mutual control. It is a good general rule that there should be "one society to one village and to one village one society".

సహకార ఉద్యమమునందు విశేష పరిజ్ఞానము కలిగి అంతర్జాతీయ ప్రఖ్యాతినిపొందిన wool J వూలుఫ్ పండితుడు సహకార సంఘముల విస్తీర్ణ ప్రదేశమును గురించి రైఫేసియన్ సిద్ధాంతమునే అనుసరించుచు సభ్యులొండొరుల బాగోగులు తెలిసి కొనుట కవకాశము కలిగిన చిన్న ప్రదేశములలోనే సహకార సంఘములు నెలకొల్ప బడవలెనని Co-operation in India అను గ్రంధములో స్పష్టీకరించెను

The local society ought to be small and to have a clearly defined, narrowly circumscribed area, without which conditions being fulfilled there could be no close touch uor intimate knowledge of one another, which is the main safe-gaurd in the system adopted under Raiffeisen principles.

## నాలుగవ ప్రకరణము.

జర్మనీ దేశములో పల్లెటూళ్ల ప్రాంతములలో గ్రామమున కొక సంఘము, అనే పద్ధతిని పరపతి వ్యాపారము బాగుగా కొనసాగిన దని జర్మనీ దేశపు సహకారోద్యమమును కూలంకషముగ పరిశోధించిన క్యాహెల్ నివేదికలో చెప్పబడినది.

" This limitation of area constitutes one of the essential principles of Co-operative rural credit societies in Germany by this means a certain security is guaranteed. The members are intimately acquainted with each other. They know the means and capacity of each other. They know that such a one is industirous and farms well, and another is intemperate or a bad farmer whose circumstances are gradually becoming worse. (Page 67)

If business is extended over several communes, the cost of administration is increased, and the scrutiny of detail is necessarily less effective. Another important advantage of restricted area is that savings deposits which constitute the bulk of the working capital of these

societies are more conveniently lodged by members.

జర్మనీ దేశములో సహకారోద్యమము పరిశీలన చేసిన సర్ ఫ్రెడరిక్ నికల్సన్, తన నివేదికలో జర్మనీ దేశములోని సహకార పరపతి సంఘములు నియమిత విస్తీర్ణ ప్రదేశములో రైఫేసియన్ సిద్ధాంతము లమలులో పెట్టుటచేతనే బాగుగ పని చేసినవని నివేదించెను.

"In Germany, as a rule these Banks are local and their marked feature is the limitation of their area of operation. In the Raiffesein Bank, this is an absolute rule".

చిన్న ప్రదేశములోనే సహకార సంఘములు బాగుగ పని చేయగలవని ఈ విధానము ననుకరించియే, మనదేశములో వివిధ రాష్ట్రములలో సహకార పరపతి సంఘములు నెలకొల్పబడినవి. అయితే గత దాదాపు 50 సం॥రములు అనుభవములను బట్టి చూచిన చిన్న సంఘములు బుబ్బలో పుట్టి మఘలో పూడినట్లు కొంతకాలము రెపరెపలాడి తరువాత యీసుకపోవుచున్నవి. సంఖ్య వృద్ధిగా కనబడుచున్నదే గాని సభ్యుల

వృద్ధి వ్యాపార పురోభి వృద్ధి కనబడుట లేదు. ప్రథమ యుద్ధానంతరము అనగా 1919 సం॥రం మొదలు 1930 సం॥రం వరకు మన రాష్ట్రములో సహకార సంఘ ములు సంఖ్య వృద్ధి యైనది. సభ్యులు పెరిగిరి. అప్పుల వాడకము హెచ్చినది. ప్రతి గ్రామ పరపతి సంఘము సెంట్రలు బ్యాంకు నుంచి ధారాళముగ డబ్బు తీసికొని విరివిగా సభ్యులకు బట్వాడా చేసినది. పనిచేయు పంచాయితీ దార్లకు ఉత్సాహముగ నుండెను. వ్రాత పని నెరవేర్చు ప్రెసిడెంటు లేక కార్యదర్శికి వ్యాపార వృద్ధి వలన సంఘములకు లాభము వచ్చుటచే గౌరవ వేతనములు కట్టుబాటుగ నుండెను. ఇంతలో 1930 సం॥ నుంచి 1940 సం॥రం వరకు ఆర్థిక మాంద్యము వ్యాప రించెను. ధరవరులు పడిపోయినవి. భూముల క్రయము తగ్గిపోయినది. రైతులకు ఋణములు తీర్చుకునే ఆస్కా రము లేకపోయినది. సంఘములో వ్యాపారము స్థభించి పోయినది. జప్తులు వేలములు పరిపాటైనవి. వ్యాపారము సన్నగిల్లుటచే సంఘవ్యవహారికులలో నుత్సాహముతగ్గినది. లాభములు లేక పోవుటచే వ్రాత పని నెరవేర్చు చున్న అధ్యక్ష, కార్యదర్శులకు లబ్ధి లేకుండ పోవుట మూలమున సంఘ పుస్తకములు బూజులు దులిపే యోగ్యత

కూడ లేకపోయినది. జప్తులు, వారంట్లు మూలమున సభ్యులు సంఘము దరిజేరుట మానివేసిరి. ఆస్థిపరులు బాకీలు సరిపెట్టుకొని సంఘమును వదలి వేసిరి. సహకార పరపతి సౌధమునకు పునాది యైన గ్రామసహకార సంఘములు ఆర్థిక మాంద్యమున నొక్కదశ కాలము పీడింపబడుటచే సహకారోద్యమము నీళ్ళు కార జొచ్చెను. మద్రాసు రాజధానిలో సహకారోద్యమ వ్యవహారములు పరిశీలించుటకు నియమింప బడిన విజయ రాఘవాచారి కమిటిలో వారు గ్రామ సహకార సంఘములను బాగుగ పరిశీలించి యీసంఘములను పునరుద్ధరించుటకు చక్కని సలహా నొసంగిరి. గ్రామ సహకార సంఘము యొక్క పరిస్థితుల నిట్లు 1940 సం||రంలో ప్రకటించిరి.

"The present structure of the credit movement in this province is pyramidical with the primary society at the base, the Central Bank in the middle and the Provincial Bank at the apex. Such a structure can be sound and stable only if it is broad based on solid foundations. The weakness of the structure lies in the weakness of the foundation - the the village society. The weakest link

in the chain is the village society – 60% of the societies in the province are indebted to the Central Bank. 13% have not borrowed for one year, 6% for 2 years, and 3% for 3 years.

This is a position which you cannot regard with any degree of satisfaction. These societies are in a state of suspended animation."

అర్థిక మాంద్యము వ్యాప్తి చెందిన 10 సం॥లలో సహకార పరపతి ఉద్యమమునకు మూలాధారమైన గ్రామ పరపతి సంఘములు నానాటికి దీసికట్లు నాగంబొట్లు అనునట్లు దిగనారి పోవుటకు ప్రారభించినవి. తీతువు కాళ్ళవలె సన్నగిల్లినవి. కుక్క గొడుగుల విధమున దల బరువై తరగుట కారంభించినవి. గ్రామ సంఘములు యీదుస్థితిని పరిశీలించి ఉద్యమమునకు బలము చేకూర్చుటకు విజయ రాఘవాచారి కమిటీవారు చిన్న గ్రామ సంఘములను కలిపి గ్రామ సమూహములకు వర్తించునట్లు పెద్ద సంఘములను స్థాపించవలసినదిగా సలహా యిచ్చిరి.

"It is necessary in our opinion that small societies should be reorganised on a wider basis by grouping them together into one society. But a radius of three to five miles according to convenience and facilities, as far as possible, for easy accessibility and mutual contact among villagers might be the normal feature of reorganisation. Agricultural credit societies reorganized and expanded on these lines will be able to work at a margin, which will give them sufficient income to carry on their operations on a business basis by employing the requisite paid staff and to build up reserves. These larger societies are in our opinion, the natural consequence of the decentralization of co-operative activities and departmentalization of credit, sale and production to which we have just referred. We also feel that there is a distinct advantage in extending the jurisdiction of one village society to more than one village, because it may be possible to check or overcome the factious tendencies which are an unfortunate feature of village life to-day. It is not that four or five villages in the neighbour-

hood do not share the same partisanship but that the intensity of bitterness which may prevail as between two warring factions in a single village may not manifest itself in the same degree when the field of action is extended over a wider area. Further such an enlargement of their area will offer societies a wider scope for the selection of proper men to carry on their business efficiently; it will conduce to better audit or supervision as it will be easier for any agency to supervise one centrally organized body than a number of small scattered societies."

అయితే యీసలహా మదరాసు రాష్ట్రీయప్రభుత్వము వారు అమలు పరుపలేదు. ఒకయూరికి ఒకసంఘమును పెట్టుటయే నిర్ధారణచేసిరి. కాని, బొంబాయి, మైసూరు తదితర రాష్ట్రములలో గ్రామ సమూహములకు పరపతిసంఘములను స్థాపించుచున్నారు. బలమగు సంఘములేర్పాటగుట మూలమున ధనస్థోమత వృద్ధియగుటయే గాక గౌరు వోద్యోగులపై సంఘమాధారపడి యుండక వేతనోద్యోగులను సంఘ

వ్యవహారములు నిర్వహించుటకు, నియోగించు కొనుటకు తగిన ధనస్థోమతు గలిగియుండును. నాధారుసంఘములు పూరూర వృద్ధి పరచుట కంటె బలమైన సంఘము లను, ఆర్థిక స్థోమతతో వృద్ధి పరచుట ఉద్యమ పునాదికి కట్టుదిట్టము. బలమైన పునాదులపై సహ కార సౌధము నిలబడగలదు. బలహీనములైన సంఘ ములు ఉద్యమమునకు అనర్థ దాయకములే కాని, యుద్యమ పురోభివృద్ధికి తోడ్పడజాలవు.

1940 సం॥రం నుండి 1950 సం॥రం వరకుగల మరి యొక దశలో ఆర్థిక మాంద్యము పోయి ఆర్థిక సౌష్ఠవము వృద్ధి అయినది. ధరలు హెచ్చినవి. భూముల ధరలు పెరిగినవి. రైతాంగమునకు ఆదాయము చేకూరినది. పాత అప్పులు తీరినవి. రైతాంగములో నాదాయము పెంపొందుటచేత డబ్బు చేతులో ఆడుచున్నది. గ్రామ సంఘములు పెద్దవిగా నుండి తగిన క్షేమనిధి సంపాదించు కొనినచోట రైతులు ధారాళముగ డబ్బు డిపాజిట్టు చేసికొను చున్నారు. పెద్ద విస్తీర్ణ ప్రదేశము లకు వర్తించు ఆలమూరు, పశ్వివేదల గ్రామ సంఘములే యిందుకు తార్కాణములు. ఈ సంఘములో

రైతాంగము పది లక్షల రూపాయలు డిపాజిట్లు పూర్వ కముగ నిలవవేసి కొనినది. అనుభవముమీాద చిన్న సంఘ ములు ఊరూర పెట్టుట కంటె గ్రామ సమూహములకు బలమైన సహకార పరపతి సంఘములు నెలకొల్పుటయే శ్రేయోదాయకమని తోచక మానదు.



ఐదవ ప్రకరణము

# సకలార్థ సహకారము

గ్రామ సంఘములు పునర్నిర్మాణము చేయుటవిషయములో పరిమితి లేని పూచీ పద్ధతితొలగించి పర్మితి గల పూచీలమలులో పెట్టవలెనని బహుళ సంఖ్యాకుల అభిప్రాయముగ నున్నదని వ్యక్త పరచ బడినది. మరియు ఒక గ్రామమునకు ఒక్కొక్క సంఘముగా కుండగ సంఘ విస్తీర్ణ ప్రదేశము, గ్రామ సమూహములకు వ్యవహరించ వలయుననియు, సూచింప బడినది. పై రెండు విషయములలోను ప్రముఖ సహకారులలో భిన్నాభిప్రాయములున్నను, గ్రామ సహకార సంఘములు అప్పు లిచ్చి పుచ్చుకొను ఏకైక ప్రయోజనమునకే కాక, బహుళ ప్రయోజనముల కొరకు, అనగా గ్రామ సంఘములు సకలార్థ సహకార సంఘములుగా మార్చుటకు, ఏకాభిప్రాయము కలదు. ఉద్యమారంభ దశలో కేవలము పరపతి వ్యాపారము కొరకే సంఘములు స్థాపింప బడినవి. వృద్ధి పరుపబడినవి. ఈ యేక లక్ష్యము

తోనే గత 40 సం॥రముల నుండి గ్రామ సంఘములు పని చేయుచున్నవి. రైతునకు ముఖ్యముగ అదునుకు కావలసినది, పెట్టుబడికి డబ్బు. ఈ డబ్బు దొరకకయే రైతు సాహుకారుల చేతులలో బడి హెచ్చు వడ్డీకి అప్పులు తీసి యీ ఋణములు తీర్చ లేక "మలగానాం, తేలానాం" అవుతున్నాడు. రైతును ఋణవిముక్తుని చేయుటయే ముఖ్య ఆదర్శకముగా పెట్టుకొని సహాకార పరపతి సంఘములు స్థాపింప బడినవి. అయితే రైతు సమస్య ఒక్క ఋణ సమస్యతో తీరలేదు. రైతు హెచ్చు వడ్డీ యిచ్చు కొనుట మూలమున అప్పులు తీర్చ లేక పోవుట యొక కారణము. రైతు ఆదాయము వృద్ధి చేయుటకు, తక్కువ వడ్డీకి పెట్టుబడి యిచ్చుటయే కాకుండ అనేక మార్గముల తోడ్పడ వలసి యున్నది. అందు ముఖ్యమైనది, రైతుకు కావలసిన విత్తనములు, ఎరువులు వ్యవసాయ పరికరములు సరసమైన ధరలకు సరఫరా చేయుటయైయున్నది.

ఈ సరకులు సరఫరా చేయుటలో సాహుకార్లు, దళారీ వ్యాపారస్తులు, ధరలో రెట్టికి రెట్టి కట్టుబరాతం

యిచ్చి యీసరకులు అమ్మకంలో రైతువద్దనుంచిహెచ్చు లాభము గుంజుచున్నారు. హెచ్చు వడ్డీలు రైతును ఏలాకుృంగ దీయుచున్నవో యీ సరకుల బరాతంకూడ ఆర్థికముగా నష్టే కుృంగదీయు చున్నది. రైతు గత్యంతరములేక ఈవిత్తనములు ఎరువులు వ్యవసాయపరికరములు పెట్టుబడిపెట్టిన సాహుకారు వద్దకే వెళ్ళి బరాతంమీాద కొనితెచ్చు కొనుచున్నాడు. ఈ సరకులుకొని తెచ్చుకొనిన ఋణము తనకు రాబోవు పంటను తక్కువ ధరకు ఇట్టి యిచ్చుకొను చున్నాడు. ఇందు మూలమున పండించిన పంటలకు తగినఆదాయము రాబట్టుకోలేక పోవుచున్నాడు. పల్లెటూరి సాహుకారు వడ్డీవ్యాపారస్తుడే కాక దుకాణదారుడుగ వ్యవహరించి రైతుకు ధన రూపకముగా సహాయముతోపాటు,సరకులు సరఫరాచేయుచు, సంవత్సరము పొడుగున రైతునకు పెట్టుబడి పెట్టుచున్నాడు. ఇందుతో కూడ రైతు ఆదాయము తానే గుంజుకొను చున్నాడు. మరియు పంట పండిన తర్వాత యీ పంట తన యిష్టము వచ్చినట్లు హెచ్చు ధరలకు అమ్ముకొనుటకు రైతునకు తగినసావకాశములేదు. ఋణములేని రైతులరుదు. కొలది మంది రైతులు మాత్రమే స్వంత పెట్టుబడులుకలిగి స్వంత ద్రవ్యముతో సరకులు కొని తమ యిచ్చవచ్చిన

ధరలకు పంటలు అమ్ముకొన గలరు. నాదారు రైతాంగ మును గ్రామములో సాహుకార్లు జలగల వలె పట్టుకొని, కొనుబడి వ్యాపారములో కూడ పీల్చి పిప్పి చేయు చున్నారు. నాదారు రైతాంగమును సంరక్షించ వలె నంటే అతడు పండించిన పంట సాహుకార్ల చేతులలో పడకుండగ తగిన ధర వరలు వచ్చేవరకు పంట దినుసులను నిలువ చేసుకొని అమ్ముకొనుటకు తగు అవకాశము కలుగ జేయుటకు గ్రామ పరపతి సంఘము తోడ్పడవలెను. ఈ మార్కెటింగు వ్యాపారము రైతునకు సమిష్టిగా గ్రామ సహకార సంఘము చేసి నప్పుడే రైతు పండించిన పంటకు సరియైన ధరవర్లు కిట్టుబాటై ఋణ విముక్తు డగును. గ్రామములోని సాహుకారు ముందుగా రైతునకు పెట్టుబడికి అప్పు యిచ్చుచున్నాడు. సరకులు సరఫరా చేయుచున్నాడు. పంటలు అమ్మిపెట్టు చున్నాడు. ఈ మూడు ప్రయోజనములకు రైతునకు సాహుకారే దిక్కు. సాహుకారు దగ్గర అప్పు తీసుకొన్న వాడు అతని దగ్గరే సరకులు కొనవలెను. అతనికే పంట అమ్మవలయును. లేనిచో అప్పునీయడు. అప్పు పెట్టు సాహుకారు హెచ్చు వడ్డీ గుంజు చున్నాడు. సరకులమ్మి హెచ్చు లాభము తీయుచున్నాడు. పంటకొని తానే

లబ్ధి పొందుచున్నాడు. ఈ మూడు వ్యాపారములు సాహుకారే గ్రామములో నుండి రైతునకు పెద్ద దిక్కుగా నున్నాడు. అందుచే రైతులు వీరి అండను చేరక తప్పదు. సహకార సంఘము లింతకాలము కేవలము రైతులకు ఋణములు మాత్రమే యిచ్చు చున్నవి. యితర ప్రయోజనముల కొరకు రైతునకు తోడ్పడుట లేదు. సంఘ ఋణమును కూడ వెనుకబెట్టి రైతు సాహుకారు ఋణములనే ముందు తీర్చు చున్నాడు.

ఎప్పుడో ఒక సారి సంఘములో రైతునకు అప్పు దొరకును. అనుసిత్యము అన్ని అవసరములకు రైతునకు సాహుకారు సహాయ పడుచున్నాడు. అందు చేతనే సహకార సంఘములు అప్పు సంఘములుగా మాత్రమే వుపచరించుట మూలమున రైతున కంతగా తోడ్పడుటలేదు. రైతుకు సహకార సంఘములు సరిగా తోడ్పడ వలెనన్న-చో గ్రామములో సాహూకారు చూపు, ఆదరణ చూపవలయును. సాహుకారు రైతుపైచూపు ఆదరణ స్వప్రయోజనము కొరకేను. ఏటేట రైతు యెంత పండించుచున్నను తుదకు మిగిలేది హాళ్ళికి హాళ్ళి సున్నకు సున్న. కాతాలింకా ఋణములనే కనుబరచు

చుండును. త్రివిధ వ్యాపారము లొక్క చేతిమీదనే నడచుచుండుట చేత సాహుకార్లు ధనవంతు లగుచున్నారు. ఆస్థిపరులగుచున్నారు. భూస్వాము లగుచున్నారు.

రైతులు ఋణముల పాలగుచున్నారు. రైతును సంరక్షింప వలెనన్న గ్రామ సహకార సంఘములు షాహుకారు స్థానము నాక్రమించు కొనవలెను. అనగా వ్యవసాయమునకు పెట్టు బడి పెట్ట వలయును. సంవత్సరము పొడుగునను, సరకులు సరఫరా చేయ వలయును. పంటను అమ్మి పెట్టవలయును. యీ మూడు వ్యవహారములలోను రైతునకు లాభము చేయవలయును.

అది యెట్లు చేకూరును? తక్కువ వడ్డీకి డబ్బు సరఫరా కావలయును. తక్కువ ఖరీదునకు సరకులు సరఫరా కావలయును. హెచ్చు ధరలకు పంటలు అమ్మి పెట్ట వలయును. యీ మూడు వ్యవహారములు గ్రామ పరపతి సంఘము లేక ముఖముగ రైతు లాభము కొరకు చేసినపుడే రైతు బాగుపడును. సంఘ మభివృద్ధి చెందును. అందుకొరకే సహకార సంఘములు కేవలము ఏకప్రయోజనము కొరకు కాక బహుళ ప్రయో

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

జనముల కొరకు మారవలెననియు సంఘములన్నియు నూతన పద్ధతిని పునర్నిర్మాణము కావింపబడవలెననియు సహకార ప్రముఖుల నేటి ఆశయము. ఈయాశయ ముతో పనిచేయు నూతన సహకార సంఘములకు సకలార్ధ సహకార సంఘములని పేరు.



# ఏకైక ప్రయోజన సంఘములు

దేశములో కేవలము పరపతి సంఘములే కాక రెండవ ప్రపంచ యుద్ధానంతరము సహకార అంగడులు (Stores) పరపతేతర వ్యాపారము కొరకు స్థాపింప బడినవి. ఈ సంఘములును పరపతి సంఘముల వలెనే ఊరూరను స్థాపింప బడక గ్రామ, సమూహములకు పరిమితిగల పూచీపైననే స్థాపింప బడినవి. యుద్ధకాలములో నీసంఘములు బాగా వృద్ధిపొందినవి. ప్రభుత్వము వారు కంట్రోలు సరకులను వీటిద్వారా అమ్మించుటచే వీటికి మంచి ప్రోత్సాహము కలిగినది. యుద్ధానంతరము కంట్రోలు సరకులు, క్రమముగా తగ్గిపోవుటచే యీసంఘములు సన్నగిల్లుచున్నవి. క్రయ విక్రయ సంఘములు పాల సంఘములు వ్యవసాయ పురోభివృద్ధి సంఘములు యిండ్ల సంఘములు పారిశ్రామిక సంఘములు అవి యివి అననేల వివిధ ప్రయోజనముల కొరకు వివిధ సంఘములు కుక్క గొడుగులవలె లేచుచున్నవి. అప్పు కొరకు రైతు సహకార సంఘములను చేరవలయును.

సరుకుల కొరకు స్టోర్సు సంఘములో చేర వలయును. పంటహామీ యిచ్చుకొనుటకు లోనుఅండు సేలు సొసైటీలో చేరవలయును. సరుకు అమ్మకొనుటకు మార్కెటింగు సంఘములో చేరవలయును. పండ్లు అమ్మకొనుటకు పండ్ల (Fruit Growers) సంఘమునకు వెళ్ళవలయును. పాలు అమ్మకొనుటకు పాలు (Milk-Supply) సంఘములో చేరవలయును. ఇట్లు వివిధ ప్రయోజనముల కొరకు వివిధ సంఘములలో బహువిధ వ్యాపారములు కొనసాగించు కొనుటకు రైతు చెదర కొట్టబడుచున్నాడు. ఈ సంఘములను నిర్వహించేవారు పల్లెటూళ్ళలో అన్నిటికి ఒక్కరేను. వారికే గౌరవ పదవులు, పేర్లు కుప్ప తిప్పలుగా వచ్చిపడుచున్నవి. ప్రయోజనకారి ఒక్కటియులేదు. వివిధ ముఖములవ్యాపారము వెదజల్లబడుటచేత ఏ సంఘమున కాసంఘమే స్వయంపోషకత్వము లేనిదై పరాధీనమై ప్రభుత్వమువారి యండను ప్రభుత్వోద్యోగుల దయా దాక్షిణ్యముల మీదను ఆధారపడి వుండవలసి వచ్చుచున్నది. ఈ బహుముఖ వ్యాపారము నంతరింప జేసి ఒక్కొక్క ప్రయోజనమునకు ఒక్కొక్క సంఘమును విస్తరింప చేయక రైతు వివిధ ప్రయోజనములకు గ్రామములో నొక్కసంఘమే అనగా సకలార్ధ

సహకార సంఘ మేర్పరచుట ప్రయోజన కారియని రిజర్వుబ్యాంకు అధికారుల ఆశయము. ఈ యభి ప్రాయమును వారు అన్నిరాష్ట్రములలోను ప్రచారము జేసిరి. వివిధ రాష్ట్ర ప్రభుత్వములు వీరి సలహా ననుసరించి నూతన సకలార్థ సహకార సంఘములను సృష్టించు చున్నారు. ఇంతవరకునున్న సంఘములకే పేర్లుమార్చి అనుగుణ్యమైన మార్పులతో నూతన నిబంధనలను అమలులో పెట్టి సకలార్థ సహకార సంఘములుగా వ్యవహరింప జేయుచున్నారు. అయితే రిజర్వుబ్యాంకు వారి సలహా అన్ని రాష్ట్రములలోను ఒకేవిధముగ పాటింపబడుటలేదు. (Reserve Bank) వారి యాశయము ప్రతి గ్రామమునకు ఒక సకలార్థ సహకార సంఘ ముండవలెననియె. ఈ యుద్దేశ్యము మద్రాసు రాష్ట్రీయ ప్రభుత్వవారమలులో పెట్టుచున్నారు. సంయుక్త రాష్ట్ర ప్రభుత్వమువారును, మైసూరు స్టేటు ప్రభుత్వమువారును గ్రామ సమూహామునకు సకలార్థ సహకార సంఘములు నెలకొల్పు చున్నారు. విజయ రాఘవాచారి కమిటీవారు, ప్లానింగు కమిటీవారు బొంబాయి నానావతి కమిటీవారు, గ్రామ సమూహాము లకు మాత్రమే వివిధ ప్రయోజనముల కొరకు సకలార్థ

సహాకార సంఘములు నెలకొల్ప బడవలెనని సలహా నొసంగిరి. సంయుక్త రాష్ట్రములలో సకలార్ధ సహాకార సంఘములు గ్రామ సమూహములకు యెట్టి పని చేయుచున్నది యిందు పొందు పరుప బడినది.

"A compact block of 15 to 20 villages round about each seed store of the agricultural department of the Government in the District will be selected for the reorganisation of the multi-purpose societies of each block will in due course have a development Union which will take over the seed store will have a godown and will stock implements "Charkas" consumers' goods etc. for distribution among the members."

భారత దేశములో స్థాపింప బడిన సహాకార సంఘముల నిబంధన లన్నిటిలోను యీసకలార్ధ సహాకార సంఘముల యాదర్శకము లుండనే యున్నవి. కాని ఆచరణములో లేవు. కేవలము పరపతి వ్యాపారమునకే ప్రాధాన్య మీయబడెను. జర్మనీలో ప్రాతిపదికలో రైఫేసి యన్ సహాకార పరపతి సంఘములు స్థాపించినపుడు యిది

సకలార్థ ప్రయోజనము కొరకే వుద్దేశించి యుండెను. రైఫేసియను సంఘముల వుద్దేశ్యము ఇట్లు ప్రకటింపబడినవి "Savings, credit and supply" societies అనే పేరుతో సంఘములు వ్యవహరింపబడెను. ఆదాయము పెంపొందించునవి, పరపతి నిచ్చునవి, సరకులు సప్లయి చేయునవి, సంఘములకు పేర్లు.

"The object of the society is to procure the necessary capital for furnishing loans and credit to members and otherwise to effect the betterment of their economic conditions especially by (a) The purchase in common of farming requisites (b) The preparation and sale of agricultural product and of the products of rural industry for members (c) the procuring of machines and other objects of utility on their joint account for letting on hire to members.

The society aims less at realising profits from its operations than at strengthening such of its members as are economically weak and at promoting their intellectual and moral welfare. Its activities must therefore extend to (a) the furtherence of

thrift (b) the accumulation indivisible common Fund (Foundation Fund) for the advancement of the economic condition of members (c) the organisation of means for the promotion of rural social welfare and of love of home (d) the establishment of conciliation of courts for the deminution of legal disputes (e) Vigorous opposition to such transactions in real property as are against the public good and such participation in the relief of landed property from indebtedness as may be expedient and (f) the holding of instructive lectures and the exchange of participal experience at the meeting of members."

జర్మనీలో స్థాపింప బడిన రైఫేసియన్ సంఘముల ఉద్దేశ్యములు, ఆదర్శకములు డబ్బు సరఫరా చేయుట వ్యవసాయ పరికరములు సరఫరా చేయుట, యితర ఆర్ధిక సాంఘికాభ్యున్నతికి వలయు ప్రణాళికలు వైచి అమలులో పెట్టుట, ప్రచారము ప్రభోధము సలుపుట ప్రధానములై యున్నవి. మన రాష్ట్రములో గ్రామ సహకార సంఘముల ఉద్దేశ్యములు ఆదర్శకములు యీ భావములతోనే యీ పక్కీలోనే ఏర్పాటు

చేయబడినవి. సకలార్థ సహకార సంఘము లేరీతిని మార్పు చెంది పనిచేయవలసి యున్నది ప్లానింగు కమిటీ వారు సుస్పష్టముగా వివరించిరి. వీరి ఆదర్శకములు తీసుకొని మద్రాసులో గూడిన 15 వ రాష్ట్రీయ రిజిస్ట్రారుల కాన్ఫరెన్సులో 1947 సం॥రంలో యీాదిగువ పొందుబరచిన తీర్మాన మామోదింప బడినది. ఇదియే సకలార్థ సహకార సంఘముల నిర్మాణ నిర్వహణ వ్యాప్తికి ఆధారముగా తీసుకొన బడుచున్నది.

"As the supply of credit touches only one aspect of the life of the cultivator the activities of the primary co-operative societies should be so extended as to cover the whole of his life. The primary credit society should therefore be reformed and reorganised as to serve as a center for the general economic development of its members.

The membership of the primary society should be opened to all persons residing in its area of operation. The society sholud be so organised as to have at least fifty

members and its area of operation should be such as would permit adequate business and at the same time efficient supervision and effective control. As regards its functions the committee has recommended that the reorganised agricultural primary co-operative society should in particular (a) finance crop production (b) act as the agent for the sale of produce to the nearest co-operative marketing organisation (c) supply the farmers' simple needs for crop-production like seed, cattle feed fertilizer and agricultural implements and also consumers goods like cloth kerosene, salt and matches on indent basis or on the basis of established needs (d) serve as milk collecting station for the nearest dairy and as a centre for animal first aid and maintenance of stud bulls (e) serve as a centre for maintaining agricultural machinery for the joint use of the members and (f) encourage subsidiary occupations for its membears.

పరపతి సంఘములు సకలార్ధ సహకార సంఘములుగా మార్చుటలో నధిక సంఖ్యాకుల యభి

ప్రాయము. రైతు అక్కరలకు సర్వ విధముల తోడ్పడ వలెనని వ్యక్తమగుచున్నది. అయితే యీ విషయములో కూడ భిన్నాభిప్రాయము లున్నవి. ప్లానింగు కమిటీ వారు సూచించిన ఉద్దేశ్యములే రిజిస్ట్రారుల కాన్ఫరెన్సులోని తీర్మానములో కొంతమార్పులతో అంగీకరింప బడినది. అయితే కేవల పరపతి సంఘములను వర్తక వ్యాపార సంఘములుగా మార్చుట సమంజసములా? అని కొందరు వితర్కించుచున్నారు. వడ్డీ వ్యాపారము చేసెడి బ్యాంకులే ప్రజల ద్రవ్యంతో వర్తకానికి దిగిన నష్టం వచ్చినచో నెవరు భరించెదరని ప్రశ్న వేయుచున్నారు. రిజర్వుబాంకు వారు పరపతి సంఘములను సకలార్థ సహకార సంఘములుగా మార్చిన పరిమితిలేని పూచీ అందరి నెత్తిన చుట్టాలంటున్నారు. బొంబాయి రిజిస్ట్రారు, బొంబాయి సహకారులు, పరపతి సంఘముల ఉద్దేశ్యములు పూర్తిగా నిర్వహించ వలసివస్తే పరిమితిలేని పూచీ పూర్తిగా తీసివేయాలనియు రైతుకు అప్పు యిచ్చినందులకు ప్రయోజనము అతనికి కావలసిన సరుకులకు డబ్బు సరఫరా చేసి అయివేజుపై అప్పు లిచ్చి పంటను ఏక ముఖమున అమ్మిపెడితేనే సహకార

సంఘముల యొక్క ప్రయోజనము సఫలమగునని వాదించుచున్నారు. D. G. Karraj గారు రిజిస్ట్రారుల కాన్ఫరెన్సులో నిట్లు పన్యసించిరి.

"A primary credit society cannot be called a bank in this sense in which some people have called it. Without a Bank, business cannot be done. As a result of experience of a large number of years that in every community where a co-operative body is to take the place of a proprietory dealer - in this case the village sowcar or the Bania - it has to confirm as far as may be necessary to the procedure and methods, which the predecessor had found desirable by experience. These services were given not because alternative methods were not available, but because the conditions of rural credit necessitated a combination - I do not see any reason why even the smallest of the co-operative society should not be permitted to deal in articles. I do not see any objection why trading by them even on a larger scale should not be possible. I should therefore

consider that it should be possible for big societies to do direct trading on a comparatively large scale and even small societies can do direct trading on a very small scale in articles which meet established needs without any great harm to the main idea of the expansion of non-credit functions.

గ్రామ పరపతి సంఘములు సకలార్థ సహకార సంఘములుగా మారి వర్తక వ్యాపార వ్యవహారము లందు సంపూర్తిగ కలుగ జేసుకొన వలెనని వీరి వాదన. ఈ విషయములో ప్రతివాదులు. మద్రాసు రాజధానిలో జాయింటు రిజిస్ట్రారుగా పనిచేయుచున్న శ్రీసుబ్రహ్మణ్యం నాయుడుగారు యిందులో మితవాదులు. సకలార్థ సహకార సంఘములు పనిచేయవలెనని అభిలాష వీరికి కలదు. అయితే వర్తక వ్యాపార విషయాల్లో జోక్యం కలుగజేసు కోకూడదని వీరి అభిప్రాయము. "Combination of banking and credit with trading is objectionable." ఇండెంటు సిస్టము మీద whole sale సంఘములకు ఏజంట్లుగా సకలార్థ సహకార సంఘము లు వ్యవహరించ వలెనని ప్లానింగు

కమిటీ వారి సలహా. ఈ యిండెంటు సిస్టము మద్రాసులోపూర్తిగా విఫలమైనదని శ్రీ సుబ్రమహ్మణ్యం నాయుడుగారి అనుభవము. పాలవ్యాపారము కుటీరపరిశ్రమల వ్యాపారము సకలార్ధ సహకార సంఘములే చేయవలెనని ప్లానింగు కమిటీవారి సూచన. ఈ సూచనయే రాష్ట్రీయ సహకారుల రిజిస్ట్రార్ల మహాసభలో ఆమోదింపబడినది. ఇందుకు శ్రీసుబ్రహ్మణ్యం నాయుడుగారు మాత్రం వ్యతిరేకులు. గ్రామ సంఘంలిట్టి మహత్తరమైన పూచీని అవలంభింప జాలవని వీరి నిశ్చితాభిప్రాయము. పరపతి కొనుగోలు(Credit and marketing) సహకార సంఘవ్యాపారములో కలిపి వేయుట వీరి యభీష్టతము. ఇంతియే గాకుండ సభ్యుల సాంఘిక నైతిక పురోభివృద్ధికి విజ్ఞానవ్యాప్తికి సంఘములు తోడ్పడుట అత్యావశ్యకమని కూడ వీరి అభిప్రాయము.

"My submission is let credit and marketing may be linked up. We might go a little further and say that the societies should give loans not only for current agricultural production but should also undertake marketing finance. In addition to these let them also provide for recreative

activities. The cultural life of the people should not be lost sight of and the societies must make provision for rural libraries. We have got to do more intensive work than it has been possible for us to do till now.

వంగ దేశపు సహకార సంఘముల ప్రతినిధి అగు I.A. Ali గారు సకలార్థ సహకార సంఘములు పెద్ద విస్తీర్ణ ప్రదేశములకు వర్తింప వలయుననియు 5, 6 వేల మంది సభ్యులు కలిగి రెండు వేలమంది గృహస్థులుగల పెద్ద ప్రదేశములకు చెందవలయు ననియు, సభ్యుల తరపున బాహాటముగ సరకుల వ్యాపారము జరిపించ వలెననియు యుద్దేశించుచున్నారు. ఇట్లు సకలార్థ సహకార సంఘముల విషయమై భిన్నాభి ప్రాయములు దేశములో చెలరేగుచున్నవి. అనుభవము మీాద గాని యేయే వ్యాపారములో యీా సంఘములు జోక్యములు కలుగజేసు కొనవలసినవి యిదమిద్ధమని తేల్చుట కష్టము. అయితే ఒక్క విషయమున అందరు ఏకాభిప్రాయమునకు రావలసియున్నది. సహకార పరపతి సంఘములు రైతు పురోభివృద్ధికి నెలకొల్ప బడినవి. రైతుకు ముఖ్యముగా కావలసిన సరుకులు, యెడ్లు,

విత్తనములు, బండ్లు, యెరువులు, వ్యవసాయ పరికరము లును. వీటిని సహకార సంఘముల ద్వారాసమకూర్చుట అత్యావశ్యకము. రైతు పంటమీాద అప్పులిచ్చుట, రైతు పంట సరుకు•హామీాపై అప్పులిచ్చి నిలువ చేసుకొనుటకు ఆస్కారము కలుగజేయుటకు రైతు పంటను సమిష్టిగా అమ్మిపెట్టి హెచ్చుధరను రాబట్టుట సకలార్థ సహకార సంఘములకనీస ధర్మము. ఈ త్రివిధ సహకారమును సకలార్థ సహకార సంఘములు పెంపొందించ వలయును.

సహకార సంఘముల విధ్యుక్త ధర్మములలో నొకటి వయోజన విద్యావ్యాప్తి కావించుట. సహకార సంఘములలో 100కి 90 మంది నిరక్షరాస్యులు. వయో జన విద్యా ప్రణాళికలు సహకార సంఘములో నమలు పర్చుట నిబంధన పూర్వకముగ నుండవలెను. సాము దాయకప్రయోజన నిధులిందుకు వినియోగపడవలెను. సహ కార సంఘముల సభ్యులకు ఆహార సరుకులు అందచేయుట, బట్ట సరఫరాచేయుట, గృహోప కరణములు అందుబా టులో పెట్టుటకు అవకాశము లేర్పరు పవలెను. కూడు గుడ్డ, కొంప, అందరికి లభ్యమగుటకు తగిన వసర్లు కలుగ జేసి సభ్యుల సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడుట యే

సకలార్థ సహాకార సంఘముల యొక్క ప్రయోజనము. ఈ బహుళ ప్రయోజనముల కొరకు సహాకారోద్యమ మునకు పునాది యైన సహాకార సంఘములు కృషి సలిపి నప్పుడే యుద్యమమునకు స్థావ మేర్పడగలదు. పునాది కట్టు దిట్టముగాగలదు. సహాకార సౌధము దృఢ ముగ నిలువగలదు. లేని-చో పేకముక్కలతో కట్టిన యింటివలె వెంటనే కూలిపోవును.

ఒక గ్రామములో వివిధ ప్రయోజనముల కొరకు వివిధ సంఘములు నెలకొల్ప బడకూడదని రైఫీసియన్ ఉద్దేశ్యము. ఇందు కొరకే సహాకార పరపతి సంఘ నిబందనలలో, పరపతి వ్యాపారము, పరపతేర వ్యాపా రము, ఒకే సంస్థలో కలిపియుండవలెనని ఉద్దేశ్యముతో జర్మనీలో, ప్రథమమున, సంఘములు స్థాపింప బడెను. మనదేశములో కూడ సంఘవుద్దేశ్యములలో యీ ప్రయోజనము లన్నియు, పేర్కొన బడినవేగాని, అమలులో లేవు. వివిధ సంఘములను వేరువేరు ఉద్దేశ్య ములతో స్థాపించక కలిపివేయుట మూలమున కలిగెడి లాభములను రైఫేసియన్ సంఘములను పరిశీలనచేసిన

క్యాల్వర్ట్ హెంగ్ నివేదిక స్పష్టపరచినది. ఆ యభిప్రాయమే యీ క్రింద పొందుపరుప బడినది.

"One of the principal difficulties of operating against the creation of a separate agricultural supply society in a village in which a credit society is already established is the dearth of suitable men to fill the responsible offices in the two societies. The advantages of amalgamation are more over considerable. The credit society need not raise special capital in order to be able to carry on the business of a supply society as it either has cash at disposal or by reason of its credit at the co-operative Central Bank can settle accounts through that agency. The recovery of sums due by purchasers is assured by the knowledge of the financial condition of members possessed by the committee of management. The small percentage added to the cost price by the society constitutes a useful sourse of revenue to meet the cost of management and strengthen the reserves and when the business is large enables, perhaps

the rates for loans and deposits to be respectively lowered and raised."

పై నివేదిక వలన మనము స్పష్టముగా అవగాహన చేసుకోవలసిన విషయములు మూడు. (1) ప్రతి గ్రామములోను సంఘములు సక్రమముగా నిర్వహించుటకు విద్యాధికులు దొరకుట దుర్లభము (2) చిన్న సంఘములైతే వేతనోద్యోగులను తగినంత జీతములిచ్చి పోషించుకొనజాలవు. పెద్ద సంఘములైతే వ్యాపారము బాహుళ్యము మీద యెక్కువలాభము మిగుల గలదు. ఈ లాభములో నుండి అర్హులైన వేతనోద్యోగులను నియమించుకొనవచ్చును. (3) వ్యాపారము వృద్ధియైలాభములు హెచ్చినకొలది సభ్యులకు వడ్డీరేట్లు తగ్గించి కొంచెము లాభ వ్యత్యాసములతో ఎక్కువ సహాయము సభ్యులకు చేయవచ్చును. ఈ మూడు ప్రయోజనములు సంఘ వ్యవహార ప్రదేశము హెచ్చు చేసినచో లభ్యము కాగలవని క్యాహెల్ నివేదికలో స్పష్టీకరింప బడినది. 25 సంవత్సరములు సహకారోద్యమమున అనుభవము కలిగి జాయింటురిజిష్ట్రారు పదవి యందు పనిచేయుచున్న శ్రీ. కె. సుబ్రహ్మణ్యం

నాయుడుగారు సకలార్థ సహకార సంఘములు విజయ వంతముగా పనిచేయుటకు రెండు ముఖ్య నియమములను పాటింప వలయునని 15 వ రిజస్ట్రారుల కాన్ఫరెన్సులో నొక్కిచెప్పిరి. అందు మొదటి నియమము పల్లెటూరి పరిస్థితులను బాగుగ పరిచయము గల వేతనోద్యోగులను సంఘములలో నియమించుట. రెండవది సంఘము యొక్క విస్తీర్ణ ప్రదేశము తగినంత విశాలముగ నుండి వ్యాపారాభి వృద్ధి కలుగజేయుట. ఈ వ్యాపారాభివృద్ధి మూలముననే సంఘము వేతనోద్యోగుల నియమించుకొని స్వయంపోషకము కాగలదు.

"Two conditions have been laid down for the sucessful working of the multipurpose society. One is that a well paid and efficient manager who is familiar with all aspects of village life and has been trained in the methods of co-operation will be necessary and the other is that the area of operations of the society should be sufficiently wide. To provide the society with enough business turnover, its pay for competent manager. We have therefore proposed to start what we

choose to call as 'Rural Banks' with wide area of operations and a large membership".

క్రమముగా అనుభవము మీఁద సహకారోద్యోగులు ఉద్యోగేతర సహకారులు గ్రామ సహకార సంఘమును బలవత్తరమైన సంస్థగా చేయుట శ్రేయోదాయకమని అంగీకరించుచున్నారు. బలహీనమైన యేక ప్రయోజనము కొఱకు కేవల పరపతి సంఘముగా నుంచుటకు అంగీకరించుట లేదు. బహుళ వ్యాపారము ప్రధానముగా నెంచ బడుచున్నది. విస్తీర్ణ ప్రదేశము 4, 5 మైళ్ళలోపులో నుండి గ్రామ ప్రదేశములకు వర్తింప బడవలెనని యంగీకరింప బడుచున్నది. ఇట్టు సంఘములు పరిమితి లేని పూచీ పద్ధతిపైగాక పరిమితి గల పూచీ పైననే నెలకొల్ప బడవలెనని నిర్ణయ మగుచున్నది. ఇట్లు సంఘములు గౌరవోద్యోగుల తీరిక కాలములో వ్యవహారములు నిర్వహించుటకన్న వారి యాజమాన్యమున సహకార పద్ధతుల యందు తరిఫీజు నొందిన అర్హులగు వేతనోద్యోగుల నియామకము మూలమున నిర్వహింప బడవలెనని స్థిర పరుప బడినది. దేశమంతటిలో కుక్క గొడుగుల

వలె పూరూర సంఘముల పెట్టుట కంటె ధృఢమైన పెద్ద సంఘములు వెలసి రైతు సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడవలెను. ఒకే పద్ధతిని ఏక ప్రయోజనము కొరకు రైతుజీవితము నియమబద్ధము చేయుట యను చితము. ఏక ప్రయోజనము కొఱకు వుద్యమము వ్యాప్తి జేసినచో నుద్యమమును సంకుచిత పరచుటయే యగును. పైన సూచించిన బహుళ ప్రయోజనము కొఱకు అనగా సహకారోద్యమము ప్రజల సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడవలెనన్నచో సహకార పతాకమున సూచించిన ఏడురంగులలోని ఉద్దేశ్యములను విస్తరించి వ్యాప్తి చేయ వలయును. అప్పుడే సహకారోద్యమము—బహుజనాశ్రయము కాగలదు. ఏడురంగుల పతాకమునకు ప్రతిష్ఠరాగలదు. సర్వ వ్యాప్తి కాగలదు. ఒక్క పరపతి వ్యాపారము నకే రైతు జీవితముతో సహకారోద్యమము సంబంధము పెట్టుకొనిన, రైతు నిత్య జీవితముతో సంఘమునకు, సంబంధము పోవును. రైతు నిత్య జీవితముతో సంఘము సర్వవిధముల సంబంధము పెట్టుకోవలయును. సంఘసభ్యులు తరచు కలుసుకొనుటకు సంఘముతో వివిధ ప్రయోజనముల కొఱకు సంబంధము ఏర్పాటు చేసిన పరస్పర సహాయము

అన్యోన్య సానుభూతి పెంపొందును. సహకార పర పతి సంఘము లిప్పుడు అప్పులు మాత్రమే యిచ్చు చుండుటచేత సభ్యుడు సంఘము నకు అప్పుపుచ్చు కొన్నప్పు డొకసారి అప్పుతీర్చివేయు నపుడు మరి యొకసారి వచ్చుచున్నాడు. అప్పుయిచ్చి పుచ్చుకోవడము సంబంధము తప్ప మరి ఏవిధమయ్యిన్ని సంబంధము సంఘముతో లేదు. సభ్యుల బహుళ ప్రయోజనము కొఱకు సంఘవ్యాపారము వృద్ధి పరచిన చో సంఘ సభ్యులకు సంఘయాజమానులకు నిత్యము సంబంధము ఏర్పడును. సభ్యులవ్యాపారము పరిశీలించుటకు బాగో గులు కనిపెట్టుటకు తగిన సలహా లిచ్చుటకు పరస్పర సంబంధమేర్పడును. సభ్యులలో నైకమత్యము పెం పొందించుటకు పరస్పర సహాయముతో వ్యాపారము వృద్ధి పరచుకొని ఒండొరుల ఆర్థిక పురోభివృద్ధికి తోడ్పడు టకు సంబంధ మేర్పడగలదు. ఇవి సకలార్థ సహకార సంఘములు చేయకలవు. కేవల పరపతి సంఘములు చేయజాలవు.

గ్రామ సమూహములకు, పరపతి సహకార సంఘములను పునర్నిర్మాణము చేయవలెను. అప్పుడే

యీ సంఘములు బలిష్టములై నిలువ గలవు. బలహీన మైన సంఘములు ఉద్యమమును పోషింపజాలవు. ఈ సంగతి యెల్లరకు అనుభవైక వేద్యము.

వృక్షశాస్త్ర పరిజ్ఞాతలు మంచరకము వృక్షములను సంపాదించుటకు మంచి విత్తనములను నాటి గాలి, వెలుతురు, బాగా తగులునట్లు దూరదూరముగా పాతిపెట్టి పెరుగనిచ్చెదరు. దగ్గర దగ్గరగా నాటిన చెట్లు బలిష్టముగా పెరుగవు. తగిన ఫలము నీయ జాలవు. ఇది వృక్షశాస్త్రజ్ఞుల అనుభవము. జంతు శాస్త్ర పరిజ్ఞాతలు కూడ మంచిజాతి పశువులను వృద్ధి పొందింప తలచి నపుడు దృఢమైన సంతతి గల పశువులను ఏరి దృఢ సంతానమును ఎడమ ఎడమగా కలిపి సంతతి వృద్ధి చేయుదురు. ఈ రీతిగనే మానవాభ్యుదయము కోరు (Biologist) శారీర శాస్త్ర పరిజ్ఞాతలు యుత్తమ జాతి అభివృద్ధికి సంతానము నిరోధము కల్పించి ధృఢమైన బిడ్డలు కలుగుటకు సర్వవిధముల ప్రయత్నించు చున్నారు. సంతాన నిరోధమన్న అసలు బిడ్డలు పుట్టకుండ చేయుటయే కాదు. ఒక తల్లి ఏటేటను సంతాన వంతురాలైనచో పిల్లలు అనారోగ్య వంతు లగుదురు. అందుచే

బిడ్డలు శ్రేయస్సు గోరు దంపతులు కాన్పులు ఎడముగా నుండుట నభిలషింతురు. ఎందుచేత? బిడ్డలు బలిష్ఠముగా పెరిగి, ఆయుష్మంతులై చిరకాలము వృద్ధిల్ల వలెననికదా!

వృక్షశాస్త్ర పరిజ్ఞాతలు, జంతు శాస్త్ర పరి జ్ఞాతలు, శారీరక శాస్త్ర వేత్తలు, ఇట్లు బలిష్ఠమగు సంతానము పెంపొందించుటకు కృషి సలువుట ఎందుకు? మంచి వృక్షములను పెంపొందించి, ఎక్కువ ఫలప్రదముగా చేయుట కొఱకేను. మంచి జాతి పశు సంతతిని వృద్ధి చేసి ఎక్కువ ప్రయోజకారిగ చేయుట కొరకేను. ఏటేట బలహీనమైన సంతానము కనుట కంటె సంతాన నిరోధము నిచ్ఛగించుట, దృఢమైన సంతానమును కని వంశాభివృద్ధి చేయుట కొరకేను. ఈరీతిగనే యుత్తమ సంఘ నిర్మాణ విషయములో పరిశీలన జేయ వలసిన ఆవశ్యకత యెంతేనియు కలదు. బలహీనమైన సంఘముల నూరూర పెట్టిసంఖ్య వృద్ధిచేయుట కంటె ఆర్థికోపపత్తి కల, దృఢమైన సంఘములను గ్రామ సమూహాములకు విస్తరిల్ల జేయుట యుద్యమ శ్రేయో దాయకము

 

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

సహకార బీజము సువిశాల క్షేత్రమున నాటిన శాఖోపశాఖలుగా విస్తరిల్లి వేలకొలది పాంధులకు ఆశ్రయమిచ్చి సుఫలము నొసగును.

పరా:

ఇంద్ర ధనస్సులోని ఏడు రంగులు:—



## ఏడవ ప్రకరణము

# సహకార పతాకము

సహకారోద్యమము ప్రజల సర్వతో ముఖాభి వృద్ధికి దోడ్పడు టకు ద్యమప్రారంభకులు ఉద్దేశించిరి. వివిధ రంగముల సహకారోద్యమము తదను గుణ ముగా విజృంభించుచున్నది. ప్రజల యార్థిక సాంఘిక నైతిక, రాజకీయ, వైజ్ఞానిక, వ్యవసాయక పురోభివృద్ధికి సహకారోద్యమము తోడ్పడుట కుద్దేశింపబడినది. ఇందు కనే సహకారోద్యమ పతాకముపై ఇంద్రధనస్సు చిహ్న ముగా తీసుకొనబడినది. ఇంద్రి ధనస్సునందు ఏడురంగులు కలవు. సూర్యబింబములోని కిరణములే యింద్రిధనస్సు లోని యేడు రంగులును. ఈయేడు రంగులు సంపుటిలో కరణమే స్వచ్ఛందమైన తెల్లని సూర్యకాంతి. బండి ఆకులకు ఏడురంగులు పూచి గిరగిర గుండ్రిముగ త్రిప్పిన ఆయారంగుల ప్రిత్యేక వ్యక్తిత్వము పోయి స్వచ్ఛందమైన తెల్లని స్వరూపము కన్పడును. సూర్యకిరణములు మేఘ ములపై పడినపుడు యీ కిరణములలోని ఏడు రంగులు స్ఫుటముగా ప్రితిఫలించును. సూర్యకిరణములలో

నేడురంగులెట్లు కలసి యున్నవో ఆరీతిగనే సహకారోద్య
మమున ఏడు శాఖలు యిమిడియున్నవి.

అందు సహకార శాఖను ప్రథమ కిరణము

1. ఆర్థిక పురోభివృద్ధి:— ప్రజల ఆర్థిక పురోభివృద్ధికి కృషి సల్పుట సహకార సంఘముల ప్రథమ లక్ష్యము. సభ్యులలో మితవ్యయము చేకూర్చి ఆదాయము వృద్ధి పొందించుట యుద్యమాదర్శకము. జర్మనీలో ప్రథమున స్థాపింపబడిన సహకార సంఘములలో రై ఫేసియన్ తన సర్వశక్తులను, వినియోగించి, ప్రతిసభ్యుడు తాను సంపాదించు కొనిన ద్రవ్యములో కొంత కూడిక చేసుకొనుటకు సేవింగ్సు డిపాజిట్లు, ఫిక్సుడు డిపాజిట్లు, పోత్సహించెను. ఇందు మూలమున ప్రతిసభ్యుడు కొంత స్వంతద్రవ్యము నిలువ చేసి కొనుట కవకాశ మేర్పడెను. ఈడబ్బుతో బీద సభ్యులకు ఫలప్రదమైన పనులకప్పు లీయబడెను. స్వసహాయము పరస్పర సహాయము వలన బీదసభ్యులలో పరపతి హెచ్చగును. సంఘ సహాయము వలన క్రమ క్రమముగా సభ్యులలో జర్మనీ దేశములో ఆర్థిక పురోభివృద్ధి కలిగినట్లుగా "క్యాహెల్" నివేదిక రుజువు చేయుచున్నది. వూల్ఫు పండితుడు సహకార పరపతి సంఘ

ముల ద్వారా వివిధ దేశములలో బీద రైతాంగమున కార్థిక పురోభివృద్ధి కలిగినట్లు Peoples Bank అనే గ్రంథములో వ్రాసెను.

"Can peoples' Banks accomplish all this? The answer is to be found in that vast net work of flourishing banks spread out over Germany and Italy membering by the thousand turning homeless labourers cultivating owners, unemployed business men into thriving traders, and starving peasants into substantial yeomen."

2 సహకార పతాకను న రెండవరంగు ; సాంఘిక స్వాతంత్ర్యము

సహకారోద్యమము సభ్యుల కార్థికోపపత్తి తోపాటు సాంఘిక ఔన్నత్యము చేకూర్చుచున్నది. ఈసంఘములలో చేరుసభ్యులలో అధికుడు, అధముడు అనేవ్యత్యాసములేదు. ధనవంతుడు, దరిద్రుడు అనే విచక్షతలేదు. జాతి, కుల, మత బేధములు లేవు.

అందరికి సమాన హక్కు. సమాన గౌరవము. సమాన బాధ్యత. సంఘనిర్వాహణ విషయములో ప్రతియొక్కరికి ఒక్కటే ఓటు. ధన వంతునికి ఎన్ని షేర్లున్నప్పటికీ బీదవానికి ఒక్క షేరున్ననూ వోటుహక్కు సమానమేను. సాంఘిక నిమ్నోన్నతములను, ఆర్థిక వ్యత్యాసములను, ఈ సహకార సంస్థలు పాటించక అందరిని సమానభావముతో గౌరవించును. సంఘములో చేరిన ప్రతి సభ్యుడు అన్ని అధికార స్థానములు నిర్వహించుటకు, స్వాతంత్ర్యము కలదు. ఇందు మూలమున మేధా సంపత్తియు చాకచక్యము చురుకుతనముగల ప్రతిభాశాలురకు జాతి, మత, కుల, భేదములు, లేక యున్నత పదవులు లభించుచున్నవి. సాంఘికౌన్నత్యమునకు దారి చూపుచున్నది. సాంఘిక వివక్షతల కాస్కారమియ్యక అందరి సభ్యుల సాంఘిక గౌరవము కాపాడును. (Each for all and all for Each). అందరిక్షేమము కొఱకు ప్రతిఒక్కరు "ప్రతి ఒక్కని క్షేమము కొఱకు అందరు తోడ్పడవలెనని" నిర్దేశింపబడినది. ఈ అదర్శమే సహకారోద్యమమున ప్రతి ఒక్కరికి సాంఘిక స్వాతంత్ర్యము నొసగుచున్నది. ఆర్థిక స్వాతంత్ర్యము కలిగినప్పుడే

సాంఘిక స్వాతంత్ర్యమునకు మార్గమేర్పడును. ఇట్టి మార్గముననే సహకారోద్యమము సంఘనిర్మాణ నిర్వహణమునందు సాంఘికనిమ్నోన్నతములకు తావీయక సాంఘిక స్వాతంత్ర్యమునకు దోహద మొసగుచున్నది.

3. నైతిక పురోభివృద్ధి ఉద్యమము మూడవ కిరణము. 3 వ రంగు.

సహకారోద్యమాదర్శకములలో సభ్యుల నైతిక పురోభివృద్ధి ప్రధానము. కేవలము ఆర్థికముగ, సాంఘికముగ, సభ్యు డౌన్నత్యము బడసినను సభ్యులలో నైతిక పరివర్తనము లేనిది నిష్ప్రయోజనము. వ్యక్తి జీవితములోను సాంఘిక జీవితములోను, నైతిక పరివర్తనము కలుగనిది యీ యుద్యమము సుస్థిరముగ నిలువజాలదు. అందుననే యుద్యమ సంస్థాపకులు సభ్యుల నైతిక జీవితమునకు(Character)ప్రాధాన్యము నిచ్చిరి. ఈ యుద్యమములో చేర్చుకొనబడు ప్రతి సభ్యుడును దాను సంఘమునకు విశ్వాస పాత్రుడుగానుండి ఋజు ప్రవర్తనము కలవాడై సంఘ వ్యవహారములను నైతికాదర్శకములతో వ్యవహరించుట కొప్పుకొనవలెను.

జర్మనీలో స్థాపింపబడిన సహకార సంఘములు రైఫేసి యన్ యాజమాన్యమున నైతిక ప్రాధాన్యము కలిగి వ్యవహరించినవి కనుకనే సభ్యులలో అపూర్వ నైతిక పరివర్తనము కలిగినట్లు వూల్ఫు పండితుడు వ్యక్తీకరించెను.

"The golden sunshine of thrift and co-operation whenever it has cost its race has "unvield and brought to view in plenty unlooked for virtues which had long lain hidden, like flowers shrouded by the the night. The idle man becomes industrious, the spend-thrift thrifty, the drunkard reforms his ways and becomes sober, the hauntea of taverns forsakes the inn,the illeterate though a grand father learns to read and write. It sounds like a tale from wonderland. Yet it is all sober fact."

సోమరిపోతు శ్రమపడి పనిచేసు కొనుచున్నాడు. దూబరామనిషి మితవ్యయము నలవాటు చేసుకొను చున్నాడు. త్రాగుబోతు దురభ్యాసములను, విసర్జించు చున్నాడు. నిరక్షరాస్యుడు పేదవాడైనను పిల్లల

తండ్రి యైనను చదువను వ్రాయను నేర్చుచున్నాడు. ఇవన్నియు నాశ్చర్యకరముగానే కనబడవచ్చును. కాని ఇవన్నియు యదార్ధములేను. ఇందే మాత్రము ఉత్ప్రేక్ష లేదు. సహకారోద్యమము సభ్యులలో కలుగజేసిననైతిక పరివర్తన యిది.

4. సహకారోద్యమ పతాకములోని 4 వ రంగు కిరణము—రాజకీయ స్వాతంత్ర్యము.

సహకారోద్యమము సభ్యులకు రాజకీయ పరిజ్ఞానము కలుగజేసిస్వాతంత్ర్య మొసగుచున్నది. సహకార సంఘములుప్రజాస్వామ్య పరిపాలనాసిద్ధాంత పద్ధతిని నిర్వహింపబడుచున్నవి. ఈసంఘములు యాదర్శకము డిమోక్రాటిక్ పరిపాలన. ప్రజా ప్రాతినిథ్య పరిపాలనలో ముఖ్యవిషయము వయోజనులకు వోటింగు హక్కు. ప్రతి సహకార సంఘమందును 18 ఏండ్ల వయస్సు వచ్చినవారే సభ్యులుగ నుండుటకు అర్హులు. సహకారోద్యమములో చేరుటకు అర్హత కలిగి యుండుటకు 18 ఏండ్లు నిండిన వయోజనుడై యుండవలెను. ఇందు స్త్రీ పురుష భేధములేదు. సంఘములో చేరుప్రతి యొక్కరికి పరిపాలనా

నిర్వహణ మునందు ఓటింగు హక్కు గలదు. అధిక సంఖ్యాకులగు సభ్యుల వోటింగు ఫలితము మీదనే సంఘ పరిపాలనాధికారు లెన్నుకోబడుదురు. ఈపాలక వర్గ సభ్యులు మాహాజన సభకు బాధ్యులు. అధిక సంఖ్యాకుల సభ్యుల విశ్వాసము లేనిచో వీరు పదభ్రష్టులగుదురు. ఇది డిమోక్రసీ పరిపాలనా పద్ధతి. సహకారసంఘములలో నీపరిపాలనా విధానములో తరిఫీజు అయ్యిన సభ్యులకు రాజ్యాంగ విధానములో పాల్గొనుటకు మంచి యవకాశము సమర్ధత యేర్పడును. ఈ ప్రజాస్వామిక పరిపాలనా సిద్ధాంతములను సహకార సంస్థల నిర్వహించు ప్రముఖులు బాగాగ్రహించి తరిఫీదు నొందుట మూలముననే దేశ రాజ్యాంగనిర్వహణవిషయములలో, యెక్కువగా పాల్గొని అధికార పదవులను, ప్రఖ్యాతితో నిర్వహించుటకు, సమర్థులగుచున్నారు. ఇంగ్లాండులోను, ఫిన్ లెండు, జకోస్లోవేకియా డెన్మార్కు మొదలగు దేశములలో, సహకారోద్యమ నిర్వాహకులు, తమదేశ ప్రభుత్వ పరిపాలనా విధానము నందు అధికార పదవుల నధిష్టించి యున్నారు. కేబినెట్ లో మంత్రి పదవులను స్వీకరించినారు.

ఇంగ్లాండులో సహకార రాజకీయ పార్టీ ఒకటి గలదు. ఈ సహకార రాజకీయ శాఖ ప్రజలలో

రాజకీయ ప్రచార ప్రబోధములు కావించుచున్నది. ప్రజా సామాన్యములో రాజకీయ పరిజ్ఞానము, కలుగ జేయుట వీరి ఆదర్శకము, ఫిన్‌లాండు, జకస్లోవేకియా మొదలగు దేశములలో సహకారులే రాజ్యాంగ విధానము నంతను చేతపుచ్చుకొని, తమవోటు ప్రాబల్యము తో ప్రభుత్వమును సమర్థతతో నిర్వహించుచున్నారు. సహ కార సంస్థలు రాజకీయ కక్షులతో ఐక్యము కలుగజేసుకో కూడదని సుస్పష్టముగ ఉద్యమ నిర్వాహకులు మొదటి నుంచి అదర్శకముగ పెట్టుకొని వ్యవహరించినను, సహకా రోద్యమ లక్ష్యము మొదటినుండియు ప్రజాసామ్యవాద పద్ధతిని సహకార సామ్రాజ్యమును (Co-operative common wealth) స్థాపించుటయే యుద్యమా దర్శక మని ప్రకటింప బడినది. రాజకీయ స్వాతంత్ర్యము బడయుటయే ఉద్యమా దర్శకము. నిరంకుశత్వము నిర్మూలనము చేయుటకు ఉద్యమ ప్రధాన తత్వము. రాజకీయ స్వాతంత్ర్యము సహకారసభ్యులు కాపాడు కొననిచో నుద్యమ తత్వమునకే భంగము వాటిల్లును. సహకారుల న్ని దేశములలోను రాజకీయ స్వాతంత్రోద్య మమున ముందడుగు వైచుచు రాజకీయ పురోభివృద్ధికి దోడ్పడు చున్నారు. పురోగామియగు రాజకీయ

కక్షుల వారితో చేరి, దేశ స్వాతంత్ర్యమును గాపాడుటకు, సర్వవిధముల తోడ్పాటొనర్చుచున్నారు.

5. విద్య:— సహకారోద్యమ పతాకములో 5వ రంగు— కిరణము. విద్యాపురోభివృద్ధి:—

సహకారోద్యమ స్థాపకులు ప్రధమము నుండియు, సభ్యులలో విద్యా ప్రచారమునకు కృషి సలుపుచుండిరి. విద్యా ప్రచారమే యీ యుద్యమమున కాయువుపట్టు. రైఫేసియన్ మహాశయుడు, సభ్యులలో విద్యావ్యాప్తి చేయుటకు సంఘములో నుండి సాముదాయక ప్రయోజన నిధి 100కి 7½ వంతున వినియోగించుటకు నిర్ణయించెను. ఈరీతిగనే రోకడేలు, పైనీర్లు కూడ తమ సంఘుని బంధనలలో సంఘము లాభముల నుంచిసాముదాయక ప్రయోజననిధి కేటాయించి యీధనమును నిరక్షరాస్యులలో విద్యా వ్యాప్తి చేయుటకు సంఘ సభ్యులలో విజ్ఞాన ప్రభోధము కలుగ జేయుటకు వినియోగించుచుండిరి. ఉద్యమ తత్వము బహుళవ్యాప్తి యగుటకై విద్యాధికులచే ప్రచార ప్రబోధములు కావించుటకు తగిన యేర్పాట్లు చేయబడు చుండెను. వార్షి

క్రోత్సవములు వివిధ సమావేశములు జరుపు నపుడు సహకార తత్వము విజ్ఞాన ధనులచే వ్యాప్తి కావింపబడుచున్నది. ఇంతటితో సరిసమాప్తి కాక సహకార విద్యా ప్రబోధము కావించుటకు వివిధ దేశములలో పాఠశాలలు కళాశాలలు నిర్వహింప బడుచున్నవి. విశ్వ విద్యాలయములో ప్రత్యేకముగా బోధింప బడుచున్నది. (Research) శాస్త్ర పరిశోధన కావింప బడుచున్నది. ఉద్యమ నిర్వాహకులకు తరిఫీజు నొసగ బడుచున్నది. వివిధ మార్గముల సహకారోద్యమ నిర్వాహకులు సహకార విజ్ఞానమును వెదచల్లు చున్నారు. పఠన మందిరములు నెలకొల్ప బడుచున్నవి. మాస, వార, దిన, సహకార పత్రికలు యుద్యమ పురోభి వృద్ధికై వ్యాప్తి చేయబడుచున్నవి. అయితే సహకారులకు విద్యా విషయముపట్ల యెందుకీ శ్రద్ధ? యని అడుగ వచ్చును. లక్ష్యమేమని ప్రశ్నింప వచ్చును? విద్యా విహీనులు సహకార తత్వమును గ్రహింప లేరు. సభ్యులలోను ప్రజా సముదాయము లోను సహకారోద్యమ వ్యాప్తికి సద్విద్యావ్యాపనమే మూలాధారము. ప్రాథమిక పాఠశాలలు స్థానిక సంస్థలచే నిర్వహింపబడుచున్నవి. కళాశాలలు ప్రభుత్వము

వారిచే నిర్వహింపబడుచున్నవి. వివిధ శాస్త్ర పరిశోధనలు ప్రత్యేక సంస్థలచే నిర్వహింప బడుచున్నవి. అయితే సహకారులు వ్యాప్తిచేసే విద్యయేమిటని ప్రశ్నింప వచ్చును? సహకార విద్యయొక్క లక్ష్యము ప్రజలను ఉత్తమ పౌరులుగా తరిఫీజు చేయుట యేను! ఉత్తమ విజ్ఞానమును ప్రజలలో వ్యాప్తిచేసిన గాని ప్రాపంచిక నూతన పునర్నిర్మాణమునకు (New world order.) దోహదము కాజాలదు. ఆదర్శక పద్ధతుల పై ఆర్థిక సాంఘిక నైతిక రాజకీయ పరిణామము కలుగజేయుటకు సద్విద్యావ్యాపనమే మూలసాధనము. ఇట్టి సద్విద్యావ్యాపకము వలననే ప్రజలుఆర్థిక, సాంఘిక, నైతిక, రాజకీయ స్వాతంత్ర్యమును సంపాదించుకొని కాపాడుకొన గలరు. ఈలక్ష్యమును సాధించుటకు సహకార పతాకమున విద్యా పురోభి వృద్ధి సూచించు, రంగు, పతాకమున చూపబడుచున్నది.

సహకార పతాకములోని 6 వరంగు— వర్తక-వాణిజ్య-స్వాతంత్ర్యము:—

ధనిక వాద పద్ధతిలో వర్తక వ్యాపార సరళియంతయు వ్యక్తి లాభము కొఱకు చేయబడుచున్నది.

ఈ వర్తక వ్యాపారము పోటీ పద్ధతిని జరుగు చున్నది. వ్యాపారమంతయు లాభము కొఱకు నిర్వహింప బడు చున్నది. పోటీ లాభపద్ధతి కష్టలకు కార్పణ్యములకు అంతఃకలహములకు తుదకు నాశన కరమైన యుద్ధ ములకు దారిచూపుచున్నది. వ్యక్తులకు, వ్యక్తులకు, జాతులకు, జాతులకు స్పర్థలు, పోటీలు, వృద్ధియై ఘోర ప్రపంచ సంగ్రామములకు దారిచేసి, ప్రపంచనాశన హేతువగుచున్నది. కొనేవారికి, అమ్మేవారికి, మధ్యన దళారులుండి (Middle men) వర్తక వ్యాపార వ్యవ హారములను నడిపించుచుండుటచే మధ్యన గొప్పయ గాధ మేర్పడుచున్నది. ఈదళారీ వ్యాపారము నశిం చవలెను. ఉత్పత్తి లాభము కొఱకు కాక, ప్రజా విని యోగము కొఱకు (Service) వినియోగ పడవలెను. ఈ సంఘసేవ చేయుటకు స్వచ్ఛంద సేవకులుకావలయును. వీరు గౌరవ సేవకులు కావచ్చును. వేతనసేవకులు కావచ్చును. వర్తక వ్యాపార వ్యవహారము లన్నియు సంఘసేవ కొఱకు నిర్వహింప బడిన దేశములలో శాంతి సుఖ సంపదలు వర్ధిల్ల గలవు. ప్రజలు పరస్పర వైషమ్యము విడనాడి సౌభ్రాతృత్వముతో మెలగగలరు. ఈ సహకార పద్ధతియే వర్తక వాణిజ్య వ్యాపార స్వాతంత్ర్యము

నకు దోహద మొసంగ గలదు. వర్తకవ్యాపార వ్యవహార ములలో నీ పరిణామము చేకూర్చుటయే సహకారో ద్యమ లక్ష్యము. ఆదర్శకము. చిహ్నము. సహకార పతాకములోని 6 వ రంగు ఈవ్యాపార స్వాతంత్ర్యము నే ద్యోతకము చేయుచున్నది.

సహకార పతాకములోని 7 వ రంగు కిరణము.

వ్యవసాయము — సేద్యము — కృషి

నేడు ప్రపంచకములో వ్యవసాయము ఏవ్యక్తి కావ్యక్తి స్వలాభము కొరకు చేసుకొనుచున్నాడు. తాను పడించిన పంట తాను వినియోగించగా మిగిలినది లాభము కొరకు అమ్మకము చేయుచున్నాడు. భూమిపై హక్కు, యెవరు సంపాదించు కొన్న, వారిదేను. ఒక్కొక్క భూస్వామి కెంతెంత భూమి యుండ వల యునో నిర్ణయములేదు. ధన స్థోమతుకల భూస్వాములు నాదారు రైతాంగమున కప్పులు పెట్టు క్రమముగా నాభూములన్నియు స్వాధీనము చేసికొని బీదరైతులను భూములనుండి వెడలుగొట్టి, కేవలము కూలీలుగా చేసి వైచుచున్నారు. ప్రస్తుత వ్యవసాయ పద్ధతి యంతయు

ధనికవాద పద్ధతిని వ్యక్తి లాభము కొరకు వ్యవహరింప బడుచున్నది. ఇందు మూలమున పెద్ద భూస్వాము లింకను పెద్ద భూస్వాము లగుచున్నారు. నాదారురైతు లడుగంటి పోవుచున్నారు. ఈ పద్ధతి వలన దేశము పుష్కలముగా పండినను, ప్రజా నీకమునకంతకు తిని అనుభవించే యోగ్యత లేకున్నది. ఎక్కువ పంట పండితే పండిన పంటకు ధరవరలు రావని లాభసాటి వ్యవ సాయికులు పంటను తగులపెట్టి నాశనము చేయుచున్నారు. చేతిలో రానున్న పంటకెక్కువ ధర రాబట్టుకై యీ యక్రమ పద్ధతులకు దిగుచున్నారు. ఇందు మూలము ననే ప్రపంచకములో క్షామములు వృద్ధి అగుచున్నవి. ప్రజలు నాశనమగు చున్నారు. ఈ లాభసాటి వ్యవ సాయపద్ధతి నశింపు కావలయును. భూమి మీద పండే పంటనెల్లరు తినుటకు హక్కుదార్లు కావలయును. వ్యక్తు లలో నీయధిక లాభ తృష్ణ, పోవలయును. పంట సమిష్టిగా పండింప బడవలయును. పండిన పంట సమిష్టిగా క్రియ విక్రయములు బడయవలయును. పంట అనుభవించుట కొఱకే గాని లాభసాటి వ్యాపారము నకు కాదు. ఈ పరిణామము వ్యవసాయ పద్ధతులలో చేకూర వలెను. ఇట్టి పరిణామము చేకూర్చుటకే

వ్యవసాయ పద్ధతులలో మార్పు రావలసి యున్నది. వ్యవసాయికులు సమిష్టిగా వ్యవసాయ పరికరములు, విత్తనములు, యెరువులు సంపాదించుకొని పంట వృద్ధి చేసుకొనవచ్చును. సహకార సంస్థల యాజమాన్యమున పదిమంది కలసి సమిష్టి వ్యవసాయము చేసికొని పంట విభాగము చేసుకొన వచ్చును. ఐర్లండు డెన్మార్కు— దేశములలో నెవరికి వారు వ్యవసాయము చేసుకొనుచూ సమిష్టిగా వ్యవసాయ పరికరములు సహకార సంఘముల ద్వారా సంపాదించుకొని, సమిష్టిగా పంట దినుసులు సంఘముద్వారా క్రియపరచుకొను చునారు.

రష్యాదేశములో వ్యక్తి వ్యవసాయమునకు ప్రోత్సాహ మొసగబడుట లేదు. భూమి యంతయు ప్రభుత్వముదేను. సమిష్టిగా సహకార పద్ధతులపై వ్యవసాయమ మలులో పెట్టబడుచున్నది. పంటంతయు ప్రభుత్వమున కధీనము చేయబడుచున్నది. చేసిన పనికి రైతులకు ముదరా యీయ బడుచున్నది. అయితే రైతుల యిండ్ల చుట్టూ రెండు మూడు యకరములు స్వంతముగా వ్యవసాయము చేసుకొనుటకు పాడిపశువులు పెంచు కొనుటకు ఫలవృక్షములు, పాదులు

పెట్టుకొని యనుభవించుటకు ప్రతేకముగ ఆస్కార మీయ బడుచున్నది. మరనాగళ్లతో (Tractors) పెద్దపెద్ద ఖండములుగా గల భూములు సమిష్టిగా దేశ మంతట వ్యవసాయము చేయబడుచున్నవి. ఇందు మూలమున పంటల నందరికీ ప్రభుత్వము వారందు బాటులో పెట్టుచున్నారు. వ్యవసాయమెక్కువ ఫల వంతముగా కూడ చేయబడుచున్నది. వ్యక్తి స్వాతం త్ర్యము పోగొట్టకుండగ రైతాంగములో సామరస్య భావముచేకూర్చి యన్యోన్య సాహాయ్యముతో వ్యవ సాయము వృద్ధి పరచుటయే సహకారోద్యమ లక్ష్యము. వ్యక్తిస్వాతంత్ర్యము దుర్వినియోగము గాకుండగ అనగా లాభసాటి పద్ధతులపై యుపయోగపడక అందరి క్షేమ ముకొఱకు పంట దినుసులను వృద్ధిపరచి, ఉత్పత్తివృద్ధి చేయుటయే సహకార వ్యవసాయపద్ధతుల యొక్క ఆదర్శకము. ఇట్టి స్వాతంత్ర్యము సహకార పద్ధతు లలో కలుగజేయుట కొఱకే సహకారపతాకములో చిహ్నముగ ఏడవ రంగు.

## ఎనిమిదవ ప్రకరణము

# సహకారోద్యమ పరిణామము:—

సహకార పతాకములోని ఏడు రంగులు మానవుడు వివిధ రంగములలో సంపాదింప వలసిన స్వాతంత్ర్యములు తెలపు చున్నవి. ఈ వివిధ రంగములలోను స్వాతంత్ర్యము సంపాదించి నప్పుడే ప్రతివ్యక్తియు సంపూర్ణ వికాసమును జెంది అభ్యున్నతి కాంచగలడు వ్యక్తి అభ్యున్నతితో సంఘ సమిష్టి అభ్యుదయము కలుగును ఒక్కొక్క విషయములో సంపూర్ణ వికాసము నొంది యితర విషయములలో వికాసము చెందక పోయిన యెడల నట్టి వికాసము వికృత రూపము దాల్చునే గాని సమగ్ర సౌష్ఠవ మీయజాలదు. కాళ్లు వికృతముగా పెరిగిన బోదకాళ్ళగును. ఈరీతిగనే యొక్కొక్క యవయవమే పెరిగి వృద్ధి చెందిన యది వికృతరూపమే దాల్చును గాని పూర్ణవికాసము పొందజాలదు. అరిష్ట దాయక మగును మానవుని స్వరూపము, అందముగా ఆకర్షణీయముగా యుండవలెనన్న అన్ని అవయములు సంపూర్ణ వికాస

మును పొందవలయును. అప్పుడే ఆవ్యక్తి సర్వాంగ సుందరుడగును. అందచందములు కలిగియుండును. ఈ రీతిగనే సహకారోద్యమ పరిణామము వివిధ రంగముల సమానముగ వృద్ధి పొంది నపుడే ఉద్యమ లాభముచే కూరగలదు. లేనిచో వికృత రూపము దాల్చును. అందు కొరకే యుద్యమ సంస్థాపకులు మానవుని సర్వతో ముఖాభి వృద్ధికి యుద్యమము వివిధ రంగములలో విక సించునట్లు పునాదులు వైచిరి. అయితే యీ సమగ్రలక్ష్యమును దృష్టి యందుంచుకొనక ఒక్కొక్క దేశములో ఒక్కొక్క ప్రయోజనము కొఱకు యుద్యమము వృద్ధిపరచుటచే సమైక్య భావము కలుగుట లేదు. గ్రామములలో సహకార సంఘములు కేవల మొక్క ప్రయోజనము కొరకే నిర్మించుటచే యుద్యమము కుంటు పడుచున్నది. అందుచే రిజర్వుబ్యాంకు Reserve Bank వారీ యుద్యమము పురోభివృద్ధి కాంచవలెనన్న గ్రామములోని యందరి ప్రజల యొక్కయు సమగ్ర పురోభివృద్ధికి కృషి సలుప వలెనని నిర్దేశించిరి.

జర్మనీ దేశములో నీయుద్యమము కేవలము పరపతి వ్యాపారము రైతాంగములో వృద్ధిపరచుటకే పెంపొందింప

బడినగి. ఈ పరపతి వ్యాపారము జర్మనీ దేశము లో సహకార సంఘములద్వారా సంపూర్ణ వికాసము చెందిన మాట తథ్యము. కాని యుద్యమము వివిధరంగములలో వికాసము పొందకపోవుట మూలమున కుంటుపడినది. రైతాంగ మీయుద్యమ వ్యాప్తి వలన ఆర్థిక స్వాతంత్ర్యము పడయ గలిగిరి. తక్కువ వడ్డీలకు డబ్బు పొందగలిగిరి. అయితే హిట్లరు నిరంకుశ ధాటికి యెదురుగ నిలిచి స్వాతంత్ర్యము కాపాడు కొన లేకపోయిరి. హిట్లరు నియంతృత్వమునకు "దాసోహ"మనిరి. తక్కువ వడ్డీకి డబ్బు సంపాదించు కోగలిగినారు. కాని యుద్యమ లక్ష్యము పూర్తిగ గ్రహింపలేకపోవుట మూలము నవ్యక్తి స్వాతంత్ర్యమును, రాజకీయ స్వాతంత్ర్యమును, పొగొట్టుకొనిరి. నియంతృత్వమునకు దాసులైరి. ఈ విషయమునే Bertran B. Fowler "The lord helps those" అను గ్రంథములో నిట్లువ్యక్తపరచెను.

"The credit Union movement swept Germany visibly changing the entire credit situation. Groups of peasants and

workers for the first time in their lives escaped from the clutches of the money lender. But inspite of the constructive work done by the German credit Unions there was one fatal flaw in the system.

Raiffesein laid down the rules of organisation function and development. But he presented them merely as rules to follow rather than as a deep and cogent philosophy the system grew and expanded by virtue of its sound foundation of practicality. But its members remained in ignorance of the tool that had been placed in their hands. For this same reason the co-operative movement in Germany was impotent in the face of the rise of Hitlarism. There had been time enough and the idea was great enough to have worked a revolution in the country. But there had been no system of education to build a strong edifice of democratic under-standing and technique and therefore they were unable to widen the scope of their activities or do much to support the tottering economic system. Hence they could do nothing but bow to the

Director and look to him to supply the leadership they had failed to develop through practical education".

ఈ రీతిగనే ఇంగ్లాండులో కూడ సహకారపద్ధతిని వస్తువుల క్రియ విక్రయము మార్గమున వర్తకవ్యాపార సరళి పెంపొందింపబడినది. ఈపద్ధతి కొనుగోలు వ్యాపార విషయములలో విప్లవము గలుగ జేసినది. అయితే సభ్యులు వ్యాపారము వలన కలిగిన లాభముల పంపకము కొఱకే ఆతురత చూపుచున్నారు. ఉద్యమమును, వివిధ రంగములలో వ్యాప్తి కావించుటలేదు. సభ్యులలో (Dividend hunting mentality) లాభములు పంచుకోవడము కొఱకే మనో వృత్తి మారినది.

"We find in Great Britain to-day a tremendous and splendid business organisation built by the people- It has revolutionized shop keeping in England, and Scottland. But it had done a little more than that. To-day the British Co-operative movement is still in the hopeful stage. It can work great changes, do magnificient things if the members are educated to

make of the British co-operatives a great movement rather than a mere business organisation. The Sweeds and Danes have built a great co-operative movement while the British made it a great co-operative business structure.

The Sweeds and Danes used education to build their co-operatives while the British did little more than publicise and organise.

The British movement to-day one must admit that there is something radically wrong with the whole set up. The organised consumers of the British Isles have in their grasp a weapon with which they could reform the economic structure. That they have not done so is proof of actual weakness within the movement.

జర్మనీ దేశములోని పరపతి యుద్యమము, ఇంగ్లాండులోని పరపతేతర సహకారోద్యమము గతశతాబ్దమునుంచి విజృంభించి వృద్ధియగుచున్నను అనుకున్నంత

ఫల మీయకుండుటకు కారణము అమెరికా దేశపు సహకారవేత్తయగుBertram B. Fowlerస్పష్టీకరించినాడు. జర్మనీలో బీదరైతాంగమునకు వడ్డీ తక్కువకు ధనము లభించుచున్నది. ఇంగ్లాండులో కూలి నాలి చేసుకొని జీవించే ప్రజాసామాన్యమునకు, శ్రామికులకు, సహకార అంగడుల ద్వారా తక్కువ ధరలకు వస్తు సముదాయము లభించుచున్నది. కెనడా, యునైటెడ్ స్టేట్సులలో రైతాంగము తమ పంటదినుసులను సహకార వర్తక వ్యాపార వాణిజ్య సంఘముల ద్వారా గిట్టుబాటు ధరలకు అమ్ముకొనుచున్నారు. ఐర్లండు, డెన్మార్కు దేశములలోని ప్రజలు సహకార సంఘములద్వారా విస్తారముగ పాడి పంటలు వృద్ధి చేసుకొనుచున్నారు. ఇందు మూలమున అధికధన ప్రాప్తి కలుగుచున్నది. సోవియట్ రష్యాలో కూలీలు భూస్వాములను వెడలిగొట్టి భూమి నంతయు తమ స్వాధీనము చేసికొని సమిష్టి వ్యవసాయము చేయుచున్నారు. ఇందు మూలమున దేశములో సమిష్టి వ్యవసాయ పురోభివృద్ధి కలిగినది. వ్యవసాయ పద్ధతులలో నూతన పరిణామము కలిగినది. జపానీలు తమ దేశముపై దండయాత్ర సలిపి పరి

శ్రమలు విధ్వంసము కావించి నప్పుడు చైనాదేశము లోని జనసామాన్యము పారిశ్రామిక సహకార సంఘ ముల ద్వారా(Industrial co- operatives) దేశము మునందంతటను గృహపరిశ్రమలు స్థాపించి పారిశ్రామి కాభి వృద్ధిని పొందగలిగెను. ఇట్లు వివిధదేశములలో సహకారోద్యమము వివిధమార్గముల వర్ధిల్లినది. అయితే ప్రజలీ యుద్యమ తత్వమును పూర్తిగ గ్రహింపలేదు. స్వప్రయోజనము కొఱకే వినియోగించుచున్నారు. ఉద్యమ పతాకములో చిహ్నముగా చూపించ బడిన వివిధ ప్రయోజనముల కొరకు, వుద్యమసమగ్రపురోభివృద్ధి గాంచక పోవుట మూలమున యుద్యమ సంస్థాపకు లాదర్శకముగ పెట్టుకొనిన ఫలితము కలుగుటలేదు. ఉద్య మలక్ష్యము సర్వజనుల శ్రేయోభివృద్ధి, ప్రపంచక శాంతి, లోకకళ్యాణము, ప్రజలయార్థిక, నైతిక, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక, పారిశ్రామిక, వ్యావసాయిక, పురోభివృద్ధిని, సర్వ తోముఖముగ సాధించి ప్రపంచమందంతటను ప్రజలకు సుస్థిరమైన సహకార సామ్రాజ్యము స్థాపించుట యే యీయుద్యమ గమ్యస్థానము. ఇట్లు సమగ్రపురోభి వృద్ధి వివిధ శాఖలలో గలిగి ప్రజల సర్వతోముఖ

## ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

స్వాతంత్ర్యమునకు తోడ్పడినచో సహకారోద్యమము సర్వజనాశ్రయణీయమగును. ఒక్కొక్క శాఖ విజృంభించినంత మాత్రమున నీయుద్యమము వికృత రూపము దాల్చునేగాని సర్వతోముఖాభివృద్ధి కాంచనేరదు.



# సహకార క్రమశిక్షణ

సహకారోద్యమాభివృద్ధి వివిధమార్గముల విజృభించి ప్రజలకు సంపూర్ణ స్వాతంత్ర్యము చేకూర్ప వలెనన్న నీయుద్యమ మెన్నియో నిభంధనల పాటింప వలెను. ఈ నిబంధనలను నిర్భంధములని యెంచకూడదు. శృంఖలా బంధములని తలంప కూడదు. నియమములు పాటించుట మూలముననే సంఘము నియమ బద్ధమై నిర్ణీత మార్గములలో సక్రమ పురోభివృద్ధి చెందగలదు.

రైలు పట్టాల మీద నడచి నపుడే కడు వేగముగ పోయి గమ్యస్థానము చేరగలదు. రైలు పట్టాలు తప్పినచో కూలి పోవును. పట్టాలు రైలునకు శృంఖలా బంధనములనుకొనిన స్వాతంత్ర్యము యొక్క సంపూర్ణ నిర్భంధనము తెలియక పోవుటయేను. రైలు పట్టాలు మీద నడచినపుడే డ్రయివరు తనశక్తి సామర్థ్యములను

చూపగలడు. పట్టాలుమీాద నడపక స్వేచ్ఛయనుకొని తన యిష్టము వచ్చినట్లుగా రైలు నడపినచో బోర్లబడును.

ఈ తీరుగనే కవీశ్వరుడు కవిత్వమును చెప్పు నప్పుడు నియమ బద్ధుడై ఛందోబద్ధుడై యుండి తన స్వాతంత్ర్య ముపయోగించును. నియమబద్ధమై పద్యము నడచినప్పుడే కవి యొక్క స్వాతంత్ర్యము గంభీరత. మృదు మధురభావములు, వెలువడును. నియమ బద్ధముగాక యథేచ్ఛగా పద్యములల్లినచో నడక యింపుగానుండదు. శృతి కటువిగా నుండును. వ్యాస, వాల్మీకి, కాళిదాసులు, కవిత్వమును నియమ బద్ధులై చెప్పి మధుర పదజాలములతో కావ్యములు రచించి కవితకుశోభ చేకూర్చిరి. కవిత్వమునకు ఛంధస్సు శృంఖలా బంధమైనను సంపూర్ణ స్వాతంత్ర్యముతో కవి తనభావవీధుల విహారించ గలడు.

గాయకుడు సప్తస్వరములను సంపుటీ కరణ ముచేసి నియమబద్ధుడై తనచాతుర్యమును చూపి, మధురముగగానము చేయుచున్నాడు. సప్తస్వర ములు నియమ బంధన మనుకొని స్వైరవిహారముగా

గానము చేసిన యెడల కుక్కకూతలు, కాకి, అరపులుగా తయారగును. జంతుగాన కళావిశారదుడు వైలిన్ చేతబుచ్చుకొని నాల్గు తీగలు తనవ్రేళ్ళతో నొక్కి మేళవించి నపుడే మధురగీతాలాపనము వెలువడును. తప్పువ్రేలు పడిన చో అపశ్రుతి పలుకును. చిత్రకారుడు చిత్రము రచించి నపుడు నియమబద్ధుడై గీతలు గీచి తూలికతో రమ్యసుందర విగ్రహమును చిత్రించు చున్నాడు. రమ్యమైన ప్రకృతిని కట్టెను గుడ్డపై సుందరాకారముగ తీర్చి దిద్దుచున్నాడు. మనము చిత్రపటముపై గీసిన కొంకెగీతలు వచ్చును. అయితే నిపుణుడైన చిత్రకారుడు తనస్వాతంత్ర్యమును యథేచ్ఛగా వినియోగించి చిత్తరువునకు నాలుగుమూలలబిరిగీసి, ఆబిరిలో నిర్ణీతముగుకొలతల ప్రకార మాకారమును, రామణీయకముగ చిత్రించును. చిత్రకారునికి Cavas పటము నియమబంధమును కొని నచో చిత్రరచన చేయగలడా? స్వేచ్ఛకు పటము డ్డమైనదని గీతలు పటమును మించి గీసినచో చిత్రమునకు అందమేర్పడునా? ఈ రీతిగనే ఆటలు(Foot ball, Cricket, )నియమబద్ధముగా గీసిన బిరులలోనే యాడవలయును. బిరిదాటిన ఆట మొదటికి రావలసినదే.

స్వాతంత్ర్య మనగా నెవనియిష్టప్రకారము వాడు నడచు కొనుటకాదు. స్వాతంత్ర్యము కూడ నియమ బద్ధకమేను. ఈ నియమముకే శాసనములు. శాసన బద్ధులై పౌరులు నీతి నియమములు పాటించి నడచి నప్పుడే స్వాతంత్ర్య మనుభవింప గలుగుదురు. యధేచ్ఛగా స్వైర విహారము సలిపిన-చో స్వాతంత్ర్యము, వికృత పరిణామము దాల్చును. సంఘము మల్ల కల్లోల మగును. వివిధ కళ లను వికసింప చేయుటకు కళారాధకులు నియమ బద్ధులై కళలను వికసింపజేసి మానవాభ్యుదయము నకు తోడ్పడుచున్నాడు. ఆరీతిగానే మానవ సంఘము సంపూర్ణస్వాతంత్ర్య మనుభవింప వలెనన్న నియమ బంధనముతో నిర్మాణము చేయ బడవలెను. ఒక వ్యక్తి యింకొక వక్తిని మోసగించి లాభము పొంద చూచుట నియమములకు వ్యతిరేకము. ఒక సంఘము మరియొక సంఘమును వంచించి తాను లాభము పొంద చూచుట నియమ విరుద్ధము. ఒకజాతి యింకొకజాతినిదౌర్జన్యముగా అణచిపెట్టుట స్వాతంత్ర్య నిరోధము. వ్యక్తులకు, వక్తు లకు, జాతులకు, జాతులకు, వృత్తులకు, వృత్తులకు, కళలకు కళలకు, సామరస్యము చేకూర్చి నియమ బద్ధముగా

నడిపించి సర్వశ్రేయోభి వృద్ధికొఱకు కృశి సలుపుటయే సహకారోద్యమము యొక్క పరమావధి.

సహకారోద్యమము వివిధ శాఖలలో స్వాతంత్ర్య సిద్ధికి కృషి సలుపుచున్నది. ఈ స్వాతంత్ర్యము నియమ బద్ధమైనది. పరపతి సంఘములో పెక్కు నియమములు కలవు. 18 సం॥ రములు వయస్సు వచ్చిన వారే యిందు సభ్యులుగ జేరుటకర్హులు. ఒక్క గ్రామ పరపతి సంఘములోనే సభ్యుడుగా నుండవలెను గాని ఆసభ్యుడు మరి యేయితరగ్రామ పరపతిసంఘములలోను మెంబరుగా చేరరాదు. వ్యక్తి ఋణాధికారముమించి యెంత ఆస్తి పరుడైనను అప్పు తీయరాదు. ఎన్ని షేర్లు కలిగియున్న వాడైనను సభ్యునకు ఒక్కటే ఓటు. వాయిదా మీరిన సభ్యుడు పాలకవర్గసభ్యుడుగా నుండరాదు. సంఘములో వచ్చిన లాభమునకు అందరును సమాన భాగస్తులేను. అయితే యేయొక్కరును యీ లాభమును పంచుకొనగూడదు. సంఘలాభములో నుంచి నూటికి రు 6-4-0చొ॥న మాత్రమే షేర్లపై వడ్డీ యీయబడును. ఇంతకు మించి లాభము పంచు కొనుట కధికారము లేదు. ఫలప్రదమైన పనుల కొఱకే అప్పులు శాంక్షను

కాబడవలయును. ఈ నియమములు సహాకార పరపతి సంఘములు పాటించినప్పుడే సంఘ మభివృద్ధిలోనికి వచ్చును. సభ్యులభ్యున్నతి కాంచెదరు.

ఈతీరుగనేపరపతేతర వ్యాపార సంఘములలో నియమములుకలవు. సభ్యులు సంఘములకు, విశ్వాస పాత్రులుగనుండవలెను. సంఘములోనే దమయక్కర్లకుకావలసిన వస్తువులు కొనవలెను. అన్యధా కొనరాదు. సంఘములో అందరికీ కావలసిన వస్తువులు బజారు ధరకే అమ్మవలయును. సంవత్సరాంతమున లాభములలోనుంచి డివిడెండు $6\frac{1}{4}\%$ మించి తీసుకొనరాదు. లాభము క్షేమనిధి పెంపొందించుట కే ర్పరచవలెను. వడ్డీలు లాభములు నిర్ణీతరేట్ల ప్రకారం నిర్ణయింపబడుట వలననే యీ సంఘములలో చేరు సభ్యులు (joint stock) కంపెనీలలో వలె వచ్చిన లాభమంతయు హెచ్చురేట్లు వేసుకొని పంపకము చేసుకొనుటకు వీలులేదు. ఏ సంఘములోను లాభము పంపకము 6% మించి వుండకూడదు. కొదువ సొమ్మంతయు క్షేమనిధికి జమకట్టబడ వలయును. ఈ క్షేమనిధి అందరిక్షేమము కొరకు నిర్మింప బడినది. పరపతేతర వ్యాపార మిట్టి నియమ బద్ధముగా రోక

డేలు పయినీర్లు వ్యవహరించుట మూలముననే ఆ సంస్థనేడు కోటాన కోట్ల రూపాయిలు విలువగల వస్తువుల వ్యాపారము చేయుచున్నది. ఇది వఱకు వచ్చిన లాభముతో వేలకొలది ఎకరములు టీ,కాఫీ తోటలు సంపాదించినది. స్వంతస్టీమర్ల పై రవానా వ్యాపారము సలుపుచున్నది. సరసమైన ధరలకు సమస్త వస్తువులును పరికరములును సభ్యులకు సరఫరా చేయ గలుగుచున్నది. సంఘముల నిర్వాహణమునకు, పాటించవలసిన నియమములను పాటించక సభ్యులు సంఘముల విశ్వాసపాత్రముగ వ్యవహరించక ఎవరి మట్టుకు వారు తమ లాభముకొఱకు పెనగులాడిన యుద్యమము పెంపొందదు. ఎవరికి వారే యమునాతీరే అన్నట్లుగా వ్యవహరించిన సహాకారోద్యమము యీపాటికే నీళ్లుకారి పోయెడిది. కాని నియమబద్ధముగా నుద్యమము నడిపించుట వలన ప్రతిష్ఠావంతముగా విజృంభించుచున్నది. అయితే వివిధమార్గముల వికసించి నిర్ణీతప్రకారము నడిపింప బడకపోవుటమూలమున నీయుద్యమము కుంటుపడుచున్నది. బహువివిధ మార్గముల నీయుద్యమము ప్రజల సర్వతోముఖాభివృద్ధికి కృషిసలిపినపుడే గమ్యస్థానము చేరగలుగును. మన

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

దేశ ప్రధానామాత్యుడగు జహ్వార్‌లాల్ పండితుడు, రాజకీయవేత్తలలో నెన్ని భేదాభి ప్రాయములున్నను భారతదేశములో సహకార సామ్రాజ్యమును స్థాపించుటయే యందరిలక్ష్యము కావలెనని నాసిక కాంగ్రెసు మహాసభకు సుస్పష్టమైన సందేశము నొసంగెను.

సహకారోద్యమము భారతదేశ పురోభివృద్ధికి సర్వతోముఖముగా కృషిసలిపినపుడె రాజకీయ స్వాతంత్ర్యముతోబాటు ఆర్థిక, నైతిక, సాంఘిక, వివిధపురోభివృద్ధులు కలుగును. వీణాతంత్రులమీద గాయకుడు రాగాలాపనము చేయునపుడు తన హస్తలాఘవమును నైపుణ్యమును చూపును. వీణాజంత్రమునకు 7 తంత్రులుండును. నాల్గు ప్రధానతంత్రులు మూడుశ్రుతితంత్రులు. ఈ ఏడు తంతువులు క్రమానుగతిని నాదమునుద్భవింపజేయును. ఇందులో నేతంతి సక్రమముగ నుపయోగించకపోయినను అపశ్రుతి కలుగును. నాదము శ్రుతి కటు వగును. సాధకుడు నియమబద్ధముగా తంతువులను పరిష్కారము చేయుచూ సాధనచేసిన కొలది రక్తు తేరును. ఏ తంతువు సడలినను సీల భిగించును. ఈ బిగింపు తంతులను నియమ బద్ధముచేయుట కొఱ

కేను. అడుగడుగునకు తంతులను సడలకుండా వైణి
కుడు శ్రుతినిమేళవించు కొనుచుండును. ఈ తీరుగనే
సహకారోద్యమ నిర్వాహకులు సహకారోద్యమ పతా
కమునద్యోత కముగు నేడు రూపములును సమాన
ముగ పెంపొందించినపుడే యుద్యమముతో సమగ్ర స్వరూ
పమువిరాజిల్ల గలదు. వైణికుని చేతిలో వీణాతంత్రులు
మనోహరముగా పలికి యమృతగానము నొసగినట్లు
యుద్యమ నిర్వాహకుల చేతులలో యుద్యమము
షడువిధముల నడిపింప బడినప్పుడే సర్వతో ముఖాభి
వృద్ధి బొంది ప్రజలకు సుస్థిర శాంతి సుఖ సంప
దల నొసగ గలదు.



పదియవ ప్రకరణము

# దృక్పథము మారాలి

సహకారోద్యమాదర్శకముల నన్నిటి నాచ రణలో పెట్టి నిర్వహించినపుడే అభ్యున్నతి చెందును. ఏ యుద్యమమున కయిన నాదర్శకములలో లోప ముండదు. ఆచరణలోనే లోపములు కలుగును. ఉద్యమ సంస్థాపకు లుద్యమమునకెట్టి లోపములు కలుగ కుండు నట్లు సర్వవిధముల కట్టుబాట్లు చేయుదురు. అయితే కాలక్రమేణ యీ కట్టుబాట్లు సడలి పోవును. ఆద ర్శకములు విస్మృతి చెందబడును. ఇందుకు కారణము మొదట నేర్పాటుచేసినయుద్యమ సంస్థాపకులయందుండెడి యాదర్శక లక్ష్యము తరువాత వచ్చెడి వారలలో నుండదు. బహుజన వ్యాప్తిమైన కొలది వివిధ తరహాల మనుష్యు లుద్యమములో చేరుటతోనే వారల మనోభావముల బట్టి యుద్యమమునకు ఘనతగాని,

కళంకము గాని యేర్పడును. ఈ సత్యము మనము సాధారణముగా మతముల వ్యాప్తిలో చూడగలము. జీసస్ క్రైస్తు నీశ్వర పితృత్వము, మానవ సౌభ్రాతృత్వము ప్రజలలో నెలకొల్పుటకు తీవ్ర కృషిసల్పెను. కాని క్రమముగానీమతము వ్యాప్తిమైన కొలది, మతప్రచారకులలోనే భేదములు పొడచూపినవి. విభిన్న మార్గముల క్రైస్తవ మతానుచరులు తమ యాదర్శక లక్ష్యములను వీడి నిత్య జీవనమునందు జీసస్ క్రైస్తు చెప్పిన బోధలకు వ్యతిరేకముగా నడచుకొనుచున్నారు. ఒకరి నొకరు హింసించుకొనుచున్నారు. యుద్ధములకు తమలో తామే కాలు దువ్వుచున్నారు. జీసస్ క్రైస్తు తన జీవితమును సత్యము కొఱకు బలియొసగెను. అట్టి మహానీయుని మతప్రచారకులు నేడు వివిధ దేశములలో క్రైస్తవ మతస్థులై యుండియు నొండొరులను కాల్చుకొను చున్నారు. రెండు ఐరోపా ఘోర సంగ్రామములలో క్రైస్తవ మతములోని యుత్కృష్టాదర్శకమైన మానవ సౌభ్రాతృత్వము మంట గలసినది.

బుద్ధ భగవానుడహింసాతత్వమును ప్రపంచకము నందంతట వెదజల్లెను. మానవ ప్రేమ తత్వమును

వ్యాప్తి చేసెను. కాని నేడు బౌద్ధమత ప్రచారము విశేషముగా గల జపాను చైనా కొరియా దేశములలో అహింసా తత్వ మేనాడో యడుగంటినది. కప్పల నూరుగాయలు పెట్టుకొని తినే దుస్థితికి యీ మతస్థులు దిగిరి. క్రైస్తవుల వలె బౌద్ధ మతస్థులు హింసాకాండ జరుపుటలో నొకరికొకరు కాల్చుకొనుటలో వెనుతీయుట లేదు. ఈరీతిగనే మహమ్మదీయ మతములో కూడ సంస్థాపకుల ఆదర్శక మొకటి, ఆచరణ వేరొకటి. మహమ్మద్ ప్రవక్త మద్యపానము నిషేధించెను. వడ్డీ వ్యాపారము బహిష్కరించెను. కాని మన కాబూలీ సోదరులు మహమ్మదు ప్రవక్త అనుయాయులే అయినను వీరి నిత్యజీవనము వడ్డీ వ్యాపారము. ఋణస్థుని వీరు జలగలవలె బట్టి పీల్చిపిప్పిచేసెదరు. వీరిలో మద్యపానము యథేచ్ఛగా సాగుచున్నది.

ఆర్యులలో సత్య ధర్మానుష్ఠానములు జీవితాదర్శకములు. కాని ఆర్యధర్మమును నిత్యజీవితములో చూప వలసిన ఆదర్శకప్రాయులైన వారే, అధర్మమునకును, అసత్యమునకును వెరచుటలేదు. ఈరీతిగ నాదర్శకమునకు అనుష్ఠానమునకు నెంతయో వ్యత్యా

నము కనబడుచున్నది. గాంధీమహాత్ముడు ప్రజలలో ఐకమత్యము, పరమత సహనము, నుద్బోధించెను. కాని మహాత్ముని అనుయాయులు నేడాంతరులను వంచించుకొని సహనము లేక, పరస్పర విరోధ భావము లతో మెలగు చున్నారు. పరమత సహనము లేక దేశములో యథేచ్ఛగ నొండరులను చంపుకొనుచున్నారు. రక్త ప్రవాహములను ప్రవహింప చేయుచున్నారు. మహాత్ముడే తన ప్రాణములను ఒకమతోన్మత్తుని తుపాకీకాల్పువలన చనిపోయెను. మహాత్ముని యను యాయులే కాంగ్రెసు గోత్రికులే, మహాత్ముని యున్నతా దర్శకములను విడనాడు చున్నారు. ఇట్లే యాదర్శక ములకు, లక్ష్యములకు, నాచరణలకు, సంబంధము లేకుండ పోయినది. ఇందుకు ముఖ్య హేతువు జ్ఞాన లోపమేను. లక్ష్యముప్రధానముగ నుంచుకొనకపోవుట మూలముననేను ప్రధాన లక్ష్యములు మరుగు పడకుండ యెప్పటికప్పుడు సక్రమ విధమున ప్రచార ప్రబోధములు సలుప బడు చుండిన యాచరణయందు పట్టుదల, విశ్వాసము కలు గును. ఉద్యమ నిర్వాహకు లాదర్శకముగ, ననుష్ఠాన మునందు, సమున్నత భావములను సడలింపక యే కైక లక్ష్యముతో ప్రవర్తించిన వీరిని మార్గ దర్శకులుగా

తీసికొని, యితరులు కూడ యటులాచరించుటకు కృషి సలుపుదురు. ఆదర్శకము చూప వలసిన పెద్దలే యప మార్గముల సంచరించిన నితరులు వీరిననుగమింతురు. అందుమూలమున "గతానుగతికోలోకః"॥ యనునట్లు వారిని చూచి వీరు, వీరిని చూచి వారు క్రమముగా నాదర్శకముల నుండి దిగిపోవుట సంభవించుచున్నది. క్రమముగా నుద్యమము నశించుటకు మార్గ మేర్పడు చున్నది. ఇట్టి ప్రమాదములు రాకుండగ నుద్యమా దర్శకములను యెల్లప్పుడు లక్ష్యము నందుంచుకొన వలెను. ఆదర్శకముకంటె ప్రవర్తనయే యెక్కువ ప్రధానము.

సహకారోద్యమమునకు నాదర్శకములలో లోటులేదు. లక్ష్యములలో లోటులేదు. ఉన్నతభావము లెన్నియేని కలవు. కాని యీ యాదర్శకములను ఉన్నత భావము లను నిత్య జీవితములో ఆదర్శకముగా చూపించ గల యనుష్టాన పరులే కావలయును.

శ్లో॥ "యద్యదాచరతి శ్రేష్ఠ
స్తత్తదేవేత రోజనః

త్యాగశీలత పై నాధార పడి యున్నది. త్యాగమే యీ యుద్యమమునకు మూలాధారము. సంఘములో చేరిన ప్రతి సభ్యుడు సంఘ క్షేమము కొఱకు త్యాగముతో కృషి సలుప వలసి యున్నది.

ఒక సభ్యుడు సంఘములో చేరిన తోడనే తన యభివృద్ధి కొఱకు సంఘసహాయము కోరును. తనకు వ్యవసాయ పురోభివృద్ధికి పరపతి కావలె నన్న ముందుగా తాను షేరుధనమును కట్టి యితరుల సహాయముతో అప్పు తీసుకొన వలయును. ఇతరులు తనకు జామీను లేనిదే అప్పురాదు. తాను యితరులకు జామీ నుండవలయును. ఇతరులు తనకు జామీ నుండవలయును. ఇది యన్యోన్య సహాయమునకు పరస్పర సానుభూతికి నవకాశమొసగును. నేను భాగ్యవంతుడను ఇతరులకు జామీ నుండనని ధిక్కరించిన, సహకార భావమే లోపించును. పరస్పర సహాయ మడుగంటును. అందుచే నీ యుద్యమములో చేరువారితరులతో కలసి పని చేయుట నేర్చుకొన వలయును. ఇందు మూలమున కొంత త్యాగము చేయుటకు సిద్ధ పడవలెను. తాను శక్తి వంతుడైనచో విజ్ఞాన వంతుడైనచో, ప్రతిభా శాలి

మైనచో, తనశక్తి సామర్థ్యము, విజ్ఞానమును,తన యభి వృద్ధి కొరకేకాక తోడి సభ్యుల యభివృద్ధికి త్యాగము చేయువలసి యున్నది.

సంఘు నిర్వాహణము చేయుట కందరి తరఫున కార్య భారము వహింప వలెను. సమర్థుడు పంచాయితీ దారుగా నెన్నుకోబడును. పంచాయితీ దార్లు యధ్యక్షునెన్ను కొనెదరు. ఈ స్థానములు, సభ్యులలో, సమర్థులైన వారికే వప్పగించెదరు. ఈ సమర్థులగు సభ్యులు సంఘు నిర్వాహణ బాధ్యత వహించి తమయమూల్యమగు కాలమును సంఘుసేవ కొఱకై చ్ఛికముగ వినియోగింప వలసి వచ్చును. తోడి సభ్యులకు తాము సంపాదించిన విజ్ఞానము ప్రచార ప్రబోధములమూలముగానందజేయ వలసి వచ్చును. ఇట్టి సంఘుసేవ చేయుటకు సమర్థులగు సభ్యులు త్యాగము చూప వలయును. ఇట్టి పరస్పర సహాయము త్యాగము చూపనిచో నీయుద్యమములో స్థానము లేదు. ఫలాపేక్షా రహితముగ త్యాగము చేసినపుడే యీయుద్యమము సక్రమ నిర్వాహణ మగును. గ్రామ సంఘుములు, సెంట్రలు బ్యాంకులు, రాష్ట్రీయబ్యాం

కులు, వివిధ సహకార సంస్థల సభ్యుల నుంచి, యెన్ను కొనబడిన గౌర వోద్యోగుల మూలముననే నిర్వహింప బడుచున్నవి. ఇట్టి గౌర వోద్యోగుల త్యాగము మూలముననే యుద్యమ పరువు ప్రతిష్ఠలు కాపాడ బడుచున్నవి. గౌర వోద్యోగులు త్యాగము నకు సంసిద్ధులు కాని-చో, సంఘసేవ, ఆదర్శక వంత ముగ జరుగదు. ఇట్టి త్యాగము వలన ఫలితమే మని అడుగవచ్చును. నిజమైన త్యాగులు ఫలితముకోరరు. ప్రతి ఫలయుక్త మయినది-త్యాగముకాదు. ప్రతిఫలముకోరనిదే త్యాగము. త్యాగమున్నతాదర్శకమయినది. ప్రేమపూరిత మయినది. ప్రేమ పూరితులే యీ త్యాగమునకు సమర్థులు. ఉన్నత ప్రేమా దర్శకము ఫల రహిత మైనది. ఎట్టి ప్రతి ఫలమును కాంక్షించదు. అనిర్వాచ్యమయిన ప్రేమనుండే త్యాగము ధ్భవిల్లును. సహకారోద్యమము ప్రతి సభ్యుని నుండి యిట్టి ప్రేమ పూరితమయ్ను త్యాగ మునే, బలిదానమునే, కోరుచున్నది. తల్లి బిడ్డను పెంచు నపుడు త్యాగము చేయును. అహర్నిశలు బిడ్డ యొక్క క్షేమము కొఱకు త్యాగము చేయు చున్నది. బిడ్డ పైగల మాతృ ప్రేమయే తన సౌఖ్యమును కూడ విడినాడి త్యాగము చేయించు చున్నది. ఈ రీతిగనే

గురువు శిష్యునకు విద్య గరపునపుడు ప్రేమతో త్యాగము చేయుచున్నాడు. భార్యా భర్తల అన్యోన్య ప్రేమకు త్యాగమే మూలా ధారము. యజమానికి సేవకునికి పరస్పరాను బంధము త్యాగము మీదనే యధారపడి యున్నది. ప్రపంచకమీ త్యాగము మీదనే ఆధార పడియున్నది. బీజము నశించి వృ క్ష ము న కు -చో టి చ్చు చున్నది. పుష్పము నశించి ఫలమునకు -చోటిచ్చు చున్నది. చెట్లు ఫలమును త్యాగము చేయు చున్నవి. యోధుడు దేశసేవ కొఱకు ఆత్మార్పణము చేయు చున్నాడు. శాస్త్రజ్ఞుడు తన విజ్ఞామును లోకమునకై త్యాగము చేయుచున్నాడు. ఫల రహితముగ కర్మ చేయ మనియే మనకు భగవద్గీత యుపదేశించు చున్నది. సహకారోద్యమమునకు కర్మఫలత్యాగమే యాదర్శకము. ఆయువుపట్టు. ఉద్యమ సేవకులిట్టి యాదర్శకమగు త్యాగ పునాది పైననే సహకార సౌధమును నిర్మాణము చేసిరి. ఫలాపేక్షా రహితులై వేల కొలది త్యాగశీలు రుద్యమ పురోభి వృద్ధి కకుంఠిత సేవ యొనర్చి యమర కీర్తిని బడసిరి.

సహకారోద్యమము నందలి యుత్తమా దర్శకములలో ప్రధానమైనది త్యాగశీలత. తరువాత గణింప

తగిన ఆదర్శకము సేవాపరాయణత. ఈ యుద్యమము నకు సేవాపరాయణతయే ఆయువు పట్టు. సేవాపరాయణత్వము రెండు విధములైనది. అందు మొదటిది ఐచ్ఛికసేవ, రెండవది వేతనసేవ. ఉపపత్తి గల సభ్యులు ఉద్యమమునకు ఐచ్ఛిక సేవ యొనర్చ వలెను. ఉపపత్తి కని వారు ఉద్యమమునకు వేతన సేవ నొనర్ప వచ్చును. పాశ్చాత్య దేశములలో సహకారోద్యమమునకు ప్రభుత్వ సహాయము కొలది మాత్రమేను. శాసనములు కావించుటతోనే ప్రభుత్వమువారి భాద్యత. ఉద్యమ నిర్మాణము, నిర్వహణము, తనిఖీ యంతయు నాయా సంస్థలవారే నిర్వహింతురు. ప్రభుత్వ జోక్యము తక్కువ. ప్రభుత్వ సిబ్బంది యుండరు. మన దేశములో నట్లు కాదు. ఆదినుండి యంతము వరకు సృష్టి స్థితి లయము లన్నిటికి ప్రభుత్వోద్యోగులచే యాదర్శకము.

సంఘములుసృష్టించడము అనగా రిజిష్టరుచేయడము ప్రభుత్వోద్యోగుల యధీనము. సహకార డిపార్టు మెంటు సహకార శాఖకుజెందిన ప్రభుత్వోద్యోగులే యీ సంఘములను నిర్మాణముచేసి, రిజిష్టరుచేసి, నామకరణముచేయుదురు. ఇది డిపార్టుమెంటు వారిబ్రహ్మత్వము. ఈసంఘముల

నిర్వహణము సభ్యులనుంచియెన్నుకోబడినపంచాయితీదార్లు లేక డైరక్టర్లుది. వీరు సంఘమును పరిపాలన చేయుదురు. అయితే యీ పరిపాలన యడుగడుగునకు పరిశోధించుచు ప్రభుత్వోద్యోగులు సంఘముల తనిఖీ చేయు చుందురు. లెఖలు ఆడిట్టుచేసి, ఆడిట్టు రిపోర్టులను జారీ చేయుదురు. ఈ పరిపాలనా విధానములో ప్రభుత్వోద్యోగులు లోపములున్నవని యను మానించిన పంచాయితీలకు డైరక్టర్లకు భర్తపు చెప్పుదురు. పరిపాలన తమ హస్త గతము చేసు కొందురు. ఏడాదో రెండేండ్లో ప్రభుత్వో ద్యోగులే యాయాసంస్థలను నిర్వహించి యందులకగు వ్యయము సంఘకాతాను ఖర్చు పరచుదురు. ఇది పరిపాలనా విధానము అనగా బ్రహ్మత్వంతో పాటు విష్ణుత్వం కూడ ప్రభుత్వోద్యోగులే చూచుకొందురు. సంఘము సక్రమముగా పని చేయకపోతే ప్రభుత్వోద్యో గులే సంఘానికి స్వస్థి చెప్పెదరు. అంటే అపరకర్మ జరిగింతురు. ఇంతటితో శివత్వం సిద్ధిస్తుంది. అంటేసంఘా లన్నీ లయం చేయడం కూడ ప్రభుత్వోద్యోగులదేను. గ్రామ సంఘము మొదలుకొని రాష్ట్ర సంఘం వఱకు సృష్టిస్థితిలయములన్నియు ప్రభుత్వ సహకారశాఖోద్యో గులపై నాధారపడి యున్నవి. ఈ యుద్యోగుల

యంతర్వ్వలపై,అంతర్వ్వలుగా నియమింప బడియున్నారు. జూనియరు యినస్పెక్టర్లు, సీనియరు యినస్పెక్టర్లు, సబురిజిస్ట్రారు, డిప్యూటీరిజిస్ట్రార్లు, జాయింటురిజిస్ట్రార్లు రిజిస్ట్రారు, ఇది యీశాఖోద్యోగుల నిర్మాణం. రాష్ట్రీయోన్నతాధికారి యగు రిజిస్ట్రారు యీ యుద్యమ మమునకురాష్ట్రములో నధిష్టానదేవత. శాసనమురీత్యాయీ యీయుద్యమ సృష్టి, స్థితి, లయములు వీరియందా విర్భవించి యున్నవి. సహకారశాఖలోని యుద్యోగుల యంతర్వ్వలకు యీయన శిఖరము. దిగువ వారంతా సహకారపరపతి సంఘ సౌధ నిర్మాణమునకు, పరపతి సంఘములెట్లు పునాదులో, వేతనోద్యోగులైన వేలకొలది శాఖోద్యోగులగు జూనియరు యినస్పెక్టరు లీసహకార భవన నిర్మాణమునకు పునాదులు. సబురిజిస్ట్రారు, డిప్యూటీరిజిస్ట్రార్లు, రిజిస్ట్రార్లు, యంతర్వ్వలు. వీరందరు వేతనోద్యోగులే. ఇంతవఱకు ఈ యుద్యమమును వీరు హస్తగతము చేసుకొని నిర్వహించు చున్నారు. సహకారసంస్థల నిర్వాహకు లాయాసంఘములను నిర్వహించు చుందురు. వీరందరు నుద్యమమునకు ఐచ్ఛిక సేవకులు. గౌరవోద్యోగులు. ఈ యుద్యమమునకు గౌరవోద్యోగులు, వేతనోద్యోగులు రెండు కళ్ళవంటి

వారు. రెండుకళ్ళు దృష్టి సమానముగ ప్రసరించినపుడే యేకలక్ష్యముతో నుద్యమ పురోభివృద్ధి కలుగును. ఇందుతో నే కంటికవరోధము కల్గినా ఉద్యమమునకు భంగము వాటిల్లును. ఎడ్లబండికి రెండెడ్లు సమానముగ జతగలసినపుడే బండి దొర్లును. ప్రమాదము రాకుండును. బండికాడికి ఒకవైపు యెద్దును యింకొకవైపు దున్న పోతును గట్టిన బండి సమానముగ పోదు. చెరియొక వైపునకు యీడ్చును. తుదకు బండియె బోల్తా పడును. సహకార శకటము చురుకుగా పోవలెనన్న యుద్యోగి, అనుద్యోగి, సహకారు లేకలక్ష్యము తో సహ కరించ వలెను. ఉద్యమ సేవయే వీరి లక్ష్యము కావలయును. ఈసేవాపరాయణతకు కొలగట్టు జీతముకాదు. భత్యము కాదు. ఫలరహితమైనసేవ. ఉద్యోగి అనుద్యోగి,సహకారు లలోనెందరో యుత్తమ సేవకులు గలరు. ఉభయులలోను కొందరు కేవలము సేవానటనము చేయువా రున్నారు. అయితే యుద్యమ పురోభి వృద్ధి వేతనోద్యోగుల యొక్కయు, గౌరవోద్యోగుల యొక్కయు విశుద్ధ సేవానిరతిపై నాధారపడి యున్నది. డబ్బు పుచ్చు కొని పనిసేసినను పుచ్చుకొనక పని చేసినను ఉభయ వర్గముల వారు యుద్యమ లక్ష్యములను

పాటించి నూతనా దర్శకములతో నూతన ప్రపంచ నిర్మాణమున కుద్యమసేవ యొనర్ప వలసి యున్నది. ఇట్టి యైచ్ఛిక సేవకుల నుద్యమమన్వేషించి సంపాదించు కొనవల యును. తల్లి బిడ్డకు చేయు సేవకు, దాది బిడ్డకు చేయు సేవకు, మహాదంతరము కలదు. బిడ్డ పోషణకు, రక్షణకు తల్లి చేయు సేవ యమూల్యమైనది. ఫలాపేక్షా రహిత మైనది. బిడ్డ శ్రేయస్సును కోరి నిద్రాహారములు మాని సుఖసౌఖ్యములు వదలి తల్లి బిడ్డకు సేవచేయుచున్నది. ఈ బిడ్డకుచేయు సేవలో తల్లి విసుగు విరామము నెరుగదు. అయితే దాది ఇట్టిసేవ బిడ్డకుచేయునా? దాది సేవకు కొల గట్టి యిచ్చే జీతము. జీతము పుచ్చుకొనే దాదులలోకూడ యకుంఠిత సేవా పరాయణులు లేరా? ఉన్నారు. వారి సేవ ప్రేమ పూరిత మైనది. ఫల రహిత మైనది. అని ర్వాచ్య మైనది.

మిల్లులలో పనిచేయు సేవకులకు మిల్లు యాజమానులపై ప్రేమ లేదు. వారిచ్చే కూలికే వీరు చేసే సేవకు ఉద్దుళ్ళా. ఏ రోజున కాహాజే తెగ తెంపు. అందుచేతనే మిల్లు యజమానులకు సేవకులకు నిరంతర సంఘర్షణము జరుగు చుండును. పరిశ్రమ లభి

వృద్ధిలో కనబడినను, ప్రపంచ మంతటిలోను వ్యాప్తి గాంచినను శ్రామికులకు యజమానులకు నెట్టి యను బంధము లేదు. పూర్వ కాలములో నెన్నియో కుటీర పరిశ్రమలు వర్ధిల్లినవి. తన కుటీరములో కూర్చొని మధుర గానము చేయుచు చేనేత పారిశ్రామికుడు బట్టల నేసి చీనిచీనాంబరములను తయారు చేసి తన హస్తలాఘవముతో నపూర్వ కళా నైపుణ్యమును చూపెడివాడు. అంచులుకట్టి పుష్పములను, లతలను, చిలుకలను గోరువంకలను, బట్ట మీద నేసి చూపించి తన నైపుణ్యమును ప్రదర్శించెడివాడు. ఈ నేత పారిశ్రామికుని సేవకు విలువ యెక్కడ? ఈ శ్రామికుడు పడిన కష్టమునకు ఫలము కళా చాతుర్యమే. తాను పరిశ్రమకు చేయు సేవకు ఫలితము జీవన భృతితోపాటు ఆత్మానందము. తన వృత్తియందు తన్మయత్వము నొంది యితరుల నానందింప జేయుచున్నాడు. నాటి పారిశ్రామికులు యజమానులపై విప్లవము చేసియెరుగరు. తాను పడిన కష్టమునకు యితరులు మెచ్చి ఫలమొసగెడివారు. లాభము కొరకు తనసేవను అమ్ముకొనలేదు. ఇట్టిఫలరహితసేవనే సహకారోద్యమ యుద్యమ నిర్వాహకుల నుండి యకుంఠిత సేవ నపేక్షించు చున్నది. ఈ సేవ ప్రతిఫల

రహితమైనది. ఈ సేవ యందు ఆత్మోన్నతి కలదు. పర శ్రేయస్సు కలదు. సభ్యుల సేవానిరతి మీదనే యుద్యమ పురోభివృద్ధి యాధారపడి యున్నది.



## పదునొకండవ ప్రకరణము.

### ఉద్యమ పరిణామము

సహకారోద్యమము నూతన ప్రాపంచిక నిర్మాణమునకు కృషి సలుపు చున్నది. పాత పద్ధతులు నశింపు చేసి నూతన పద్ధతులపై సంఘ నిర్మాణము జేయు చున్నది. కాలము యెప్పుడు నొకే రీతిగ నుండదు. మార్పు కాలధర్మము. పగలు మారి రాత్రికి చోటిచ్చును. రాత్రి మారి పగలగును. ఋతువులు మారును. వర్షములు మారును. యుగములు మారును. మార్పే కాల లక్షణము. కాలము అనంతము. అనంత కాలములో అనంత మార్పులు. ప్రకృతిలో అనంతమైన మార్పులు. ఈ మార్పు కనబడకుండగనే వచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు మార్పు విప్లవయుతమై యుండును. దివారాత్రముల మార్పులు, వర్షముల మార్పులు, కనబడ కుండగ తరళి పోవుచుండును. అయితే ఒక్క భూకంపము వచ్చి భూమి నంతా దద్దరిల్లజేయును. ఒక్క తుపాను పట్టి ప్రళయము

కావించును. అగ్ని పర్వతములు బద్దలై భూమి దించుక పోవును. భూమి యున్న-చోట జల మయ మగును. జల మయ ప్రదేశములున్నత శిఖరాగ్రములు కావచ్చును. ఇవి కాలములోని ప్రళయమార్పులు. ఈ రీతిగనే మానవ సంఘములో కూడ మార్పులు ప్రకృతిలో ప్రళయము వలెనే వచ్చుచుండును. ఒక్కొక్కప్పుడు సున్నితముగ సాగి పోవు చుండును. ఒక్కొకప్పుడు ప్రళయ భీకర విప్లవములు చెలరేగును.

ఆరంభములో మానవ సంఘమున తికమకలై నరాజ్యాంగములులేవు. ఉదర పోషణమునకే కాలయాపన మంతయు నైపోయెడిది. కుటుంబ యజమానియే కుటుంబ రక్షకుడు. కుటుంబముల యజమానియె సంఘ రక్షకుడు. సంఘ రక్షకుడే సంఘాధిపతి. సంఘాధి పతియే రాజ్యాధికారి. అతని మాటయే శిలా శాసనము. కుటుంబములలో కుటుంబములు పోరాడుకొన్నను, ఒక జాతికి ఒక జాతికి సంఘర్షణము జరిగినను, ఓడిపోయినవారు గెలచిన వారికి ఊడిగము చేయవలసినదేను. బానిసలు కావలసిదేను. ఇదియానాటి యుగ ధర్మము. యజమానికి సేవకుడు ధనమాన ప్రాణముల నర్పింప వలసినదేను. బాని

నకు వేరే స్వాతంత్ర్యము లేదు. యజమాని బానిసను పోషించును. రక్షించును. తిండి పెట్టును. బట్ట యిచ్చును. తల దాచుకొనుటకు కొంప యిచ్చును. కాని బానిసకు స్వంత ఆస్తి లేదు. ఆస్థి యంతయును యజమానునిదే. ఇది ఆనాటి పరిపాలనా ధర్మము. ఇష్టమైన యజమాని, బానిసను విడువ వచ్చును. బానిస స్వతంత్రుడై మెలగ వచ్చును. రోమనులు గ్రీకులు, ప్రపంచకమును జయించి వేలకొలది బానిసలను పట్టుకొనిరి. ఆకాలమున నిరంకుశత్వమే పరిపాలనా విధానము. అయితే ఆకాలము తరలి పోయినది. మళ్లీ రాదు. యజమానిత్వము ప్రపంచములోనే రూపు మాసి పోయినది. అది బానిస యుగము. నిరంకుశ యుగము.

తరువాత రాజు, సామంతులు, యుగము వర్ధిల్లినది. రాజులు భుజ బలము చే రాజ్యములు సాంపాదించి సామంత రాజులకు తిరిగి దేశము లప్పగించిరి. సామంత రాజులు తమ ప్రదేశములో రాజ్యాది కారము నిరంకుశ ముగ చేయుచు రాజునకు కప్పము కట్టుదురు. యుద్ధ కాలములో సైన్యములను సరఫరా చేయుదురు. తాము కూడ ఛత్రపతి జండా క్రింద అవసరము వచ్చినపుడు

రాజరక్షణ కొరకు యుద్ధము చేయ వలయును. యజమానుని, సేవకుని పరిపాలన కంటె రాజు సామంత రాజు పరిపాలనమున, యజమానుల నుండి కొన్ని హక్కులను సామంత రాజులు సాంపాదించు కొన్నారు. సామంత రాజులను రాజు పోషించ నక్కర లేదు. ఎవరి యాస్థి వారిది. అయితే రాజు అధికారము మాత్రి మెప్పు కొనవలెను. ఈ యుగము కూడ తరలి పోయినది. దీనినే ఫ్యూడలిజమ్ అంటారు.

క్రిమంగా పల్లెలు పట్టణములు వృద్ధి అయినవి. స్థావరము లేర్పడినవి. వర్తకవ్యాపారములు హెచ్చినవి. రక్షక శ్రేణులు కావలసివచ్చినవి. డబ్బుతో సైనికులు యేర్పడిరి. పరిశ్రమలువృద్ధియగుటతో జనసామాన్యములో డబ్బుపెరిగినది. వీరు తమహక్కులకై పోరాడుటప్రారంభించిరి. వర్తకమునకురక్షణకావలసివచ్చినది. యవరెమట్టుకు వారు వర్తక రీత్యా యిండ్లు వాకిళ్ళు ఆస్థులు బ్యాంకులు, ఫ్యాక్టరీలు, కట్టుకొని వృద్ధి యయినారు. వెనుకటి యుగములో భూస్వాము లెట్టి అధికారమునకు వచ్చిరో ఆరీతిగనే వర్తక వ్యాపారముల ద్వారా పెరిగిన ధనముతో, ధన స్వాములు అధికార పదవులకు ఎగబ్రాకిరి. దీనినే ధనిక యుగ మందురు. (Captilism) యీా ధనిక యుగ

ములో యెవరి మట్టుకు వారే వర్తక వ్యాపార నిర్వహణ మున కధికారులు. ధనముతో కూలీలను నియోగించుకొని స్వలాభమునకు ప్యాక్టరీలను వృద్ధి చేసుకొనిరి. గనులు వ్యాపారము సాగించిరి. అవి యివి యననేల లాభము కొరకు యెన్నెన్నియో వ్యాపారములకు దిగిరి. విత్తం కొద్ది వైభవమన్నట్లు డబ్బున్న కొద్ది వ్యాపార విజృం భణ చేసుకొన్నారు. కూలి నిచ్చి కూలీలను కొను కొన్నారు. లాభములపై లాభములు పెంచు కొన్నారు.

ఆది కాలంలో బానిసలను పోషించు భారము యజమానునిదే. మధ్య కాలంలో బానిసలు, స్వాతం త్ర్యము సంపాదించుకొని, ఆస్తుల నేర్పరచుకొని రాజు లతో సమానముగ హోదాను అంతర్వ్యల క్రమేణ సాధించు కొన్నారు. అయితే ధనిక యుగములో నెవ రికి వారికే యధేచ్ఛ. యవరు సంపాదించుకొన్నది వారి కేను. లాభమే లక్ష్య మగుటచే యెవరి మట్టుకు వారే ధనాశా పిశాచావేశ పరులై నీతి, ధర్మము, నియమ ములు లేక ప్రపంచక మంతా తమ పొట్టకే "శ్రీరామ రక్ష" యనుచు కోటీశ్వరులగుచున్నారు. కూలి వాడు

తిన్నా తినక పోయినా యారోగ్యవంతు డైనా యనా రోగ్యవంతుడైనా తనకిచ్చే కూలికి పని చేసి చూప వలసిన దేను. పని చేయక పోతే కూలిలేదు. కూలి లేకపోతే కూడు లేదు. వ్యవసాయపు యజమానులు, మిల్లు యజమానులు ఆయా వ్యాపార యజమానులు ధనిక యుగములో నవలంభించిన పద్ధతి యిది. ఈ పద్ధతి మిఉు మిట్లు గొలుపు మాయా బజారులను సృష్టిం చినది. ధన, కనక, వస్తువాహనములు, వృద్ధి యైనవి. అయితే యివి యనుభవించేవారు కొలది మందిమా త్రిమేను. బహుజనము, కూటికి లేక, గుడ్డకు లేక, కొంప లేక యల్లాడు చున్నారు.

ఈ యార్థిక నిమ్నోన్నతములు ధనిక యుగ ఫలితములు. ఈ యుగాదర్శకములు పోటీ, లాభము. పోటీలు స్పర్ధలకు, కక్షలకు, కార్పణ్యములకు, యుద్ధము లకు, దారిచూపినవి. లాభమే సర్వ వ్యాపారములకు లక్ష్యమగుటచే తృప్తి లేక ఆత్మ నాశనము కొరకు దారి చూపు చున్నది. ధనిక వాదులే రాజ్యాధికారు లగు టచే సంఘము దారిద్ర్య దేవతకు బలియైనది. ఈ ధనిక యుగము నాశనము కాక తప్పదు. ఈ లక్ష్య

ములు మారక తప్పవు. ఈ ఆదర్శకములు నమసి పోగలవు. నూతన భావ న్ను లావిర్భ వింపవచ్చును. నూతన లక్ష్యను లాదర్శకములు కాగలవు. బానిస యుగము యెట్లు మారినదో చెప్ప గలమా? కాలగతి (ఫ్యూ డ లి జ మ్) సామంత యుగమునకు చోటిచ్చినది. సామంత యుగము మారి, ధనిక యుగమునకు చోటి చ్చినది. ధనిక యుగము మారి, నూతన యుగము నకు చోటియ్యక తప్పదు. ఈ నూతన యుగము యెట్టి ప్రళయ భయంకర రూపమున నేతెంచునో యెవ్వరు చెప్పగలరు. భూకంపమువలె నొక్క సారి మూల విరాటులతో సహా పాతపద్ధతులను కదలింప వచ్చును. ప్రచండ వాయు వేగముతో వెలువడు తుపాను వలె పాత లక్ష్యములను తుడిచి పెట్టవచ్చును. దావాగ్ని వలె సర్వము భస్మీపటలముచేసి నాశనము చేయ వచ్చును. అగ్ని పర్వతము వలె ఒక్కసారి బ్రద్దలై సాంఘిక నిమ్నోన్నతములను సరి చేయవచ్చును. కాని యెప్పటికప్పుడు ప్రకృతి సిద్ధమైన మార్పులు సంఘము నందు సంఘటిల్లు చుండును. యుగ సం ధులు మారి నపుడు ఘోర సంగ్రామములు చెల రేగు చుండును. ఒక్కొక్క సంగ్రామముతో "సహేం

ద్రి తక్షకా యస్వాహా" అను నట్లు అగ్ని గుండ ములో ఆయుగ దుష్ట శక్తులా హుతి యగుచుండును. పాత పద్ధతులు మారి నూతన పద్ధతులకు దారి చూపు చుండును. మొదటి ఐరోపా ఘోర సం గ్రామము, రెండవ ఘోర సంగ్రామము, పాత ప్రపం చపు దుష్ట శక్తులను హుతమార్చినవి.

నూతన లక్ష్యములకు నూత నాదర్శకములకు చోటిచ్చినవి. ప్రజల మనోభావములలో విప్లవము కలుగజేసినవి. ధనిక వాద సిద్ధాంతములు పోయి, సాంఘిక వాదసిద్ధాంతములు చేకెత్తినవి. ఈనూతన సిద్ధాంతముల యావిర్భావమే వి వి ధ దేశములలో పొడచూపుచున్న రాజకీయ, సాంఘింక, ఆర్ధిక, విప్లవ ములు. ఈవిప్లవములు రష్యా దేశములోను, చైనా దేశము లోను, నాశన కరమైన భూకంపము వలె, దావాగ్ని వలె, తుపానువలె, ఒక్క నిముషములో దేశము నంత టను చుట్టు ముట్టువైచి పరిపాలనా విధానములోను సాంఘిక వ్యవహారములలోను, ఆర్ధిక పద్ధతులలోను, నూతన విధానము లమలు లోనికి వచ్చినవి. భారత దేశములో మహాత్ముని నాయకత్వము క్రింద ప్రజలలో

భావ విప్లవము కలిగి నూతన సాంఘిక పరిణామము లకు, ఆర్థిక పద్ధతులకు దారి చూపు చున్నది. ఆశియా ఖండములోని, వివిధ దేశములలోని జాతులలో నూత్రన సంచలనము కలుగు చున్నది. పద్ధతులు మారు చున్నవి. ఆదర్శకములు లక్ష్యములు నూతనావిర్భా వము చెందు చున్నవి. స్పర్ధ, పోటీ, లక్ష్యములు పోయి వివిధ వ్యవహారములలో సహకార భావము వృద్ధి పొందు చున్నది. నియంతృత్వము పోయి స్వలాభ పరాయణత నశించి, సంఘ సేవకు త్యాగ లక్ష్యము యేర్పడు చున్నది. పాత లక్ష్యములు పోయి నూతనా దర్శకము లమలు లోనికి వచ్చు సరికి యింకను కొంత కాలము పట్టును. బీజము వృక్ష మగుటకు కొంత కాలము పట్టును. వృక్షము పుష్పించి ఫలభరిత మగు టకు కాల విలంబనము కాక తప్పదు. కాలమే యీ మార్పులను కలుగ జేయ వచ్చును. పరిపక్వ మయిన ఫలము తనంతట చెట్టునుండి పడునట్లు, పాము తన యొంటి నుండి కూసము విడుచునట్లు, పాత పద్ధతులు వాటంతట యవియే కాల క్రమేణ నశించి, నూతన పద్ధతు లమలులోనికి వచ్చును. ధనిక యుగము నశించి, సహకార యుగమునకు తావివ్వక తప్పదు. సహకార

యుగ భానోదయ మగుచున్నది. అరుణ కాంతులు పొడ చూపు చున్నవి. నూతనచైతన్యముతో ప్రపంచక జాతులు సహకార భావముతో కృషి సలుపుట కాయత్త మగుచున్నారు. సర్వమానవ సౌభ్రాతృత్వము నకు పునాదులు వేయ బడు చున్నవి. ఏక ప్రపంచక రాజ్యాంగ విధానమునకు సహకార పద్ధతులు సూంచిప బడుచున్నవి. వర్తక, వాణిజ్య, వ్యాపార, పద్ధతులలో పోటీ పద్ధతులకు, లాభ దృష్టి, బేరసారములకు తావు లేకుండ చేసి, సహకార విధానమును నందరు సమాన ముగ అనుభవించుట కనువగు మార్గములు యాదర్శ కము లగుచున్నవి.

కాళరాత్రి నుండి భానూదయ మగును. అమవస నిశ నుండి, పూర్ణచంద్ర కళలు, వికసించును. చీకనుటిండియే వెలుతురు వచ్చును. అంధకారము నుండియే జ్యోతులు వెలుగును. మాతృ గర్భ వేదన నుండియే యానంద జనక మయిన శిశు వుదయించును. ఆర్త నాదము నుండియే యాశా భావము కలుగును. భీభత్సము నుండియే, శాంతి ప్రసార మగును. దుఃఖము లేనిదే యానందము లేదు. కష్టము

లేనిదే సుఖము లేదు. నిరాశ నుండియే యాశ జనిం చును. నేడు ప్రపంచక మంతట ఆర్థిక, నైతిక, సాంఘిక, రాజకీయ, భీభత్సము చెలరేగి యున్నది. మూసలో కరగ బెట్టిన లోహమువలె నేడు ప్రపంచక మంతయు, నొక్క సారిగ పరితప్తమగు చున్నది. ఇదంతయు శుభశూచకము. నూతన స్వరూపముతో మానవ సంఘమావిర్భవింపగలదు. ఈ నూతన పరి ణామమే, విధానమే సహకార భావము. సహకార భానుడుదయించి, యంధకారమును పోగొట్టి తన స్వచ్ఛంద కిరణ ప్రసారములచే ప్రపంచమునకు శాంతి సుఖ సంపదలను వ్యాప్తి చేయగలదు. ప్రపంచకమీ నూతనసహకార భానూదయమునకు పరిపక్వ మగుచున్నది. ఎదురు చూచుచున్నది. తహతహలాడు చున్నది. సంసిద్ధ మగుచున్నది. ప్రపంచక మంతయు, సహకార సిద్ధాంత ముల ననుసరించి, యెట్టి పరిణామము చెందునో, భవిష్యత్తే తేల్చగలదు.

# సహాకార దృక్పథము.

ధనిక యుగములో వ్యక్తుల యాదర్శకము, ధన కాంక్ష. ధనసంపాదన కెట్టియకార్య కరణములైనను వేరు చేయవెరవలేదు. ఏ సాధనము చేతనైనను ధనమార్జించు టయే వీరి లక్ష్యము. ఈ ధన సంపాదనకొక యంతములేదు. పరిమితిలేదు. లక్షాధికారి కోటీశ్వరుడగుటకు కృషి సలుపు చున్నాడు. కోటీశ్వరుడు కోటాన కోట్లకు పడగ నెత్తుచున్నాడు. ఏ వ్యాపారము చేసినను ధన కాంక్షయే ప్రాధాన్యము. ఇదియే లక్ష్యము. ఈ ధనాఢ్యులు తమ అర్థబలముచేత ప్రజా సామాన్యమును పీల్చి పిప్పిచేయు చున్నారు. వీరే అధికారులు. ధనముతో నధికార ప్రాబల్యము సంపాదించు కొనుచున్నారు. వీరే శాశనకర్తలు. బీదవాళ్లను లోబరచుకొని, శాసనములు, శాసనసభలు, తమ యధీనము చేసుకొను చున్నారు. శాసనములు తమకు

అనుకూలముగా మార్చుకొను చున్నారు. ధనమే వీరల కిట్టి ప్రాబల్య మొసగు చున్నది. ఈ ధనమును వ్యక్తుల పరము కాకుండగ, యందరి సమష్టి సౌభాగ్యము కొఱకు, మార్చుటయే, సహకారోద్యమ లక్ష్యము. ధనసంపాదనమును సహకారోద్యమము నిషేధించలేదు. ధనార్జన ప్రోత్సహించును. అయితే యీ ధన సంపాదన యే యొక్కరి కొఱకే కాదు. అందరి ప్రయోజనము కొఱకును. ధనము సహకారోద్యమమున కుపకరణము మాత్రమే.

మేడ నెక్కుటకు మెట్లుపకరణము. నిచ్చెన ఉపకరణము. త్రాడుపకరణము. అయితే మెట్లు, నిచ్చెన త్రాడు, మేడ నెక్కుటకే ప్రయోజనము. మేడనెక్కువారు మెట్ల నుపయోగించుకొని, మేడలో సుఖముగా నుండెదరు. మెట్లను కాసిపెట్టుకొని యెవరు కూర్చొనరు. అయితే ధనికయుగములో ప్రజలలక్ష్యము, శాంతి, సుఖ, సంపదలు, గాక, ధనసంపాదనమే లక్ష్యమగుట మూలమున, శాంతి నశించినది. సుఖము పోయినది. సంపత్తులు లయమగుచున్నది.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

# వడ్డీవ్యాపారము

వడ్డీవ్యాపారమంతా, వ్యక్తిపరంగా జరుగుచున్నది. షాహుకార్లధిక వడ్డీల కప్పులిచ్చెదరు. అప్పులు కావలసినవారు వీరినాశ్రయించ వలయును. అప్పులకు వచ్చెడివారి యాతురత, కనిపెట్టి, రేపురా, మాపురా, యని, వాయిదాలు వేతురు. ఆతురతకొద్ది, సొమ్ము కావలసినవారు ధనాఢ్యుని యింటిచుట్టూ విసుగు విరామములేకుండ తిరుగుచు అతడు విధించు షరతులకు లోబడి, అప్పులను తీసుకొందురు. ఈ యప్పుల వాడకములో షరతువడ్డీలు, దండనవడ్డీలు, సంవత్సరవారీ వడ్డీలు, మాసవారీ వడ్డీలు, రోజువారీ వడ్డీలు, కూడ బిగింపవుతాయి. మొదటనోటువడ్డీలు, తరువాత తనఖావడ్డీలు, యీయప్పులు తీర్చనియెడల ఆస్తులు సంక్రమించుకొనుటతో సమాప్తి. క్రమముగా అప్పుదారులు యావత్తు నిరాస్తిపరులవడము, ఋణదాత లింకా ధనవంతులవడము, లక్షాధికారులు కోటీశ్వరులవడము యీవ్యాపారం చేయించుచున్నది. డబ్బిచేవాడే డబ్బు పుచ్చుకొనువానిపై షరతులు విధిస్తున్నాడు. డబ్బిచ్చే

వాడు అధికారి. యజమాని, డబ్బు పుచ్చుకునేవాడ తని యెదుట పేలవమయి పోతున్నాడు. తుదకు బానిస యగుచున్నాడు.

ధనాఢ్యులు పదిమంది కూడి చేసే వ్యాపారమును బ్యాంకులని యంటున్నాము. ఈ బ్యాంకుల లక్ష్యము వ్యక్తుల మోస్తరుగానే వ్యాపారములలో లాభముతీయుటతప్ప వేరు లక్ష్యము లేదు. అప్పు తీసుకొన్నవా రేమైపోయినను సరే. నిర్దాక్షిణ్యముగా వడ్డీలమీద, వడ్డీలు కట్టి యప్పుదారుని హాత మార్చుడమేపని. జాయింటుస్టాకు కంపినీల (Joint Stock company) లో వడ్డీవ్యాపారము సాంగించి లాభాలు మీద లాభములు, తమ సభ్యులకు పంచిపెట్టుదురు. కాని యన్యదృష్టి ధృక్పథము వ్యక్తిధనవంతులకు గాని బ్యాంకు భాగస్వాములకు గానిలేదు. ఈ ధనికవాద పద్ధతి నిర్మూలనము చేయడమే సహకారపరపతి వ్యాపారముయొక్క యుద్దేశ్యము. లక్ష్యము.

సహకార పరపతి సంఘములు చేయునదియు వడ్డీ వ్యాపారమే!! సభ్యులకప్పులిచ్చుటయే!!! అయితే వడ్డీ

వ్యాపారస్తుని యింటిలోని ధన మందరికి యందుబాటులో నుండదు. చెరువులోని నీరు త్రాగువారందరికి నందు బాటులో నుండునట్లుగా, సహకారబ్యాంకులోని, సొమ్ము ఫలప్రధమైన పనులకు వాడుకునే వారందరికి నందు బాటులో నుండును. చెరువులోని నీరెవరికెంత కావల యునో యంతయే వాడుకొన వలయును. చెంబుతో కావలసిన వారు చెంబెడు నీళ్ళు తీసుకొన వచ్చును. బిందెడు నీళ్ళు కావలసిన వారు బిందెతో తీసు కొన వచ్చును. ఉపయోగమును బట్టి వాడకము హెచ్చు చేసుకొన వచ్చును.

ఒక యకరము వ్యవసాయము చేసుకొను వానికి సహకార బ్యాంకులో 100-0-0 నూరు రూపాయి లప్పు దొరకును. పదియకరములు వ్యవసాయము చేయు వానికి రు 1000-0-0 లు యప్పు దొరకును. ఈ రీతిగనే ప్రయోజనమును బట్టి యాయా వ్యాపా రములు నిర్వర్తించు కొనుటకు, డబ్బు సహకార బ్యాంకులో వ్యాపారస్తులకు దొరకును. చెరువులోని నీరు యూరి లోని త్రాగు వారందరికి, సమాన హక్కు యెటుల కలదో, సహకార బ్యాంకులోని డబ్బు

యూరిలో నివసించే గ్రామస్తు లందరకు ఫలప్రదమైన పనులకు వినియోగించు కొనుట కవకాశము కలదు. ఈ ధనము వినియోగించు కొను వారెవరనగా యప్పు కావలసిన వారే!! వారేయీబ్యాంకుల నిర్వాహకులు. అప్పు దార్లప్పు కొరకు, ధనికుల యిండ్ల వద్ద, పడి కాపులు పడి యుండు నట్లు సభ్యులు సహకార సంఘముల వద్ద అప్పులు కొరకు పడికాపులు పడి యుండ నక్కరలేదు. సంఘవడ్డీషరతులుఒక్కొక్కరకు, ఒక్కొక్క విధముగా మారవు. అందరికీ నొక్కటే రేటు. సంఘ వ్యాపారము వృద్ధి యైన కొలది, వడ్డీ రేటు తగ్గు చుండును. వడ్డీ వ్యాపారములో వచ్చిన లాభ మే యొక్క రిది కాదు. ఈ లాభమున కందరు హక్కుదార్లేను. కాని యెవరి మట్టు కువారు పంచుకొని తీసుకొని వెళ్ళు టకు వీలులేదు. చెరువులోని నీటి కందరు హక్కు దార్లే యైనను, యే యొక్కరి సొత్తుకాదు. చెరువులో నీరు వాడ రాదని ఎవరిని నిషేధించరాదు. అందరు వారి వారియుపయోగముల కొరకు వాడుకొన వచ్చును. ఆరీతిగనే సహకార సంఘములలోని డబ్బు నందరు వాడుకొనవచ్చును. అయితే యెవరెవ రెంత వాడు కొన వలయునో, కొన్నికట్టు బాట్లున్నవి. ఈ కట్టు బాట్లు,

నియమములుపాటించి నపుడే సంఘ పురోభి వృద్ధి కలుగును. సంఘమాదర్శకములు నిర్వర్తింపబడును.

ధనాఢ్యులప్పుదార్లను శాసించిరి. ఇప్పుడు తారుమారైనది.

"బలవంతుడ నాకేమని పలువురతో నిగ్రహించి పలుకుట మేలా, బలవంతమైన సర్పము చలి చీమల చేత చిక్కి చావదె సుమతీ॥"

అంటే నిర్ధనులు స్వల్ప వ్యాపారస్థులు, సామాన్య గృహస్థులు, కార్మికులు, కర్షకులు, మొదలగు వారందరు నేకమై సహకార సంఘము, స్థాపించు కొని తమ యాస్త్యు పాస్తులను, యేకోన్ముఖము చేసి, సంపుటీకరణము చేసికొని స్వల్పాదాయములను గూడ బెట్టుకొని, సంఘములో నప్పులు వాడు కొనుచూ సంఘముల ద్వారా వడ్డీ వ్యాపారముసాగిస్తే ధనాఢ్యుల యొక్క డబ్బెవరికి కావాలి? వారి యిండ్లలోనే నిలువ యుండాలి. బూజు పట్టిపోవాలి. ఉపయోగించుకోవలసి వస్తే వారే యప్పు దార్లవద్దకు వచ్చి

సంఘాలలో దాచుకోవాలి. వడ్డీ షరతులు, దాచు కొనేవారు విధించుటకు వీలులేదు. సంఘమే విధించును. సంఘ పరిపాలకులే చెప్పుదురు. అక్కర లేదంటే వెళ్లిపోవలసినదేను. వారిచ్చే వడ్డి పుచ్చుకోవలసినదేను. వడ్డీ వ్యాపార పద్ధతి యీ సహకారోద్యమనులో తారు మారైపోలేదా? పల్లెటూరి బ్యాంకునుంచి రాష్ట్రీయ బ్యాంకు వరకందరు నప్పుదారులేను. ఈ వడ్డీ వ్యాపార మున కోటానుకోట్లు వ్యవహారించు చున్నారు. బీద సాదల కప్పు లిచ్చి వసూలు చేయుచున్నారు. ఫలప్రదమైన ప్రయోజనము కొరకు వడ్డీవ్యాపారము కొన సాగింపబడుచున్నది. ధనవంతులు కోట్ల కొలది ధనము నిర్భయముగా నీబ్యాంకులలో దాచుకొనుచు న్నారు. హెచ్చు వడ్డీ రేట్లు తగ్గి 6½% వడ్డీ రేటుకు మన రాష్ట్రమంతట నేడు సహకార బ్యాంకులలో ప్రజా సామా న్యమునకప్పులు దొరుకు చున్న వంటె యీ ప్రభావ మంతా సహకారోద్యమ పరపతి వ్యాపార పద్ధతి మూలముననే కదా! వడ్డీ వ్యాపార పద్ధతులలో సహ కారోద్యమ మప్పిచ్చేవారికి అప్పు పుచ్చుకునేవారికి మధ్య న యున్న పెద్ద యగాధమునకు వారధి కట్ట బడినది.

"The co-operative movement has bridged the wide gulf between the lender and the borrower" సహకారోద్యమము నందు వడ్డీ వ్యాపారము చేయబడు చున్నను లక్ష్యమువేరు. ఆదర్శకము వేరు. గమ్యస్థానమువేరు. లక్ష్యము వ్యక్తుల యభివృద్ధి. సంఘపురోభివృద్ధి. లాభమే లక్ష్యము కాదు. ఈ పరివర్తన ముద్యమ వ్యాపారములలో కలిగి నప్పుడే సహకారోద్యమము సుఫలము నీయ గలదు.

అర్ధ శతాబ్దములో భారత దేశ మంతట సహకారోద్యమము వ్యాపించి సహకార పరపతి వ్యాపారము సామాన్య రైతులకాశా జ్యోతి కల్పించు చున్నది. సహకార పరపతి వ్యాపారము బహుళ వ్యాపారముగ మారి సభ్యుని సర్వతో ముఖాభి వృద్ధికి తోడ్పడిన నూతనార్ధిక పరివర్తనము కలుగజేయు ననుట నిస్సందేహము.

వడ్డీ వ్యాపార పద్ధతిలో నిట్టి సాంఘిక పరివర్తనము కలుగజేసినపుడు వర్తకవ్యాపార పద్ధతిలోకూడా సహకార సిద్ధాంతము లెట్టి యార్ధిక పరివర్తనము కలుగ జేయ కలవో పరిశీలించ వలసి యున్నది. పండించే

వారు, తినేవారు, అను రెండు తెగలు కలవు. వీరినే యుత్పత్తి దారులు, వినియోగ దారులు, అని వ్యావహారించు చున్నారు. ధనిక యుగములో నుత్పత్తి దారులదే పై చేయి. వినియోగ దారులది క్రింది చేయి. ఉత్పత్తి వినియోగము కొరకేను. అయితే ధనిక యుగములో నుత్పత్తి లాభము కొరకు లక్ష్యముగా పెట్టుకొనుట మూలమున ననర్థము కలిగినది. ఉత్పత్తిదారులు ధన సంపాదనము కొరకు పంటలు పండించినను, వస్తువులు నిర్మాణము చేసినను, లాభము కొరకే. ఉత్పత్తి దారులచే, వినియోగ దార్ల క్షేమము పాటింప బడుట లేదు. తమ ఇచ్ఛ వచ్చిన ధరలకు వస్తువులను నిర్మాణము చేసి క్రయవిక్రయములను జరిపి ప్రజల నెత్తి కొట్టు చున్నారు. పంటలు పండినా ధరలుకిట్టు బాటుగా నుండే కొరకు పంటలు నాశనము చేసి యుత్పత్తి దారులు అక్రమపద్ధతుల నవలంభించుచున్నారు. తిండికి లేక ప్రజలు మలమల మాడు చుండగా ధరలు గిట్టు బాటుగా లేవని పంటలు నాశనము చేసే యుత్పత్తి దారులు కలరు. ఫ్యాక్టరీలలో తండోప తండములుగా వస్తువు లుత్పత్తి యగుచుండగా ధర వరల గిట్టు బాటుకొరకు వస్తు నాశనము చేసి యుత్పత్తి మాని వేసి

మార్కెట్టులో వస్తువుల అభావం కల్పించి, చీకటి బజారు పెంచి రెట్టికి రెట్టి పదిరెట్లుగ లాభములు పెంచి వర్తక వ్యాపార సరళి నంతను ధనిక వాదులు తమ వ్యక్తి లాభముల కొరకే వృద్ధి పరచుట మూలమున ప్రజా సామాన్యము హాతమారు చున్నది. కూటికి గుడ్డకు మొగము వాచుచున్నది. ధనవంతుని యొద్ద ధన మెక్కువై నకొలది వారిలో వారికి స్పర్థలు,కక్షలు,పోటీలు పెరిగి తుదకు జాతి మాత్సర్యమునకు, ఘోర సంగ్రామములకు, ప్రజానాశనమునకు, మార్గదర్శకమగుచున్నది. ఇది ధనిక యొగ వర్తక, వాణిజ్య, వ్యాపార, పద్ధతుల పరిణామము. డబ్బు పెరిగి పెరిగి నాశనమగును. " సహేంద్ర తక్షకా యస్వాహా " యనునట్లే ధనిక జాతుల ధనమంతా మర ఫిరంగులకు, ఆటం బాంబులకు సర్వనాశనమునకు తోడ్పడు చున్నది. ఇట్టి ధనిక వాద పద్ధతుల నరికట్టి నూతన లక్ష్యముతో నూతన పద్ధతులపై వర్తక, వ్యాపార, సరళి నంతయు మార్చి, సంఘములో పరివర్తనము కలుగ జేయుటయే సహకారోద్యమ లక్ష్యము. సహకార సంఘములు వర్తక, వ్యాపార, వాణిజ్య, వ్యవహారములు, ధనికవాదుల పద్ధతినే యనుకరించి వ్యవహరించుచున్నను లక్ష్య

ములు వేరు. ఆదర్శకములు వేరు. సహకారోద్యమమున నుత్పత్తి లాభము కొరకు కాక, వినియోగము కొరకు, యుపయోగపడుట లక్ష్యము. అప్పుదారులేవడ్డీ వ్యాపార మంతయు, హస్త గతము చేసికొని వ్యవహరించు చున్నట్లు వినియోగ దారులే సహకారోద్యమమున నుత్పత్తి నంతయు వశీకరణము చేసుకొనుట మహా దాశయము. సహకార దుకాణములలో కూడ సరుకులు లాభమునకే యమ్మబడును. నిలువ చేయబడును. క్రియ, విక్రయములు నిర్వహింప బడును. అయితే వినియోగదార్లే యీ యంగడుల నిర్వాహకులు. వస్తు క్రయ విక్రయములలో వచ్చెడిలాభము సంఘ సమిష్టి లాభమునకు చేర్చబడును. ఈలాభము హెచ్చిన కొలది వస్తువుల యుత్పత్తి కొరకు వినియోగమగును. పాశ్చాత్య దేశములలో యెన్నియో సహకార యం గడులు యుత్పత్తికి పూనుకొనినవి. ఫ్యాక్టరీలు నిర్మా ణము లైనవి. స్వంత స్టీమర్లు వేసుకొనినవి. మోటా ర్లు నడపించినవి. వేలకొలది యకరసులలో టీ, కాఫీ, తోటలు వేసి టీ, కాఫీల నుత్పత్తిచేయుచున్నవి. పం టలు పండించబడు చున్నవి. కోట్లకొలది రూపాయిల విలు వగల వర్తక వ్యాపార వ్యవహారములను కొనసాగింపబడు

చున్నవి. ఇందు మూలమున వర్తక వ్యాపారవ్యవహా రములలో నూతన పరివర్తన కలిగినది. ఆర్థిక విప్లవము కలుగజేయు చున్నది. వినియోగదార్లే యుత్పత్తిదా ర్లకు నేడు షరతులను విధించు చున్నారు. ఉత్పత్తి దార్లు వినియోగదార్లవద్దకు సరుకులను తెచ్చి వారు యిచ్చిన ధరలకు సరుకులనిచ్చి పోవుచున్నారు. వర్తక వ్యాపార పద్ధతు లన్నియు సహాకార విధానమున నేడు తారుమారైనవి. ఉత్పత్తి దార్ల యధికారము నశించినది. వినియోగ దార్లదే పైచేయి యైనది.

స్టోర్సు సంఘములు కలసి ఫెడరేషన్లు యయి నవి. ఫెడరేషన్లు హోలుసేల్సు యయినవి. ఈ కేంద్ర వినియోగ సంఘములు దేశ దేశములలో వ్యాప్తి గాంచి వివిధ దేశములలోని మార్కెట్టుల నాక్రమించు కొని యుత్పత్తి పదార్థములను సరళి మార్గమున విశీ కరణము చేసి, వచ్చెడి లాభము నధికోత్పత్తికి, ప్రజల సౌకర్యముల కొరకు, ప్రజల యార్థికోపపత్తికి విని యోగ పడుచున్నది. ఇందుచేత సహాకార వ్యాపార పద్ధ తులు స్పర్థలకు, కక్షలకు తావొసంగక శాంతి భద్ర తలకు దోహద మొసగు చున్నవి. సహాకారోద్యమము

పరస్పర వైరుధ్యముతో, పని చేయుచున్న, యుత్పత్తి వినియోగదార్ల మధ్య సహకార భావము పెంపొందించి, సామరస్యము చేకూర్చుచున్నది.

"The wide gulf between the producer and the consumer is bridged by co-operative movement"

ఈ రీతిగనే ధనిక యుగములో యేలేవారికి, యేలబడే వారికి మధ్యన అగాధము ప్రబలినది. పరిపాలనా విధాన మంతయు, నేలే వారే తమ హస్తగతము చేసుకొనిరి. పరిపాలనా విధాన మంతయు కేంద్రీకరింపబడి, ప్రజా సామాన్యమునకెట్టి జోక్యము లేకుండ నిర్వర్తింప బడుచున్నది. ఏలే వారికి, యేలబడేవారికి మధ్య నగాధమును, పోగొట్టుటకు, సహకారోద్యమము సర్వ విధముల కృషి సలుపు చున్నది. సహకార సంస్థల నిర్మాణ మంతయు, యేలబడే వారి హక్కులను సంరక్షించుట కొరకే నిర్దేశింప బడినది. గ్రామ పరపతి సంఘములు, గ్రామ సహకార యంగడులు సహకారోద్యమములలోని వివిధ సంస్థలాయా సంస్థల సభ్యుల వలననే పరిపాలింప బడుచున్నవి. జాతి

మత కుల భేదములు లేకుండగ సంఘములో నెల్లరు, చేర్చుకొన బడుదురు. 18 సంవత్సరములు దాటిన వారే యీ సంఘములో చేరుట కర్హులు. వయోజన వోటింగు పద్ధతి యీ యుద్యమారంభము నుండి యమ లులో నున్నది. అయితే ప్రతి యొక్కరికి నొక్క ఓటే గలదు. అధికార వర్గమనగా పాలక వర్గము. సభ్యుల ఓటుపై యీపాలకవర్గము యాధారపడి యున్నది. సంఘ నిర్మాణ మంతయు ప్రజా పరిపాలనా పద్ధతిని వయోజన వోటింగు హక్కుతో, నిర్వహింప బడు చున్నది. అధిక సంఖ్యాకుల యాభిప్రాయముతో పాలక వర్గ సభ్యులు సంఘ పరిపాలన కావించ వలెను. అధిక సంఖ్యాకుల విశ్వాసము లేనిచో పాలక వర్గము తొలగి పోవలయును. నియంతృత్వమున కీయుద్యమములో చోటు లేదు. నిరంకుశత్వమునకు తావులేదు. అధిక సంఖ్యా కుల యభిప్రాయముపై పరిపాలనా విధాన మంతయు నియమ బద్ధముగా నిర్వహింప బడ వలయును. పాల కులు, పాలితులు, నందరు నొక్కటేను. సంఘములో అధికులు, అధములు అనుభేధ భావము లేదు. ఒక్క రూ పాయిషేరుధనము చెల్లించిన సభ్యుడు యధికసంఖ్యాకుల, మన్నన బడసినచో, అధ్యక్షుడు కావచ్చును. అధిక

సంఖ్యాకుల యాదరణ లేని-చో లక్షాధికారి కూడ అధి
కారపదవి నధిష్టింప జాలడు. ఇందు మూలమున సహ
కారోద్యమమున, నధికారి, యనధికారి, మధ్యను యంత
ర్వ్యాలు, భేదభావములు లేవు. నేటి యధికారి, రేపనధికారి
కావచ్చును. నేటి యనధికార రేపధికారి కావచ్చును.
ప్రజా ప్రభుత్వ పరిపాలనా విధానములో సహకారో
ద్యమ మందరికి సమాన హక్కు, సమాన భాద్యత,
సమాన గౌరవము, ఆచరణ పూర్వకముగా నమ
ులులో పెట్టుట మూలముననే పాలక పాలితులకు సామ
రస్యము చేకూర్చు చున్నది.

" The co-operative movement has
bridged the wide gulf between the ruler
and the ruled "

ఏలేవారికి యేలబడే వారికి మధ్యమున ప్రబలిన
యగాధమునకు యీ సహకార విధానము దృఢమైన
వారధి కట్టుట మూలముగ ప్రజా సముదాయములో
నూతన రాజకీయ పరివర్తనము కలుగు చున్నది.
ఏలబడేవారి చేతులలోనే యేలేవారు నేడు చిక్కి

యున్నారు. ఆధార పడి యున్నారు. అప్పిచ్చేవారు అప్పు పుచ్చుకొనే వారిని ధనిక యుగములో బానిస లుగా చేసుకొన్నారు. పండించేవారు వినియోగించే వారిని ధనిక యుగములో నదుపులో పెట్టుకున్నారు. ఏలేవారు ధనిక యుగములో యేలబడే వారిని బాని సలుగా చేసి కొన్నారు. ఈ మూడు వర్గములలోను నేడు సహకారోద్యమము నూతన పరిణామమును కలుగ జేయు చున్నది. ఏలేవారు యేలబడే వారికి నేడధీనులు. ఉత్పత్తి చేసే వారు నేడు కొనేవారికి బద్ధులు. అప్పు పుచ్చుకొనే వారికి అప్పిచ్చేవారే నేడు లొక్కు. ఇది నేడు సహకారోద్యమము కావించిన యార్ధిక పరివర్తనము. విప్లవము. ఈ విప్లవ మురుము లతోను, మెరుపులతోను రాలేదు. సెలయేళ్ళు ప్రవ హించినట్లు, మంద మారుతము వీచినట్లు, ఆరము గ్గిన పండు నేల జారినట్లు కనబడ కుండగనే మార్పు వచ్చినది. విప్లవము జరిగి పోవుచున్నది. డోలు, సన్నాయిలతో యార్భాటములతో నీ మార్పు రాలేదు. ఈ పరివర్తనము సంఘములలో దేశములలో ప్రపం చకములో నంతటా సక్రమముగా వ్యాప్తి కావలెన న్నచో కాలము పట్టును. కొంచము నిరీక్షించ

వలెను. కృషి చేయవలెను. త్యాగ ధనులు కావలెను. సేవా తత్పరులు కావలెను. లక్ష్యమిది. గమ్యస్థాన మిది. వడ్డీ వ్యాపారము చేయుట యుద్యమ సాధనమే కాని లక్ష్యము కాదు. గమ్యస్థానము కాదు. వ్యాపార విధానములో సరకుల నమ్ముట కాదు. పరిణామము కలుగ జేయుటయే దుకాణముల నిర్వహించుటలోని యాశయము. సంఘములలో నధికార పదవుల నధిష్టించుట నిరంకుశత్వమునకు కాదు. స్వార్థ పరత్వమునకు కాదు. ప్రజా సేవకు త్యాగ లక్ష్యముతో సంఘ సేవద్వారా మానవాభ్యుదయమునకు, సహకార తత్వము చాల నిగూఢమైనది. అంతరాత్మక మైనది. ఈ తత్వముద్యమ సాధన లన్నిటిలోనంతర్వాహినిగా ప్రవహించు చున్నది. బడబాగ్ని వలె దాగి యిమిడి యున్నది. కాల గతిని పరిణామము చెందక తప్పదు. రాత్రినుండి పగ లెట్లావిర్భవించినదో యట్లు ధనిక యుగమునుంచి సహకార యుగము కనబడ కుండగనే క్రమానుగతముగ పరిణామము చెంది పరిపక్వ మగును. ఈ పరివర్తనము దూరదృష్టితో చూచే వారెల్లరకు దృగ్గోచర మగును. అంతర్ముఖముగ దృష్టి ప్రసారించే వారికి సూక్ష్మ రూపమున నన్నిట దర్శన మగును.

దివ్య దృష్టులతో నీ విశ్వరూప సందర్శనము చేయ దగును. అంతర్ముఖ బహిర్ముఖ పరిశోధనము కావించి నప్పుడే యుద్వయ విరాట్స్వరూపము సందర్శన మగును.



# సహాకారోద్యమ విరాట్ స్వరూపము

కండ్లతో చూచినప్పుడు వస్తువుల యదార్ధ స్వరూపము మనకు కనబడును. ఏయేవస్తు వెంత ప్రమాణము కలిగియున్నది, కండ్లు తెలియ జేయును. ఆకారము, రూపము, తెలుసు కునే శక్తి కండ్లకు కలదు. అయితే చిన్న వస్తువు చిన్న వస్తువుగాను, పెద్ద వస్తువు పెద్ద వస్తువుగాను, కండ్లకు కనబడును. చిన్న వస్తువుల రూపము, పెద్దదిగాజేసి, అణురూపములను దర్శించే శక్తి కంటికి లేదు. ఈసూక్ష్మ దర్శన శక్తి అణురూ పములను, చూపించే శక్తి సూక్ష్మ దర్శిని యంత్రమునకు కలదు. దీనినే "మైక్రొస్కో" పందురు. "మైక్రొస్కోపు" చిన్న వస్తువులను పెద్దస్వరూపముతో చూపించి, యంతర్గత భాగములను ప్రస్ఫుటీ కరణ చేయును. అయితే దగ్గర నున్న వస్తువులనే, పెద్దవి చేసి, యీ యంత్రము చూపించ గలదు. గాని దూరమున నున్న వస్తువుల నీయంత్రము చూపించ జాలదు. దూరదృష్టి ప్రసారము

చేసి దగ్గరకు చూపించే యంత్రము కూడ కలదు. ఈ యంత్ర సహాయముతో ఖగోళములను కూడ చూడ నగును. మిళుకు, మిణుకుమని రాత్రి కనుపించే నక్షత్రములు లీయంత్ర సహాయమున, చూచిన యడల బ్రహ్మాండ మయిన దివ్య జ్యోతులుగా కనిపించును. ఏ వస్తువునైనను పరిశోధించుటకు సూక్ష్మ దృష్టితోను, దీర్గ దృష్టి తోను, పరిశీలించ వలసి యున్నది.

సహకారోద్యమమును సూక్ష్మ దృష్టి, దీర్ఘ దృష్టి ప్రసారముతో చూచిన, మనకే యుద్యమ స్వరూపము కనబడును. యదార్ధ స్థితి గతులు తెలియనగును. ఇంత వరకు మన ముద్యమమును టెలిస్కోపిక్ వ్యూ, (Telescopic View) దీర్ఘ దృష్టి ప్రసారముననే చూచినాము. అప్పులవ్యాపారము ద్వారా ఆర్థికముగ, కష్ట జీవుల, పురోభి వృద్ధికి యుద్యమమెట్లు తోడ్పడి సాంఘిక పురోభి వృద్ధి కలుగ జేయునో, తెలిసి కొంటిమి. బీద వార లందరు చేరి, మహత్తరమైన కార్యములు సాధించుట కీయుద్యమము తోడ్పడ గలదని గ్రహించితిమి. వర్ష బిందువు లాకాశము నుండి ధారలుగ పడి, సెలపళ్ళై, జీవ నదులుగ పారు చున్నవి.

చీమలు పెట్టిన పుట్టలు మహత్తరముగ పెరిగి కొండ లంత లగుచున్నవి. పుష్పముల నుంచి, బిందువు బిందువుగా, తేనెటీగలు మకరందమును తీసుకొని, బ్రహ్మాండమైన తేనె పట్టులను పట్టి, మనకు మధువును, సంపాదించి పెట్టు చున్నవి. ఈ రీతిగనే సూక్ష్మ వస్తువుల మాహాత్మ్యమెంతేని కలదు. దూర దృష్టిలో మనకు జీవ నదియే కాన్పించును గాని, నీటి బిందువులు కనబడవు. చీమలు పెట్టిన పుట్టలు కొండలంత మనకు యెదుట కనబడునే గాని, యీ నిర్మాణములో అణిగి మణిగి యున్న యిసుక రేణువులు, మృత్కణములు, మనకు కను పించవు.

తేనె పట్టు దూర దృష్టికి కనబడునే గాని, పట్టులోని మధుకణములు మనకు కనిపించవు. ఈ అల్ప జీవరాసులు మహత్తర కార్యసాధనము చేయు చున్నవి. ఆదర్శకము చూపు చున్నవి. మక్షికములు నిరుపమాన మైన సంఘ సేవ యొనర్చు చున్నవి. వృత్తి నిర్ణయములు కావించు కొను చున్నవి. ఆయా విధులను క్రమ శిక్షణతో నిర్వర్తించు చున్నవి. స్వయం సహాయముతో ఆత్మరక్షణ చేసు కొనుచు తమ పొట్ట

పోసుకొని అందరి క్షేమము కొరకు తాము సంపా దించిన యా హారమును పొదుపు చేయు చున్నవి. పరస్పర సహాయముతో సంఘ రక్షణ కావించుకొను చున్నవి. ఒక్కొక్క తేనె పట్టు మక్షిక సామ్రాజ్య నిర్వహణ చాకచక్యము నాదర్శకముగ తెలుపును. కొన్ని తేనెటీగలు స్కౌటులుగా బయలు దేరి పుష్పా న్వేషణమునకు బయలు వెడలి పుష్ప వాటికలు సందర్శించి, యీ వార్తలను తేనె పెరలోని తోడి మధుపముల కెరిగించును. మరి కొన్ని మక్షికములు యీ వార్తాహారుల సందేసము గైకొని పుష్పములోని మకరందమును తీసుకొని పట్టులను చేర్చును. మరి కొన్ని తేనె పెరలోని గూళ్లను కట్టును. మరికొన్ని తేనె పట్టులోని గుడ్లను పోషించును. ఈ గ్రుడ్లకు వేడి తగల కుండగ సంరక్షించుటకు తమ రెక్కలతో అనుక్షణము పంకాల వలె విసరి తేనె పట్టు యొక్క శీతోష్ణ స్థితిని మార్చు చుండును. ఆయా మక్షు కములా యా విధుల నిర్వర్తించి సంఘ రక్షణము కావించు కొని, క్వీన్ బి. "Queen Bee" మక్షిక సామ్రాజ్యా ధిష్ఠాన దేవత యైన, రాణికి, తమభక్తి విశ్వాసముల చూపి ఆత్మార్పణము కావించును. ఈ

మక్షికముల సేవాపరాయణత, త్యాగ శీలత, ఆత్మ బలిదానము, సూక్ష్మముగ పరిశీలించిన మహత్తర సత్యము ను తమ స్వల్ప జీవితములో ప్రకటించు చున్నవి. తేనెటీగల ( Co-operative common wealth ) సహకార సామ్రాజ్యము నిర్వహించుట యెట్లోనిరూపించి చూపించు చున్నవి. మక్షిక సామ్రాజ్య జీవనమే సహకార సామ్రాజ్యాదర్శకము.

చెవులు లేని మక్షికములు సహకార సామ్రాజ్యమునకెట్టి ఆదర్శకము చూపుచున్నవో, కండ్లులేని చీమలు ( Co-operative republic ) అంటె ప్రజాస్వామ్య సిద్ధాంతములపై సహకార ప్రజా రాజ్యమునకు మార్గ దర్శకములగు చున్నవి. చీమలు యెట్టి కట్టడి యైకమత్యముతో చరించుచున్నవో గమనింపుడు. సంఘ సేవ కొరకెట్టి త్యాగము, ఆత్మ బలి దానము, గావించుచున్నవో పరిశోధింపుడు. సైనికుల నడకలలో పంక్తులలో, తప్పు పట్టిన పట్టవచ్చును గాని, చీమల బారు నడకలలో తప్పు పట్ట జాలము. సంఘ సమష్టి పోషణకు ఆహారము నిలువ చేసు కొనును. అందరి యొక్క క్షేమము కొరకు ప్రతి మక్షికము

బాధ్యత వహించి, స్వధర్మము నిర్వహించును. స్వధర్మ నిర్వహణము నందు అప్రమత్తతతో నుండవు. చీమల పుట్టలలోని పరిపాలనా విధానము, విధి కృత్యముల నిర్వహణము, సంఘ నిర్మాణ సౌష్టవము, సూక్ష్మ దృష్టితో పరిశీలించిన, మక్షిక సామ్రాజ్యమువలె నల్ప జంతువులతో కూడిన పిపీలికా సామ్రాజ్యము కూడ మానవ సామ్రాజ్య నిర్మాణమునకాదర్శక మగును. సహకార సామ్రాజ్య నిర్వహణమునకు, సూక్ష్మ దర్శక జ్ఞానము, దూర దర్శకత్వమునను, రెండు మార్గముల నంతర్ముఖ బహిర్ముఖముల పరిశోధించి, నిర్వాణము చేయ వలసి యున్నది. దూర దర్శకత్వముతో ఆదర్శకములను, లక్ష్యము నందుంచుకొని, కర్తవ్యములు సాధించ వలయును. ప్రతి సభ్యుడును, పిపీలికములు, మక్షికములు వలె తమ విధి కృత్యములను, సూక్ష్మ దర్శక జ్ఞానముతో ఆత్మ పరిశోధనము కావించి, తమ ధర్మ విధులను పాటించుచు, క్రమ శిక్షణకు, లోబడి, సంఘ సమిష్టి సేవకు, ఆత్మ బలిదానము కావించి నపుడే సహకార సామ్రాజ్య స్థాపన, సుస్థిర పునాదులపై నిలువబడ గలదు. ఇట్టి నియమములకు సభ్యులలవడనిదే, సంఘ లక్ష్య మేర్పడదు.

పదమూడవ ప్రకరణము.

ఏ వ్యక్తి కా వ్యక్తియే స్వలాభాపేక్షతో, సంఘ సమిష్టి జీవనమునకు తోడ్పడని యెడల, సంఘ నాశనముతో బాటు నాత్మ నాశనము కూడ కలుగును. సహకారోద్యమ సంస్థాపకు లీ లక్ష్యమునే దృక్పథము నందుంచుకొని వ్యక్తి పురోభి వృద్ధి, సంఘపురోభి వృద్ధి రెండును సమాన లక్ష్యముగా పెట్టుకొని, సహకార పతాకమున "Each for all and all for each" ప్రతిఒక్కరు అందరు కొరకును, అందరు ప్రతి ఒక్కరి క్షేమము కొరకును, కృషి సలుప వలెనని సువర్ణాక్షరములతో ప్రస్ఫుటీకరించిరి.

మహాత్ముడు సహకార సామ్రాజ్యమును కాంక్షించెను. మహాత్ముని అనుయాయియగు జవహర్ లాల్ పండితుడు సహకార సామ్రాజ్యము, భారత సామ్రాజ్య లక్ష్యముగా అడుగడుగునకు ప్రకటించు చుండెను. అయితే మ హా త్ము డు అహింసా సత్య సిద్ధాంతము లాదర్శకముగా తన జీ వి త ము లో ప్రకటించెను. సంఘము లకు బలి దాన మొసగి ఆత్మార్పణ మొనర్చు కొనెను. ఈనిష్ఠ, యీ నియమము, యీ కృషి,

యీ ఆదర్శకము, ప్రతి భారతీయుడు తాను ఆదర్శక పూర్వకముగ నాచరించి చూపినపుడే మహాత్ముడు సాధించిన భారత స్వాతంత్ర్యము, సర్వజనా దరణీయమై చిరస్థాయిగా నిలువ గలదు. మహాత్ముడు భారత జాతియ నుష్ఠింప వలసిన, సత్య ధర్మ మార్గములను నిర్మాణ కార్యక్రమ రూపమున ప్రకటించెను. ఈనిర్మాణ కార్య క్రమ మంతయు సహకార మార్గమున నడపింప యత్నించెను. లాభ కాంక్ష లేని, వ్యాపారము. పోటీ లేని వృత్తులు, సేవా పరాయణత్వముతో కూడిన కార్యాచరణ, సుస్థిర స్వాతంత్ర్య స్థాపనకు మూల కందములని యుద్ఘోషించెను.

మహాత్ముడు కేవల రాజకీయ స్వాతంత్ర్యము లను మాత్రమే కాంక్షించ లేదు. ప్రజల సర్వతో ముఖాభివృద్ధికి, ఆర్థిక, సాంఘిక, నైతిక, పురోభివృద్ధి యావశ్యకమని గ్రహించెను. ఈ సమగ్ర పురోభి వృద్ధికి యీశ్వర విశ్వాసము, ధర్మాచరణ, ప్రధానములుగ పరిగణించెను. మహాత్మునికి సత్యము కంటె వేరు దైవము లేదు. మహాత్ముని దృష్టిలో సత్యమే

ధర్మము. ధర్మమే సత్యము. సత్య సాధనము పైననే విజయ సాధన మాధారపడి యున్నదని యేనాడో మహా ఋషులు పలికిన "సత్యమేవ జయతి" యను ధర్మ మును రాజకీయ రంగమున ప్రవేశపెట్టి రాజకీయమును పవిత్ర వంతము గావించెను. వర్తక, వాణిజ్య, వ్యాపార సమస్త కార్యాచరణ రంగములందు సత్య నిష్ఠనే ప్ర తిష్ఠించెను. విజయము సాధించెను. కేవలము సభ్యుల సంఖ్యపై ఓటు బలముపై, తనకార్యాచరణ నిర్ణయిం చుకొన లేదు. ధర్మ లక్ష్యము పెట్టుకొని తాను స్వల్ప సంఖ్యాకులతో నధిక సంఖ్యాకులను తన పక్ష మునకు త్రిప్పు కొన గల నని దృఢ విశ్వాసముతో పని చేసెను. ఎందరు ప్రతి ఘటించినను, తన యాత్మ విశ్వాసమును పోగొట్టు కొనలేదు. ధర్మ పథమును విడనాడ లేదు. అర్థ బలము కంటె అంగ బలము కంటె ధర్మ బలము విజయ సిద్ధిని చేకూర్చ గల దని యడుగడుగునకు తన నైతిక ధర్మానుష్ఠానము ద్వారా శత్రు కోటికి, ఋజువు చేసెను. తాత్కా లిక లాభముల కసత్య మార్గము నెన్నడు చేపట్ట లేదు. అధర్మము, అసత్యము, అక్రమము, అన్యాయము, తాత్కాలిక విజయము చేకూర్చవచ్చును.

నిడివిమీాద నిజమే గెలువ గలదు. రావణుడు అంగబలము, అర్ధబలము కలిగి యుండియు ధర్మబలము లేనందున నశించెను. దుర్యోధనుడు పదకొండు అక్షోహిణిల సైన్యము కలిగి యుండినను కోట్ల కొలది ధన రాసుల కధిపతి యైనను ధర్మ బలము లేని కారణమున సర్వ నాశనమయ్యెను. సీజరు, చంగేస్ఖాను నెపోలియన్, కైజరు, మాస్లోని, హిట్లరు అర్ధబలము అంగ బలమంతయు సమకూర్చుకొని ప్రపంచ సామ్రాజ్య కాంక్షితులై, విజయము కాంక్షించినను, తుద కపజయమే వీరికి కలిగినది. ఇందుకు కారణము ధర్మ బలము లేకుంటడుయే.

ధనిక యుగమున వర్తక వాణిజ్య వ్యాపారములు ధర్మ యుతముగ గాక అధర్మ మార్గముల నిర్వర్తింప బడుటచే నీయపజయము కాంచినవి. సహకార పద్ధతులకు ధర్మమే మూలాధారము. అంగ బలము, అర్ధబలము, ధర్మ బలసహాయమున నడిపించుటే యద్యమ తత్వవేత్తల లక్ష్యము. అంగబలము, అర్ధబలము, దుర్వినియోగ పరుపక ధర్మబలముతో యీా యుద్యమము ప్రతిష్ఠాపించుటయే యుద్యమ ప్రతిష్ఠాపకుల యాశయము. కనుకనే

యుద్యమము వివిధ మార్గముల శాఖోప శాఖలై విస్త రిల్లు చున్నది.

సభ్యుని శీలమే, యీ యుద్యమ ప్రవేశమునకు అర్హత నిచ్చును. శీలమే గీటురాయి. శీలము లేనిదే సహకారోద్యమము లేదు. సహకారోద్యమము, సభ్యుల సంఖ్యామీదను, సభ్యుల ధనస్తోమతు మీదను నాధారపడియుండ లేదు. అర్థ బల, అంగ బలము లెప్పుడూ, యేకాలములోను, యేంసస్థలోను, పూర్ణ బలము నొసగ లేవు. ధర్మముతో కూడిన, అర్థ సంపా దనము, ధర్మముతో కూడిన సంఘ శక్తియే విజయ సాధన కాధార భూతనులు.

అందు కొరకే జర్మనీలో పరపతి యుద్యమ సంస్థాపకుడగు రైఫేసియన్ పరపతేతర వ్యాపార సంస్థాప కులగు రోకడేలు పయినీర్లు శీలము (Character) ఆదర్శ కము మీదనే తమ యుద్యమమును ప్రతిష్ఠాపించిరి. అధర్మ ప్రవృత్తులతో యుద్యమములో చేరిన సభ్యు లుద్యమ న్విరాహకులైనచో నుద్యమ వ్యాపార మడు గంటి పోవును. ఉద్యమము కూకటివ్రేళ్ళతో కూలి

పోవును. అర్ధ సంపాదన, కామ్య సాధన, మోక్ష లక్ష్యము, ధర్మము మీదనే యాధార పడి యున్నవి. ఇందు కొరకే ప్రాచీనులు, ధర్మార్ధకామ మోక్షములను, చతుర్విధ పురుషార్ధములని ప్రకటించిరి. అర్ధసాధనకు, కామ్య సాధనకు, మోక్షసాధనకు, ధర్మమే మూలాధార మని ధర్మమునకు అగ్రిస్థాన మొసగిరి. సహకారోద్యమ విజయమునకు ధర్మ సాధనయే మూలాధారము. సభ్యులు సత్య ధర్మానుష్ఠానపరులు కావలయును. సంఘ కార్యములు సత్య సంధతపై నిర్వహింప బడవలయును. ఈ పరి శీలన ముద్యమమునకు అంతర్ముఖ సాధనము. ఇది దూర దర్శక యంత్రముతో చూడ తగినది కాదు. సూక్ష్మ దర్శక యంత్ర మంతర్ముఖముగా ప్రసరింప జేసి, ప్రతి సభ్యుడు తమ ఋజువర్తనము నడుగడుకునకు పరి శీలించు కొను చుండ వలయును. ఈ సూక్ష్మ పరిశీల నమే యుద్యమమునకు బలమును శక్తి సామర్ధ్యముల నొసగును. ఏవ్యక్తి కావ్యక్తి ధర్మబల సంపన్నుడై సత్సంగముతో ప్రవర్తించిన యుద్యమము ఫలప్రదము కాగలదు. ఏ సంఘమున కాసంఘ ముత్తమ పద్ధతులపై నిర్వహింపబడిన యుద్యమము పునాది దిట్టముతో లేవగలదు. "The strength of the chain lies in

the weakest link " ఒక గొలుసు యొక్క బల మంతయు యాగొలుసులోని చిన్న కొండీల యొక్క బలముపై యధారపడి యున్నదను సత్యము బాగుగా యీ యుద్యమమునకు వర్తించును. ప్రతి సభ్యుని సత్ప్రవర్తనముపై సంఘ బలమాధారపడి యున్నది. ప్రతి సంఘముయొక్క సౌష్ఠవము మీదనే యుద్యమ బలమున్నది.

మహాత్ముడు కాంగ్రెసులో చేరెడు ప్రతిసభ్యుడు తాను భారతజాతి కంతయు నాదర్శకుడుగా నుండుటకు తన కార్య సాధనముల ద్వారా ఆచరణయందు చేసి చూపవలె నని నిర్ణయించెను. ఈ సభ్యుల ఋజువర్తనము మీదనే కాంగ్రెసు ప్రతిష్ఠ యంతయు నాధార పడి యున్న దని వ్యక్త పరచెను. సభ్యులలో ఋజువర్తనము పెంపొందించుట కనుదినము కార్యసాధన కొరకు నిర్మాణ కార్యక్రమము సమగ్రముగా ప్రతి సభ్యుడు కొనసాగించవలెనని యాదేశించెను. భారతదేశముయొక్క యార్థిక, నైతిక, సాంఘిక, రాజకీయ పురోభివృద్ధి యంతయు దీని మీదనే యాధార పడియున్నదని ప్రకటించు చుండెను. ఇవియే సాధన చతుష్టయములు. ఆర్థిక,

సాంఘిక, నైతిక, రాజకీయ, స్వాతంత్ర్య సంపాదనకు, సంపాదించిన స్వాతంత్ర్యము నిలబెట్టుకొనుటకు, నిర్మాణ కార్యక్రమమే మూలాధారమని వ్యక్త పరచెను. ఈ నిర్మాణ కార్య క్రమమంతయు సహకార సంఘముల ద్వారా సాధింపబడవచ్చును. ఈ నిర్మాణ కార్య క్రమమే సకలార్ధ సహకార సంఘములయొక్క స్వరూపము పూర్ణ వికాసము. సహకారోద్యమ సూక్ష్మ దర్శక దృష్టిని (అనగా మైక్రొస్కోపిక్ వ్యూ) సకలార్ధ సహకార సంఘముపై ప్రసరింప జేసినచో వివిధరూపముల పరిణామము కాంచనగును. నిర్మాణ కార్య క్రమము సకలార్ధ సహకార సంఘముల ద్వారా అమలులో పెట్టినయెడల నుద్యమ విశ్వరూప సందర్శన మగును. దూర దర్శక యంత్రదృష్టి ప్రసారము ద్వారా చూచినచో నుద్యమములోని యున్నతాదర్శకములు లక్ష్యములు ప్రత్యక్ష మగును. మహాత్ముడు తన జీవితములో కనిన కలలు యధార్ధములు కావలెనంటే భారతీయు లనుష్టాన పరులై సకలార్ధ సహకార సంఘముల ద్వారా నిర్మాణ కార్యక్రమము సాగించి, లోకదర్శకులై సహకార సామ్రాజ్యమునకు సుస్థిర స్థాపకులు కావలయును.

పదునాల్గవ ప్రకరణము

# సకలార్ధ సహకార సంఘములు నిర్మాణ కార్యక్రమము.

సకలార్ధ సహకార సంఘములకు మహాత్ముని నిర్మాణ కార్యక్రమమునకు సంబంధమేమని ప్రశ్నింపవచ్చును. సహకార సంఘములు ప్రపంచకములో, ఆర్ధిక, నైతిక, సాంఘిక, రాజకీయ, రంగములలో పరివర్తనము కలుగ జేయుటకు స్థాపింప బడినవి. నూతన ప్రపంచ నిర్మాణమునకు సహకారోద్యమము నవవిధానమును సూచించుచున్నది. ఈ నూతన మార్గముల నుద్యమము సర్వతో ముఖాభివృద్ధి చెందినపుడే పాత పద్ధతులు నశించి నూతన మార్గమున ప్రపంచ నిర్మాణము కాగలదు. ఈ తీరుగనే మహాత్ముడు మానవాభ్యుదయము కొఱకు అహింసా సత్య మార్గముల నూతన ప్రపంచ ప్రతిష్ఠాపన కావించుటకు, నిర్మాణ కార్య క్రమము ద్భవింప జేసెను. సహకార పద్ధతియే యుత్తమ మార్గ

మని గ్రహించెను. కాంగ్రెస్ యధినాయకులు మహా త్ముని యాదర్శకము గైకొని భారతదేశ పునర్నిర్మాణము నకు ధనికవాద పద్ధతిని సామ్యవాద పద్ధతిని వదలి, సహకార పద్ధతి యనుగమించుటకు, తీర్మానించిరి. భారతదేశ ప్రధానామాత్యుడగు జవహర్‌లాల్ పండి తుడుకూడ సహకార పద్దతియే, భారత దేశ రాజ్యాంగ విధానమున కాదర్శకమని ఖండితముగ ప్రకటించెను. ఇందు మూలమున సహకారోద్యమమునకును భారత దేశ రాజ్యాంగ విధానమునకు అవినాభావ సంబంధము కలదు.

దేశములోని ప్రస్తుత ధనికవాద విధానము మారవలెనన్న-చో, నార్థిక, నిమ్నోన్నతములు తొలగ వలెనన్న-చో, దేశ సంపత్తులందరి యందుబాటులోను సమానముగ వ్యాప్తి చేయుటకు, సహకార విధానమే యుత్తమ మార్గము. ఇందుకు భారతదేశ గ్రామసీమలు సహకార విధానము నమలు పరచుటకు తగియున్నవి. గ్రామ సీమలలో సహకార తత్వము సరియైన పద్దతుల మీద ప్రతిష్ఠాపన చేయుటకు కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమము యధా విధిగా నమలులో పెట్టుటకు సకలార్థ సహకార సంఘములన్ని విధముల తగి యున్నవి.

## పదునాల్గవ ప్రకరణము.

మహాత్ముని నిర్మాణ కార్యక్రమములో మొదటి సూత్రము:- భారత దేశ ప్రజలలో సాంఘిక సమైక్యత సమకూర్చుట:—

హిందూ మహమ్మదీయ సమ్మేళనము కలుగ జేయు సహకారోద్యమము, జాతి, మత, కుల, భేదములు పాటించదు. వివిధ జాతుల వారికి, వివిధ కులముల వారికి, సహకారోద్యమ మాశ్రియ మిచ్చినది. సహకారోద్యమమునకు, పునాదులు సకలార్థ సహకార సంఘములు. సకలార్థ సహకార సంఘములు వివిధ కులముల వారికి, వివిధ వృత్తుల వారికి, వివిధ జాతుల వారికి వివిధ మతములవారికి సమైక్యత కలుగ జేసినపుడే తమ విధికృత్యము నిర్వహించిన దగును. వివిధ దేశములలో సహకారోద్యమము సమస్త జాతుల వారికి మతముల వారికి నాశ్రియ మొసగుచున్నది. స్థానము నిచ్చుచున్నది. భారత దేశములో కూడ గ్రామ సహకార సంఘములలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, బౌద్ధులు, పారశీకులు, వీరు వారననేల సర్వ మతములవారు సభ్యులుగ జేరుచున్నారు. కుల వివక్షత పాటించుట లేదు. మహాత్ముని నిర్మాణ కార్య క్రమములో ప్రథమ నియమము జాతి, మత, కుల, సమైక్యత కొరకు కృషి సలుపుటయేను. ఇట్టి కృషి సలుపుటకు కార్య రూప

మున సిద్ధించుటకు సకలార్థ సహకార సంఘ నిబంధనలము లులో పెట్టిన నీ యాదర్శకము ఫలించును. కాంగ్రెసు అనుయాయులు సకలార్థ సహకార సంఘములలో చేరి యిట్టి జాతి మత సమైక్యతకు కృషి సలిపిన యుభయ తారకమగును.

నిర్మాణ కారకక్రమములో 2 వ నిబంధన లేక ఆదర్శకము. అస్పృశ్యతానివారణ:-

అంటు దోషము నివారించుట కాంగ్రెసుసభ్యులు నియమముగా పాటించవలెను. అస్పృశ్యతా నివారణ, కాంగ్రెసు నియమములో ప్రధానముగ పాటించ వలసినదని మహాత్ముని యుద్దేశ్యము. అస్పృశ్యతా దోషము సాంఘిక మాత్సర్యమును తెలుపును. సాంఘిక స్వాతంత్ర్యము కలుగ జేయుట సహకారాదర్శకములలో నొకటి. అస్పృశ్యతా నివారణ యాచరణ పూర్వకముగా చూపుటకు మాహాత్ముడు మాలపల్లెలో కాపురము చేసెడివాడు. మాల పిల్లను తన పెంపుడు కూతురుగా స్వీకరించెను. సహకార సంఘములో మనదేశములోవేలకొలది మాలలుసభ్యులుగా చేరియున్నారు. వీరలకు సభ్యు లందరి తోపాటు సంఘ

ములో సమాన హక్కు, సమాన గౌరవము, సమాన బాధ్యత కలదు. అస్పృశ్యతా దోషమును నివారించుటకు సంఘ మహాజన సభలలో వీరినందరు సభ్యులతోడ కలిపి కూర్చొండ బెట్టు కొనెదరు. ఈ నియమమును సహకార సంఘ నిర్వాహకులు పాటించుట మూలమునే, కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమములో నొకటియైన అస్పృశ్యతా నివారణ, సకలార్థ సహకార సంఘముల ద్వారా కావింప వచ్చును. హరిజనులకు ప్రత్యేక సంఘములు సహకారోద్యమములో ప్రతిష్ఠాపన చేసినచో నుద్యమాదర్శకమునకే భంగము కలుగును. సవర్ణులు, హరిజనులు, నేకీభూతమై సకలార్థ సహకార సంఘమును నిర్వహించుట మూలముననే కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమము ఫలప్రదమగును. సహకారోద్యమ మాదర్శకము నెరవేరును.

## 3. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో మూడవ నియమము త్రాగుడు మాన్పుట.

కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమ నియమావళిలో మద్యపాన నిషేధము మూడవ ప్రధానాంశము.

త్రాగుడు మానుట, మాన్పుట కాంగ్రెసు నియమా వళిలో యొకటి. త్రాగుడు మూలమున సామాన్య జనుల కార్థికముగ నపార నష్టము కలుగు చున్నది. నీచ గుణము లలవడు చున్నవి. ఈ దురభ్యాసము వలన దేహ దార్ఢ్యము నశించు చున్నది. పరువు ప్రతిష్ఠలడు గంటు చున్నవి. ఈ దురభ్యాసమును తొలగించుటకై మహాత్ముడు కాంగ్రెసు వాదులకు నిర్మాణ కార్య క్రమ ములో నియమము పెట్టెను. ఈ నియ మమలులో పెట్టి ప్రజా సామాన్యములో త్రాగుడు దురభ్యాసము మాన్పు టకు కాంగ్రెసు ప్రభుత్వములకు మహాత్ముడాదేశించెను. మహాత్ముని యాదేశానుసారముగ వివిధ రాష్ట్రములలో మద్య పాన నిషేధ మమలులో పెట్ట బడినది. ప్రభు త్వాదాయమునకు నష్టము కలిగినను ప్రజలలో నైతిక పరివర్తనము కలుగ జేయుటకు కాంగ్రెసు యిట్టి నియమ మును పాటించినది. సహకారోద్యమమున సభ్యులలో నైతిక పరివర్తనము కలుగజేయుటకు త్రాగుడు దురభ్యా సము సభ్యులలో మాన్పుటకు మహత్తర కృషి సలుప బడు చున్నది. వివిధ దేశములలో సహకారులు మద్య పాన నిషేధమునకు ప్రచార ప్రభోదములు సలుపు చున్నారు. సహకారోద్యమ వ్యాప్తి యైన దేశములలోని

సభ్యులు మద్యపాన నిషేధము కావించి యిందు మూల మున వచ్చిన ఆదాయమును సంఘములలో కూడ బెట్టి కొని నిలువ వేసుకొను చున్నారు. ప్రభుత్వ శాసనముల మూలమున శిక్షించెదరనిభయము చొప్పున త్రాగుడు కొందరు మానినను దొంగతనముగా, రహస్యముగా త్రాగుడు సాగుచునే యున్నది. కాని యీ త్రాగుడు దురభ్యాసము సంఘ కట్టు బాట్లవలన విశేషముగ మాన్ప వచ్చును. ప్రజలలో నైతికపరివర్తనము కల్గి త్రాగుడు దురభ్యాసము బహిరంగంముగా నిరసింపబడి, త్రాగుబోతులు సాంఘికముగ బాహి ష్కరింపబడి సంఘములో స్థానము లేకుండగ పరి భవ పాత్రులుగా చేయబడినచో, మద్యపానము తనంతట తానే యడుగంటును. సహకారోద్యమము ప్రజలలో నైతిక స్వాతంత్ర్యము కలుగ జేయుట ముఖ్యా దర్శకము. లక్ష్యము. కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమములో, మధ్యపాన నిషేధ మొకటిగాన, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమ నిర్వాహకు, లీయుద్దేశ్యమును సకలార్ధ సంఘములలో బాగుగ కృషిచేసి సంఘ సభ్యులలో నైతిక పరివర్తనము కలుగజేయుట సముచితము. ఈ కాంగ్రెసు నియమము సకలార్ధ సహకార సంఘములు పాటించి

తమ సంఘ యాదర్శకమైన నైతిక పరివర్తనము కలుగజేసి యుద్యమ ప్రతిష్ఠను పెంపొందించ వలెను.

కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమములో నాల్గవ నియమము ఖాదీ యుత్పత్తి :— 5 గృహ పరిశ్రమాభివృద్ధి

మహాత్ముడు ప్రతి సభ్యుడు నియమముగా ఖాదీ యుత్పత్తి చేయవలెనని నియమము పెట్టెను. ప్రతిసభ్యుడు కాయ కష్ట పడి పనిచేయవలెనని యీ నియమము విధించుటలో ముఖ్యోద్దేశము. ప్రతి కాంగ్రెసు సభ్యుని నియమముగా పాటించుటలో అతి సులభమైన పని నూలు తీయుటయేను. (Manual labour ) తాను కాయ కష్ట పడిపని చేయక పరులకృషి మీదనే యాధార పడి (పరభృతము) జీవించుట గర్హ్యమని మహాత్ము డుపదేశించెను. ఇందుకొరకే ఖాదీ యుత్పత్తి నిర్మాణకార్య క్రమంలో ప్రధానకార్య క్రమముగా నేర్పడినది. సహకారోద్యమము ప్రతివాడుస్వయంపోషకత్వము Salf help స్వయం కృషిపై యాధార పడి యుండవలెనని యుద్బోధించు చున్నది. ఖాదీ

నియమమును పాటించుట మూలమున సహకార సంఘ సభ్యులు స్వయం కృషి చేయుట కల వాటు పడుదురు. ఉత్పత్తి వృద్ధి యగుట మూల మున సంపత్తును వృద్ధి యగును. ఉత్పత్తియే యార్థిక పురోభివృద్ధికి మార్గము. ఖాదీ యుత్పత్తి మూలమున ప్రతి సభ్యుడును కొంత యాదాయమును గణించు కొన గలడు. ఈ యాదాయము కుటుంబ జీవన భృతిని వృద్ధి పరచును. ఖాదీ పరిశ్రమ మూలమున ప్రతి కుటుంబములోను యాదాయ మభివృద్ధియై సుఖ జీవనమునకు తోడ్పడును. మహాత్ముని నిర్మాణ కార్య క్రమోద్దేశ్యములలో ఖాదీ పరిశ్రమ కుత్తమస్థాన మిచ్చుటకు ముఖ్యోద్దేశము, బీద కుటుంబములలో ప్రతి సభ్యునికి స్వయంకృషి ప్రోత్సహించి యందుమూల మున నార్థిక పురోభివృద్ధి కలుగజేయుటయేను. సహ కారోద్యమ లక్ష్యము, ప్రజల యార్థిక పురోభి వృద్ధికలు గజేయుటసహకారులు ఖాదీ యుత్పత్తి మూలమున నాదా యమభివృద్ధి పరచుకొన వచ్చును. స్వయంపోషకత్వము చేసుకొన వచ్చును. సహకార సంఘముల ద్వారా ఖాదీ యుత్పత్తి వ్యాప్తియై వృద్ధి చెందిన దేశములో గుడ్డ కరువుండదు- దిగంబరులు కనబడరు. సహ

కారులు, కాంగ్రెసువాదులు, ఈ నిర్మాణ కార్యక్రమ ములోని ఖాదీ యుత్పత్తి నియమమును సకలార్థ సహా కార సంఘముల ద్వారా యాచరణలో పెట్టి యుత్సా హాపూర్వకముగా పనిచేసిన దేశమునకు కావలసిన బట్ట యంతయు నుత్పత్తియగుటయే గాక ప్రజాసామాన్యము యొక్క సంపత్సమృద్ధికిదోహద మొసగును.

## 5 గృహ పరిశ్రమలు

ధనిక యుగంలో కుటీర పరిశ్రమ లన్నియు నాశన మైనవి. ఫ్యాక్టరీలు వృద్ధి యైనవి. లక్ష లాది పామర జనముకు కూడు లేకుండ పోయినది ఫ్యాక్టరీలలో పనిచేయు వారలకు సుఖము లేదు. పెండ్లాము బిడ్డలను వదలి దూరదేశమునకు వెళ్లి దుఃఖ భాజనమైన జీవనము గడుప వలసి వచ్చు చున్నది. ఫ్యాక్టరీలలోని యధికోత్పత్తి వలన ఫ్యాక్టరీ దార్ల యాదాయాభివృద్ధికే శ్రామికులు తోడ్పడు చున్నారు. కాని వారల జీవనము మెరుగు బాడు గులు లేక హీనముగనే యుంటున్నది. ధనిక యుగ ములోని ఫ్యాక్టరీల యభివృద్ధి కొలది మంది

ధనాఢ్యుల యభ్యున్నతికే తోడ్పడు చున్నది. కాని యధిక సంఖ్యాకుల యారోగ్యైశ్వర్యములకు తోడ్పడుటలేదు. ఎవని వృత్తివాడు చేసికొని పోటీలేని సుఖ జీవనము చేయవలెనంటే గృహ పరిశ్రమముల వృద్ధి మూలముననే యిది సాధ్యము కాగలదు. ఆర్థిక నిమ్నోన్నతములకు, కొలది మంది చేతుల లోనే ధనము కేంద్రీకరింపబడుటకు, నీధనిక యుగమున ఫ్యాక్టరీ పద్ధతి యరిష్టదాయకముగా పని చేసినదని మహాత్ముడుద్ఘాటించెను. జన సామాన్యమునకు సుఖ సంపదలు సరిసమానవ్యాప్తి యగుటకు గృహ పరిశ్రమముల మూలముననే, కలుగునని ప్రకటించెను. చైనా దేశీయులు, జపాను దండయాత్ర మూలమున సర్వ నాశనమైన తమ పరిశ్రమల నూరూర, గృహాపరిశ్రమలను సహకార సంఘముల ద్వారా వృద్ధి చేసికొని తమ దేశ సంపత్తును నిలబెట్టుకొనిరి. గృహ పరిశ్రమలు వృద్ధియై యార్థిక పునర్నిర్మాణమునకు నూతన దృక్పథము కలుగ జేయును. సహకార పద్ధతిపై గృహాపరిశ్రమలు స్వల్ప పెట్టుబడులతో వృద్ధి కాగలవు. అసంఖ్యాకమగు జన సామాన్యమునకు వృత్తి పోషణ నొసగ గలవు. తమ

యింటిలో తాము కూర్చొని, కుటుంబ మంతయు కలసి పనిచేసి, కుటీర పరిశ్రమలద్వారా సుఖ జీవనము చేయ వచ్చును. స్పర్థలు, పోటీలు, యిందుండవు. ఉత్పత్తి యంతయు స్థానిక వినియోగము కొరకే యుపయోగ పడును. గృహ పరిశ్రమలు పెంపొందించుట సహకారోద్యమ లక్ష్యము. కాంగ్రెసు వాదుల యాదర్శకము. నిర్మాణ కార్య క్రమ విధులలో నొకటి యగు గృహ పరిశ్రమలు సకలార్థ సహకార సంఘముల ద్వారా సాధింప తగినవి. అమలులో పెట్టి పనిచేయుటకు మహదవకాశము కలదు. సహకారులు, కాంగ్రెసు వాదులు, సకలార్థ సహకార సంఘముల ద్వారా యీలక్ష్యమునుగృహ పరిశ్రమలను వృద్ధి పొందించ నగును.

## 6. గ్రామ పారిశుద్ధ్యము :—

మహాత్ముని నిర్మాణ కార్యక్రమములో గ్రామ పారిశుద్ధ్యమునకై కృషి సలుపుట కాంగ్రెసు కార్యకర్తల నియమావళిలో నొకటి. గ్రామీణులయారోగ్యము, జీవిత ప్రమాణము, గ్రామ పారిశుద్ధ్యముపై యాధా

రపడి యున్నవి. ప్రతి వ్యక్తియు శుచి శుభ్రతములను పాటించినచో, నారోగ్యము చెడదు. పెంటలతోను కుప్పలతోను, యశుచి పదార్థములతోను, నిండి యుండిన గ్రామము నివాస యోగ్యముకాదు. గ్రామములు వాస యోగ్యములుగా చేసుకొనుటకు ప్రతి గృహస్థుడును శుచి శుభ్రతలను పాటించ వలయును. అప్పుడే గ్రామ పారి శుద్ధ్యము కలుగును. కాంగ్రెసు కార్యకర్తలు గ్రామ స్థలలో శుచి శుభ్రతలను పెంపొందించుటకు కృషి సలు పవలెనని మహాత్ముడు ఆదేశించెను. తాను సేవా గ్రామములో ఆదర్శకముగా చూపెను. పాకీ పని కూడ చేసెను. సహకార సంఘ నిర్వాహకులు కూడ గ్రామ సమగ్ర పురోభి వృద్ధికి గ్రామ పారిశుద్ధ్యము నభి వృద్ధి పఱచ వలసి యున్నది. ఇందు కొరకు సంఘ నియ మములలో సాముదాయక ప్రయోజన విధినుండి గ్రామ పారిశుద్ధ్యమునకై ధనము వినియోగింప వలసినదని నిబంధనలు కలవు. గ్రామ పారిశుద్ధ్యమునకై కృషి సలుపుట సహకార నిర్వాహకులకు, కాంగ్రెసు వాదులకు, సమాన లక్ష్యమేను. ఈ విధిని నిర్వర్తించుటలో సకలార్థ సహకార సంఘము లెంతయో కృషి సలిపి మహాత్ముని నిర్మాణ కార్య క్రమమునకు తోడ్పడవచ్చును.

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

## 7. ఆధునిక విధానమున విద్యావ్యాప్తి.

### Basic Eduction

మహాత్ముడు కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమము నూతన విధానమున విద్యావ్యాప్తి ప్రజాసముదాయములో గావించ వలసినదని నిర్ణయించెను. ఆధునిక విద్యార్థులు యక్షరాభ్యాసము చేసినది మొదలు ఏదియోయొక కుటీర పరిశ్రమయందు తరిఫీదై యాపరిశ్రమముద్వారా యాదాయ సంపాదించి స్వయం పోషకత్వము కలిగి యుండవలెనని మహాత్ముని యుద్దేశ్యము. నేటి విద్య గుమాస్తాలుగా తయారగుటకే యుపయోగ పడుచున్నది. వృత్తుల నిర్వహణమునకు కాయకష్టపడి పనిచేయుట కుపయోగ పడుట లేదు. దేశములో ప్రజ లందరు పాత విద్యా విధానమున గుమాస్తాలుగా తయారై నచో నుద్యోగములు లభించుట దుర్లభమగును. వృత్తులు లేక నేడెందరో యల్లాడు చున్నారు. విద్యా వంతులు కూడ నిరుద్యోగులగు చున్నారు. వృత్తిపోషణ ప్రాధాన్యముగ నూతన విద్యా విధానము వ్యాప్తి కావలె నని

మహాత్ముని యాశయము. ఇట్టి విద్యావ్యాప్తికి కాంగ్రెసు కార్యకర్తలు కృషిసలుప వలసినదిగా మహాత్ముఁడాదేసించెను. సహకార సంఘముల యుద్దేశ్యము కూడ ప్రతి వ్యక్తియు స్వయం పోషకత్వము కలిగి యుండవలెనని నిర్వహింప బడినది. సభ్యుడు స్వయం పోషకత్వముకలిగి యుండుటకు విద్యా విహీనుఁడైనచో నెక్కువ ప్రయోజన కారి కాఁడు. విద్యా వ్యాసంగము సభ్యునికి వస్తు పరిజ్ఞానము వృద్ధి చేయును. చక్కటి పద్ధతు లవగాహన చేసికొని, కృషి సలుపుట కర్హత యేర్పడును. సహకార సంఘములో చదువుకున్న వారికి కలిగిన యవకాశములు, చదువుకొనని వారికి లేవు. సంఘ నిర్వహణ విషయములో చదువుకొన్న వారు బాగుగ శ్రద్ధ తీసుకొని వ్యవహరింప వచ్చును. సహకార సంఘ ప్రతిష్ఠాపకులగు రైఫేసియన్, రోకడేలు పయినీర్లు, తమ సంఘ నియమావళిలో సద్విద్యా వ్యాప్తి సభ్యులలో కలుగజేయుట, యర్హవిధియని స్పష్టీకరించిరి. నూతన విధానమున విద్యా వ్యాప్తి చేయుటకు సహకార సంఘములు పూనుకొనుట యుచితము. అవశ్య కర్తవ్యము. సకలార్థ సహకార సంఘములు తమ సభ్యులలో నూతన విధా

నమున విద్యా వ్యాప్తి కలుగజేయుట కెంతయు తగి యున్నది. ప్రజలలో సద్విద్యా వ్యాప్తి కలుగ జేయుట యీ సంఘముల యత్యావశ్యకృత్యము. ఈ విధానములో కూడ సహకార సంఘములు కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమమునకు తోడ్పడి దేశములో సద్విద్యా వ్యాప్తికి దోహద మొసగ వలయును.

## 8. వయోజన విద్యా వ్యాప్తి

ప్రజా సామాన్యములో నిరక్షరాస్యులు హెచ్చుగ నున్నారు. భారత దేశములో 100 కి 92 మందికి చదువుట వ్రాయుటరాదు. ఎనమండుగురు మాత్రమే అక్షరాస్యులు. ప్రజాసామాన్యములో నార్థిక, నైతిక, సాంఘిక, రాజకీయ, పురోభి వృద్ధి కలుగ జేయు టకువిద్య ముఖ్యావశ్యకము. బాలురకు విద్య గరపి నంత మాత్రమున సంతృప్తి పడకూడదు. పల్లెటూళ్ళలో నివసించు రైతాంగము బడులలో చిన్నతనము నందు కొద్దిగా చదువను వ్రాయను నేర్చుకొన్నను, తగిన విద్యా వృద్ధి చేసుకొనుటకు నవకాశములు లేవు. ఈ కొలది చదువుకొన్న వారుకూడా యితర వ్యాపా

రములలో నిమగ్నులై యుండుట వలన చదువుకొన్న నాలుగక్షరములు కూడా మరచి పోయి నిరక్షరాస్యు లగుచున్నారు. చదువుకొనే యా శక్తి కలవారలకు పల్లె టూళ్ళలో యెట్టి యవకాశములు లేవు. అందుచే మహాత్ముడు వయోజన విద్యావ్యాప్తి కావించవలెనని నిర్మాణ కార్య క్రమములో విధించెను. ఇట్టి విద్యా వ్యాప్తి పెద్దలలో కలుగ జేయుటకు రాత్రి పాఠశాలలు నెలకొల్ప బడవలెను. పత్రికా పఠనము ప్రోత్సహింప బడ వలయును. గ్రంథాలయములవ్యాప్తి ద్వారా విజ్ఞాన వ్యాప్తి కావింపబడ వలయును. రేడియోలు, సినీమాలు ద్వారా, సులభముగ వయోజన విద్యావ్యాప్తి జేయ బడ వలయును. సహకార సంఘములు వివిధ దేశములలో వయోజన విద్యావ్యాప్తికి రాత్రి పాఠ శాలలు నెల కొల్పినవి. వేసవి పాఠశాలలు నిర్వ హించు చున్నవి. పత్రికా పఠనము వ్యాప్తి చేయ బడు చున్నది. పుస్తక భాండాగారములు నెలకొల్ప బడు చున్నవి. సినీమాల ద్వారా విద్యాప్రసంగములు ప్రోత్సహింప బడుచున్నవి. రేడియోల ద్వారా విజ్ఞాన వ్యాప్తి ప్రోత్సహింప బడుచున్నది. ఇవి వయోజనులలో విజ్ఞాన వ్యాప్తికి యాధునిక పద్ధతులు. ప్రాచీన కాల

పూలో భారత దేశమున ప్రజాసామాన్యములో విజ్ఞాన వ్యాప్తి బహు విధముల చేసెడివారు. చదువను, వ్రాయను, ప్రజాసామాన్యమునకు చేతకాకపోయినను భారత దేశములో ప్రజా సామాన్యములో నెంతయేని విజ్ఞానము వర్ధిల్లు చుండెడిదని యానిబిశెంటు విదూషీ మణి యెన్ని సార్లో వ్యక్తపరచెను. విజ్ఞాన వ్యాప్తి ప్రజలలో శీలము ఋజువర్తనము, న్యాయాన్యాయ వివక్షత, సత్యసంధత, సత్కార్యాను ష్టానము, పెంపొం దించుట కొరకుద్దేశింప బడినది. ఇట్టి విజ్ఞానము భారతదేశములో ప్రజాసామాన్యమునకు హరికథా కాలక్షే పములు, పురాణ శ్రవణములు, ఆటలు, పాటలు, భజనలు, ప్రార్థనలు, తోలుబొమ్మలు గొల్ల సుద్దులు,బుర్రకథలు, మూలమున వివిధ జాతు లలో, నుత్తమ సంస్కృతి వెదజల్లెడివారు. ఇవి యానాటి వయోజన విద్యావ్యాప్తికి కావించిన యేర్పాట్లు. ఆధునిక కాలమున సభలు యుపన్యాసములు, సినీమా ప్రదర్శనములు, వస్తు ప్రదర్శనములు, రేడియో ప్రసంగ ములు, ద్వారా వయోజన విద్యావ్యాప్తి కలుగ జేయవచ్చును. వివిధ దేశములలోని సహకారులు వివిధ మార్గముల వయోజన విద్యావ్యాప్తికై లక్షల

కొలది ద్రవ్యము వినియోగించు చున్నారు. సకలార్థ సహకార సంఘము లిట్టి కార్య నిర్వహణము గావించుటకు సమర్థములై యున్నవి. కాంగ్రెసు కార్యకర్తలు సహకార సంఘ నిర్వాహకులును, సకలార్థ సహకార సంఘములద్వారా కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమములో చెప్పబడిన యీనియమమును పాటించి ప్రజాసముదాయము వయోజన విద్యావ్యాప్తి కలుగజేసిన సహకార పురోభి వృద్ధికి కాంగ్రెసు ప్రతిష్టకు నెంతయేని తోడ్పడ గలరు.

## 9. స్త్రీ జనోద్ధరణ

మహాత్ముడు నిర్మాణ కార్యక్రమములో స్త్రీజనోద్ధరణకై కాంగ్రెసు కార్యకర్తలు కృషిసలుప వలసినదని యొక నియమము విధించెను. పురుషులు వివిధ రంగములో పాల్గొని యున్నత స్థానముల నాక్రమించు కొని యున్నారు. భారత దేశములో స్త్రీలకు ప్రాచీన కాలమునుండి పురుషునితో సమానముగ సంఘములలో స్వత్వతగలదు. అయితే కాలక్రమమున స్త్రీలలో విద్య నశించి, హీనస్థితిలో పడిపోయినారు. జనాభాలో

సాధారణముగ ప్రతి దేశములోను పురుషుల కంటె స్త్రీలే హెచ్చుగా కనబడెదరు. స్త్రీ పురుషులకు సంఘములో సమాన హక్కు, సమాన గౌరవము, సమాన ప్రతిష్ఠ యుండవలెనని మహాత్ముని యాశయము. వివిధ కార్యరంగములలో స్త్రీలు కూడ పాల్గొని దేశాభ్యుదయమునకు తోడ్పడ వలెనన్న స్త్రీలకు పురుషులతో పాటు సమాన హక్కులు సమాన బాధ్యతలు, వుండ వలెను. ఇట్లు గౌరవము, స్త్రీ జాతికి కలుగజేసి నప్పుడే దేశాభ్యుదయము కలుగును. దేశసంపత్తి కలుగును. ఇందుకొరకే మహాత్ముడు కార్యకర్తల కీ నియమము విధించెను. సహకారోద్యమము స్త్రీ పురుష భేదము పాటించదు. 18 సం॥ములు వయస్సు వచ్చిన స్త్రీ పురుషులెల్లరు సంఘములో మెంబరుగా చేర్చుకొన బడుదురు. పురుషులతో పాటు స్త్రీలు సంఘ నిర్వాహకలు కావచ్చు. పాశ్చాత్య దేశములలో నెన్నియో సహకార యంగడులు స్త్రీలచే నిర్వహింపబడు చున్నవి. కార్య నిర్వాహక వర్గమున స్త్రీలుకూడ సభ్యులుగా చేర్చుకొన బడు చున్నారు. సభలలో పాల్గొను చున్నారు. సహకారోద్యమము స్త్రీలలో నూతన చైతన్యము కలుగ జేసినది. స్వయంపోష

కర్తవ్యమునకు తోడ్పడినది. ఆర్థిక బలము చేకూర్చినది. అయితే భారత దేశములో నింకా స్త్రీలలో సహకారోద్యమ వ్యాప్తి కాలేదు. స్త్రీలకు ప్రత్యేక సహకార సంఘములు, పట్టణములలో నెలకొల్పబడు చున్నవి. ఇట్టి ప్రత్యేక సంఘములు పల్లెలలో నెలకొల్పుట సాధ్యముకాదు. అవసరము కూడ లేదు. సకలార్థ సహకార సంఘములలో చాలమంది స్త్రీలను చేర్చుకొనుట మూలముగా గృహ పరి శ్రమాభి వృద్ధికి వలయు నార్థిక సహాయము చేయుట యత్యావశ్యకము. మంచి పశువులను కొని వీరలకిచ్చి పాలయుత్పత్తి వృద్ధి చేయించవచ్చును. పాలు, వెన్న, పెరుగు, జున్ను, నెయ్యి వ్యాపార, మెంతయైనను స్త్రీల సహాయముతో సకలార్థ సహకార సంఘముల ద్వారా వృద్ధి పరుప వచ్చును. గృహ పరిశ్రమలు వృద్ధి బొందింప వచ్చును. స్త్రీలకు, ఆర్థిక, సహాయము కలుగ జేసిన ఆర్థిక స్వాతంత్ర్యము, దానితోపాటు సాంఘిక రాజకీయ పురోభివృద్ధి కలుగును. సంఘసేవకు చాలమంది, స్త్రీలిందు మూలమున, పురుషులతోపాటు, సహాయ పడ గలరు. కాంగ్రెసు కార్య విధానములో, స్త్రీల పురోభివృద్ధి, సక్రమముగ, సకలార్థ సహకార సంఘముల ద్వారా వ్యాప్తి

చేసి, కృషి సలిపిన వీరిలో నూతన చైతన్యము కలుగ గలదు. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమము స్త్రీలతోడ్పాటుతో దిగ్విజయముగా కలుగ గలదు. సహకారోద్యమము కూడ వివేకవంతురాండ్రగు స్త్రీలచే నభ్యున్నతి కాంచ గలదు. ఈ కార్యక్రమము కూడ సకలార్ధ సహకార సంఘము లమలులో పెట్టి పనిచేయుట కెంతేని యవకాశ మున్నది.

## 10. ఆరోగ్య విధులు పారిశుద్ధ్య విధుల గురుంచి విజ్ఞాన వ్యాప్తి చేయుట :—

మహాత్ముడు కాంగ్రెసు నిర్మాణ కార్య క్రిమములో నారోగ్య విధులు, పారిశుద్ధ్య విధులను గురించి, విజ్ఞానము వెదజల్ల వలసినదిగా, నిర్మాణ కార్య క్రిమములో నొక విధి యేర్పాటు చేసెను. జబ్బు వచ్చిన తర్వాత మందు పుచ్చుకొని నివారణ చేసికొనుట కంటె, జబ్బు రాకుండగనే యారోగ్య విధులను పాటించి, పారిశుద్ధ్య నియమముల ననుసరించిన, ప్రిజ లారోగ్యవంతులుగా నుండ గలరని మహాత్ముని యాశయము. సబర్మతీ యాశ్రిమములోను, సేవా గ్రామములోను, మహాత్ముడు

శుచి శుభ్రతలను ఆహార విహార నియమములను, ఆరోగ్య విధులను, తాను స్వయముగ పాటించి, యాశ్రమ వాసులచేత, నిత్యము నియమ పూర్వకముగా, ననుష్ఠానము నందు పెట్టించెడి వాడు. గృహములను, పరిశుభ్రపరిచెడి వాడు. వీధులను తుడిచెడివాడు. పాకీదొడ్లను స్వయముగ పరిశుభ్ర పరచెడి వాడు. ఇతరులచే చేయించెడి వాడు. ఇది నికృష్ట కార్యముగ నెంచ గూడదని యుద్బోధించెడి వాడు. ఇట్లు శౌచ విధులను, ఆరోగ్య మార్గములను నవలంభించుట చేతనే గ్రామము లంటు వ్యాధులకు గురికాక ప్రజల యారోగ్య మభివృద్ధి కాగలదని, నిర్మాణ కార్యక్రమ ప్రణాళికలో నిర్దేశించెను.

ఈవిధి నాచరణలో పెట్టించుట సహాకారోద్యమో ద్దేశ్యములలో నొకటి. ప్రతి సహాకార సంఘ నిబంధనలలో నావశ్యకముగా నీ నియమ ముండవలసినదేను. ఇందు మూలమున ప్రజా సామాన్యములో నారోగ్యము పెంపొంది ప్రజలు కాయ కష్టపడి కృషి చేయుట కర్హులుగ నుందురు. జబ్బు వచ్చిన తర్వాత రోగము కుదుర్చు కొనుట కంటె రోగము రాకుండగనే కాపాడు కొనుట శ్రేయస్కరము. మహాత్ముని యాదేశాను

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

సారము కాంగ్రెసు కార్య కర్తలు సకలార్ధ సహకార సంఘముల ద్వారా యీ నియమా వళిని యమలులో పెట్టి కృషి సలిపిన దేశమారోగ్యవంతము కాగలదు.

## 11. రాష్ట్రి భాషా వ్యాప్తి. 12. మాతృ భాషా వ్యాప్తి

మహాత్ముని నిర్మాణ కార్యక్రిమ విధులలో రాష్ట్రి భాషా వ్యాప్తి, మాతృ భాషా వ్యాప్తి, కాంగ్రెసు కార్య కర్తలు పాటింప వలసినదని నిర్ణయించెను. కాంగ్రెసు మహా సభవారు రాజ్యాంగ ప్రిజా పరిషత్తులో హిందీ భాషను రాష్ట్రిభాషగా పరిగణించిరి. హిందూదేశమంతట రాజకీయ భాషగ నిది నిర్ణయింప బడినందున ప్రజలెల్లరీ భాషా జ్ఞానము కలిగి యుండిన గాని రాజకీయ వ్యవహా రములు, వర్తక, వాణిజ్య, వ్యాపారములు, స్వయ ముగ, సక్రిమముగ, నిర్వహించు కొనజాలరు. వివిధ రాష్ట్రిములలోని ప్రిజలతో వ్యాపార సంబంధ బాంధ వ్యములేర్పాటు చేసుకొనుటకు బ్రిటీషు పరిపాలనా కాల మున ఇంగ్లీషు భాష రాష్ట్రిభాషగా నుండెడిది. ఇంగ్లీషు భాష ద్వారా వ్యవహారములు నడిచెడివి. బ్రిటీషు పరి పాలన మంత మొందినది. స్వపరిపాలనము వచ్చినది. భారత దేశము బహు జనులు వాడెడి భాష హిందీ

భాష. అందుచే వివిధ రాష్ట్ర ప్రజల వ్యవహార నిర్వహణమునకు రాష్ట్ర భాష యైన హిందీ భాష వ్యాప్తి చేయుట కాంగ్రెసు కార్యకర్తల విధి. సహకార సంఘములు కూడ, దేశకాల పరిస్థితులను బట్టి, దేశమున కనుగుణ్యముగా రాష్ట్రభాషా జ్ఞానము సహకారులలవాటు చేసుకొనుటావశ్యకము.

మాతృభాషా జ్ఞానమాయా దేశ భాషల ద్వారా వ్యాప్తి యగుటకు సహకారులు కాంగ్రెసు కార్యకర్తలకు తోడ్పడ వలెను. ఈ విషయమున గూడ సకలార్థ సహకార సంఘములు కృషిసలిపిన సభ్యులలో మాతృ భాషా జ్ఞానము వృద్ధియైసంఘ వ్యవహారముల నెక్కువగా పాల్గొనుట కవకాశముండును. ఇప్పుడు సంఘముల చేరిన సభ్యులలో 100కి 92 మంది నిరక్షరాస్యులేను. వ్రేలిముద్ర వేయువారేను. సంఘ వ్యవహారము లెల్లరు తెలుసు కొనుటకు మాతృ భాషాజ్ఞాన వ్యాప్తి యత్యావశ్యకము. ఈమాతృ భాషాజ్ఞాన వ్యాప్తికి, రాష్ట్ర భాషా జ్ఞాన వ్యాప్తికిని సకలార్థ సహకార సంఘులు కృషి చేసి నీయుద్యమ పురోభి వృద్ధి కెంతయు శ్రేయోదాయకము.

# ప్రజలలో ఆర్థిక సమానత్వము కొఱకు కృషి సలుపుట:—

మహాత్ముని నిర్మాణ కార్య క్రమములో ప్రజలలో, నార్థిక సమానత్వము కొరకు కృషి సలుపుట యొక నియమము. ఇది కాంగ్రెసు వారెల్లరు ముఖ్యముగా పాటించ వలసినది. ప్రజా సంఘములో నేడు ఆర్థిక నిమ్నోన్నతములు హెచ్చుగ నున్నవి. ఇందు మూలమున ప్రజా సము దాయములో చాలా యన ర్థములు కలుగుచున్నవి. కోటీశ్వరులు, కూటికి లేనవాళ్లు, ధనవంతులు, దరిద్రులు, సంఘములో నేడు రెండు భాగములుగా ప్రత్యేకముగ కనబడు చున్నారు. ధనవంతులింకను, ధనవంతు లగుటకును, దరిద్రు లింకను దరిద్రులుగా దిగిపోవుటకును, ప్రస్తుత కాలమున నవలంభింపబడుచున్న యార్థిక విధానమే కారణము. ఎవరికి వారే పోటీ పద్ధతిని సంపాదనకు దిగుటచేత, ధనస్తోమతు కలవారి కనగా అర్థ బలము

కలిగిన వారికి, జనస్తోమతు కలవారికి, అనగా అంగ బలము కలవారికి నాదాయాభివృద్ధి చేసుకొనుట కవ కాశములున్నవి.ఏ వ్యక్తి కావ్యక్తి స్వప్రయోజనముకొరకు స్వార్థమే లక్ష్యముగా పెట్టుకొని, కృషి సలుపుట మూల మున యౌన్నత్యమును; ఐశ్వర్యము ననుభవించుట కవకాశములు కలుగు చున్నవి. పోటీకి నిలువ లేని వారు అధఃపతితులగుట తప్ప వేరు గత్యంతరము లేదు. ఇందు మూలముననే బీద వారింకను కృంగి పోవుచున్నారు. ధనవంతులింకను ధనవంతులగుచున్నారు. ధనవంతులు వృద్ధియగుటకు మూలకారణ మితరుల దగ్గర నుంచియెక్కువధనము తామా కర్షించుటయే కారణము. ఒకచోటధనము నిలువయైనచో కొందరివద్ద ధనాభావమేర్ప డును. ధనాభావముకలిగిన చోటదైన్యము కలుగకతప్పదు. ప్రపంచములో నిట్టి ధనాభావము ధనిక యుగమున నేడవలంభించున్న యార్థిక విధానమున కలిగినది. వాతా వరణములో నొక్కొక్కప్పు డొక్కొక్కచోట గాలి యభావముగ నుండును. గుండము లేర్పడును. ఈ యభావము గలిగినచోట తప్పక తుపాను చెలరేగును. ఇది ప్రకృతిలో మనము చూచు నైసర్గికపు మార్పులు. ఈ రీతిగనే సంఘములో కూడ ధనాభావ మేర్పడి

నపుడు విప్లవములకు కారణ భూతమగును. అం దుచే నార్థిక వేత్తలు సాంఘిక తత్వ వేత్తలు, నైతిక పురోగాములు, సంఘములో నిట్టి ధనాభావము కలు గకుండగ, యుండుటకు కృషి సలుపుదురు. వెంటనే యీ నిమ్నోన్నతములు సరి చేయని-చో, విప్లవమే శరణ్యము కాక తప్పదు.

సహకారోద్యమ మార్థిక నిమ్నోన్నతములను సరిచేయుటకే ప్రారంభింప బడినది. వర్తక, వాణిజ్య వ్యాపారములలో, వ్యవసాయ పరిశ్రమలలో, కూలీ లనుపెట్టి పనిచేయించి లాభ మంతయు నొక్కరే యనుభ వించుటకు నాయత్త పడుట మూలమున జనసామాన్య ములో దారిద్ర్యమునకు -చో టేర్పడినది. సహకార వ్యాపారములో నే యొక్కరును లాభమంతయు తీసు కొనుట కవకాశము లేదు. డిపోజిట్టుదార్లకు వడ్డీరేటు తగ్గింప బడు చున్నది. వస్తు క్రియ విక్రియములలో లాభము ఖర్చులు పోను నూటికి $6\frac{1}{4}$ కు మించి, హెచ్చు తీసు కొనుట కవకాశము లేకుండగ చేయబడినది. కేపిటలిస్టు విధానమున అవసరమును బట్టి వస్తువుల యభా వము, కలుగజేసి, పరిమితి లేకుండగ లాభములను దోచు

కోవడమేను. ఇందు మూలమున ప్రపంచమంతయు నేడార్థిక కల్లోలములకు గురియైనది. విప్లవములు చెల రేగు చున్నవి. అమెరికా ఖండము నేడు ధనసంపత్తులతో తులతూగు చున్నది. ఏషియాఖండము దారిద్ర్యముతో కుృంగి పోవుచున్నది. యుద్ధములచే యూరోపా ఖండ ములో ద్రవ్య నాశన మైనది. ఈ నాశన మైన దేశములలో నార్థికాభివృద్ధి కలుగ జేయుట కమెరికా లోని ధనవంతులు, ప్రభుత్వములు, మార్షలు విధానమున కోట్లకొలది డాలర్లు వెద జల్లు చున్నారు. అయితే పైనుంచి డాలర్లు యెన్ని విసరి కొట్టినను నిలుచుటలేదు. తూట్లు పడిన బంతిలో గాలి యెంత కొట్టిన లాభమేమి? ప్రతి దేశము స్వయం పోషకను కావలయును. ప్రతిజాతి స్వయం పోషకత్వము కావాలి. ప్రతి కుటుంబము స్వయం పోషకము కావాలి. ప్రతి వక్తి స్వయం పోషకత్వము కలిగి యుండ వలెను. ధనిక యగములో నెవరికి వారే యమునా తీరే యనునట్లు యెవరికి వారే లాభ పరాయణులగుట మూలమున తోడి వారేమై పోయినా, ఆలన పాలనా లేకుండా పోయినది.

ప్రాచీన భారత దేశములో సమిష్టి కుటుంబములు వృద్ధిగ నుండెడివి. కుటుంబములో నందరి పోషణ

సమానముగ నుండెడిది. ఈ రీతిగనే గ్రామములు స్వయం పోషకత్వము కలిగి యుండెడివి. వృత్తి పోష ణాలో స్పర్ధలు లేవు. పోటీలు లేవు. ఎవరి పోషణ వారు చేసుకొని సుఖజీవనము జేసు కొనెడివారు. అంద రికి ఒంటినిండ బట్ట, తినుటకు తిండి, నివసించుట కిల్లు యవకాశముండెడిది. నేడు ఒకరు పంచ పక్ష పర మాన్నములతో విందారగించెదరు. మరి కొందరకు గంజి కూటికి కూడ ఆస్కారము లేదు. ఒకరు యేడం తస్థుల మేడపై విహరించెదరు. మరియొకరు కొంప మీద యాకులులేక సూర్య చంద్రాదులను యింటి లోనే కట్టివేసు కొందురు. ఒకరు ధన, కనక, వస్తు వాహనములతో, చీని చీనాంబరములతో, విర్రవీగు చుందురు. మరియొకరు చింకి గుడ్డలతో, కూటికి గుడ్డకు మొగమువాచి యల్లాడుచుందురు. ఇవి నేటిదనిక యుగమున పడేపాట్లు. ఇట్టి యార్ధిక నిమ్నోన్నత ములు లేకుండగ జేయుట కందరకు సరిసమానమైన యార్ధి కోత్పత్తి కలుగ జేయుటకు సహకార విధానమే శరణ్యము. లాభ మంతయు సంఘముదేను. వ్యక్తులు స్వయం కృషి చేసుకొని స్వయం పోషకత్వము కలిగి యుండ వలెను. సహకార విధానమున కోటీశ్వరులగు

టకు వీలులేదు. దరిద్రులుగ నుండుటకు వీలులేదు. మహాత్ముడు యంత్ర పరిశ్రమను నాశనముచేసి, కుటీర పరిశ్రమలకు స్థాన మొసిగవలెనని చేసిన యుద్బోధనము వలన కలుగు ఫలితము సర్వ జనులకు వృత్తి యేర్పడి ధనము సర్వ వ్యాపకమగుట కేను. ఇదియే సహాకారోద్యమ లక్ష్యముకూడా.

దేశమున నేడు మూడు పిశాచములా వహించి, ప్రజలను పీల్చి పిప్పి చేయుచున్నవి. ఈ మూడు పిశాచములు, అప్పు, అజ్ఞానము, అనారోగ్యము. ఈ పిశాచములను పారగొట్టవలెనన్న సహకా రార్థిక విధానమే శరణ్యము. సకలార్థ సహకార సంఘముల ద్వారా యార్థిక విధానము నమలులో పెట్టిన దైన్య స్థితి నుండి ప్రజా సామాన్యమును తొలగింప వచ్చును. పెట్టు బడుల నిచ్చి వృత్తి పోషణ చేయ వచ్చును. గృహ పరిశ్రమలు పెంపొందింప వచ్చును. వివిధ మార్గముల నాదాయాభి వృద్ధి కలుగ జేయవచ్చును. కాంగ్రెసు నిర్మాణ కార్య క్రమములో ప్రధాన సూత్ర మైన యార్థిక సమానత్వము కలుగ జేయుట సకలార్థ సహాకార సంఘముల కృషి మూలముననే సిద్ధించును.

కాంగ్రెసు నిర్మాణ కార్య కర్తలు మహాత్ముని యార్థి కవిధానము నమలులో పెట్టిన-చో దరిద్ర నారాయణ సేవ చేసీ, సంఘము నుద్ధరింప వచ్చును. మహాత్ము డంగవస్త్రము కట్టుకొని, ప్రాసాదములను వదలి, పూరి కొంపలలో నివసించి, జీవిత యాత్ర గడిపిన యీ యాంద ర్శకము కోరకేను. యంత్రములను వదలి, రాట్నా చక్రమును చేతబట్టి, నూలు తీయుటలో గల గొప్ప తనము నూతనార్థిక విధానము నమలులో పెట్టుట కోరకేను. మహాత్ముడు పట్టణములను, రాజ ప్రాసాదములను వదలి, పల్లెటూళ్లలో నాశ్రమవాసి యగుటకు కారణము, నూతన నార్థిక విధానము నమలులో పెట్టుట కోరకేను. నూతననార్థిక విధాన మనగా సంపత్తు ను, సౌభాగ్యమును విసర్జింపమనికాదు. సంపత్తులు, నన్న పానీయములు నందరు సమానముగ ననుభవింప వలెనని యుద్దేశ్యము. ఇట్లు సమానముగ ననుభవించుటకు ధనికవాద పద్దతి ననుసరించిన, యార్థిక విధానములో నిమ్నోన్నతములు కలుగక తప్పవు. ఈ విధాన మంతరింప వలెను. సకలార్థ సహకార సంఘములు గ్రామసీమలలో నీ నూతన నార్థిక విధానము అమయిలో పెట్టి కృషి సలిపిన గ్రామ సీమలు

ఐశ్వర్య వంతములు కాగలవు. అజ్ఞానముపోయి, విజ్ఞానము వ్యాప్తి కాగలదు. అనారోగ్యము నశించి యారోగ్యము వృద్ధిల్ల గలదు. ఈనూతనార్ధిక విధానము సహకారోద్యమము ద్వారా అమలులో పెట్టినప్పుడే సర్వేజనాః సుఖినో భవంతు కాగలరు. మహాత్ముని యభీష్టము నెరవేరకలదు. ప్రపంచక శాంతి, లోక కల్యాణము చేకూరకలదు.

# ఆలమూరు ప్రాంతమున సహకార ప్రారంభము.

## మొదటి ప్రకరణము

ఆలమూరు ప్రాంతమున సహకార ప్రారంభము 1918 సం॥ర ప్రాంతమునుండి వ్యాప్తి చేయబడినది. 1918 సం॥లో ఆలమూరుగ్రామ సహకార పరపతి సంఘము రిజిష్టరు కాబడినది. అప్పటికి రామచద్రపురం తాలూకాలో సెంట్రల్ బ్యాంకు లేదు. స్థానిక కో-ఆపరేటివ్ యూనియన్ లేదు. పెద్దాపురం లోకల్ కో-ఆపరేటివ్ యూనియన్ పెద్దాపురం, రామచంద్రపురం తాలూకాలకు వ్యవహరింప బడుచుండెను. తూర్పు గోదావరిమండలమున కంతకును గ్రామసహకార సంఘములకు ఋణములనిచ్చుటకు కాకినాడ సహకార సెంట్రల్ బ్యాంకు వ్యవహరించు చుండెడిది. 1904 సం॥ కో-ఆపరేటివ్ శాసనము కావింపబడి అమలులో పెట్టబడిన ప్పటికి గ్రామాదులలో సహకార సంఘములు విరివిగా వ్యాప్తించలేదు. సకృతుగా అక్కడక్కడ గ్రామ సహకారసంఘములు వెలసినవి. 1904 సం॥రం మొదలు 1920 సం॥రం వరకు మదరాసు

రాష్ట్రములో సహకారోద్యమము రెవెన్యూ బోర్డువారి పరిపాలన క్రింద అనుభవజ్ఞులగు రాష్ట్రీయ సహకార రిజిష్ట్రార్లచే వ్యాప్తి కావింపబడినది. 1914 మొదలు 1918 వరకు జరిగిన మొదటి ఐరోపా సంగ్రామానంతరము ప్రజలలో నూతన చైతన్యము కలిగినది. రాజకీయ సంస్కరణములకు ఆందోళనము బయలు దేరినది. తిలక్, ఆనిబిసెంటమ్మ గార్లచే హోమ్‌రూల్ వుద్యమము దేశమంతట వ్యాప్తికావింప బడినది. రాజకీయ ఆందోళనా ఫలితముగ రాష్ట్రములలో ద్వంద్వ ప్రభుత్వవిధానము అమలులో పెట్టబడినది. ఈ ద్వంద్వ పరిపాలనా విధానములో దేశీయ మంత్రులకు రాష్ట్రి పరిపాలనా విధానములో కొన్ని ప్రభుత్వశాఖల పరి పాలనము అధీనము చేయ బడినది. అంతకుపూర్వము గవర్నరునకు సలహాదారుగా ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లే రాష్ట్ర పరిపాలనా విధానమంతయు చూచెడివారు. అప్పుడు సహకారోద్యమము రాష్ట్రములో ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ల పరిపాలనాధీనములో నుండెడిది. 1920 సం॥నుంచి సహకారశాఖ దేశీయ మంత్రుల యధీన మైనది. ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్ల అధీనములో అనగా 1904—20 వరకు తెల్లదొరలు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లుగా నుండె

డివారు. వీరిక్రింద అనుభవజ్ఞులగు రెవిన్యూవున్నతోద్యోగులు రాష్ట్రీయ సహకార రిజిష్ట్రార్లుగా పనిచేసిరి. సర్. పి. రాజగోపాలాచారిగారు మొదటి రాష్ట్రీయ సహకారరిజిష్ట్రారు. వీరు జిల్లాకలెక్టరుగా పనిచేసి రాష్ట్రములో పరిపాలనా నిర్వాహణమునందు సమర్థులని ప్రఖ్యాతిగాంచిరి. వీరు దాక్షిణాత్యులు. వీరు అరవ జిల్లాలలో గ్రామసీమలకు వెడలి ప్రజలతో ముఖాముఖిని సంప్రదించి సహకార సంఘముల నిర్వాహణ బాధ్యతలను, బాగా ప్రచార ప్రబోధములు గావించి, మంచి వాతావరణము కల-చోట్ల, సమర్థులగు దేశసేవా పరాయణులు గల -చోట్ల, సహకార సంఘములను నెలకొల్పి వాటి పురోభి వృద్ధికై సర్వ విధముల తోడ్పడెడివారు. వీరి తరువాత దివాన్ బహదూర్ శ్రీ. ఆర్. రామచంద్రరావుగారు రెండవ రిజిష్ట్రారుగా నియమింప బడిరి. వీరును కలెక్టరు శ్రేణిలో చేరిన రెవిన్యూ వుద్యోగస్థులేను. గొప్ప దేశాభిమానులు. ప్రజాసేవకులు. వీరి హయాములో వుద్యమము ప్రతిష్ఠా వంతమై క్రొత్త పోకడలు కల్గినది. ప్రథమ రిజిష్ట్రారు హయాములో 1904 సహకార శాసనము ప్రకారము గ్రామ సహకార సంఘములు మాత్రమే నెలకొల్ప బడినవి. వీటికి కావలసిన డబ్బు స్థానిక డిపా

జిల్లాపై మాత్రమే ఆధార పడవలసి యుండెను. 1912 సం॥లో సహకార శాసనము సంస్కరింప బడినది. గ్రామ సంఘములను పోషించుటకు ప్రచార ప్రబోధములు సల్పుటకు, కేంద్రి సంస్థలు నిర్మాణము చేయుటకవకాశము నూతన శాసనము కలుగ జేసినది. గ్రామ సంఘములకు పెట్టుబడి పెట్టుటకు కేంద్ర మద్రాస్ రాష్ట్రీయ బ్యాంకు స్థాపింప బడినది. క్రమముగా కేంద్రి జిల్లా బ్యాంకులు వెలసినవి. సంఘముల నిర్మాణ నిర్వహణముల తోడ్పడుటకు స్థానిక సహకార యూనియనులు యేర్పాటు చేయబడినవి. సహకార సంఘములు వివిధ జిల్లాలలో వ్యాప్తి చేయుటకు యూనియనులు యేర్పాటు చేయబడినవి. సహకార సంఘములు వివిధ జిల్లాలలో వ్యాప్తి చేయుటకు యూనియనులు, సెంట్రిల్ బ్యాంకులు, స్థాపించుటకు రెండవ రిజిష్ట్రారుగా పనిచేసిన శ్రీ. ఆర్. రామచంద్రిరావుగారు తీవ్రికృషి సల్పిరి. వీరును తమిళ సోదరులేను. పిమ్మట మూడవ రిజిష్ట్రారుగా శ్రీ. సామి కన్నుపిళ్ళైగారు నియమింపబడిరి. వీరును జిల్లా కలెక్టరు శ్రేణిలో చేరినవారే. కొంత కాలము వీరు తూర్పు గోదావరి జిల్లా కలెక్టరుగా పనిచేసిరి. గొప్ప మేధావులు. గణిత శాస్త్రజ్ఞులు.

నూరు సంవత్సరముల పంచాంగమును గుణించిపెట్టినజ్యోతి ష్కులు. వీరు రిజిస్ట్రారుగా నుండు కాలములో నుద్యమము క్రమముగా పల్లెటూళ్ళకు పాకుటప్రారంభ మైనది. వీరి తరువాత నాల్గవ రిజిస్ట్రారుగా రావు బహాదూర్ వేదాచల అయ్యరుగారు వచ్చిరి. 1904 మొదలు 1920 వరకు యీనల్గురు హైందవ సహకార రిజిస్ట్రార్లు వీరి హయాంలో సకారోద్యమము గ్రామ సీమలలో చక్కగా వ్యాప్తి కావించిరి. వివిధ మండలములలో యీ పదహారు సంవత్సరములలోను దాదాపు రెండువేల సహకార సంఘములు మాత్రము రిజిష్టరు కాబడినవి. సుస్థిరములైన పునాదులు వేయబడినవి. బహు తాపీగా వుద్యమము ప్రజా సముదాయములో వ్యాప్తి కావింప బడినది. రిజిష్ట్రారులే స్వయముగా సంఘ వ్యవహారములు పరిశీలించి బాగోగులు కనుగొనెడివారు. వీరు సమర్థులగు దేశ సేవా పరాయణులను సంఘములలో చేరి వుద్యమసేవ చేయుటకు అధికముగ ప్రోత్సహించెడివారు. ఇందు మూలమున సహకారోద్యమమున ఆనాడు సంఘసేవా తత్పరులు చాలమంది ముందుకు వచ్చి సంఘసేవ యొనర్చెడివారు. ఉత్తమ శ్రేణికి చెందిన గౌరవోద్యోగులు

చాలమంది వుద్యమసేవ చేయుట మూలముననే ప్రథమ దశలో యీ యుద్యమము మంచి పటుత్వముగా నడుప బడినది. స్వార్థపరులు, స్వలాభ పరాయణులు, సంఘ ముల దరి జేరెడివారుకారు. ఇది రాష్ట్రములో సహ కారోద్యమ బాల్యదశ.

ప్రథమ ఐరోపా సంగ్రామానంతరము దేశములో విశేష ఆర్థిక పరిణామము చెందినది. ధరవరులు పెరిగి నవి. భూముల క్రియములు హెచ్చినది. వర్తక వ్యాపార సరళికి ధనము యెక్కువ కావలసివచ్చినది. డబ్బు చలామణి హెచ్చైనది. వడ్డీ వ్యాపారము సర్వ విధముల పెరిగినది. ఈతరుణములో సహకారోద్య మము ద్వారా రైతాంగమునకు పెట్టుబడులు పెట్టి తోడ్పడుటకు రాష్ట్రీయ మంత్రులు యెక్కువ జోక్యము కలుగ జేసుకొని సహకార సంఘ వ్యాప్తికి దోహద మొనర్చిరి. ద్వంద్వ పరిపాలనా విధానములో సహకారోద్యమ పరిపాలనా విధానము తారుమారైనది. ఉద్యమ ప్రారంభదశలో దొరలు ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్లుగా నుండెడివారు. రిజిష్ట్రార్లు మనదేశీయు లుండెడివారు. ద్వంద్వ పరిపాలనా విధాన

మములులోనికి వచ్చుసరికి మంత్రులు మనవారు. రిజిస్ట్రార్లు తెల్లదొరలు. ఐ. సి. యస్ ఆఫీసర్లు వచ్చిరి. మిస్సర్సు. హెమింగువే, గ్రే, హుడ్, స్ట్రాత్రీ, ఆస్టిన్ యీ ఐదుగురు తెల్లదొరలు, ఒకరితరువాత నొకరు రిజిస్ట్రార్లుగా ద్వంద్వ పరిపాలనావిధాన మములులో నున్నంత కాలము యించుమించు పదిహేను సంవత్సరములు రిజిస్ట్రార్లుగా నుండిరి. మనదేశీయులు రిజిస్ట్రార్లుగా నుండునపుడు వీరికి ప్రజలతో ఎక్కువ అనుబంధముండి, రెవెన్యూ శాఖలో ఆరితేరినవారగుటకు మూలమున మంచి చెడ్డలను స్వయముగా చూచుకొని సంఘములను జాగ్రత్తగాపరిశీలన చేసి తాపీగా రిజిష్టరు చేసి నడిపించెడివారు. అందుచే ఒడుదుడుకులు లేక వుద్యమము పునాది కట్టుదిట్టముతో బాగాపని చేసినది. మొదటి రిజిష్ట్రార్లు నల్గురు అరవ సోదరులే అగుటచే వుద్యమము అరవదేశములో ఆంధ్రదేశ ములో కంటె బహుళవ్యాప్తిగాంచినది. తరువాత వచ్చిన ఐ.సి. యస్.రిజిష్ట్రార్లు కాగితములమీాద సంఘముల సంఖ్య జిల్లాల వారీగా వృద్ధిపరచిరి. ఉద్యోగులసంఖ్య హెచ్చైనది. మొదటవచ్చిన అసిస్టెంటు రిజిష్ట్రార్లందరు డిప్యూటీకలెక్టరు గ్రేడువారు. వీరు తమరెవెన్యూ శాఖ లలోఅనుభవము పురస్కరించుకొని జిల్లాలలో గ్రామ

సహకార సంఘముల సంఖ్య బాగుగా వృద్ధిపరచిరి. రెండవ దశలో వుద్యమములోని సహకార సంఘముల సంఖ్య రెండు వేలనుంచి పదిహేను వేలకు పెరిగినది. సహకార శాఖో ద్యోగుల సంఖ్య విస్తారము పెరిగినది. డిప్యూటీరిజిస్ట్రార్లు సబురిజిస్ట్రార్లు,సీనియరు ఇన్స్పెక్టర్లు, జూనియరు యినస్పెక్టర్లు సిబ్బందీ వృద్ధియైనది. ఆడిటర్ల సంఖ్య పెరిగినది. సంఘ ములలోయిచ్చిపుచ్చుకొను వడ్డీవ్యాపారము 1920_1930 వరకు విస్ధారము పెరిగిపోయినది. కోట్ల కొలదిరూపాయలు బ్యాంకులద్వారా చలామణియైనది. రైతు అడిగినదే తడువుగా అప్పు పుట్టినది. గ్రామ సంఘముల వ్యాపా రము వేలు దాటినది. సెంట్రల్ బ్యాంకుల వ్యాపారము లక్షలు దాటినది. రాష్ట్రీయ బ్యాంకుల వ్యాపారము కోట్లైయినది. యూనియనులు తణిఖీచాలక పులిమీద పుట్ర అన్నట్లు యూనియనులపై ఫెడరేషనులు సృష్టింప బడినవి. డబ్బు బాగా చలామణియగుట మూలమున దేశములో ద్రవ్యోబళంబనము వృద్ధియై యెన్ని సంస్థలను పోషించుటకైనను సమర్ధముగా నుండెను. సహకార పరపతి వుద్యమము అంతరువులపై అంతరువులు కట్టబడి గాలిమేడలాగున పెరిగిపోయినది.

ఇంతలో ఆర్థిక మాంద్యము ప్రపంచకమంతను చుట్టిముట్టి వేసినది. పంట దినుసుల ధరవరులు పడి పోయినవి. భూమిధరలు కృంగిపోయినవి. బ్యాంకుల లో వాయిదా మీరిన బకాయీలు వృద్ధియైనవి. ఇచ్చి పుచ్చుకొను వ్యాపారము స్థంభించినవి. బకాయి వసూళ్ళకై సెంట్రల్ బ్యాంకులు సంఘములపై ఒత్తిడి కావించినవి. సంఘములు మెంబర్లపై చర్యలు జరిపినవి. జప్తులు, వారంటులు అమలు పెట్టడంతో సంఘ వ్యవహారములు అరికట్టినవి. కొన్ని సంఘములు యెత్తి వేయబడినవి.

1930 మొదలు 1940 వరకు ఆర్థిక మాంద్యము ఒక దశపాటు రైతు లోకమును పీల్చి పిప్పి చేయుటచే సహకార సంఘములు నిళ్ళు కారజొచ్చినవి. సంఘ వ్యాపారము సన్నగిలుటచే ఆర్థిక స్థోమతులేక ఫెడరేషనులు యెత్తివేయ బడినవి. యూనియనులు పనిలేక నామమాత్రావసిష్టముగ చేయబడినవి. సూపరు వైజర్లు బ్యాంకు అధీనము చేయబడిరి. రాష్ట్రమంతట ఒకే తీరున పరపతి వుద్యమ మంతయు అల్లకల్లోల మైనది. చిన్నగ్రామ సంఘములు యీచుక పోయినవి.

పెద్ద గ్రామ సంఘములు తాత్కాలికముగా వ్యాపారము స్థభించిపోయి తీతువుకాళ్ళ లాగున సన్నగిలి పోయినవి. 1928 సం॥రం నాటికే టౌన్ షెండ్ కమిటీవారు ఆర్థిక సుడిగుండములో సహకార పరపతి వుద్యమము పడుచున్నట్లు వాస్తవిక పరిస్థితులు గ్రహించిరి. 1938 సం॥రంలో ప్రభుత్వము వారిచే నియోగింపబడిన విజయ రాఘవాచారి కమిటీవారు ఏనుగ లాగున ఎత్తడి పోయిన యీ సహకార వుద్యమమును పునరుద్ధరించుటకు అమూల్యమైన సలహాల నిచ్చిరి. సహకార పరపతి వుద్యమమునకు గ్రామ సంఘములే పునాది రాళ్ళని వీరు గట్టిగా విశ్వశించిరి. ఈ గ్రామ పరపతి సంఘముల కట్టుదిట్టము చేయుటకు వీరు చిన్న సంఘములను కలిపివేసి పెద్ద సంఘములను దృడపరచ వలెనని దృఢపరచిరి. పర్మితిలేని పూచీపద్ధతి అమాయకులగు ప్రజానీకమును మోసపరచుటకు మార్గ మగుచున్నదని గ్రహించి నూతన సంఘములను పరిమితిగల పూచీ సంఘములుగనే వ్యాప్తి కావింప సలహా నొసగిరి. రైతు అక్కరలకు అన్ని విధముల తోడ్పడుటకు గ్రామ సంఘములు సకలార్థ సహకార సంఘములుగా

మారవలె నని విజయరాఘవా చారి కమిటీవారు ప్రకటించిరి.

సహకారోద్యమ భావిపరిణామములు గూర్చి ఆర్థిక మాంద్యము నుండి సహకార సంఘములను లేవనెత్తుటకు యీ తరుణములో రిజర్వు బ్యాంకువారు సలహాపూర్వకముగా నెన్నియో కర పత్రములను ప్రకటించిరి. గ్రామ సహకార సంఘములు పటిష్ఠవంతముగా పనిచేయుటకు, కేవలము అప్పులుయిచ్చి పుచ్చుకొనుటతో సంతృప్తిపడక సభ్యులకు కావలసిన సరకులు సంవత్సరము పొడుగున సప్లై చేయవలయు ననియు రైతు పండించిన పంటలు సంఘములద్వారా క్రయ విక్రియములు చేయవలయు ననియు, సభ్యుల సర్వతోముఖాభివృద్ధికి, గ్రామోద్ధరణకు గ్రామ సహకార సంఘములు సకలార్థ సహకార సంఘములుగా పనిచేయవలయునని శంఖారవము చేయుచుండిరి.

ఆలమూరు పరిసర ప్రాంతములలో 1920 – 1930 వరకు 30 సహకార సంఘములు వెలసినవి. 10 లక్షల వ్యాపారము వృద్ధియైనది. సంఘముల తనిఖీ

చేయుటకు ఆలమూరు యూనియను 4 వేల రూపా
యల సూపరు విజన్ ఫండ్‌తో నల్లురు సూపరువైజ
ర్లతో అత్యుత్సాహముగా పనిచేసినది. సంఘములకు
కావలసిన ద్రవ్యము రామచంద్రపురం సెంట్రల్
బ్యాంకువారు సరఫరా చేయుచుండిరి. అయితే 1930
నుంచి 1938 వరకు సంఘముల పరిస్థితులు చూచిన
రాష్ట్రములోని యితర సంఘములు వలెనే ఆర్థిక మాం
ద్యము వలన రైతులు వాయిదాలు కట్టలేక బకా
యిపడుటవలన సంఘవ్యాపారము నీళ్ళుకార జొచ్చినది.
10 లక్షల రూపాయలనుండి లక్షవరకు సంఘముల
వ్యాపారము పడిపోయినది. యూనియను సూపరు
విజన్ ఫండు 4 వేలనుంచి 4 వందలకు దిగిపో
యినది. ఇట్టి ఆర్థిక దైన్యస్థితినుండి సంఘముల
లేవనెత్తుటకు ఆలమూరు చుట్టు ప్రక్కలనుండు
సహకారులు నూతన పతకము నొకదానిని తయారు చేసి
క్రొత్త సహకార సంఘమును రిజిష్టరు చేయవలసినదిగా
1938 సం॥లో కాంగ్రెసు మంత్రివర్గము వారికి సమ
ర్పించిరి. కాంగ్రెస్ మంత్రివర్గమువారిలో ఆనాడు
గౌరవనీయులగు వి. వి. గిరిగారు సహకార శాఖా
మాత్యులు. వీరు యీనూతన సంఘ నిబంధనలు

సాకల్యముగా పరిశీలించి అప్పుడు సహకార రిజిస్ట్రారుగా పనిచేయుచున్న ఆస్టిన్ దొరగార్కి ఆలమూరు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంకును రిజిష్టరు చేయవలసినదిగా సలహా నొసంగిరి. శ్రీ ఆస్టిన్ దొరగారు, జాయింటు రిజిస్ట్రారగు గిరియప్పగారు ఆలమూరు గ్రామపరిసర ప్రాంతములలోని 12 గ్రామములు చేర్చి పర్మితిగల పూచీపైన సకలార్ధ సహకార సంఘముగా ఆలమూరు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంకు అనే నామకరణముతో రిజిష్టరు చేయుటకు అనుమతించిరి. 1-2-1938 సం॥రం తేదీని రాజమండ్రి సర్కిల్ డిప్యూటీ రిజిస్ట్రారగు శ్రీ హృదయస్వామిగారు యీసంఘమును రిజిష్టరు చేసిరి. రెవెన్యూ శాఖామాత్యులగు ఆనరబుల్ శ్రీ టి. ప్రకాశం పంతులుగారు 27-2-1938 తేదీని బ్యాంకు ప్రారంభోత్సవము కావించిరి. ఆనాటి సభకు తూర్పు గోదావరిజిల్లా కలెక్టరు శ్రీ కుద్వాగారు అధ్యక్షత వహించిరి. పరిసర గ్రామముల నుంచి చాలమంది సహకారులు విచ్చేసి వుత్సవమున పాల్గొనిరి. శ్రీ ప్రకాశం పంతులుగారు యిట్టి రూరల్ బ్యాంకులు దేశమంతట వెలసి కార్మిక కర్షకుల అభ్యున్నతికి తోడ్పడవలసినదిగా ఆశీర్వదించిరి.

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

### సంఘ విస్తీర్ణప్రదేశములో చేరిన గ్రామములు జనాభా, పొలముల విస్తీర్ణము.

| గ్రామము | జనాభా | పొలములవిస్తీర్ణము య. | సెం. |
|---|---|---|---|
| (1) ఆలమూరు | 4,669 | 2778_ | 57 |
| (2) తాతపూడి | 1,514 | 1649_ | 71 |
| (3) చింతలూరు | 1,716 | 1249_ | 50 |
| (4) అంగర | 4,023 | 2292_ | 75 |
| (5) పెదపళ్ళ | 1,921 | 691_ | 48 |
| (6) జొన్నాడ | 5,332 | 3036_ | 07 |
| (7) మండపేట | 13,101 | 5347_ | 70 |
| (8) కల్వచర్ల | 767 | 470_ | 03 |
| (9) పెనికేరు | 1,663 | 1015_ | 34 |
| (10) వెదురుమూడి | 947 | 747_ | 83 |
| (11) నవాబుపేట | 1,302 | 483_ | 19 |
| (12) పడమరఖండ్రిక | 1,702 | 671_ | 24 |
| మొత్తము | 36,957 | 20,433_ | 41 |

పైపేర్కొనబడిన గ్రామములు ఆలమూరు గ్రామమునకు యించు మించు 5 మైళ్ళ లోపు దూరములో

నున్నవి. అన్ని గ్రామములకు రోడ్డు సౌకర్యములు కలవు. గోదావరి కాలువలవలన పంటసౌకర్యములు న్నవి. ఈ గ్రామములన్నియు మాగాణి గ్రామములు. 1941 సం॥ర జనాభాలెక్కల ప్రకారము యీపండ్రెండు గ్రామములలోను 36,957 మంది జనాభాకలరు. ప్రస్తుత జనాభాప్రకారము 40,000 మంది యుందురు. ఈ గ్రామములలోనిభూములఆయకట్టు20,433-21ట్లు. జనాభా పెరుగుచున్న దేకాని, భూమి పెరుగుటలేదు. తల 1కి అర యకరము భూమి మాత్రమువచ్చినది. రసంగి, బసంగి విస్తారముగా యీ గ్రామములలో పండించేధాన్యము. అరటి, చెరకు తోటలు కూడా వేయబడుచున్నవి. కాలమానము బాగున్నచో పైరులు బాగుగా యీ భూములలో పండును.

ఆలమూరు రూరల్ బ్యాంకు విస్తీర్ణ ప్రదేశములో పైన పేర్కొనబడిన 12 గ్రామములలోను రూరల్ బ్యాంకు స్థాపింపక పూర్వము సహకార సంఘములు చక్కగా పనిచేయుచుండెడివి. అయితే ఆర్థిక మాంద్యమువలన యీ సంఘములన్నియు క్షీణించినవి. వెస్టుఖండ్రిక, జన్నాడ, పెదపళ్ళ, నవాబుపేట గ్రామము

లలో సంఘము లెత్తివేయబడినవి. రెండవ ఐరోపా సంగ్రామా నంతరము తిరిగి ధరవరులు హెచ్చైనవి, భూములధరలు పెరిగినవి. రైతుల పాతబకాయీలు తీర్చివేయుటకు సావకాశముకల్గెను. క్రొత్తఅప్పులు తీయుటకు పరపతి కల్గియుండిరి. ఎత్తడి పోయిన సంఘములు మరల రెపరెపలాడుచున్నవి. 1940_1950 వరకు ఆర్థికపరిస్థితులు బాగుండుటచే సహకార పరపతి సంఘములలోని వ్యాపారము పెర్గినది. 1920_1950వరకు ఆయాదశలలో సంఘముల వృద్ధిక్షయముల తెల్పుపట్టికలు యిందు పొందు పరుపబడినది.

సొసైటీ పేరు :— ఆలమూరు

సంఘ ఋణాధికారము. ఋ. 1,25,000

వ్యక్తి ఋణాధికారము ఋ. 3000/—.

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 17—18 | 63 | 664 | — | 5,500 | 6,164 |
| 2. | 18—19 | 89 | 1,00, | 5 | 7,800 | 8,805 |
| 3. | 19—20 | 189 | 2,108 | 50 | 17,700 | 19,858 |
| 4. | 20—21 | 221 | 2,290 | 154 | 17,353 | 19,805 |
| 5. | 21—22 | 232 | 2,462 | 208 | 18,826 | 21,496 |
| 6. | 22—23 | 260 | 2,909 | 731 | 20,864 | 24,503 |
| 7. | 23—24 | 290 | 3,297 | 1,457 | 24,101 | 28,855 |
| 8. | 24—25 | 392 | 6,230 | 1,457 | 49,480 | 57,157 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 9. | 25_26 | 434 | 8,028 | 2,882 | 73,448 | 84,358 |
| 10. | 26_27 | 479 | 10,743 | 3,315 | 95,802 | 1,09,860 |
| 11. | 27_28 | 472 | 11,350 | 6,648 | 1,06,678 | 1,24,676 |
| 12. | 28_29 | 464 | 9,875 | 8,522 | 49,686 | 68,083 |
| 13. | 29_30 | 464 | 9,901 | 9,137 | 1,04,899 | 1,23,937 |
| 14. | 30_31 | 460 | 10,753 | 11,542 | 1,01,080 | 1 23,375 |
| 15. | 31_32 | 417 | 9,850 | 13,935 | 85,919 | 1,09,704 |
| 16. | 32_33 | 365 | 9,015 | 14,606 | 86,009 | 1,09,630 |
| 17. | 33_34 | 316 | 7,786 | 15,106 | 83,441 | 1,06,323 |
| 18. | 34_35 | 260 | 6,729 | 15,106 | 73,451 | 95,289 |
| 19. | 35_36 | 251 | 5,957 | 15,106 | 61,509 | 82,572 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
| --- | --- | --- | --- | --- | --- | --- |
| 20. | 36_37 | 251 | 5,974 | 15,106 | 44,742 | 65,822 |
| 21. | 37_38 | 250 | 3,655 | 15,106 | 38,925 | 59,686 |
| 22. | 38_39 | 233 | 3,148 | 15,139 | 52,236 | 53,255 |
| 23. | 39_40 | 485 | 6,690 | 15,465 | 73,495 | 75.960 |
| 24. | 40_41 | 1275 | 12,068 | 15,917 | 96,393 | 1,21,037 |
| 25. | 41_42 | 1525 | 13,228 | 16,771 | 93,458 | 1,18,490 |
| 26. | 42_43 | 1887 | 13,106 | 17,421 | 95,411 | 1,54,132 |
| 27. | 43_44 | 1898 | 14,957 | 19,649 | 1,00,124 | 1,94,548 |
| 28. | 44_45 | 2942 | 18,799 | 19,704 | 1,55,414 | 2,28,503 |
| 29. | 45_46 | 2555 | 25,991 | 20,051 | 2,28,099 | 2,81,279 |
| 30. | 46_47 | 2952 | 33,892 | 23,978 | 2,88,081 | 4,15,169 |

| నెం | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 31. | 47_48 | 3529 | 50,173 | 25,116 | 4,17,138 | 5,07,371 |
| 32. | 48_49 | 3662 | 60,494 | 33,156 | 4,96,046 | 5,31,126 |
| 33. | 49_50 | 4558 | 1,48,321 | 22,868 | 8,74,984 | 9,92,925 |

సొసైటీ :- మూలస్థానం

సంఘము ఋణాధికారము.
రు. 30,000/-

వ్యక్తి ఋణాధికారము.
రు. 1000/-

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 23_24 | 33 | 346 | — | 3000 | 3,346 |
| 2. | 24_25 | 75 | 976 | 1 | 6963 | 7,943 |
| 3. | 25_26 | 103 | 1,797 | 93 | 16480 | 18,370 |
| 4. | 26_27 | 132 | 2,472 | 106 | 19957 | 22,533 |
| 5. | 27_28 | 146 | 2924 | 332 | 19750 | 22,780 |
| 6. | 28_29 | 158 | 2990 | 332 | 20916 | 23148 |
| 7. | 29_30 | 141 | 2428 | 384 | 14121 | 16933 |
| 8. | 30_31 | 133 | 2081 | 384 | 11376 | 13841 |

| నెం. | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 9. | 31_32 | 121 | 1880 | 496 | 7406 | 9782 |
| 10. | 32_33 | 73 | 887 | 689 | 3728 | 5284 |
| 11. | 33_34 | 51 | 570 | 689 | 3118 | 4377 |
| 12. | 34_35 | 37 | 358 | 1052 | 2115 | 3525 |
| 13. | 35_36 | 30 | 490 | 1212 | 3975 | 5677 |
| 14. | 36_37 | 27 | 437 | 1212 | 3025 | 5146 |
| 15. | 37_38 | 23 | 332 | 1211 | 2462 | 4572 |
| 16. | 38_39 | 32 | 173 | 1211 | 2881 | 5402 |
| 17. | 39_40 | 36 | 178 | 1211 | 1931 | 4715 |
| 18. | 40_41 | 32 | 207 | 1211 | 2390 | 5834 |
| 19. | 41_42 | 222 | 528 | 1211 | 4671 | 8745 |

| నెం. | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 20. | 42_43 | 309 | 617 | 1211 | 3507 | 8283 |
| 21. | 43_44 | 323 | 576 | 1211 | 1319 | 6268 |
| 22. | 44_45 | 174 | 225 | 1211 | — | 3701 |
| 23. | 45_46 | 152 | 171 | 1211 | 250 | 1470 |
| 24. | 46_47 | 145 | 186 | 1211 | 230 | 1512 |
| 25. | 47_48 | 143 | 161 | 1211 | — | 1110 |
| 26. | 48_49 | 143 | 161 | 1211 | — | 1120 |
| 27. | 49_50 | 13 | 17 | 1211 | — | 996 |

సొసైటీ పేరు:- అంగర.

సంఘ ఋణాధికారము
రు 40,000

వ్యక్తి ఋణాధికారము
రు 1000—:

| నెం. | సంIIరం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 20_21 | ₂0 | 210 | — | 1,945 | 2,155 |
| 2. | 21_22 | 26 | 256 | 11 | 2,000 | 2,267 |
| 3. | 22_23 | 47 | 437 | 31 | 4,000 | 4,468 |
| 4. | 23_24 | 57 | 515 | 6228 | 4,211 | 4,788 |
| 5. | 24_25 | 57 | 1,067 | 88 | 568 | 1,171 |
| 6. | 25_26 | 111 | 1,681 | 189 | 8,216 | 9,472 |
| 7. | 26_27 | 145 | 3,742 | 463 | 12,902 | 15,046 |
| 8. | 27_28 | 221 | 3,742 | 487 | 30,464 | 34,693 |

| నెం. | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు పండు | అప్పులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 9. | 28_29 | — | 3,742 | 978 | 22,697 | 27,417 |
| 10. | 29_30 | 213 | 3,289 | 978 | 34,002 | 38,269 |
| 11. | 30_31 | — | 3,289 | 978 | 19,182 | 23,440 |
| 12. | 31_32 | 198 | 3,289 | 978 | 18,457 | 22,724 |
| 13. | 32_33 | 161 | 2,836 | 978 | 16,801 | 20 615 |
| 14. | 33_34 | 149 | 2,507 | 978 | 15,239 | 18,724 |
| 15. | 34_35 | 149 | 2,183 | 978 | 14,632 | 17,793 |
| 16. | 35_36 | 149 | 2,031 | 978 | 11 912 | 14,921 |
| 17. | 36_37 | 147 | 1,783 | 978 | 8,841 | 11,601 |
| 18. | 37_38 | 139 | 1,593 | 978 | 5,668 | 8,423 |
| 19. | 38_39 | 137 | 1,399 | 978 | 3,550 | 6,247 |

| నెం | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు పండు | అప్పులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 20. | 39_40 | 115 | 797 | 978 | 3,146 | 5,561 |
| 21. | 40_41 | 110 | 778 | 978 | 2,752 | 5,127 |
| 22. | 41_42 | 95 | 722 | 978 | 2,433 | 4,727 |
| 23. | 42_43 | 95 | 530 | 978 | 2,115 | 4,296 |
| 24. | 43_44 | 82 | 526 | 1022 | 495 | 1,834 |
| 25. | 44_45 | 34 | 260 | 1053 | 495 | 1,709 |
| 26. | 45_46 | 101 | 332 | 1070 | 3,650 | 5,144 |
| 27. | 46_47 | 183 | 1028 | 1070 | 4,385 | 7,232 |
| 28. | 47_48 | 199 | 1317 | 1137 | 7,585 | 9,496 |
| 29. | 48_49 | 245 | 1745 | 1158 | 11,900 | 14,112 |
| 30. | 49_50 | 296 | 1,796 | 1158 | 11,760 | 13,972 |

సంఘము ఋణాధికారము సొసైటీపేరు:- జొన్నాడ వ్యక్తిఋణాధికారము

రు 40,000 లు రు 1,000 లు

| నెం. | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 18–19 | 15 | 111 | — | 1000 | 1,111 |
| 2. | 19–20 | 75 | 466 | — | 4005 | 4,471 |
| 3. | 20–21 | 118 | 959 | 18 | 8000 | 8,977 |
| 4. | 21–22 | 158 | 1,367 | 78 | 8259 | 9,704 |
| 5. | 22–23 | 166 | 1,521 | 143 | 6933 | 8,597 |
| 6. | 23–24 | 128 | 1,594 | 143 | 9781 | 11,518 |
| 7. | 24–25 | 137 | 2,194 | 463 | 15364 | 18,021 |
| 8. | 25–26 | 134 | 2,699 | 601 | 21798 | 25,098 |
| 9. | 26–27 | 131 | 3,175 | 925 | 35274 | 39,374 |
| 10. | 27–28 | 137 | 3,505 | 1060 | 36931 | 41,496 |
| 11. | 28–29 | 123 | 3,306 | 1060 | 30809 | 35,174 |
| 12. | 29–30 | 112 | 3,164 | 2324 | 34523 | 40011 |
| 13. | 30–31 | 123 | 3,368 | 3043 | 23823 | 30234 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 14. | 31–32 | 118 | 3,187 | 3043 | 16736 | 22968 |
| 15. | 32–33 | 99 | 2,762 | 3043 | 14159 | 19964 |
| 16. | 33–34 | 89 | 2,152 | 3043 | 9911 | 15106 |
| 17. | 34–35 | 87 | 1,945 | 3043 | 12994 | 17982 |
| 18. | 35–36 | 71 | 1,600 | 3043 | 12,000 | 16643 |
| 19. | 36–37 | 64 | 1,448 | 3043 | 9,475 | 13966 |

సొసైటీ పేరు:— మండపేట.

సంఘము ఋణాధికారము. రు. 60,000

వ్యక్తి ఋణాధికారము రు. 3,000

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 17—18 | .... | 207 | .... | 1,500 | 1,707 |
| 2. | 18—19 | .... | 615 | .... | 3,498 | 4,113 |
| 3. | 19—20 | 110 | 1320 | .... | 9,502 | 10,822 |
| 4. | 20—21 | 122 | 1523 | 24 | 8,011 | 9,558 |
| 5. | 21—22 | 138 | 1766 | 25 | 9,982 | 11.773 |
| 6 | 22—23 | 142 | 1896 | 25 | 9,982 | 11,783 |
| 7. | 23—14 | 123 | 1582 | 153 | 5,037 | 6,772 |
| 8. | 24—25 | 124 | 1684 | 184 | 9,961 | 11,869 |
| 9. | 25—26 | 102 | 1234 | 206 | 6,281 | 7,721 |
| 10. | 26—27 | 174 | 2584 | 751 | 15,195 | 18,530 |
| 11. | 27—28 | 275 | 5360 | 855 | 56,227 | 62,442 |

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 12. | 28—29 | 306 | 6585 | 1,356 | 55,788 | 63,729 |
| 13. | 29—30 | 315 | 8851 | 2,063 | 92,783 | 1,03,697 |
| 14. | 30—31 | 289 | 9211 | 3,048 | 55,330 | 67,589 |
| 15. | 31—32 | 234 | 7713 | 3,571 | 9,263 | 20,547 |
| 16. | 32—33 | 135 | 4325 | 4,365 | 5,719 | 14,409 |
| 17. | 33—34 | 92 | 1498 | 5,200 | 2,734 | 9,432 |
| 18. | 34—35 | 78 | 665 | 5,559 | 1,193 | 7,417 |
| 19. | 35—36 | 76 | 446 | 5,875 | 1.125 | 5,376 |
| 20. | 36—37 | 78 | 405 | 6,085 | .... | 6,725 |
| 21. | 37—38 | 75 | 360 | 6,423 | 1,893 | 3,299 |
| 22. | 38—39 | 113 | 1006 | 6,610 | 32,543 | 34,858 |
| 23. | 39—40 | 127 | 1412 | 6,739 | 28,138 | 33,993 |
| 24. | 40—41 | 127 | 1470 | 6,846 | 27,586 | 32,067 |
| 25. | 41—42 | 128 | 1539 | 6,940 | 19,117 | 23,585 |
| 26. | 42—43 | 125 | 1522 | 7,012 | 12,377 | 17,483 |

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 27. | 43—44 | 129 | 1388 | 7,190 | 10 736 | 14,492 |
| 28. | 44—45 | 138 | 1242 | 7,319 | 5,308 | 9,412 |
| 29. | 45—46 | 138 | 1156 | 7,503 | 6,919 | 10,776 |
| 30. | 46—47 | 141 | 1221 | 7,539 | 12,240 | 15,902 |
| 31. | 47—48 | 144 | 1324 | 7,604 | 14,537 | 18,236 |
| 32. | 48—49 | 146 | 1430 | 7,767 | 9,600 | 13,402 |
| 33. | 49—50 | 143 | 1260 | 7,767 | 9,414 | 13,204 |

సొసైటీ :— పెనికేరు

సంఘము ఋణాధికారము. రు. 20,000/—

వ్యక్తి ఋణాధికారము. రు. 7500/—

| నెం | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 19_20 | 39 | 213 | — | 2000 | 2,213 |
| 2. | 20_21 | 61 | 312 | 1 | 2000 | 2,313 |
| 3. | 21_22 | 60 | 292 | 2 | — | 204 |
| 4. | 22_23 | 98 | 421 | 67 | 3,363 | 3,851 |
| 5. | 23_24 | 118 | 587 | 118 | 5,030 | 5,735 |
| 6. | 24_25 | 117 | 838 | 184 | 67,64 | 7,770 |
| 7. | 25_26 | 202 | 1927 | 184 | 10,696 | 12,207 |
| 8. | 26_27 | 211 | 1458 | 496 | 11,792 | 13,746 |

| నెం. | సం॥రం | మెంబర్ల సంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 9. | 27_28 | 233 | 1743 | 496 | 12,002 | 14,241 |
| 10. | 28_29 | 227 | 1464 | 833 | 7,858 | 10,155 |
| 11. | 29_30 | 233 | 1365 | 1030 | 13,487 | 15,882 |
| 12. | 30_31 | 217 | 1214 | 1101 | 6,258 | 8573 |
| 13. | 31_32 | 213 | 1162 | 1338 | 2,939 | 5439 |
| 14. | 32_33 | 191 | 947 | 1551 | 2,135 | 4633 |
| 15. | 33_34 | 145 | 698 | 1551 | 1,571 | 3820 |
| 16. | 34_35 | 143 | 585 | 1606 | 1,571 | 3768 |
| 17. | 35_36 | 134 | 514 | 1606 | 1,571 | 3691 |
| 18. | 36_37 | 134 | 514 | 1606 | 982 | 3461 |
| 19. | 37_38 | 130 | 494 | 166 | 1,260 | 2027 |

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 20. | 38_39 | 108 | 409 | 1606 | 985 | 1835 |
| 21. | 39_40 | 137 | 622 | 1606 | 3439 | 4199 |
| 22. | 40_41 | 126 | 568 | 1641 | 2936 | 3767 |
| 23. | 41_42 | 115 | 528 | 1641 | 1844 | 1882 |
| 24. | 42_43 | 110 | 499 | 2100 | 665 | 1204 |
| 25. | 43_44 | 99 | 434 | 2111 | 477 | 1105 |
| 26. | 44_45 | 97 | 399 | 2114 | 554 | 1073 |
| 27. | 45_46 | 106 | 492 | 2154 | 2412 | 2881 |
| 28. | 46_47 | 111 | 483 | 2246 | 3148 | 3849 |
| 29. | 47_48 | 130 | 731 | 2249 | 7482 | 8599 |
| 30. | 48_49 | 181 | 1188 | 2260 | 16860 | 17966 |
| **31.** | **49—50** | **226** | **1851** | **2311** | **32595** | **34303** |

సొసైటీ పేరు తాతపూడి

సంఘము ఋణాధికారము
రు 10,000లు

వ్యక్తి ఋణాధికారము
రు500లు

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు పండు | అప్పులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1. | 24_25 | 23 | 262 | ... | 2500 | 2,762 |
| 2. | 25_26 | 57 | 349 | 1 | 2950 | 3,300 |
| 3. | 26_27 | 50 | 482 | 1 | 4773 | 5,256 |
| 4. | 27_28 | 55 | 590 | 15 | 5229 | 5,834 |
| 5. | 28_29 | 78 | 706 | 118 | 6017 | 6,842 |
| 6. | 29_30 | 93 | 721 | 152 | 5363 | 7,236 |
| 7. | 30_31 | 98 | 652 | 152 | 4340 | 5,144 |
| 8. | 31_32 | 76 | 428 | 188 | 1898 | 2,514 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 9. | 32_33 | 57 | 303 | 321 | 1488 | 2,112 |
| 10. | 33_34 | 53 | 284 | 349 | 1013 | 1,540 |
| 11. | 34_35 | 44 | 183 | 349 | 768 | 1,300 |
| 12. | 35_36 | 41 | 178 | 349 | 750 | 1,277 |
| 13. | 36_37 | 41 | 173 | 350 | 473 | 1,646 |
| 14. | 37_38 | 40 | 190 | 350 | 939 | 2,027 |
| 15. | 38_39 | 45 | 224 | 400 | 1331 | 2,220 |
| 16. | 39_40 | 21 | 153 | 412 | 1980 | 2,647 |
| 17. | 40_41 | 23 | 179 | 482 | 2429 | 3,164 |
| 18. | 41_42 | 27 | 202 | 482 | 3077 | 3,418 |
| 19. | 42_43 | 31 | 211 | 482 | 2602 | 2,848 |

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 20. | 43_44 | 31 | 211 | 500 | 3251 | 2,612 |
| 21. | 44_45 | 33 | 193 | 500 | 2544 | 2,679 |
| 22. | 45_46 | 33 | 193 | 608 | 2525 | 2,807 |
| 23. | 46_47 | 39 | 315 | 608 | 5784 | 5,849 |
| 24. | 47_48 | 39 | 315 | 727 | 4473 | 5,032 |
| 25. | 48_49 | 43 | 310 | 727 | 2768 | 3,327 |
| 26. | 49_50 | 47 | 332 | 727 | 4800 | 4,359 |

సొసైటీ పేరు :— కల్వచర్ల

సంఘ ఋణాధికారము.
రు. 15,000

వ్యక్తి ఋణాధికారము
రు. 750/—.

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 19—20 | 36 | 203 | .... | 2000 | 2003 |
| 2, | 20—21 | 65 | 428 | 1 | 3840 | 4269 |
| 3. | 21—22 | 66 | 507 | 53 | 4437 | 4977 |
| 4, | 22—23 | 64 | 511 | 52 | 4319 | 4882 |
| 5. | 23—24 | 77 | 607 | 52 | 4646 | 5305 |
| 6. | 24—25 | 77 | 632 | 176 | 4973 | 5781 |
| 7. | 25—26 | 83 | 843 | 345 | 6530 | 7718 |
| 8. | 26—27 | 89 | 818 | 385 | 5478 | 6681 |
| 9. | 27—28 | 96 | 964 | 500 | 7215 | 8679 |
| 10. | 28—29 | 105 | 1081 | 604 | 9553 | 11238 |
| 11. | 29—30 | 105 | 1283 | 673 | 9128 | 11084 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 12. | 30—31 | 99 | 1255 | 838 | 6212 | 8305 |
| 13. | 31—32 | 83 | 980 | 858 | 1738 | 3576 |
| 14. | 32—33 | 60 | 462 | 1218 | 971 | 2651 |
| 15. | 33—34 | 34 | 212 | 1301 | 506 | 2019 |
| 16. | 34—35 | 19 | 99 | 1403 | 442 | 1944 |
| 17. | 35—36 | 15 | 34 | 1408 | 442 | 1884 |
| 18. | 36—37 | 14 | 34 | 1451 | 1 | 1491 |
| 19. | 37—38 | 14 | 34 | 1513 | .... | 111 |
| 20. | 38—39 | 14 | 34 | 1534 | .... | 62 |
| 21 | 39—40 | 12 | 34 | 1584 | .... | 68 |
| 22. | 40—41 | 46 | 126 | 1636 | 2200 | 2372 |
| 23. | 41—42 | 54 | 214 | 1674 | 2214 | 2370 |
| 24. | 42—43 | 63 | 314 | 1712 | 2995 | 3216 |
| 25. | 43—44 | 67 | 357 | 1736 | 3038 | 3285 |
| 26. | 44—45 | 71 | 435 | 1772 | 3689 | 4200 |

| నెం | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 27. | 45–46 | 79 | 510 | 1799 | 7306 | 7019 |
| 28. | 46–47 | 82 | 588 | 1799 | 8302 | 9409 |
| 29. | 47–48 | 86 | 649 | 1854 | 9309 | 10487 |
| 30. | 48–49 | 93 | 747 | 1943 | 9780 | 10956 |
| 31. | 49–50 | 102 | 846 | 1943 | 10527 | 11703 |

సంఘము ఋణాధికారము సొసైటీపేరు:- చింతలూరు వ్యక్తిఋణాధికారము

రు 20,000 లు రు 750 లు

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | 18_19 | 25 | 200 | — | 2000 | 2,220 |
| 2. | 19_20 | 84 | 557 | — | 5000 | 5,557 |
| 3. | 20_21 | 101 | 777 | 16 | 6,323 | 7,116 |
| 4. | 21_22 | 116 | 934 | 99 | 5,675 | 6,708 |
| 5. | 22_23 | 122 | 981 | 99 | 6,975 | 8,055 |
| 6. | 23_24 | 134 | 1017 | 213 | 6,645 | 7,875 |
| 7. | 24_25 | 154 | 1295 | 541 | 11,986 | 13,822 |
| 8. | 25_26 | 177 | 1830 | 541 | 17,359 | 19,700 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 9. | 26_27 | 187 | 2450 | 1165 | 25,491 | 29,106 |
| 10. | 27_28 | 199 | 2889 | 1231 | 26 848 | 30,968 |
| 11. | 28_29 | 201 | 3051 | 1562 | 22 986 | 27,599 |
| 12. | 29_30 | 190 | 2838 | 1700 | 21 437 | 25,975 |
| 13. | 30_31 | 178 | 2540 | 2305 | 12 435 | 17,280 |
| 14. | 31_32 | 164 | 1894 | 2605 | 6 492 | 10,991 |
| 15. | 32_33 | 125 | 1315 | 2998 | 4 655 | 8,968 |
| 16. | 33_34 | 89 | 709 | 3027 | 3 698 | 7,434 |
| 17. | 34_35 | 58 | 335 | 3149 | 1 789 | 5,273 |
| 18. | 35_36 | 41 | 211 | 3317 | 1 530 | 5,058 |
| 19. | 36_37 | 35 | 200 | 3451 | 342 | 4,045 |
| 20. | 37-38 | 31 | 117 | 3514 | 419 | 779 |

| నెం. | సం॥రం | మెంబర్లసంఖ్య | షేరు ధనము | రిజర్వు ఫండు | అప్పులు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 21. | 38_39 | 25 | 76 | 3632 | 215 | 648 |
| 22. | 39_40 | 24 | 57 | 3750 | 38 | 643 |
| 23. | 40_41 | 26 | 68 | 3845 | 308 | 551 |
| 24. | 41_42 | 79 | 509 | 3915 | 4665 | 5949 |
| 25. | 42_43 | 112 | 686 | 3976 | 5010 | 9471 |
| 26. | 43_44 | 126 | 796 | 3976 | 5933 | 10666 |
| 27. | 44_45 | 139 | 932 | 4245 | 7336 | 12199 |
| 28. | 45_46 | 138 | 960 | 4296 | 3056 | 8685 |
| 29. | 46_47 | 175 | 1081 | 4296 | 8404 | 13766 |
| 30. | 47_48 | 227 | 1476 | 4296 | 11600 | 17645 |
| 31. | 48_49 | 263 | 1739 | 4296 | 14048 | 21078 |
| 32. | 49—50 | 304 | 2299 | 4296 | 19693 | 26723 |

## ఆలమూరు సకలార్ధ సహకార సఘంము.

దిగనారిన సంఘములు మరల తలలెత్తినవి. తీసివేసినచోట్ల మరల సంఘములు స్థాపింప బడుచున్నవి. అన్నిగ్రామ సంఘములను ప్రభుత్వమువారు నేడు సకలార్ధ సహకార సంఘములుగా మార్చుచున్నారు. ఇందుమూలమున ఆలమూరు రూరల్ బ్యాంకు వ్యాపారమునకు యెట్టి నిరోధము కలుగలేదు.

పరపతిలేని పూచీగల చిన్నగ్రామ సంఘములలో వ్యక్తి ఋణాధికారము రు 500. మించిలేదు. కొద్ది సంఘములలో మాత్రము రు 1000 వరకు వ్యక్తి ఋణాధికార మున్నది. రూరల్ బ్యాంకులో వ్యక్తి ఋణాధికారము రు 3000 లు. పరిమితిలేని పూచీగల చిన్న గ్రామ సంఘములలో ఆస్థిలేని హరిజనులను, వ్యావసాయ కూలీలను చేర్చుకొనుట కంగీకరించరు. వ్యావసాయ కూలీలు, పెద్ద భూస్వాములు, రూరల్ బ్యాంకులో చేరి అప్పులు తీసుకొనుచున్నారు. ఒకే విస్తీర్ణ ప్రదేశములో రూరల్ బ్యాంకు, పూరూర గ్రామ పరపతి సంఘములు పని చేయుచున్నను, వ్యాపారములో వీటికి యెట్టి సంఘర్షణము లేదు. గ్రామ సంఘములలో చేరినవారు రూరల్ బ్యాంకులో చేరుటలేదు. రూరల్ బ్యాంకులో

చేరినవారు గ్రామ సంఘములలో మెంబర్లుగా చేర్చుకొన బడుటలేదు. రెండు సంఘములలో చేరి సభ్యులు అప్పులు వాడకుండా యుండుటకు గ్రామ సంఘ అధ్యక్షు లకు తెలియజేపి ఆయా గ్రామములలోని వ్యక్తులను రూరల్ బ్యాంకులో సభ్యులుగ చేర్చుకొను చున్నారు. ఈ అన్యోన్య సహాయము తోడ్పాటువలన రూరల్ బ్యాంకులోను గ్రామ సంఘములలోను వ్యాపారము వుభయుల సమ్మతిపైన వర్ధిల్లుచున్నది. ఎట్టి సంఘర్షణము లేదు. ఎక్కువ డబ్బు కావలసినవారు రూరల్ బ్యాంకులో చేరుచున్నారు. చిన్న సంసారులు స్వల్ప పెట్టుబడి కలవారు, స్థానిక సంఘములలో చేరి అప్పులు తీయుచున్నారు. పరిమితిగల పూచీ పద్ధతిని రూరల్ బ్యాంకు వ్యవహరించుటచే ఆస్థిపరులు, విస్తారము డబ్బు వాడకము కావలసినవారు, బీదసాదలు ధారళముగా అన్ని వర్గములవారు ప్రతి గ్రామమునుంచియు, సభ్యు లుగచేరి యెవరి తాహతనుబట్టి వారు పెట్టుబడికి ఋణము తీసుకొను చున్నారు.

ఆలమూరు రూరల్ బ్యాంకు విస్తీర్ణ ప్రదేశము నేడు పంద్రెండు గ్రామములకు వ్యాపించి యున్నది.

ఇంకను పరిసర గ్రామవాసులు తమ గ్రామములను బ్యాంకునకు చేర్చవలసినదిగా ఆందోళన చేయుచున్నారు. కాని 5 మైళ్ళ విస్తీర్ణ ప్రదేశము దాటి వ్యవహరించిన తగు పరిశీలన వుండదని, యితర గ్రామములను చేర్చుట విరమించడమైనది. మరియు ప్రస్తుతము డిపార్టుమెంటు వారి యుద్దేశము, ప్రభుత్వమువారి ఆదేశప్రకారము ఒక గ్రామమున కొక్క సంఘము వ్యవహరించవలెనని నిర్దేశింప బడినది. ఇదివరలో శ్రీ అరుణాచలం (ఐ. సి. యస్.) గారు రిజిస్ట్రారుగా నున్నపుడు అనగా శ్రీప్రకాశం పంతులుగారు ప్రధానామాత్యులుగా నుండు కాలములో ప్రభుత్వమువారు గ్రామ సమూహములకు రూరల్ బ్యాంకులు విస్తరింప జేయవలెనని తాఖీదు నిచ్చిరి. అయితే వారి హయాము అంతమగుటతోనే ప్రభుత్వమువారు అభిప్రాయమును మార్చుకొన్నారు. ఈ ఆలమూరు సహకార రూరల్ బ్యాంకు శ్రీమాన్ రాజగోపాలాచారిగారు ప్రధానామాత్యులుగా నుండు కాలములో రిజిష్టరు కాబడినది. అప్పుడు కూడ నీసకలార్థ సహకార సంఘము ఆదర్శక ప్రాయముగా నమోనాకు (Example) రిజిష్టరు చేసిరే కాని ధారాళముగా అన్ని చోట్ల రిజిష్టరు చేయుటకు అంగీకరించలేదు. నేడు సహ

కార శాఖా మాత్యులగు గౌరవనీయులు శ్రీ చంద్రమౌళిగారు ఒక గ్రామము కంటె యెక్కువ గ్రామములు కలిపి సహకార సంఘములు నెలకొల్పుటకు అంగీకరించరు. వీరు యిందుకు భిన్నాభిప్రాయులు. నేటి సహకార రిజిస్ట్రారు అగు శ్రీ జె. సి. రాయన్ గారు కూడ యీ అభిప్రాయము కలవారే. అయితే నూతన సంఘములు సృష్టించుటకు అంగీకరించక పోయినా యీ పని చేయుచున్న సంఘములు మాత్రము యెత్తి వేయకుండగా పనిచేయుటకు ప్రభుత్వము వారు రిజిస్ట్రారు వారు సర్వవిధముల తోడ్పాటు నొనర్చు చున్నారు. ఇందుకు రూరల్ బ్యాంకు వారు కృతజ్ఞలు.

ఈ పంద్రెడు గ్రామముల లోను గత 10సం॥ల నుంచి యీ బ్యాంకు సర్వతోముఖాభివృద్ధిని చెంది కృషి సల్పు చున్నది. ఇంకను వివిధమార్గముల ప్రజాభ్యుదయమునకు తోడ్పడుట కెంతయేని అవకాశము కలదు. ఈ బ్యాంకు యుద్దేశముల నన్నిటిని ఆచరణలో పెట్టి గ్రామాభ్యుదయమునకు కృషి సల్పిన ప్రజల ఆర్థికాభివృద్ధికి మహాత్ముడు కనిన కలల ప్రకారము నిర్మాణ కార్యక్రమము నాచరణలో పెట్టుట కెంత

యేని అవకాశము కలదు. పర ప్రభుత్వము పోయి స్వతంత్ర ప్రభుత్వము దేశములో సుస్థిరముగా నాటు కొని నది. కాన ప్రభుత్వము వారు యీ యుద్యమ మును శృంఖలా బద్ధముగ చేయక స్వాతంత్ర్య వాతా వరణమున స్వేచ్ఛగా విజృంభించుటకు సావకాశమిచ్చిన యీ బ్యాంకు భావి దశలో యెంత యేని గ్రామో ద్ధరణకు తోడ్పడుటకు అవకాశముకలదు.



# బ్యాంకుఆదర్శకములు.

ఈ రూరల్ బ్యాంకు రెండవ నిబంధన (Bylaw) లో సూచించిన ప్రకారము యీ సంఘము సకలార్ధ సహకార సంఘముగా రిజిష్టరుచేయ బడినది. బహుళ వ్యాపారము చేయుట కవకాశము కల్గి యున్నది. 1904 సం॥రము కో-ఆపరేటివ్ ఆక్టు ప్రకారము గ్రామ సంఘము లన్నియు సకలార్ధ సహకార సంఘములుగా పని చేయుటకు నిర్దేశింప బడినవి. అప్పటి నిబంధనల ప్రకారము సంఘముల యుద్దేశము (Objects of the soceity) యీ క్రింది విధముగా పేర్కొన బడినవి.

1. సభ్యులనుంచి, సభ్యులు కాని వారి వద్దనుంచి ధనము స్వీకరించి ఫల ప్రదమైన పనులకు అప్పుల నిచ్చుట
2. వ్యవసాయిక, గృహోపయోగముల కొరకు, తదితర ప్రయోజనముల కొరకు, సభ్యుల తరపున

సమిష్టిగా క్రయ విక్రయములు సల్పుటకు ఏజం టుగా వ్యవహరించుట.

3. వ్యవసాయోపకరణములు, మిషనులు, పశువులు, సంఘ సభ్యుల తరఫున కొనుటకు, అద్దెకు తీసు కొను టకు, వ్యవహరించుట.
4. వ్యవసాయిక గృహపరిశ్రమ, చేనేత పరిశ్రమల విష యమై నూతన విజ్ఞానము వ్యాప్తిచేసి సభ్యులలో వాటి నమలులో పెట్టుటకు ప్రోత్సాహ పరచుట
5. సభ్యులలో పొదుపు, స్వయం సహాయము, సహ కారము పెంపొందించుట.

1904 సం॥ నుంచి రిజిష్టరు కాబడిన గ్రామ సహ కార సంఘములలో పైని చూపిన 5 వుద్దేశములు ఆదర్శకములు. గ్రంథ స్తములయి వున్నవి. భారత దేశములోని ప్రతి రాష్ట్రములోను గ్రామ సంఘము లన్నిటిలోను యీ యుద్దేశములే నిర్దిష్టము చేయబడినవి. పై యుద్దేశములు యెక్కడను అన్నియు అమలులో పెట్టబడలేదు. గ్రామ సంఘముల ద్వారా పరపతి వ్యాపారమే అన్ని రాష్ట్రములలోను వృద్ధి చేయ బడినది. ఇంత కాలము నుంచి సంఘ నిబంధనలు

యెట్టి యుద్దేశముల తో చేయబడినప్పటికి అమలులో మాత్రము వడ్డీ వ్యాపార సంఘములుగ మాత్రమే పని చేయ చున్నవి. సాధారణముగా గ్రామాదులలో రైతాంగమునకు పెట్టుబడికి డబ్బే అవసరము. ఈ డబ్బే గ్రామాదులలో అపురూప మైనది. అందుచేత అప్పులకే యీ శతాబ్దారంభములో ప్రాధాన్య మీయబడినది. రైతుకు కావలసిన పంట లన్నియు తానే సుభిక్షముగా పండించుకొనేవాడు. ఆహార పదార్థములు పడించుకొనేవాడు. పత్తి పండించుకొని నూలు వడుక్కొని బట్టలు నేయించుకొనేవాడు. ఆముదాలు పండించుకొని దీపము పెట్టుకొనేవాడు. ఇంటికి కావలసిన కలప పరిసర ప్రాంతములలోని అడవులలో దొరకేది. ఆరోజులలో రైతులకు వాంఛలు తక్కువ. డబ్బువుంటే వ్రాళ్ళోనే అన్నియు దొరకేవి. అందుకొరకే ఆరోజులలో రైతులు డబ్బు వాడకము తప్ప గ్రామసంఘములలో యితర వాడకము వుండేదికాదు. ప్రథమ ఐరోపా యుద్ధానంతరము ఒకదశపాటుకూడ రైతు అక్కరలకు కావలసినవస్తువులన్నియు స్థానికంగానే దొరకేవి. అయితే రెండవ ఐరోపా యుద్ధానంతరము పరిస్థితులన్నియు మారిపోయినవి. అన్ని వస్తువులకు కంట్రోళ్ళు

యెట్టి యుద్దేశముల తో చేయబడి నప్పటికి అమలులో మాత్రము వడ్డీ వ్యాపార సంఘములుగ మాత్రమే పని చేయ చున్నవి. సాధారణముగా గ్రామాదులలో రైతాంగమునకు పెట్టుబడికి డబ్బే అవసరము. ఈ డబ్బే గ్రామాదులలో అపురూప మైనది. అందుచేత అప్పులకే యీ శతాబ్దారంభములో ప్రాధాన్య మీయబడినది. రైతుకు కావలసిన పంట లన్నియు తానే సుభిక్షముగా పండించుకొనేవాడు. ఆహార పదార్థములు పడించుకొనేవాడు. పత్తి పండించుకొని నూలు వడుక్కొని బట్టలు నేయించుకొనేవాడు. ఆముదాలు పండించుకొని దీపము పెట్టుకొనేవాడు. ఇంటికి కావలసిన కలప పరిసర ప్రాంతములలోని అడవులలో దొరకేది. ఆరోజులలో రైతులకు వాంఛలు తక్కువ. డబ్బువుంటే వూళ్ళోనే అన్నియు దొరకేవి. అందుకొరకే ఆరోజులలో రైతులు డబ్బు వాడకము తప్ప గ్రామసంఘములలో యితర వాడకము వుండేదికాదు. ప్రథమ ఐరోపా యుద్ధానంతరము ఒకదశపాటుకూడ రైతు అక్కరలకు కావలసినవస్థువులన్నియు స్థానికంగానే దొరకేవి. అయితే రెండవ ఐరోపా యుద్ధానంతరము పరిస్థితులన్నియు మారిపోయినవి. అన్ని వస్తువులకు కంట్రోళ్ళు

పాశ్చాత్య దేశములలో సహకార సంఘములు సభ్యులకు తోడ్పాటొనర్చు చున్నవి. రిజర్వుబ్యాంకు అధికారులు ఈ త్రివిధమార్గములు గ్రామ సహకార సంఘమును పున రుద్ధరించవలసినదిగా గత 10 సం॥ల నుంచి ఆందోళన చేయుచున్నారు.

1914 సం॥లో భారతదేశ ప్రభుత్వమువారు నియ మించిన (మేక్లగన్) సహకార కమిటీ వారు గ్రామ స॥ సంఘములు ఏకోద్దేశము అనగా అప్పులిచ్చిపు చ్చుకొనుటకే వ్యవహరించవలెను అని వ్యక్త పరచిరి. 1928 సం॥ లోని (Royal commissoin on Agriculture)నివేదికలో కూడ సహకారసంఘములు ఏక వుద్దేశముతో పనిచేయవలసినదిగా వ్యక్తపరచిరి. మ ద్రాసు రాష్ట్రములోని సహకార సంఘముల పరిశీలనకు నియమింపబడిన టౌన్ షెండు కమిటివారు కూడాయిట్లే తమ వుద్దేశమును వ్యక్తపరచిరి. అయితే 1940 సం॥లో వెలు వడిన విజయరాఘవాచారి కమిటీవారు సహకార సంఘ ములు బహుళప్రయోజనములకు వ్యవహరింపబడవలెనని వ్యక్తపరచిరి. గాడ్గిల్ కమిటీవారు, సరయ్యాప్లా నింగు కమిటీవారు గ్రామ సంఘములు సకలార్థ సహకార

సంఘములుగా పని చేయవలెనని ప్రకటించిరి. రిజర్వు బ్యాంకువారి అభిప్రాయము నేడు దేశమంతట వ్యాప్త మైనది. ఆసేతు హిమాచలపర్యంతము నేడు సహ కార సంఘములన్నియు సకలార్థ సహకార సంఘములు గామార్చి వేయబడుచున్నవి. అయితే యిందు ఒక్క ప్రమాదమున్నది. తగిన శిబ్బంది లేనిదే వేతనోద్యో గులు పనిచేయనిదే సకలార్థ సహకార సంఘములు పని చేయవు. గౌరవోద్యోగులు సంఘ వ్యవహారముల న్నియు చక్కబెట్టుటకు తీరికయుండదు. పరపతి వ్యా పారము చేయుటకే గౌరవోద్యోగులకు అవకాశములే నపుడు వస్తుక్రయ విక్రియములు చేయుటకు బొత్తిగా అవకాశముండదు. చిన్న గ్రామ సంఘములలో బహు ళవ్యాపారము చేయుటకు వేతనోద్యోగులు లేనిదే సాధ్య ముకాదు. తగిన వ్యాపారము లేనిదే వేతనోద్యోగు లును నియమించుట చిన్న సంఘములకు సాధ్యము కాదు. అందుచే బహుళవ్యాపారము చేయు సంఘ ముల విస్తీర్ణము హెచ్చుగానున్న కాని సక్రమముగా పనిచేసి వర్ధిల్లజాలవు. సకలార్థ వ్యాపారములో దిగిన సంఘములు వేతనోద్యోగులను పోషించుకొను సామర్థ్య

ముకలిగినపుడు యీ వ్యవహారములలో దిగవలెనేగాని లేనిచో నష్టముల పాలగును.

మదారిసు ప్రభుత్వమువారు, సహకార డిపార్టు మెంటువారు రాష్ట్రములోని సంఘములనన్నిటిని సకలార్థ సహకార సంఘములుగా మార్చి వేయుటకు త్రివర్ష ప్రణాళిక అమలులో పెట్టి పని చేయుచున్నారు. అధిక సిబ్బంది వ్యయముకు ప్రభుత్వము వారు ఒకలక్షయిరు వదియైదు వేలరూపాయలు సాలీనా మా సెంట్రల్ బ్యాం కులకు గ్రాంటు చేసిరి. త్వరితగతిని బ్యాంకుసూపరు వైజర్లు గ్రామ సంఘములు సకలార్థ సహకార సం ఘములుగా మార్చుటకు ఆయత్త పడుచున్నారు. 1920–1930 వరకు పూరూర గ్రామసహకార సంఘములు నెలకొల్పి వృద్ధిచేయుటకు డిపార్టు మెంటువారు యెంత తహతహలాడిరో నేడు గ్రామ సంఘములను సకలార్థ సహకార సంఘములుగా మార్చుట కంత ఆవేగపడు చున్నారు. నిబంధనలు మార్చివేయ బడుచున్నవి. నిబంధనల మార్చివేయుటకు సిబ్బంది సెంట్రల్ బ్యాం కులలో కుదిరారేగాని యీ నిబంధనలు అమలులో పెట్టి గ్రామ సంఘములలో పనిచేయుటకు శిబ్బందీ

యేరి? గ్రామ సంఘములలో పనిచేయుటకు వేతన సిబ్బంది వున్ననాడే యీ నిబంధనల ప్రకారము గ్రామములలో పని చేయించవచ్చును. లేనిచో యింతకాలము పాత నిబంధనలు గ్రంథస్థమైనట్లుగనే నూతన నిబంధనలు కూడ యిన్ని వేల సంఘములలోను గ్రంథస్థములై వుండునేకాని అమలులోనికి రావు. పాత నిబంధనలకు చేర్చి సంఘవుద్దేశములలో యీ దిగువ నూతన నిబంధనలు ప్రతి సంఘములోను అమలులో పెట్టుటకు ప్రభుత్వము వారు జారీచేయించిరి. నూతన గ్రామ సహకార సంఘములలో నేడు అమలులో పెట్టబడుచున్న నిబంధనల వుద్దేశములు:—

2 (1) ఉపయోగ కరమైన కార్యములకు మెంబర్లకు అప్పులు యిచ్చునిమిత్తము వినియోగించుటకై మెంబర్ల వద్దనుంచియు, ఇతరుల వద్దనుంచియు, ఋణములు తీయుట,

(2) సభ్యులయొక్క వ్యవసాయక, పారిశ్రామిక, కుటుంబ అవసర వస్తువులను, సభ్యులకు సరఫరా జేయుటకు, మరియు వారు తయారు చేసిన వ్యావ

సాయక పారిశ్రామిక వస్తువులను అమ్మకము చేయుటకు యేర్పాట్లు చేయుట;

(3) మెంబర్లకు అద్దెకిచ్చు నిమిత్తం, పనిముట్లు యంత్రములు (Machinary) పశువులను కొనుట లేక కలిగియుండుట;

(4) వ్యవసాయము, చేతివృత్తులు (కుటీర పరిశ్రమలు) చేనేత పరిశ్రమలలో నవీన పద్ధతులు ప్రదర్శించి వ్యాపింపజేయుట, అట్టి పద్ధతుల నవలంభించుటకు మెంబర్లను ప్రోత్సహించుట,

(5) భూమిని కౌలుకుగాని, గవర్నమెంటు వారి వల్ల గ్రాంటు మూలమునగాని, కేవల యితరులవల్ల గాని సంపాదించుట, మరిన్ని అట్టి భూమిని మెంబర్లు వ్యవసాయము చేయుటకు తిరిగి కౌలుకు యిచ్చుట,

(6) యెరువులు తయారు చేయుట, దానిని అమ్ముట;

(7) సర్వ సాధారణముగా మెంబర్లవల్ల గ్రామములో ఆహార వుత్పత్తి వృద్ధి చేయుటకుగాను అనువగు యితర విధములైన పనులు పూనుకొనుట,

(8) సభ్యులు వుత్పత్తిచేయు పాలను ఖరీదుచేసి విక్రయించుటకు యేర్పాటు చేయుట,

(9) సభ్యుల, సభ్యేతరుల వుపయోగార్థము వినోద, సాంఘిక సదుపాయములను ప్రోత్సహించుట, వీనికగు ఖర్చునిమిత్తము ప్రజలనుండి చందాల పూర్వకముగాను లేక ప్రభుత్వమునుండి విరాళములుగాను ధనమును సేకరించుట,

(10) మొత్తముమీద సభ్యులలో పొదుపు, స్వయం సహాయము, సహకారము ప్రోత్సహించుట,

నూతన నిబంధనల ప్రకారము సంఘములు సభ్యుల వుపయోగము కొరకు భూములు కౌలుకు తీసికొనవచ్చును. తిరిగి అమర్కము చేయవచ్చును. యెరువులు తయారుచేసి విక్రయించ వచ్చును. అధిక ఆహార వుత్పత్తికి సభ్యులద్వారా కృషి సలుపవచ్చును. ఇంతే కాకుండగా పాలు క్రయవిక్రయము చేయుటకు నిబంధనలలో అవకాశ మేర్పరుప బడినది. పఠన మందిరములు, గ్రంథాలయములు ఆటమందిరములు నాటక ప్రదర్శనములు వస్తుప్రదర్శనములు మొదలగు వినోదములు,

రెండవ ప్రకరణము.

సాంఘిక, కార్యకలాపములు జరుపుటకు పంచాయితీలకు అధికార మీయబడినది. ప్రభుత్వమువారు యీనిబంధ నలు నేడు అన్ని గ్రామ సంఘములలోను అమలులో పెట్టుటకు సర్వవిధముల తోడ్పడుచున్నారు. అంగటిలో అన్నీ యున్నవి. అల్లుని నోటిలో శని అన్నట్లు నిబంధనలలో గ్రామ సహకార పరపతి సంఘముగా సర్వ తోముఖాభి వృద్ధికి పనిచేయుటకు అవకాశము లెన్ని యైన కల్పింప బడినవి. ఈ మహత్తర కార్య నిర్వహ ణమునకు ప్రతి గ్రామములోను పనిచేసే కార్యకర్తలు కావలెను. రైఫేసినులుద్భవించ వలెను. అప్పుడే యీ యుద్యమము పటిష్టముగా పనిచేయును.

ఆలమూరు గ్రామ సహకార రూరల్ బ్యాంకు స్థాపించు నపుడు సంఘ 2 వ నిబంధనలో వుద్దేశములు యీ క్రింది విధముగా పొందు పరుపడినవి.

(i) ఉపయోగ కరమైన కార్యములకు మెంబర్లకు అప్పులు యిచ్చునిమిత్తము వినియోగించుటకై మెంబర్ల వద్దనుంచియు ఇతరుల వద్దనుంచియు ఋణములు తీయుట.

(2) మంచిరకమైన విత్తనములగూర్చి ప్రచారముచేయుట సరఫరాచేయుట

(3) సభ్యుల వుత్పత్తి సరకులను ఏజంటుగా వ్యవహరించి విక్రియించుట.

(4) వ్యవసాయ శాఖవారి సలహాల ననుసరించి సభ్యుల కమతములలో ఆధునిక వ్యవసాయ పద్ధతులు ప్రవేశపెట్టుటకు ప్రోత్సహించుట.

(5) సభ్యులకు, గృహోపకరణ, వ్యవసాయ పనిముట్లను సరఫరాచేయుట, యెరువులు, విత్తనములు, ఇనుప పనిముట్లు సభ్యులకు సమిష్టిగా క్రియము చేయుట.

(6) పశుగణము యొక్క అభివృద్ధికొరకు, ఆబోతులను పోషించుట.

(7) సభ్యుల తాలూకు పాలను కల్తీలేకుండగా క్రయ విక్రియము లేర్పాటు చేయుట.

(8) సభ్యులకు కావలసిన వ్యవసాయ పరికరములను గృహనిర్మాణము నకు కావలసిన పరికరములను సమిష్టిగా కొని ఏజంటుగా వ్యవహరించుట.

(9) వ్యవసాయ పురోభివృద్ధికి సభ్యుల ఆర్థికపురోభివృద్ధికి అనువగు ప్రణాళికలు అమలులోపెట్టుట

(10) సభ్యులలో గృహ పరిశ్రమలు వృద్ధిపొందుటకు సర్వవిధముల తోడ్పడుట.

(11) ఆరోగ్య శాఖాధికారుల సలహాపై సభ్యులలో ఆరోగ్యము, గ్రామ పారిశుధ్యము వృద్ధిపొందించుట, వైద్యసహాయము చేయుట.

(12) దుర్వ్యయముతో కూడిన దురభ్యాసములను, దురాచారములను తొలగించి సభ్యులలో మితవ్యయము ప్రోత్సహించుట.

(13) సభ్యుల పిల్లలకు విద్యా వేతనము లొసగి విద్యాభివృద్ధి కావించుట.

(14) సభ్యులలో స్వసహాయము, అన్యోన్య సహాయము వృద్ధిపరచి సహకారభావము పెంపొందించుట.

(15) పుస్తక భాండాగారములు నెలకొల్పుట పఠన మందిరము నెలకొల్పుట; వయోజన విద్యాశాలలు నిర్వహించుట, రేడియో ప్రతిష్టాపనము చేయుట, మాజిక్ లాంతరు ప్రదర్శనముద్వారా విజ్ఞానవ్యాప్తికి ప్రచార ప్రబోధములు సల్పుట.

(16) మరియు సభ్యులవద్దనుంచి, సభ్యులు కానివారి వద్దనుంచి ద్రవ్య సహాయముతోను, సాముదాయక ప్రయోజననిధినుంచి విరాళములతోను, యీ

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

దిగువ వివరించిన గ్రామోద్ధరణ కార్యములకు కృషిసల్పుట:—

(i) ప్రజాసౌకర్యము కొరకు, పుష్పవనములు, విహార ప్రదేశములు యేర్పరచుట,

(ii) గ్రామపారిశుధ్యమునకు నూతులు, చెరువులు బాగు చేయించుట,

(iii) గ్రామ పారిశుధ్యమునకు వీధులు తుడిపించుట మొదలగు కార్యప్రణాళికలు కావించుట,

(17) సభ్యుల వ్యాపార సౌకర్యముల కొరకు యితర ప్రదేశములలోని బ్యాంకుల ద్వారా డబ్బు బట్వాడాకు తగు సావకాశములు కలుగ జేయుట,

(18) ప్రభుత్వమువారి వద్దనుంచి లంక భూములను కౌలుకు తీసుకొని సమష్టి వ్యవసాయము వ్యవసాయ కూలీలకు వృత్తి కల్పించి సమష్టి వ్యవసాయపద్ధతుల నమలులో పెట్టుట,

(19) సభ్యులకు కావలసిన మంచి విత్తనములు వుత్పత్తి చేయుటకు తగు వసరులను కల్పించుట,

(20) సభ్యులకు, సభ్యులు కానివార్కి గ్రామపారిశుధ్యము విషయమై తగు బోధనలు చేయుటకును, రోగులకు ప్రథమ చికిత్స చేయుటకు తరిఫీదు

నిచ్చుటకు, వారము లేక ఒక పక్షము రోజులు పాఠశాల తరగతుల నిర్వహించుట. సదరు ప్రణాళిక లమలులో పెట్టుటకు, ప్రజల నుండి విరాళములు తీసుకొని, సాముదాయక ప్రయోజ ననిధి వలనను కార్యనిర్వాహణము కావించుట.

పై యిరువది యుద్దేశములు రూరల్ బ్యాంకు కార్య ప్రణాళికల నమలులో పెట్టుటకు నిర్దేశింప బడినవి. ఈకార్య ప్రణాళికలన్నియు ప్రజలలో ఆర్థిక, నైతిక, సాంఘిక, విద్యా వ్యవసాయ, వాణిజ్య, గృహాపరిశ్రమల సర్వతోముఖాభి వృద్ధికి లక్ష్యముగా పెట్టుకొని పని జరు పుట కుద్దేశింప బడినవి. ఈవుద్దేశములు ఒక్కనాటితో నెరవేరునవి కావు. బీజములు మాత్రము వేయబడినవి. ఇవి పెరిగి వృక్షములై శాఖోపశాఖలై కాలగతిని విస్త రింపవలసియున్నవి. బ్యాంకు పెట్టిన నాటినుండి నేటి వరకు ఒక్క దశలో యీవుద్దేశము లెంతవరకు కార్యా చరణలో పెట్టి నెరవేరుచున్నవి, ముందు విశదీకరింప బడును.

కాంగ్రెస్ నిర్దేశించిన నిర్మాణకార్య క్రమము నమలులో పెట్టుటకును, మహాత్మా గాంధీగారి గ్రామో ద్ధరణ ప్రణాళిక కార్యాచరణలో పెట్టి నడిపించుటకు

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

ఈ రూరల్ బ్యాంకులోని 2వ నిబంధనలోని వుద్దే
శము లెంతయు తగివున్నవి. ఈ ఆదర్శకమునే,
దృష్టిలో నుంచుకొని, బ్యాంకు కార్యకర్తలు ప్రజల
సర్వతో ముఖాభివృద్ధికి కృషిసల్పుచున్నారు. రాజ
కీయ కక్షులతోగాని పార్టీలతోగాని కుల తత్వములతో
సంబంధములేకుండ నిబంధనలమలులో పెట్టుట మూలమున
నీసంఘము ఒక దశలో నేటి అభ్యున్నతికి రాకలిగినది.

స భ్యు లు

రూరల్ బ్యాంకులో సభ్యులుగా చేరుటకు ఒక
ప్రమాణ పత్రము నిర్ణయింప బడినది, ప్రమాణ పత్ర
ముయీాదిగువ పొందు పరుపబడినది.

ఆలమూరు కో- ఆపరేటివు రూరల్ బ్యాంకు
లిమిటెడ్., ఆలమూరు, తూర్పుగోదావరి.
(నెం॥ బి॥ 1051 రు)

# సభ్యత్వ ప్రమాణపత్రము.

1. బ్యాంకుయెడల భక్తివిశ్వాసములుకలిగి తత్పురోభివృద్ధికి పాటుపడుదును.
2. స్వసహాయము, పరస్పర సహాయము, అన్యోన్య సహకారము, సర్వమానవ సౌభ్రాతృత్వము, జీవితా శయములని గుర్తింతును.

3. సంఘమును వంచనచేయుట 'తన్నుదా వంచనచేసు కొనుటయని విశ్వసింతును.
4. ఫలప్రదము లైనట్టియు, ఉపయోగ కరములై నట్టియు, కార్యములకు మాత్రమే తప్పనిసరియైన, అప్పుతీయుదును. తీసిన అప్పును దుర్వినియోగపర చను. ఋణవిముక్తికై సదాకృషి సలుపుదును.
5. జాతి, మత, కులకక్షలకు తావొసంగక, ఆరోగ్య, ఆర్థిక, నైతిక, విద్యా, రాజకీయ పురోభి వృద్ధికిపాటు పడుదును.
6. ఆదాయమునుమించి ఖర్చుచేయను.
7. మితవ్యయమును పాటించి పొదుపుచేసి కూడబెట్టుదును
8. సంఘముద్వారా సమిష్టి క్రియ విక్రియము లాభకర మని గుర్తించి వ్యవహరింతును.
9. ధర్మముతప్పకనిరాడంబర నైతిక జీవనమునుగడుపుదును
10. సద్గోష్ఠి, సత్సాంగత్యము, సన్మార్గప్రవర్తన, సత్యసంధత అలవరచుకొనుచు ఇందుకు భంగకరమైన దుర్వ్యసన ముల దరిజేరక, ఇతరులు పాల్పడకుండకృషి సల్పుదును.

"ఈ ధర్మములు దైనికజీవితమున నిర్వర్తించుటకు నాకు భగ వంతుడు శక్తిని ప్రసాదించుగాక.,, ఇట్లు

| | | |
|---|---|---|
| ఆ॥ కో॥ రూ॥ బ్యాంకి | సంతకము. | |
| ఆఫీసు, ఆలమూరు | గ్రామము. | |
| ది....................... | | అధ్యక్షులు. |

ఈప్రమాణము నాయెదుట తీసుకొనబడినది.

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

18 సం॥లు వయస్సుగల యీావిస్తీర్ణ ప్రదేశములోని ప్రతి వ్యక్తియు యిందు సభ్యులుగ చేరవచ్చుచు. స్త్రీ పురుష భేదములేదు. జాతి మతకుల వివక్షతలులేవు. మహాత్మా గాంధీగారి ఆశయప్రకారము దేశములో మత విభేదములు, కులకక్షలు, రాజకీయ పార్టీలు లేకుండగా దేశాభ్యున్నతికి పనిచేయాలంటే సహకారోద్యమమే శరణ్యము. దేశములోని అన్ని వర్గముల వారికి అనగా, భాగ్యవంతులకు, దరిద్రులకు, కార్మికులకు కర్షకులకు, విజ్ఞానికి అజ్ఞానికి యెట్టి వివక్షత చూపకుండగా సమాన గౌరవముతో సమానహక్కులతో, సమాన బాధ్యతలతో యీసంఘమున సభ్యత్వము పడయవచ్చును. సభ్యులుగా చేరుటకు ఒక రూపాయిమాత్రమే వాటాధనము నిర్ణయింప బడినది. ఒకషేరునకు ఒకఅణా ప్రవేశరుసుము. ఒక సభ్యుడు300 షేర్ల వరకు తీసుకొనుట కర్హత కలదు. మొదట340 షేర్లకు మాత్రమే ప్రవేశరుసుము తీసుకొనబడును. ఒక షేరునకు 10 రెట్లు అప్పుతీయవచ్చును. అనగా వ్యక్తిఋణాధికారము రు 3000/లు నిర్ణయింపబడినది. ఒక షేరు తీసుకొన్న సభ్యునికి 300షేర్లు తీసుకొన్న సభ్యునకు వాటా ధనముతో సంబంధము

లేకుండ ఒకవ్యక్తికి ఒకటే ఓటు 'One man one vote' సభ్యులను చేర్చుకొనుటకు బోర్డువారికి అధికారమున్నది. వ్యక్తుల సభ్యత్వ దరఖాస్తులను బోర్డువారు నిరాకరింపవచ్చును. సంఘోద్దేశములకు వ్యతిరేకముగా వ్యవహరించు వ్యక్తులను చేర్చుకొనకుండుటకు యీ యధికార మీయబడినది. ప్రతి వారిని సంఘములో చేర్చుకొనవచ్చును. అయితే పరిశీలన చేసి చేర్చుకొనుటకు, చేర్చుకొనకుండుటకు అంత్యాధికారము పాలక మండలివారిదేను. ఈ బ్యాంకు విస్తీర్ణ ప్రదేశములో నేగ్రామ పరపతి సంఘములో నైన సభ్యుడుగా చేర్చుకొనబడినచో యిందు సభ్యులుగా చేర్చుకొనబడరు.

ఈబ్యాంకులో సభ్యులుగా చేరినవారెవరైన, చేరిన సంవత్సరము కాలము లోపుగా వాటాధనము వాపసు కోరకూడదు. సంవత్సరము దాటిన పిమ్మట సంఘములో నెట్టిబుణములు లేనిచో పాలక మండలివారి యనుమతితో షేరుధనము వాపసు యివ్వబడును. ఒక సంవత్సరములో బ్యాంకు మొత్తము షేరుధనములో 10 వ వంతు మించి వాటాధనము వాపసు యివ్వబడదు. ఒక సభ్యుడు బ్యాంకు విస్తీర్ణ ప్రదేశమువదలి వెడలి

పోయినచో బ్యాంకు బకాయిలుపోను మిగిలిన వాటా ధనము వాపసు యివ్వబడును. సభ్యుని సంఘముతో పూచీ అతను సంఘములో చెల్లించిన వాటాధనము వరకేను. పరిమితిలేని పూచీలేదు. ఇతర గ్రామసంఘములకు, యీ రూరల్ బాంకునకును వ్యత్యాస మిదేను. ఇది పరిమితిగల పూచీసంఘము. ఎవరి అప్పు ఆస్తులతో వారికే సంబధము. సంఘ సమిష్టి అప్పు ఆస్తులకు వ్యక్తి గతముగా నెట్టి సంబంధములేదు. అయితే సంఘము ఎత్తివేయునపుడు సంఘ మొత్తమునకు నష్టము వచ్చినచో వ్యక్తుల షేరుధనము నష్టపరిహారము క్రింద తీసుకొనబడును. షేరుధనముమించి సంఘ సభ్యులకు యెట్టి బాధ్యతయులేదు.

ఇట్టి పరిమితిగల పూచీ సంఘము రాష్ట్రములో పల్లెటూళ్ళలో గ్రామ సమూహములకు పెట్టినచో బీద సాదలకు స్థానముండదని సంఘ ప్రారంభ దశలో సహకార ప్రొపిణ్యులు సందేహములు చెప్పిరి. డిపోజిటర్లు డబ్బు దాచుకొనుటకు సందేహింతురని యనుమానములు ప్రకటించిరి తుదకు సెంట్రల్ బ్యాంకే అప్పు నివ్వదని అనుమానములు ప్రకటించిరి. కాని ఒక దశలో

యీ బ్యాంకునకు బాలారిష్ఠ దోషము లన్నియు గతించి నవి. అనుమానస్తుల సందేహము లన్నియు తీరినవి. నేడు సంఘములో 4558 మంది సభ్యులున్నారు. ఇందులో 1648 మంది హరిజనులు. 958 మంది సభ్యులు స్త్రీలు. ఒకే సంఘములో యింతమంది స్త్రీలు, హరిజనులు యీరాష్ట్రములో యేసంఘములోనులేరు. భాగ్య వంతులతోపాటు బీదసాదలకు సభ్యత్వము కల్గు చున్నది. జాతి, మత, వివక్షతలు లేక సభ్యత్వము యెల్లరకు లభించుచున్నది. వ్యవసాయకులకు, కూలీలకు, యీనాందార్లకు, కౌలుదార్లకు వివిధ వృత్తులవారికి సంఘములోఆశ్రియ మీయబడు చున్నది. సంఘ సభ్యుల వృద్ధిని వివరములను తెలియజేయు 1, 2, 3, 4, 11 పట్టిక లిందుపొందుపరుప బడినవి.

# STATEMENT NO. 1.

## The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

### Progress of membership.

| Year. | Admitted. | Removed. | On the last day of the year |
|---|---|---|---|
| 1937–38. | 102 | 7 | 95 |
| 38–39 | 146 | 8 | 233 |
| 39–40. | 287 | 55 | 485 |
| 40–41. | 741 | 90 | 1,275 |
| 41–42. | 465 | 215 | 1,525 |
| 42–43. | 588 | 226 | 1,887 |
| 43–44. | 162 | 151 | 1,898 |
| 44–45. | 224 | 80 | 2,042 |
| 45–46. | 632 | 119 | 2,555 |
| 46–47. | 442 | 45 | 2,952 |
| 47–48. | 617 | 40 | 3,529 |
| 48–49. | 429 | 296 | 3,662 |
| 49–50. | 660 | 391 | 4,558 |

## STATEMENT No. 2.

### ఆలమూరు కో-ఆపరేటివు రూరల్ బ్యాంకు లిమిటెడ్, ఆలమూరు.

మెంబర్లు:- గ్రామవారీ.

| గ్రామముల పేర్లు. | మెంబర్ల సంఖ్య. | పురుషులు. | స్త్రీలు. |
|---|---|---|---|
| ఆలమూరు | 1,191 | 907 | 284 |
| చింతలూరు | 197 | 154 | 43 |
| మండపేట | 214 | 180 | 34 |
| నవాబుపేట | 259 | 213 | 46 |
| మూలస్థానం | 262 | 218 | 44 |
| జన్నాడ | 491 | 424 | 67 |
| పెనికేరు | 202 | 142 | 60 |
| తాతపూడి | 315 | 272 | 43 |
| పెదపళ్ళ | 199 | 179 | 20 |

| గ్రామముల పేర్లు. | మెంబర్ల సంఖ్య. | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| కలవచర్ల | 86 | 63 | 23 |
| వెదురుమూడి | 205 | 159 | 46 |
| పడమరఖండ్రిక | 453 } | 689 | 248 |
| అంగర | 484 } | | |
| మొత్తము | 4,558 | 3,600 | 958 |

# STATEMENT No. 3.

## The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

### Membership According to Occupation.

| | | |
|---|---|---|
| Agriculturists | ... | 3163 |
| Non-agriculturists | ... | 959 |
| Mixed | ... | 436 |
| | Total. | 4,558 |

Out of 3163 agriculturists:-

| | | |
|---|---|---|
| Non-cultivating land holders. | ... | 253 |
| Cultivating landholders. | ... | 579 |
| Tenants. | ... | 207 |
| Field Labourers. | ... | 2124 |
| | Total | 3163 |

# STATEMENT 4.

## The Alamuru co-operative Rural Bank Ltd., Alamuru.

Statement showing membership castwar.

| | | |
|---|---|---|
| Brahmins. | .... | 570 |
| Kammas. | .... | 297 |
| Kapus. | .... | 408 |
| Setti-buljis. | .... | 650 |
| Reddis. | .... | 130 |
| Native christians. | .... | 15 |
| Mohamadans. | .... | 28 |
| Harijans. | .... | 1,684 |
| Other castes. | .... | 776 |
| | Total .... | 4,558 |

## STATEMENT No. XI.

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.
Scheduled class members village-war and
their share captail.

| Village. | Class. | Males. | Females. | Share-capital. |
|---|---|---|---|---|
| Alamuru. | Setti-buljis. | 79 | 2 | Rs. 1066 |
| | Adi-Andhras. | 35 | 14 | 328 |
| | Adi-Dravidas. | 42 | 9 | 93 |
| | Potters. | 3 | — | 3 |
| West khandrika. | Setti-buljis. | 17 | 2 | 197 |
| | Adi-Andhras. | 126 | 80 | 560 |
| | Adi-Dravidas. | 30 | 16 | 109 |
| Angara. | Setti-buljis. | 69 | 16 | 366 |
| | Adi-Andhras | 75 | 50 | 314 |
| | Adi-Dravidas. | 60 | 39 | 230 |
| Vedurumudi. | Setti-buljis. | 45 | 16 | 380 |

| Village. | Class. | Males. | Females. | Share-capital. |
|---|---|---|---|---|
| | Adi-Andhras. | 61 | 20 | Rs. 211 |
| | Adi-Dravidas. | 22 | 7 | 82 |
| Pedapalla. | Setti-buljis. | 44 | 9 | 517 |
| | Adi-Andhras. | 62 | 34 | 390 |
| | Adi-Dravidas. | 16 | 18 | 68 |
| Chintaluru. | Setti-buljis. | 30 | 16 | 46 |
| | Adi-Andhras. | 37 | 4 | 123 |
| Kalvacherla. | Adi-Dravidas. | 15 | 2 | 34 |
| Penikeru. | Setti-buljis. | 19 | 2 | 186 |
| | Adi-Andhras. | 27 | 10 | 91 |
| | Adi-Dravidas. | 23 | 11 | 93 |
| Thatapudi. | Setti-buljis. | 18 | — | 22 |
| | Adi-Andhras. | 218 | 40 | 1321 |
| | Adi-Dravidas. | 18 | — | 48 |
| Jonnada. | Setti-buljis. | 37 | 2 | 418 |
| | Washer-men. | 6 | 1 | 7 |
| | Adi-Andhras. | 94 | 48 | 1,257 |

| Village. | Class. | Males. | Females. | Share-captail. |
|---|---|---|---|---|
| | Adi-Dravidas. | 16 | 4 | Rs- 66 |
| Mulastanam. | Setti-buljis. | 7 | — | 25 |
| | Adi-Andhras | 63 | 9 | 486 |
| | Adi-Dravidas. | 68 | 8 | 915 |
| Navabupeta, | Setti.buljis. | 28 | 1 | 486 |
| | Adi-Andhras. | 62 | 7 | 1098 |
| | Adi-Dravidas. | 2 | 2 | 14 |
| | Total ... | 1582 | 499 | 11,659 |

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

సంఘము ప్రారంభించి నప్పటినుంచి నేటివరకు సంఘములో సభ్యులెట్లు వృద్ధి యగుచున్నది మొదటి పట్టికలో పొందుపరుప బడినది. రెండవ పట్టికలో గ్రామవారీ సభ్యత్వము, స్త్రీ, పురుషులు సభ్యుల సంఖ్య తెలుపబడినది. 3 వ పట్టికలో వ్యవసాయకులు ఇతరుల సంఖ్య తెలుపబడినది. 4 వ పట్టికలో కులము వారీ సంభ్యత్వము చూపబడినది. 11 వ పట్టికలో షెడ్యూలుక్లాసు మెంబర్లు తెలుప బడిరి.

కులమువారీగా సభ్యత్వము చూపించుట యీ స్వాతంత్ర్య దినములలో అనుచితము. భారతదేశ ప్రధానా మాత్యులగు శ్రీ. జవహర్ లాల్ నెహ్రు గారు కులమును తెలియజేసే పండిత బిరుదమును విసర్జించి దేశమునకు ఆదర్శకము చూపిరి. ఉద్యోగములలోను కళాశాల ప్రవేశములలోను వేతనముల లోను కులతత్వములను చూపకూడదని భారతదేశ ప్రభుత్వమువారు యెలుగెత్తి చాటుచున్నారు. మనరాష్ట్ర ములో యింకను యీకులతత్వము నశించకుండా అన్ని వర్గములలోను వేళ్ళు పారుచునే యున్నది. దీనికి తోడు ఉత్తరాధి, దక్షిణాది, ప్రాంతీయ తత్వము కూడ

బయలు దేరినది. మహాత్మ గాంధీగారి నిర్మాణకార్యక్రమము అందరు అమలులో పెట్టాలంటే హిందూమహమ్మదీయ సఖ్యతయేగాక అన్ని మతముల వారిలోను కులముల వారిలోను సమైక్యత కలుగ జేయవలెను. ఇట్టి సుహృద్భావము, ఐకమత్యము, పరస్పర విశ్వాసము, అన్యోన్య సహాయము కలుగజేయుటకు సహకార సంఘములే పునాదులు కావలెను. ఈ ఆశయము నెరవేర్చుటకే రూరల్ బ్యాంకులో అందరికి సభ్యత్వము యిచ్చి వివక్షత లేకుండ కలుగజేయ బడుచున్నది. అందరిలోను సామరస్యభావము సృహృద్భావము కలుగ జేయుట కింకను ఎంతయో కృషి సల్పవలసి యున్నది. ఈ విషయము ముందుగా రాష్ట్ర ప్రభుత్వమువారే ఆదర్శకము అమలులో పెట్టిన ఎంతయేని దేశ సౌభాగ్యమునకు మార్గదర్శకమగును.

ఇంకను సహకారోద్యమములో కులసంఘములకు స్థాన మీయబడుచున్నది. హరిజనులకు ప్రత్యేక సంఘములునెలకొల్ప బడుచున్నవి. చేనేత పనివాండ్రకు కుల సంఘములు వృద్ధిచేయబడు చున్నవి. ఈ రీతిగనే చేపలు పట్టువారికి కులత్వము మీదనే సంఘములు స్థాపింప

బడుచున్నవి. ఈ కులతత్వములు నశింపవలెను. వృత్తుల పోషణకు వివిధ పరిశ్రమలకు ఆయావృత్తుల వారికి సకలార్ధ సహకార సంఘములలోనే ప్రత్యేక డిపార్టు మెంటుగా పనిచేయించాలి. అప్పుడే సహకారోద్యమము కులతత్వము లేకుండగ రాజకీయ కక్షలకు తావులేకుండ సర్వ సమాదరణము పొందగలదు. రూరల్ బ్యాంకు పాలకవర్గమువారు యీ ఆదర్శకములను లక్ష్యములో నుంచుకొని వివిధ వృత్తుల వారికి స్థానమిచ్చి జాతీయ సమైక్యతకు కులతత్వ విభేదములను రూపుమాపుటకు కృషి సల్పుచున్నారు.

## వాటాధనము.

సంఘములో సభ్యుల అభివృద్ధితోపాటు సంఘు వాటా ధనము యేటేటను వృద్ధియగుచున్నది. సంఘము స్థాపించిన మొదటి సంవత్సరములో రు750ల షేరుధనముతో ప్రారంభ మైనది. నేడు దాదాపు రు1,50,000 లషేరు ధనమున్నది. వాటాధనము సంఘమునకు, చెట్టునకు కూకటివేరు వంటిది. పరిమితిగల పూచీ సంఘమగుటచే ఋణము తీయు ప్రతి సభ్యునినుంచి నూటికి 10 రూపాయలు వాటాధనము

వసూలు చేయబడుచున్నది. పర్మిటిలేని పూచీగల గ్రామసంఘములలో నూటికి రు5లమాత్రమే షేరుధనము వసూలు చేయబడు చున్నది. వాటాధనము ఆధారము మీదనేసంఘ ఋణాధి కారముకూడ ఆధారపడి యున్నది. బ్యాంకు 18వ నిబంధన ప్రకారము వాటాధనము క్షేమనిధి మొత్తముపై 8 రెట్లు ఋణాధికారము కలదు. నేడు బ్యాంకులో క్షేమనిధిరు 46,058ల కలదు. వాటాధనము 1,48,321 రూపాయ లున్నది. బ్యాంకు మొత్తము ఋణాధికారం రు 15,55,032ల లున్నది. షేరు ధనము క్షేమనిధి వృద్ధితో సంఘ ఋణాధికారము వృద్ధి యగును. ఈ సంఘ ఋణాధికారముకు లోబడియే బ్యాంకువారు డిపాజిట్లు స్వీకరించుచున్నారు. సెంట్రల్ బ్యాంకులో అప్పులు తీయు చున్నారు. సంఘ ఋణాధి కారము ఈ దిగువ పట్టిక మూలమున విశదమగును.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

STATEMENT No. 9.

The Alamuru Co-operative Rural BankLtd.,

A l a m u r u.

Maximum borrowing limit:-

| | | RS. |
|---|---|---|
| Reserve Fund. | ... | 46,058 |
| Paid-up Share-capital | ... | 1,48,321 |
| Total | ... | 1,94,379 |
| | | 8 |
| Maximum borrowing limit, | ... | 15,55,032 |

రూరల్ బ్యాంకులో మైనర్ల తరపున వారి సంరక్షకులు సభ్యులుగచేరి వాటాధనము కట్టవచ్చును. మైనర్ల ఆస్థినిచక్కబెట్టువారు అప్పులు తీయవచ్చును. వారితరపున వ్యవహారింప వచ్చును. మైనర్లతరపున గార్డియన్లు సభ్యులుగా చేర్చుటకు రూరల్ బ్యాంకు నిబంధనలు అంగీకరించు చున్నవి. ఈ రీతిగనే భూమితనఖా బ్యాంకులలో మైనర్లతరపున గార్డియన్లు వ్యవహరించుటకు వీలున్నది. గ్రామ సంఘములలోను మరి యేయితర సహకార సంఘములలోను మైనర్లను సభ్యులుగా చేర్చుకొన వీలులేదు. వాటా ధనముయొక్క క్రమాభివృద్ధిని తెలియజేయు స్టేటుమెంటు యీదిగువ పొందుపరుపబడినది.

ఆలమూరు సకలార్థసహకార సంఘము.

Statement No. 5.

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

Progress of Share-Capital.

| Year | Received | Paid | On the last day of the yeor. |
|---|---|---|---|
| | Rs. | Rs. | Rs. |
| 1937_38 | 750 | 5 | 745 |
| 1938_39 | 2,472 | 69 | 3,148 |
| 39_40 | 3,737 | 195 | 6,690 |
| 40_41 | 4,416 | 976 | 12,068 |
| 41_42 | 2,987 | 1,827 | 13,228 |
| 42_43 | 2,560 | 2,682 | 13 106 |
| 43_44 | 3,477 | 1,626 | 14,957 |
| 44_45 | 5,898 | 2,056 | 18,779 |
| 45_46 | 12,286 | 5,094 | 25.991 |
| 46_47 | 10 323 | 2,422 | 33,892 |
| 47_48 | 18,936 | 2,655 | 50,173 |
| 48_49 | 18,941 | 8,620 | 60,494 |
| 49_50 | 42,514 | 21,387 | 1,48,321 |

## రెండవ ప్రకరణము.

### డిపాజిట్లు

ప్రారంభమునుంచి యీబ్యాంకు డిపాజిట్లమీదనే విస్తారముగా ఆధారపడియున్నది. ఈ డిపాజిట్లు సభ్యుల వద్దనుంచియు సభ్యులు కానివారివద్దనుంచి స్వీకరింప బడు చున్నవి. జర్మనీలో రై ఫేసిన్ సిద్ధాంతముపై స్థాపింప బడిన గ్రామ సంఘములు ముఖ్యముగా వాటాధనము, డిపాజిట్లపై నే వ్యవహరించుచున్నవి. కేంద్ర సంస్థలనుంచి ఋణములు తీయుట తక్కువ. సభ్యులలో మితవ్యయము పొదుపరితనము అలవాటు చేయుటకు డిపాజిట్లు ప్రోత్సహింప బడుచున్నవి. సంఘ సభ్యులు తమ స్వంత ద్రవ్యమును సంఘములో దాచుకొనినచో సంఘము స్వయంపోషకత్వము కలిగి యుండుటయేకాక యితరులకు కూడ తమద్రవ్యములు దాచుకొనుటకు విశ్వాస పాత్రమగును. జర్మనీ దేశములో గ్రామ సహకార పరపతి సంఘములు సాధారణముగా స్వయం పోషకత్వము కలిగి స్వంత ద్రవ్యము మీదనే ఆధారపడి యున్నవి. భారత దేశములో ప్రారంభములో రిజి ష్ట్రార్లు సంఘములలో డిపాజిట్లు సంపాదించుటకు ప్రోత్స హించెడివారు. కాని క్రమేణ సంఘములు వృద్ధియైన

కొలది డిపాజిట్లపై నిఘా తగ్గినది. వ్యక్తి సభ్యుల డిపాజిట్లు అరుదైనవి. గ్రామ సంఘములకు కావలసిన డబ్బంతయు సెంట్రిల్ బ్యాంకులలో అప్పులు తెచ్చుకొనుటతోనే సరిపెట్టుకొను చున్నారేగాని స్వంత డిపాజిట్లు సంపాదించి సంఘములు స్వయముగా నిర్వహించుకొనే ఆసక్తి సంఘములలో కలుగలేదు. సంఘములలో స్వంత డిపాజిట్లు లేకపోవుట మూలమున సెంట్రిల్ బ్యాంకులపై సంఘముల పరాధీనత హెచ్చైనది. సెంట్రల్ బ్యాంకులకు అప్పు దరఖాస్తు సంఘములు చేసుకొన వలెను. బ్యాంకు సూపరు వైజరు యీదరఖాస్తులను సిపార్సు చేయవలెను. యూనియన్ సిఫార్సు కావలెను. సెంట్రిల్ బ్యాంకు కార్య నిర్వాహక వర్గమువారు మంజూరు చేయవలెను. మంజూరైన ప్రకారము తిరిగి పంచాయితీ దారులు సొమ్ము తీసుకొని దరఖాస్తుదార్లకు పంచవలయును. ఈ తంతు అంతయు జరుగుటకు కాలయాపన జరుగుచున్నది. సకాలములో రైతు అక్కరలకు డబ్బు దొరకక కాలవిలంబన మగుచున్నది. ఇది సామాన్యముగా సెంట్రిల్ బ్యాంకుల మీద ఆధారపడే సంఘము లన్నియు యీకాల విలంబనమునకుపాట్లు పడవలసినదేను. ప్రతిసంఘము స్వంత

డిపాజిట్లు సంపాదించు కొన్నచో యీ ధనము సభ్యుల కిచ్చి సెంట్రల్ బ్యాంకునుంచి డబ్బు వచ్చిన తరువాత డిపాజిట్లు తీర్చవచ్చును. కాలయాపన లేకుండ యెప్పటి కప్పుడు ధరఖాస్తు దారులకు అప్పులు మంజూరు చేయ వచ్చును. పర్మితిలేని పూచీ గ్రామ సహకార సంఘ ములలో అమలులో వుండినపుడే డిపాజిట్లు రాగలవని, లేనిచో ప్రజలకు విశ్వాస ముండదని కొందరు సహకా రుల అభిప్రాయము. అయితే వాస్తవముగా చూచిన పర్మితిలేని పూచీగల గ్రామ సహకార సంఘములలో డిపాజిట్లు వచ్చుటలేదు. చాల సంఘములలో డిపోజిట్లు శూన్యమేను. పర్మితిగల పూచీగల అర్బను బ్యాంకులలోనే విస్తారముః డిపాజిట్లు కనబడుచున్నవి. ఇందుకు కార ణము వ్యవహార దక్షతయే అని ఋజువగుచున్నది. సమ ర్థతతో నిర్వహింపబడు అర్బన్ బ్యాంకులలో ధారళ ముగా డిపాజిట్లు వచ్చుచున్నవి. ధన ప్రవాహము అడ్డులేక యీ బ్యాంకులలో ప్రవహించుచునినే యున్నది. పర్మితిగల పూచీ సంఘములని ప్రజలడబ్బు దాచుకొనుటమానుటలేదు. పర్మితిలేని పూచీగల గ్రామ సంఘములు శాసనరీత్యా ఎంత కట్టుదిట్టముగా ధనమునకు నష్టము రాకుండ బిగింపు చేయబడినను యీ సంఘము

లలో ధనము ధారాళముగా ప్రవహించుట లేదు. డిపాజిట్లు పారుటలేదు. సెంట్రిల్ బ్యాంకువారి అప్పులే గత్యంతర మగుచున్నది. ఇందుచేతనే పరిమితిగల పూచీయూ, పరిమితిలేని పూచియూ, యని సంఘనిర్మాణము వితర్కించుకొనుటకంటె అనుభవమును పట్టి చూచిన కార్య నిర్వహణము సమర్ధతతో నడిపించు పరిమితిగల పూచీ సంఘములే ప్రజాదరణ పొందు చున్నవి. ఇందుకు ఆలమూరు రూరల్ బ్యాంకు వ్యవహారములే నిదర్శనము. ఈ బ్యాంకు 1938 లో ప్రారంభిచు నపుడు రు 10,000 ల డిపాజిట్లతో ప్రారంభమైనది. నేడు దాదాపు 5 లక్షల రూపాయలు డిపాజిట్లు బ్యాంకు సంపాదించినది. ఇది కాకుండగా సభ్యుల కరెంటు డిపాజిట్లు కలవు. త్రిప్టు డిపాజిట్లు కలవు. మొత్తము ఇవి చెరియొక లక్ష వుండును. సభ్యులు కానివారు వివిధ ప్రాంతములనుంచి బ్యాంకులో డబ్బు స్థిర డిపాజిట్లలో నిల్వ వేసుకొను చున్నారు. ధనవంతులే గాక మైనర్ల తాలూకు డబ్బు, అనాధలడబ్బు, తదితర గృహస్తుల ఆదాయపు డబ్బు నమ్మకముతో యిందు దాచుకొను చున్నారు. స్వల్ప మొత్తము కనీసము రు 5 లు దాచుకొన వచ్చును. హెచ్చు మొత్తము రు 50,000 లు

దాచుకొన్నవారు కలరు. సంవత్సరము లోపు కాలము నకు స్థిర డిపాజిట్లు తీసుకొన బడవు. దీర్ఘవాయిదా డిపాజిట్లకు 5 సంవత్సరములు కాలపర్మితి కలదు. ఒక సంవత్సరము వాయిదా డిపాజిట్లపై బ్యాంకువారు 3% వడ్డీ యిత్తురు. 2 సంవత్సరముల కాలపరిమితికి డిపాజిట్లకు 3½% వడ్డీ యీయబడును. 3 సంలు అంతకు మించిన వాటికి 4% వడ్డీ యివ్వబడుచున్నది. 4 రూపాయలు మించి డిపాజిట్లపై హెచ్చు వడ్డీ యీయబడదు. స్థిర డిపాజిట్లపై 100 కి 90 చొ॥న అవసరమైనచో డిపాజిట్ల దార్లు అప్పుతీసుకొన వచ్చును. ఈ అప్పులపై డిపాజిట్లపై వడ్డీకంటె 1% హెచ్చువడ్డీ వసూలు చేయబడును. కాల పరిమితిలోగా డిపాజిట్లు వాపసు చేసేయెడల బ్యాంకు వారి అనుమతిపై వడ్డీ నష్ట పరిహారముతో వాపసు చేయబడును. 6 మాసములు లోపుగా స్థిర డిపాజిట్లు వాపసుకోరే యెడల కరెంటు డిపాజిట్లు రేటు యీయబడును. కరెంటు డిపాజిట్లపై 1% వడ్డీ యివ్వబడును. డిపాజిట్లు యిచ్చి పుచ్చుకొనుటలో బ్యాంకు చక్కటి వసర్లు ఏర్పచినందున ప్రజలు విశ్వాసముతో బ్యాంకులో నిల్వ వేసుకొను చున్నారు. సంవత్సరమున కొకసారి వడ్డి చెల్లించబడును. అర్ధసంవత్సరము

లోపు కాలమునకు డిపాజిట్లు తీసుకొనుట లేదు. ఆస్థిపరు లేకాకుండా, నిరాస్థిపరులు, బీదసాదలు,సంఘములోతమకై నందిన ఆదాయమును నిల్వ వేసుకొనుచున్నారు. పొదుపు బిళ్ళల (త్రిఫ్టులేబుల్) అమ్మకముద్వారా బ్యాంకులో అను దినము సభ్యుల స్వల్ప ఆదాయములు కూడిక చేసి నిల్వ వేయడడుచున్నవి. ఈ స్వల్ప ఆదాయములు కూడిక ప్రోత్సహించుటకు (Thrift labels) కూడిక బిళ్ళల ప్రణాళిక ఒకటి అమలులో పెట్టబడినది. ఆస్థిలేని వ్యవసాయ కూలీల ప్రతి సభ్యునినుంచి యీ స్వల్ప ఆదాయము నిర్బంధముగా వసూలు చేయబడు చున్నది.

## పొదుపు బిళ్లలుకొనే నిర్బంధ విధానవివరము:—

ఒకఅణా, రెండుఅణాలు, పావలా, అర్ధరూపాయి రూపాయి విలువగల అయిదురకముల పొదుపుబిళ్ళలు బ్యాంకువారు అచ్చువేయించి అమలులో పెట్టుచున్నారు. ఒక్కొక్క కాగితములో పండ్రెండు బిళ్ళలు ముద్ర వేసియుండును. ఒక్కొక్క పుస్తకములో 100 కాగితములుండును. ఈ పుస్తకములు బ్యాంకు కలెక్షన్ ఏజంట్లు (Collection Agents)ద్వారా సభ్యులయిళ్ళకు

పోయి అమ్మకము చేయబడును. సాధారణముగా కూలి నాలి చేసుకొని జీవనాధారము కలిగిన శ్రామికుల వద్ద నుంచియే యీకూడిక బిళ్ళలు(Thrift labels) అమ్మకము చేసి వసూలు చేయబడును. ప్రతి సభ్యుడు కూలి సంపాదించుకొను దినములలో 0—1—0 మొదలు 1 రూపాయి వరకు యీబిళ్ళలు కొని బ్యాంకులో డబ్బుదాచు కొన వచ్చును. పోస్టాఫీసులో వివిధరకము లబిళ్ళలు యెట్లు అమ్మకము చేయబడునో పోస్టు జవాను బీటుకు వెళ్ళినపుడు పోస్టు మాష్టరుగారి వద్ద బిళ్ళలుతీసుకొని సాయంకాలము పోస్టు మాస్టరుగారికి డబ్బు యిచ్చునట్లే బ్యాంకు ఆఫీసునుంచి కలెక్షను ఏజంట్లు అనుదినము వివిధరకములు బిళ్ళల పుస్తకములు తీసుకొని వారివారి గ్రామాదులకు పోయి శ్రామికులకు బిళ్ళలనమ్మి బ్యాంకులో వారి కాతాకు జమ కట్టుదురు. ఈ బిళ్ళల పుస్తకము ఒక్కొక్క తరహా (Denomination) ఒక్కొక్క రంగు నిర్ణయించి ముద్రించుటచే చదువు రాని ఆడువారు, మగవారు బిళ్ళరంగును గుర్తించి బిళ్ళలఖరీదును చెల్లించుచుందురు. ఈ రీతిగా అనుదినము బీదసాదల నుంచి ఆదాయము బ్యాంకునకు అనునిత్యము ప్రవహించుచున్నది. వ్యావ

సాయ కూలీలకు పని పాటలున్న దినములలో తాము సంపాదించు కొన్న ఆదాయములో నుంచి 0_1_0; 0_2_0; 0_4_0 చొ॥న అనుదినము దాచుకొనుట మూలమున సంవత్సరాంతమునకు ప్రతి శ్రామికుడు రు 50/ లేక 100/లు నిల్వ చేసుకొని తమకుకావలసిన అక్కరలకు అనగా బ్యాంకులో బియ్యము, బట్ట తది తర సామాగ్రిని కొనుక్కొని సులభముగా సుఖజీవనము చేసి కొన గలుగుచున్నాడు. కుటుంబ ఖర్చులకు కావ లసిన అప్పులు తీర్చుకొనుటకు యీ స్వల్ప ఆదా యమునుండి తీర్చుకొన గలుగుచున్నాడు. ఈ శ్రామిక లకు త్రిప్టుకాతాలు బ్యాంకులో 2వేలున్నవి. సాలీనా మాయీశ్రామికులు కూడ బెట్టిన ధనము దాదాపు లక్ష రూపాయలుండును. బ్యాంకు వసూళ్ళ సిబ్బంది (Collection Agents) పూడ్పుల కాలములో కోత లలో శ్రామికులు నివసించు పేటలలోనికి వెళ్ళిప్రచార ప్రబోధములు సల్పి తమస్వల్ప ఆదాయములను కూడ బెట్టుకొనుట మూలమున బ్యాంకులో తమ కెట్టి పర పతి కల్గుచున్నదో తెలియజెప్పుచు యీ శ్రామికుల ద్వారా చిన్న డిపాజిట్లతో బ్యాంకులో వేలకొలది ద్రవ్యము కూడ బెట్టబడుచున్నది. ఈ స్వల్ప డిపా

జిట్లు యేసాలున కాసాలు శ్రామికుల అప్పుల కాతా లకు జమ కట్టబడుచున్నవి. ఈ స్వల్పడిపాజిట్ల రాబ డిపైననె శ్రామికులకు యేటేటను దసరా పండుగకు, సంక్రాంతి పండుగకు బట్టలు బరాతము యీయబ డుచున్నది. ఈ త్రిప్టు డిపాజిట్ల వ్యక్తులకు, ఆర్థికోప పత్తి కలుగ జేయుట యేకాక బ్యాంకునకు కూడ నిత్యము ధన ప్రవాహము కలుగజేయుచున్నది. బ్యాంకు స్థిర డిపాజిట్ల క్రమాభి వృద్ధి యీ దిగువ పట్టికలో విశదీకరింపబడినది.

## STATEMENT No. VI.

## The Alamuru Co-operative Rural Bank Ltd. Alamuru.

### DEPOSITS :-

| | |
|---|---|
| Members' Fixed Deposits. | Rs. 1,55,320 |
| Non-members fixed deposits. | 3,39,820 |
| Total. | 4,95,140 |

### Progress of Fixed Deposits.

| Year | Members | Non-members | Total |
|---|---|---|---|
| | Rs. | Rs. | Rs. |
| 1937-38 | 8,575 | 1,665 | 10,240 |
| 1938-39 | 1,000 | 10,665 | 11,665 |
| 39-40 | — | 20,855 | 20,855 |
| 40-41 | 2,000 | 26,227 | 28,227 |
| 41-42 | 3,900 | 31,142 | 35,042 |
| 42-43 | 20,200 | 72,590 | 92,790 |
| 43-44 | 23,405 | 88,050 | 1,11,455 |
| 44-45 | 30,600 | 1,18,650 | 1,49,250 |
| 45-46 | 54,130 | 1,30,355 | 1,84,485 |
| 46-47 | 83,055 | 1,42,265 | 2,25,320 |
| 47-48 | 1,21,605 | 2,19,325 | 3,40,930 |
| 48-49 | 1,32,275 | 2,42,615 | 3,74,890 |
| 49-50 | 1,55,320 | 3,39,820 | 4,95,140 |

| | |
|---|---|
| The maximum borrowing limit | 15,55,032 |
| Amount borrowed | 7,65,160 |
| Margin | 7,89,877 |

బ్యాంకు డిపాజిట్లతో ప్రథమము నుంచి యీ సంస్థ నిర్వహింప బడుచున్నను వ్యాపారము వృద్ధియైన కొలది డిపాజిట్లు సరిపోవుటలేదు. సెంట్రల్ బ్యాంకునుంచి స్వల్పవాయిదా అప్పులు తీయబడు చున్నవి. మరియు సెంట్రల్ బ్యాంకువారు యీ బ్యాంకునకు స్థిరాస్థి తనఖాదస్తావేజులు హామీపై రు 50 వేలు క్యాష్‌క్రెడిటి (Cash credit) యిచ్చి యున్నారు. మరియు సభ్యులు వ్రాసియిచ్చిన తనఖా దస్తావేజుల హామీపై స్వల్పవాయిదాలపై| సంవత్సరము వాయిదా పైన సెంట్రల్ బ్యాంకువారు అప్పులు మంజూరుచే యుచున్నారు. ఈ సంవత్సరములో నాలుగు లక్షల రూపాయలు సెంట్రల్ బ్యాంకులో స్వల్ప వాయిదా అప్పులు తీయబడినవి. సభ్యులకు కావలసిన 3 లేక 5 సం॥ల దీర్ఘవాయిదా అప్పు బ్యాంకు స్వంతడబ్బు అనగా స్వంత డిపాజిట్లు, పేరుధనము నుంచి యివ్వ బడుచున్నవి. సెంట్రల్ బ్యాంకు నుంచి యింతవరకు దీర్ఘవాయిదా అప్పులు తీయలేదు. బ్యాంకు వ్యాపారము వృద్ధి యగుటచే దీర్ఘవాయిదా అప్పులు సెంట్రల్ బ్యాంకు నుంచి తీయుట ఆవశ్యకత కలుగు చున్నది. ఇందుకొక ప్రతిబంధకము కలదు. స్వల్ప

వాయిదా అప్పులు తెచ్చుకొనుటకు బ్యాంకులో ముగ్గురు పంచాయితీదార్లు ప్రామిసరీ నోటు వ్రాసి పంపించిన సెంట్రల్ బ్యాంకువారు మంజూరు చేయుచున్నారు. ఇందుమూలమున కానీ ఖర్చుఅగుటలేదు. దీర్ఘవాయిదా అప్పు బ్యాంకు నుండి తీసిన-చో బాండు రిజిష్టరుచే యించవలెను. ఇందుకు రిజిష్ట్రేషను ఫీజు యిచ్చు కోవలసి యుండును. లక్షరూపాయలకు బాండు రిజిష్ట్రీ చేయవలసివచ్చును. కాన హెచ్చుఫీజగును. సభ్యు లురూరల్ బ్యాంకునకు స్థిరాస్థి తనఖా దస్తావేజులు వ్రాసి యిచ్చుచున్నారు. ఈ దస్తావేజుల కయ్యే వ్యయము అయిదు వేల రూపాయలలోపు మొత్తములకు సగము ఫీజుమాత్రమే. అయిదు వేలరూపాయలు మించిన తన ఖాదస్తావేజుల మీాద సభ్యుల నుంచి ప్రభుత్వమువారు పూర్తి రిజిష్ట్రేషను ఫీజు వసూలు చేయుచున్నారు. భూమి తనఖాబ్యాంకులలో సభ్యులు తనఖాదస్తావేజులు రిజిష్టరు చేసి ప్రాథమిక బ్యాంకు వారికి యిచ్చు చున్నారు. ప్రాథమిక బ్యాంకు వారువీటిని ట్రాన్సు ఫరు పూర్వకముగా సెంట్రల్ ల్యాండుమార్గేజి బ్యాంకు వారికి దఖలు పరచు చున్నారు. సెంట్రల్ ల్యాండు మార్గేజీ బ్యాంకు వారు వీనినే డిబెంచర్ల హామీగా

ట్రస్టీకి దఖలు పరచుచున్నారు. ప్రాథమిక బ్యాంకు వారు సభ్యులు వ్రాసియిచ్చిన దస్తావేజులను సెంట్రల్ ల్యాండు మార్టిగేజీ బ్యాంకువారిక్రి రిజిష్టరు చేయించ నక్కరలేకుండగానే దఖలు పరచుటకు మదాసు ప్రభుత్వమువారు నూతన శాసనము కావించిరి. ఇందు మూలమున ప్రాథమిక బ్యాంకులలో రిజిష్ట్రేషను ఫీజు చెల్లించ నక్కరలేకపోయినది. ఇట్టి పద్ధతినే ప్రభుత్వ మువారు గ్రామ సహకార సంఘముల పట్లకూడవర్తించుటకు నూతన శాసనము కావింప వలసియున్నది. సంఘములు సెంట్రల్ బ్యాంకునకు వ్రాసి యిచ్చిన తనఖా దస్తావేజులు రిజిష్ట్రేషను ఫీజు మితిమీరి పోవును. సంఘములకున్న స్వల్ప వ్యత్యాసములతో పూర్తిఫీజుని చ్చిన సంఘములకు హెచ్చునష్టము వాటిల్లును. ఈ విషయము ప్రభుత్వమువారు చర్యతీసుకొన్న-చో సహకార వుద్యమమునకు మహోపకారమగును. మాధ్యమిక అప్పులు (Intermediary loans) అనగా 3 మొదలు 5 సం॥ల వాయిదా అప్పులు సభ్యులకు లంభిచుటలేదు. ఈ విషయమై సహకారులు ఆందోళన సలుపవలసియున్నది.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

బ్యాంకు నిబంధనల ననుసరించి సంఘముఋణాధి కారమునకు లోబడి సభ్యులనుంచి, సభ్యులు కానివారి వద్దనుంచి అయిదు లక్షల రూపాయలు స్థిర డిపాజిట్లు తీసుకొనబడినవి. సెంట్రల్ బ్యాంకునుంచి నాల్గులక్షల రూపాయలు స్వల్పవాయిదా అప్పులు తీసుకొనబడినవి. కరెంటు అక్కౌంట్లు, యితర డిపాజిట్లు ఒక లక్షకలదు. మొత్తము పదిలక్షల రూపాయలు నేడు బ్యాంకు అప్పుల పూర్వకముగను, డిపాజిట్ల రూపకముగను స్వీకరించినది. బ్యాంకు యొక్క ఋణాధికారము రు 15,55,00 /— ఇంకను బ్యాంకు 5,55,000/— వరకు డిపాజిట్లు స్వీకరింప వీలున్నది. బ్యాంకు వ్యాపారము వృద్ధియైన కొలది, షేరుధనము హెచ్చును. క్షేమనిధి వృద్ధియగును. ఈ వృద్ధితోపాటు బ్యాంకు ఋణాధికారము దానంతటదే వృద్ధియగును. బ్యాంకు ప్రజలనుంచి, సభ్యులనుంచి తీసుకొను డిపాజిట్లపై వడ్డీ రేటు సెంట్రల్ బ్యాంకువారు యిచ్చెడి ఋణవడ్డీ రేటును బట్టి మారుచుండును. సెంట్రల్ బ్యాంకువారు సంఘమున కిచ్చెడిరేటు ప్రస్తుతము రు 4_8 0 లుగ వున్నది. సాధారణముగా యీరేటు తరుచు మార్చరు. వారికి డిపాజిట్లు తక్కువ రేటు కువచ్చినచో బ్యాంకుకు యిచ్చే అప్పులపై వడ్డీ తగ్గిం

తురు. బ్యాంకు యిచ్చే వడ్డీ రేటుకంటె ప్రాథమిక సంఘములు అనగా బ్యాంకుతో వ్యాపారముగల అను బంధ సంఘములు 0_8_0 తక్కువ వడ్డీకే డిపాజిట్లు స్వీకరింపవలయును. నేడు బ్యాంకువారు స్వల్పవాయిదా, అప్పులపై 4_8_0 వడ్డీ తీసుకొను చున్నారు. అందుచే రూరల్ బ్యాంకువారు 4 రూపాయలకు మించి వడ్డీరేటు స్థిర డిపాజిట్లపై యిచ్చుటలేదు. స్థిరడిపాజిట్లు వృద్ధి చేయుటకు బ్యాంకులో సర్వవిధముల ప్రయత్నము చేయబడుచున్నవి. సౌకర్యములు కలుగ జేయబడు చున్నవి. ప్రజలలో బ్యాంకు వ్యాపారము గూర్చి ప్రచార ప్రబోధనములు సల్పుటకు బ్యాంకు ఆదర్శ కములను ప్రజాళిలో వెదజల్లుటకు 1951 సం॥నకు క్యాలండరు ప్రకటింప బడుచున్నది. సభ్యులు బ్యాంకులో వేసుకొన్న షేరుధనము అప్పుల వ్యాపారము దైనందిన వ్యాపారములు తెలుపుటకు (Diary) డైరీ ప్రకటింపబడుచున్నది. ఇందుపై ప్రజాళిలో బ్యాంకుపై విశ్వాసము కలిగి, ఎక్కువ స్థిర డిపాజిట్ల నాకర్షించు టకు యీనూతన ప్రయత్నము బ్యాంకువారు చేయు చున్నారు. సభ్యులు, సభ్యులు కానివారు తమ ఆదా యములను బ్యాంకులో నిల్వ చేసుకొని యీసంఘు

పురోభి వృద్ధికి, వ్యాపారబాహుల్యమునకు, ఫలప్రదము లగు కార్యములు కావించుటకు హెచ్చుగా తోడ్పడ వలసి యున్నది.

## అప్పులు

సభ్యుల అప్పులు:—

రూరల్ బ్యాంకులో సభ్యులకు వివిధ ప్రయోజనముల కొరకు అప్పు లీయబడును. అయితే తగిన హామీలేనిదే అప్పు లీయబడవు. అప్పులు శాంక్షను చేయుటలో బ్యాంకు పాలక మండలికే సర్వాధికారము. ఫలప్రదమైన ప్రయోజనముల కొరకే అప్పులీయ బడును. అప్పు కావలసినవారు బ్యాంకులో అప్పుదరఖాస్తు చేసుకొన వలెను. బ్యాంకు పాలక మండలివారు వారమునకు మూడుసారులు సమావేశమై దరఖాస్తు దారుల అప్పు తీర్చుకొను అర్హతలనుబట్టి అప్పులు శాంక్షను చేయుదురు. ఏసభ్యుడు కాని అప్పు యిచ్చి తీరవలయునని నిరోధించుట కెట్టి అధికారము లేదు. పాలక మండలివారు తృప్తి పడని-చో యెవరి అప్పునైనను నిరాకరింప వచ్చును. సాధారణముగా సభ్యుని

ఋణము, తీర్చగల శక్తిని (Repaying capacity) బట్టి సభ్యునకు అప్పులు మంజూరు చేయబడును. అప్పులు తీర్చుకాలము మూడు విధములుగా నిర్ణయించడమైనది. (1) స్వల్ప వాయిదా అప్పులు (2) మధ్య వాయిదా అప్పులు (3) దీర్ఘవాయిదా అప్పులు. స్వల్ప వాయిదా అప్పులు ఒక సంవత్సరములోపు కాలమునకు మంజూరు చేయబడును. స్వల్పవాయిదా అప్పులు యీదిగువ ప్రయోజనముల కొరకు మంజూరు చేయబడును.

(1) వ్యవసాయ ప్రయోజనముల కొరకు — అనగా విత్తనములు యెరువులు, వ్యవసాయి పనిముట్లు కొనుటకు

(2) వ్యవసాయ కూలినిమిత్తము.

(3) ఎడ్లు, నాగళ్ళు, కూలికి తెచ్చుకొనుటకు.

(4) పశుగ్రాసము కొరకు.

(5) పశుశాలల స్వల్ప మరామతు నిమిత్తము.

(6) నీటిబోదెలు, నూతులు, చెరువులు, స్వల్ప మరమ్మత్తు నిమిత్తము.

(7) చేలమంద మహాకత్తుకొరకు.

(8) సర్కారుపన్ను చెల్లించు నిమిత్తము.
(9) స్వల్ప చిల్లర వ్యాపారము నిమిత్తము.
(10) ఆహార పదార్ధముల కొనుబడి నిమిత్తము.
(11) కుటుంబఖర్చులకు.
(12) ఇండ్ల మరమ్మతు నిమిత్తము.
(18) వైద్య సహాయమునకు
(14) శుభాశుభ కార్యములకు.
(15) విద్యాభి వృద్ధికి జీతములు పుస్తకముల నిమిత్తం.
సంవత్సర కాలము మించి పై ప్రయోజనముల కొరకు అప్పులీయబడవు.

2. మధ్యవాయిదా అప్పులు.

12 నెలలు మొదలు 24 నెలలవరకు.

(1) అరటి చెరకుతోటల మందమసాకత్తుల పెట్టుబడి నిమిత్తము.
(2) బండ్లు ఎడ్లు కొనుక్కొను నిమిత్తము.
(3) స్వల్ప ఋణములు తీర్చుకునే నిమిత్తము.

3. దీర్ఘవాయిదా అప్పులు.

రెండు సంవత్సరములు మించి 5 సం॥ల లోపుగా దీర్ఘవాయిదా అప్పులు యీ దిగువ ప్రయోజనముల



పాలక మండలి సభ్యులు.

కొరకు యీయబడును. మూడు సంవత్సరములు మించిసాధారణముగా దీర్ఘవాయిదా అప్పులు యీయ బడవు. ప్రత్యేక పరిస్థితులను బట్టి పాతఋణములు తీర్చుకొనుటకు, గృహనిర్మాణములకు, భూమి మరమ్మతు అనగా పాటిమన్ను వేసికొనుటకు, నూతులు, చెరువులు కాలువలు త్రవ్వించుకొని భూములకు జలాధారములు కల్పించుకొనుటకు 5 సం॥ల వాయిదాపై ప్రత్యేక అప్పు లీయబడును.

3 సం॥ల వాయిదా అప్పులు

1. బండ్లు చేయించుకొనుటకు, 2. యెడ్లు కొను టకు 3. యిళ్ళు కొనుటకు 4. భూమికొనుటకును, నిమి త్తము యీయబడును.

ఒక సభ్యునకు 10 రూపాయలు మొదలు 3000/—ల వరకు ఆసభ్యుడు యిచ్చే హామీ పట్టియు, తీర్చుకొన గలుగు అర్హత బట్టియు అప్పులీయబడును.

అప్పులకు యీదిగువ హామీలు తీసుకోబడును.

1. జామీను అప్పులు
2. ఇంటి తనఖా అప్పులు

3. భూమి తనఖా అప్పులు
4. బంగారు హామీ ,,
5. గవర్నమెంటు సెక్యూరిటీలపై
6. డిపాజిట్లపై
7. పంట హామీ
8. నిలువ సస్యముపై
9. సమిష్టి అప్పులు
10. గృహ పరిశ్రమలు తదితర వుత్పత్తి సరకుల

హామీపై అప్పులు

జామీను అప్పులు :—

జామీను అప్పులు సాధారణముగా సభ్యులకు తాత్కాలిక ప్రయోజనము కొరకు అనగా స్వల్ప వాయిదా అప్పులీయ బడును. జామీనుఅప్పు కోరిన సభ్యుడు మూడు మాసములు మొదలు 12 మాసముల లోపుగా కాలపర్మితిలో అప్పు వసూలు చేయ బడును. సాధారణముగా వ్యవసాయపు అప్పులన్నియు జామీనుపై మంజూరు చేయబడును. ఈ అప్పులు

పంటలు తసరబు చేసిన వెంటనే తీర్చివేయ వలయును. ప్రతిజామీను అప్పునకు దరఖాస్తుదారు ఇద్దరు జామీను దారులను హామీ యీయవలెను. షేరునకు 10 రెట్లు అప్పు మంజూరు చేయబడును. జామీనుదారు తన కున్న షేర్లలో 20 రెట్లు సొమ్ముకు జామీనుండ వచ్చును. 100 రూపాయలు అప్పు కావలసిన దర ఖాస్తుదారునకు 10 షేర్లుండ వలెను. జామీను దారులకు చెరియొక అయిదు షేర్లుండ వలయును. దరఖాస్తుపెట్టి 3 దినములలోగా పంచాయితీదార్లు అప్పు శాంక్షనుచేసి బట్వాడా యిచ్చెదరు. విశేషకాల విలంబ నము లేక పాలకమండలి వారు త్వరిత కాలములో సభ్యులు అప్పులు మంజూరు చేయుట మూలమున సభ్యు లలో భక్తి విశ్వాసములు కలిగి అప్పులు ఇచ్చి పుచ్చు కొనుట సీఘ్రముగా జరుగుచున్నది. స్వంత డిపాజిట్లు వుండుట మూలమున బ్యాంకువారు అప్పులను సులభ ముగా మంజూరు చేయగలుగు చున్నారు. బ్యాంకు సూపరు వైజర్ల తనిఖీతోగాని బ్యాంకు అప్పు శాంక్షను చేసేవరకు నిలిచివుండక అప్పలు త్వరితముగా బట్వాడా అగుటవలన బ్యాంకు ప్రజలలో భక్తి విశ్వాసములతో పని చేయుచున్నది. స్వంత డిపాజిట్లు లేనిచో ఇట్టి సావ

కాశము లేకుండెడిది. ఇతర సంఘ సభ్యులకు యింత త్వరితముగా అప్పులు మంజూరు చేయుబడవు. సభ్యుల దరఖాస్తులు కొంతకాలము పట్టును. సెంట్రల్ బ్యాంకు నకుదరఖాస్తు చేయుట కొంతకాలమును, సూపరు వైజర్ల తనిఖీ కొంతకాలము, సెంట్రల్ బ్యాంకువారి శాంక్షను కొంతకాలము పట్టును. సెంట్రల్ బ్యాంకులో అప్పులు పత్రములు వ్రాసి పంచాయితీదార్ల డబ్బు తీసుకొను టకు కొంతకాలము పట్టును. నెలలు తరబడి కాలము పట్టును. ఇట్టి కాల విలంబనములేక, రెండుమూడు దినము లలో సభ్యులకు అప్పులు బట్వాడా బ్యాంకునకు చేయ గలుగుచున్నారు.

## ఇంటి తనఖా అప్పులు:—

పల్లెటూళ్ళలో వ్యవసాయము మీద ఆధారపడు రైతులే కాకుండగా, చిల్లర వ్యాపారస్తులు, వివిధ వృత్తుల వారు అనగా, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, బంగారు పని వారు, నేతగాండ్రు, తాపీమేస్త్రీలు మొదలగు వివిధ వృత్తులవారు గ్రామములో నివశించు చున్నారు. వీరిలో కొందరకు భూములుండవు. ఇండ్లే స్థిరాస్తి. వీరలకు

అప్పులు కావలసిన జామీనుదారులు దొరకుట కష్టము. స్వల్ప అప్పులకు అనగా యీ వృత్తులవారికి ఒకటి, రెండు, మూడు, సంవత్సరములలో తీర్చు అప్పులు తరచు వస్తూవుండును. పనిముట్లు కొనుక్కొనే అక్కర వచ్చును. శుభాశుభ కార్యములకు అవసరము వస్తుంది. ఇంటి ఖర్చుకు పనిలేని కాలములో వాడకమునకు డబ్బు కావలసి వస్తుంది. ఇట్టి సామాన్య గృహస్థులకు ఇల్లు హామీ తీసుకొని అప్పుల మంజూరు చేయుదురు. ఇంటి కిమ్మతులో సగముమించి అప్పు తీయవచ్చును. ఇండ్ల తనఖాపై అప్పుతీయు సభ్యులకు ఇరుగు పొరుగువారి జామీ నుంటేకాని అప్పులీయబడవు.

ఇట్లు జామీనుకూడ నిర్బధించుటకు కారణము, ఇండ్లపై అప్పుతీయువారు జాగరూకతతో అప్పు తీర్చనిచో పెట్టెటువాళ్ళలో యిండ్లు యిరుగుపొరుగువారే కొనాలి. జామీను పెట్టుటవలన యీ సభ్యులు సకాలములో అప్పు తీయుటకు ఆతృతపడుదురు. లేనిచో గృహము లుపోవునను భయముండును. ఇండ్ల హామీపై అప్పులు ధారాళముగా యీయబడును. వీరు నూటికి 10 పేర్లుండవలెను. జామీను దార్లకు నూటికి 5/ వుం

డవలయును. వడ్డీ రేటు 100 కి 6—4—0. సాధారణముగా ఇండ్లపై యిచ్చు అప్పులు ఏడాది మించి వుండవు. అయితే ప్రయోజనముబట్టి కాల పర్మతి 3 సం॥ల వరకు యీ యబడును. 3 సం॥లు మించి యిండ్లహామీపై అప్పు లీయబడవు.

## భూమితనఖా అప్పులు:—

బ్యాంకులో సభ్యులకు భూమిహామిపైని అప్పు లీయబడును. నిర్దిష్టమైన భూమి తనఖాపై భూమి కీమ్మతులో సగము అనగా 50% అప్పుయీయబడును. అయితే ఎంత ఆస్థి వరునకైనను రు 3000/లు మించి దీర్ఘవాయిదా అప్పుయీయబడదు. బ్యాంకు విస్తీర్ణ ప్రదేశమంతయు మాగాణి భూమియగుటచే కీమ్మతు హెచ్చుగానుండును. మంచి భూములు య 1కి 5 లేక 6 వేల రూపాయల కీమ్మతు చేయుచున్నవి. ధరల మందము రోజులలో కూడ య1కి రు 2000/ లు వ్రూడుపు భూమి ధరతగ్గలేదు. యకరము వేయిరూపాయలు తక్కువ కీమ్మ తుభూములు యీప్రాంతములోలేవు. అందుచే తనఖా అప్పులు మంజూరు చేయునపుడు య1కి రు 1000/ లు

మించి అప్పులిచ్చుటలేదు. హెచ్చుభూమి కల ఆసామీలకు మూడు నాల్గు యకరములు తనఖా రు3000/లు బ్యాంకులో తనఖా అప్పులీయబడు చున్నవి, ఒకటి, రెండు యకరములు మాత్రమే భూమి కలవారికి వాయిదాసొమ్ము తీర్చుకునే అవకాశము బట్టి య1కి రు500/ లు మించక అప్పులు మంజూరుచేయబడు చున్నవి.

రైతులకు అదునులో అప్పులు వెంటనే బట్వాడా చేసేనిమిత్తము బ్యాంకు పెట్టినప్పటినుంచి శాశ్వత భూమి తనఖా దస్తావేజులపై రైతులకు పరపతి అప్పులు (Cash credit) మంజూరు చేయబడు చున్నవి. ఈ (Cash credit) అప్పులకు ప్రతి సభ్యుడు నిర్దిష్టమైన ఆస్థి హామీ యీయవలెను. ఈ హామీ ఆస్థి యితరులకు యేవిధమైన అన్యాక్రాంతము చేయనట్లు బ్యాంకువారు 12సం॥ లకు యన్‌కంబరెన్సు సర్టిఫికేటు తీసుకొందురు. ఇందుకు ఖర్చు సభ్యుడే భరించవలెను. సఖము ఫీజుకే సర్టిఫికేటు గవర్నమెంటు వారికియిచ్చెదరు. ఈ సర్టిఫికేటు తీసుకొన్న పిమ్మట ఆస్థి నిర్దిష్టమైనదని ప్లీడరు సలహా తీసుకొనబడును. వేయి రూపాయల అప్పునకు 1—0—0 ప్లీడరు సలహా ఫీజు, రెండు

వేలకు రు2/-లు, మూడువేలకు రు 3/ లు. దరఖాస్తుదారు వద్దనుంచివసూలు చేయబడును. సభ్యుని తాహతును బట్టి అప్పుతీర్చు స్తోమతును బట్టి సభ్యునకు స్థిరాస్థి తనఖాపై (Ever continuity bond) (Cash Credit) క్యాష్ క్రెడిట్ మంజూరు చేయబడును. 3 వేలుమించి ఒక సభ్యునకు (Cash Credit) యీయబడదు. సభ్యునకుక్యాష్ క్రెడిట్టుకు రెట్టింపుఆస్థి తనఖాహామీలో నుండవలయును. ఎంతసొమ్ముయిచ్చేది పాలకమండలి వారు నిర్ణయింతురు. ఒకసారి పాలక మండలివారు సభ్యునకిచ్చే (Cash credit) నిర్ణయించిన తరువాత సభ్యుడు యీ (Cash credit) మొత్తమును దఫదఫాలుగ వాడుకొన వచ్చును. అవసరము వెంబడిని ఆయా ప్రయోజనములకు నిర్ధిష్ట కాలములో తీర్చుటకు అవకాశ మున్నది. ఎప్పుడుపడితే అప్పుడు పర్మితి మొత్తము ఒకేసారిగాని దఫదఫాలుగ వాడుకొని అవకాశము కల్గినపుడెల్ల 1-0-0 తక్కువ మొత్తము కాకుండ యెంత మొత్తమైనా తీర్చుకో వచ్చును. సం॥లో (Cash credit) వాడకము ఆసామీ తాను కాతా ఏర్పాటు చేసుకొని యీ కాతా అప్పునకు వాడకము వసూళ్ళు యెన్నిసార్లైనను చేయ వచ్చును. నిలువవున్న అప్పునకే అనగా ఎన్నిరోజులు

అప్పులు నిల్వయుండునో అన్నిరోజులకే వడ్డీ కట్టబడును. కాలపర్మితిలోగా యిచ్చు వసూళ్ళకు యెదరవడ్డీ యివ్వ బడును. యీ Cashcredit అప్పులు రైతులకు చాల సహాయము గనున్నది. వ్యవసాయపు అదునుబట్టి అవసరము వెంబడిని కరెంటు అకౌంటు కాతావలె అప్పులిచ్చి పుచ్చుకొనుట మూలమున మాటి మాటికి కాల విలంబన అప్పు పుచ్చుకొనుట కక్కరలేదు. ఒకసారి యీఅప్పు మంజూరైనచో తనఖాఆస్థి నిర్దిష్టము ముగా నున్నంతకాలము ఒకేకాతా మీద అప్పులు యిచ్చి పుచ్చుకొన వచ్చును. తీర్చిన మొత్తమును మరల ఆదస్తావేజుపైననే తిరిగి అప్పుతీసుకొనవచ్చును. చెల్లులు వున్నంతకాలము యీ దస్తావేజునకు కాల దోషములేదు. పూర్తి చెల్లుబడి దస్తావేజయినచో యిక ఆదస్తావేజు పనికిరాదు. 12 ఏండ్లకాలదోషము యీ దస్తావేజున కుండదు. వసూళ్ళు దస్తావేజుపై పెట్టబడుచుండును. తిరిగి ఆఖరు వసూలు తేదీనుంచి 12 సం॥ కాలముండును. అందుచే యీ దస్తావేజు శాశ్వత అప్పు పత్రముక్రింద పరిగణింప బడుచున్నది. ఎప్పటికప్పుడు రైతులు కావలసిన డబ్బును యీ బ్యాంకులో వాడుకొని పంటలు అమ్ముకొని కాతాను

 

జమకట్టు కొను చున్నారు. యీ కాతా అప్పులు పెద్ద రైతులకు బీదరైతులకు వ్యవసాయ పెట్టుబడులకు బాగా వుపయోగ పడుచున్నవి. తనఖాదస్తావేజు వ్రాసిన నాటినుండి యీ కాతా అప్పులు అమలులోనికి వచ్చును. ఏరైతునకెంత కాతా అప్పు యిచ్చేది తనఖా ఆస్థి విలువనుబట్టి ఒకేసారి నిర్ణయ మగును. అందుచే యెప్పటికప్పుడు కావలయు మొత్తములకు ఎనెక్చరు బాండు (తాత్కాలిక అప్పుపత్రము) వ్రాసి తీసుకొన వచ్చును. ఇందుమూలమున కాలహరణము లేకుండ రైతునకు యేరోజునకు కావలసిన డబ్బు ఆరోజు పెట్టెలో దాచుకొన్నట్లు రైతులు బ్యాంకులో డబ్బు వాడు కొను చున్నారు. ఈ కాతా అప్పులు బ్యాంకులో యే ఏటను వృద్ధియగు చున్నవి. ఇందులకు కారణము బ్యాంకు వ్యాపారముపై ప్రజా విశ్వాసమేను. రైతునకు అదునుకు అప్పు సరఫరా చేయుటకు బ్యాంకునకిట్టి సావకాశము స్వంత డిపాజిట్లు వుండుటయే గాక సెంట్రల్ బ్యాంకువారు సభ్యులు వ్రాసియిచ్చిన సిరాస్థి తనఖా దస్తావేజుల హామీపై యీ బ్యాంకునకు రూ50000/లు (Cash credit) యిచ్చుట మూలమున ఈ సదుపాయము కల్గినది. సెంట్రల్ బ్యాంకున కడుగడు

గునకు అప్పునకు వెళ్ళనక్కర లేకయే Cash credit 50 వేలు నిర్ణయించుకొని, మెంబర్ల వద్దనుంచి క్రొత్త తనఖా దస్తావేజులు రావడంతో బ్యాంకులో అప్పుతీసుకొని Cash credit అప్పుతీర్చి ఎప్పటికపుడు ఈకాతా అప్పు ఖాళీగా నుంచుకొనుటకు సావకాశ మేర్పడుచున్నది. 1949-50 సం॥ సభ్యులకు బట్వాడా చేసిన రూ8,75,000/ లు అప్పులలో రూ 5,23,000/ లు కాతా అప్పులపై బట్వాడా చేయబడినవి. రూ 2,86000/ లు జామీను అప్పులపై ఈయబడినవి. బ్యాంకు వ్యాపారములో అదిక మొత్తము ఈకాతా అప్పులు జామీను అప్పులేను.

## బంగారు హామీఅప్పులు

బ్యాంకు స్థాపించినది మొదలు బంగారు హామీపైన సభ్యులకు అప్పులు యీయబడుచున్నవి. 100 రూపాయలు విలువగల బంగారముపై రూ75/లు వరకు అప్పులీయ బడుచున్నవి. అయితే యీ అప్పులకు షేరు ధనము కట్టనవసరములేదు. పల్లెటూళ్ళలో బంగారుహామీ అప్పులు వృద్ధిచేయుటకు ఎంతయోని అవకా

శమున్నది. అయితే యీ అప్పులు ప్రమాద భూయి ష్ఠమైనవి. దొంగ వస్తువులు, కల్తీవస్తువులు తీసుకొని వచ్చి బ్యాంకును మోసము చేయవచ్చును. ఈ రెండు ప్రమాదముల నుంచి తప్పించుకొని గౌరవ నీయులగు సభ్యులనుంచి కల్తీలేని బంగారము తీసుకొని బ్యాంకువారు వ్యాపారము చేయుదమన్నను వస్తువులు భద్రముగా దాచుటకు బ్యాకుంవారికి (Safe room)లేదు. సెంట్రల్ బ్యాంకులో యీ వస్తువులు దాచుటకు యేర్పాటు చేసుకొన్నను యీ విలువగల వస్తువులు సెంట్రల్ బ్యాంకునకు పంపి అడుగడుగునకు తిరిగి తెప్పించుటలో చాల ప్రమాదములు కను పించుచున్నవి. బ్యాంకులో విలువగల వస్తువులు విశేషముగా వుంచుట యీ రోజులలో చాల ప్రాణోపద్రవముగా కనబడుచున్నది. దేశములో అరాజకము చెల రేగుచున్నది. నవీన ఆయుధ పరికరములతో బందిపోట్లు అనేకచోట్ల బ్యాంకులను దోచుకొను చున్నట్లు వార్తలు వినబడుచున్నవి. అందుచే పాలక మండలివారు యుద్ధకాలములోను, యుద్ధానంతరము బంగారు హామీ అప్పులు యిచ్చుట తగ్గించిరి. అయితే సకృతుగా బహు నమ్మకమైన వారికి మాత్రమే యితర హామీ

లేకపోయినపుడు బంగారు హామీపై సంవత్సర కాలము మించకుండా అప్పులీయ బడుచున్నవి. ఈ అప్పులపై వడ్డీ యితరవాని వలెనే రు6—4—0.లు

## సెక్యూరిటీ స్వంతడిపాజిట్లు పైఅప్పులు.

గవర్నమెంటు సెక్యూరిటీపై అప్పులీయవీలున్నను పల్లెటూళ్ళలో నెవరూ వీనిపై అప్పు తీయుటలేదు. స్వంత డిపాజిట్లపై అప్పులు తీయుచున్నారు. ఇవి నూటికి రు90/లచొ॥న యివ్వబడును. వీనిపై, ఫిక్సెడ్ డిపాజిట్టుపైనున్న వడ్డీరేటు కంటె నూటికి ఒక రూపాయివడ్డీ రేటు ఎక్కువ వసూలుచేయబడును. మూడు రూపాయలు సాలుకు డిపాజిట్టుపై వడ్డీయున్న దీనిపై అప్పులు తీసుకొను సభ్యునకు రు4_0_0లు వడ్డీకే అప్పురేటు. డిపాజిట్టుపై అప్పు తీసుకొనువారు సభ్యులుగా నుండ నక్కరలేదు. మెంబర్లు కానివారు డిపాజిట్టు చేయవచ్చును. డిపాజిట్లుకు యిట్టిసదుపాయము కలుగ జేయుట వలన డిపాజిట్టు వాపసు తీసుకొన నవసరము లేకుండగా అప్పు తీసుకొనుటకు వీలు కలుగుచున్నది. ఇందు మూలమున డిపాజిట్టుదార్లకు బ్యాంకుపై విశ్వాసము కలుగుచున్నది.

ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

## నిలువ సస్యము - పంట సరకులపై అప్పులు :-

బ్యాంకు నిబంధనల ప్రకారము సభ్యులకు పంట హామీపైనను, సరకు హామీ పైనను అప్పులీయబడు చున్నది. నిలువు సశ్యము హామీపై 3 మాసములు దాట కుండగా రు.100/ లు అంచనాకట్టిన సశ్యముపై రు40/ లు వరకు అప్పులీయబడును. ఈ అప్పులు రైతులకు చాల సదుపాయములుగ నున్నవి. కోతలు కోసి కుప్పలు నూర్చి పంట తసరబుచేసే లోపుగా రైతున కెన్నియో అవసరములకు డబ్బు కావలసి వచ్చును. సాధారణముగా పల్లెటూళ్ళలో షావుకార్లు పంట హామీపై రైతులకు అప్పులు పెట్టెదరు. పంట తేలిన తరువాత అమ్మే ధాన్యమునకు తక్కువ ధరకే ముందుగా అప్పులిచ్చి జట్టి వ్రాయించుకొనును. రైతు విధిలేక అవసరమునకు కావలసిన సొమ్మునకు తక్కువ ధరకే రాబోవు పంటను తాకట్టుపెట్టును. ఇందువలన మూలమున రైతునకు అపార నష్టము కలుగు చున్నది. రైతు యీ అవసరము గడుపుటకు బ్యాంకు వారు అప్పులు యిచ్చుచున్నారు. ఈ అప్పులు భూమి సేద్యము చేయు వ్యవసాయదారునకు గాని కౌలుదా

దారునికిగాని యీాయబడును. కవులుదారు యీానాం దారుకు యిచ్చు మక్తాపోను మిగత ధాన్యము నుంచే అప్పు తీర్చుకొను చున్నాడు. స్వంత సేద్యముచేయు భూస్వామి ధాన్యము తసరబు చేసినవెంటనే యీా స్వల్ప వాయిదా అప్పులు 3. మాసములలోగా తీర్చి వేయుచున్నాడు. వరి సస్యము పండించు రైతులే కాకుండ ముఖ్యముగా యీా ప్రాంతములో చెరకు, అరటితోటల వ్యవసాయదారులు పెట్టు బడులకు యీా నిలువు సస్యపు హామీా అప్పులు వాడుకొనుచున్నారు. చెరకు, అరటి, తోటలు వేయువార్కి పంట చేతికి వచ్చులోపున విస్తారము డబ్బు కావలసి వచ్చును. ఈ తోటలపై 6 మాసములు మించకుండగా నిలువు సస్యపు అప్పులు బ్యాంకువారు మంజూరుచేయుచున్నారు. ఈ అప్పులు తీసికొను వారు బ్యాంకులో సభ్యులుగా నున్నచాలును. విస్తారము షేరుధనముచెల్లించ నవసరము లేదు. ఒకరూపాయి షేరున్నచాలును. అయితే నిలువు పైరు అప్పు తీసు కొనువార్కి యిద్దరు జామీాందార్లు హామీాయుండవలెను. బ్యాంకునకు తెలియకుండగనే పంట తసరబుచేసి అప్పు జమకట్టక, మోసము చేసిన, జామీాం దార్లకూడ బాధ్యస్తులగుదురు. సాధారణముగా అదుబాదు

రైతాంగమునే నిలువు సస్యపు అప్పులు తీసుకొను సభ్యులకు, హామీగా అంగీకరింతురు. ఈ జామీం దార్లకు సభ్యుడు ఎప్పుడు పంట తసరబు చేయునో తెలియును. తసరబు చేసిన వెంటనే అప్పు చెల్లించనిచో అప్పుదారునిపైనను జామీందారునిపై చర్య తీసుకొనబడును.

అయివేజు అప్పులు:—

రైతాంగము పండిన పంటలను వెంటనే అమ్ముకొనిన తగిన ధరలురాక నిలువ యుంచుకొన వలసి వచ్చును. ఈ కాలములో కంట్రోల్సు అమలులో నున్నందున రైతు పండించు పంటనిలువ వేసుకొనుటకే అవకాశము లేదు. అయితే కంట్రోల్సు ఎల్లకాలము వుండేవికావు. కంట్రోల్సు లేనికాలములో సభ్యులు పండించిన పంటను స్వంత గాదులలో కాని, అద్దె గాదులలో కాని, నిల్వ వేసుకొనెడివారు. ఈనిల్వసరకు గాదులలో భద్రముగా వుంచబడిన, ఆసరకు బ్యాంకువారు స్వాధీనము చేసుకొని, తాళము వైచి, సీలువేసుకొని, సరకు హామీపై, ధాన్యము అయినచో 100 కి రు 75 లు

బ్యాంకువారు అప్పు యిచ్చుచున్నారు. రు500 లులోపు సరకు హామీఅప్పులకు Insurance నిర్బంధములేదు. రు500లు మించునవి Fire Insure చేయవలయును. ఇందుకగు ఖర్చు సభ్యుడే భరింప వలెను. వాయిదా ఒక సంవత్సరం దాటి యివ్వబడదు. ఈ సరకు హామీపై వడ్డీ రేటు యిదివరలో సెంట్రల్ బ్యాంకువారు తక్కువ వడ్డీ కిచ్చెడివారు. నూటికి 4 రూపాయిలు చొప్పున సెంట్రల్ బ్యాంకు అప్పు యిచ్చిన సరకు హామీపై 5% బ్యాంకులో అప్పు యిచ్చెడివారు. ఇప్పుడు అన్ని అప్పులకు వడ్డీరేటు నూటికి 6_4_0 యేను. సరకు హామీ అప్పులకు షేరుధనము కట్టనవసరము లేదు.

## సమిష్టి అప్పులు:—

బ్యాంకు నిబంధనల ప్రకారము సమిష్టి అప్పులు సభ్యులకు మంజూరు చేయబడు చున్నవి. 5 గురు తక్కువ కాకుండ, 20 మందికి ఎక్కువ కాకుండ సభ్యుల సమిష్టి ప్రయోజనము కొరకు యీ అప్పులు శాంక్షను చేయబడుచున్నవి. యీ సమిష్టి అప్పుల మొత్తము రు 1000_0_0 లు మించి యివ్వబడదు. ఎరువులు విత్తనములు

కొనుటకు, వ్యవసాయ పరికరములు కొనుటకు ఈ అప్పులు మంజూరు చేయబడు చున్నవి. అయితే ఈఅప్పులు తీయువారు ఈ అప్పులకు వ్యక్తిగతముగాను, సమిష్టిగాను, బాధ్యస్థులు. సంవత్సరము కాలము మించి సమిష్టిఅప్పు తీయబడవు.

ఈ సమిష్టి అప్పులు విస్తారముగా బ్యాంకులో హరిజన సభ్యులు వాడుకొనుచున్నారు. లంక వ్యవసాయ పెట్టుబడికి, ఎరువులు, విత్తనములు, పశువులు, కొనుటకు సర్కారుపన్ను చెల్లించుటకు, ఈ అప్పులు చాల తోడ్ప డుచున్నవి. హరిజన సభ్యులకు, వ్యవసాయ కూలీలకు, షావుకార్లవద్ద పరపతి పుట్టదు. ఒకవేళ అప్పులు పుట్టినను హెచ్చువడ్డీకి దొరకును. పంటలుకూడ ముందుగనే బరాతము వ్రాయించు కొనెదరు. రూరల్ బ్యాంకు యిట్టి వ్యవసాయ కూలీలకు పని కల్పించుటకు ప్రభు త్వమువారి వద్దనుంచి లంకభూములు తీసుకొని సమిష్టి వ్యవసాయమున కమర్చు చున్నారు. 5 గురు 10 మంది కలసి సమిష్టిగా లంక వ్యవసాయము చేసి పంటలు వచ్చినతోడనే యీ సరకులనమ్మి బ్యాంకు ఋణము తీర్చివేయు చున్నారు. ఈ సభ్యులకు స్వంత

ఆస్థి ఏమియు లేనందున 10 మంది 20 మంది కలసి కష్టపడి లంక వ్యవసాయము చేసి వ్యక్తిబాధ్యతతోను సమిష్టి బాధ్యతతోను యీ పదిమంది లేక 20 మంది తీసిన అప్పులను సక్రమముగా తీర్చివేచి ఆదాయాభి వృద్ధి చేసుకొను చున్నారు.

ఈరీతిగనే బ్యాంకునిబంధనల ప్రకారము, వ్యవసాయ పెట్టుబడులకే కాకుండగా, ఆహార పదార్థములు కొను క్కొనుటకు, బట్టలు కొనుక్కొనుటకు, సమిష్టి అప్పులు మంజూరుచేయబడుచున్నవి. ఇవికూడ ఆస్థిలేని వ్యవసాయ కూలీలకే మంజూరు చేయబడు చున్నవి. వ్యాపారస్తులు బీదసాదలకు బట్టలు అమ్మకములో హెచ్చు లాభములు కట్టి బరాతము పెట్టుచున్నారు. ఈ ప్రాంతములో నెల్లూరు జిల్లానుండి అరువుబట్టల వ్యాపారస్తులు విశేషముగా పాటకపు జనమునకు సాలీనా బట్టలుయిచ్చి పోవుచుందురు. పాటకపు జనము వర్తకుల వద్ద సంవత్సర వాయిదాపై తీర్చే పద్ధతిని బట్టలుఅరువునకు తీసుకొనుచున్నారు. రు 5/ విలువగల బట్టతీసుకొన్నవారు సంవత్సరాంతమున రు10/లు చెల్లించవలెను. అంటే సంవత్సరమునకు అసలుకు సమానమైన వడ్డీ

అగును. ఈ అప్పులు వసూలు చేయుటలో యీ వ్యాపారస్తులు చేసే నిర్బంధము అతికఠినముగా నుండును. కాబూలీలు, రోహిలాలు, రైల్వేకూలీలకు గవర్నమెంటు చిన్ననౌఖరీ చేసుకొనువారికి హెచ్చు వడ్డీలకు అప్పులు లుపెట్టి గుమ్మము మీాద కూర్చుని వసూళ్లు చేసే లాగునే యీ వ్యాపారస్తులు కూడా అతికఠినంగా యీ బట్టల ఖాతా వసూళ్లు చేయుదురు. ఈ దుర్ణయమును మాన్పుటకు బ్యాంకువారు పాటుపుజనమునకు సమిష్టి అప్పులు బట్టలు కొనుటకు మంజూరు చేయుచున్నారు.

ఈ బట్టల ఖాతా సమిష్టిఅప్పులు ముఖ్యముగా స్త్రీలు సంఘసభ్యులుగాచేరి వాడుకొనుచున్నారు. 5గురు 10 మంది కలసి సంక్రాంతి, దసరా ముందు తమ కుటుంబమునకు కావలసిన బట్టలు సంఘములో సమిష్టిగా తీసుకొని పండుగలు, కోతలరోజులలో తాము రోజూ సంపాదించు ఆదాయములో నుంచి 0_2_0; 0_4_0 (త్రిప్ప లేబుల్సు) పొదుపు బిళ్ళలు కొనుక్కొని సంవత్సరాంతమునకు అప్పులు తీర్చి వేయుచున్నారు. ఈ అప్పులపై వడ్డీ రు 6_4_0 లు.

ఒక రూపాయి యిచ్చి సభ్యులుగా చేరిన సమిష్టి అప్పు దార్లలో చేరవచ్చును. ఈ అప్పులకు అదనపు పేర్లు జమకట్ట నక్కరలేదు. పాటకపు జనము బ్యాంకులో యీ సమిష్టి అప్పులు, తీసి బట్టలు, బియ్యము తది తర గృహోపకరణములకు వాడుచున్నారు.

ఆసిధిపరులకే గాక పాటకపు జనమునకుకూడ యీ సంఘములో అప్పులు యీరీతిగ దొరకుచున్నవి. ఇందు మూలమున బ్యాంకు పట్ల అన్ని వృత్తుల వారికి సంతృప్తి కలుగుచున్నది. ఈసమిష్టి అప్పులు వ్యవసాయ పెట్టు బడికే గృహోప కరణములుకొనుక్కొనుటకు కాక వర్తక వ్యాపార పరిశ్రమల పురోభి వృద్ధికికూడ యీయబడు చున్నవి. కమ్మరి పనివాండ్రు 5 గురుచేరి సమిష్టి అప్పు తీసుకొని ఇనుము కొనుక్కొని పనులు, గొలు సులు, పారలు ఇతర వ్యవసాయ పనిముట్లు ఉత్పత్తిచేసి సరకుల నమ్ముకొని సమిష్టి అప్పులను సులభముగా తీర్చు కొను చున్నారు. 5 గురుచేరి సమిష్టి అప్పు తీసుకొని కలపకొని ఇటుక తయారుచేసి వాటి అమ్మకము ద్వారా బాకీలు తీర్చుకొనుచున్నారు. కుమ్మరగాయలు వ్యాపార స్థులు సమిష్టిగా అప్పుతీసి పట్నవాసములకు వెళ్ళ

కూరలుకొని ఆలమూరు సంతలో అమ్మి అప్పులు తీర్చు కొని కూరగాయల వ్యాపారము చేయుచున్నారు. ఈరీతి గనే వడ్రింపనివారు సమిష్టి అప్పుతీసి కలపకొని కుర్చీలు బల్లలు చేసి అమ్ముకొని అప్పు తీర్చుచున్నారు. ప్రతి సంవత్సరము వ్యాపారస్తులు సమిష్టి అప్పులు తీసి తమ వ్యాపారము సాగించుకొను చున్నారు. ఇది సమి ష్టిగా తీర్చు అప్పులు విధానము.

మరొకరు వ్యక్తిపరంగా స్వంతఆస్తి హామీయిచ్చి సమిష్టి వ్యాపారము నిర్వహించి యీ వ్యాపారము వలన వచ్చెడి లాభమునుంచి తమఅప్పులను వాయిదాల పూర్వకముగా తీర్చివేయు చున్నారు. బ్యాంకులో అప్పుతీసి చిన్నచిన్న ధాన్యపు మరలు కొనుక్కొని బియ్యము వ్యాపార లాభమునుంచి అప్పుల తీర్చు చున్నారు. 10 మంది కలసి 10 వేల రూపాయలు బ్యాంకులో అప్పులుతీసుకొని వేరుశనగనూనెఆడు మిల్లును కొని వ్యాపారము చేయు చున్నారు. మరి 10 మంది కలసి 20,000/ రూపాయలు స్వంత పెట్టుబడి పెట్టి బ్యాంకులో 20 వేల రూపాయలు అప్పు తీసి ధాన్యపుమిల్లు వ్యాపారము నిర్వహించు చున్నారు.

6 మంది కలసి బ్యాంకులో 12000/ రూపాయలు అప్పు తీసి ముద్రణాలయము నిర్వహించు చున్నారు. మరి కొందరు ఆలమూరునుంచి కాకినాడకు బస్సునూళ్ళు పొంది కారుల వ్యాపారము నిర్వహించు చున్నారు. ఈఅప్పు లన్నియు తగిన ఆస్థి హామీపై 5 సంవత్సరములు దాట కుండగా 3 సంవత్సరములు తక్కువ గాకుండ తీర్చు పద్ధ తినిఅప్పులీయ బడినవి. వాయిదా ప్రకారము డబ్బు కట్టు చున్నారు. ఈ విధముగా గృహ పరిశ్రమల పోషణకు వ్యాపారాభి వృద్ధికి వివిధ ఫలప్రధములైన వ్యాపారము లకు అప్పులీయ బడుచున్నవి. 1938వ సంవత్సరములో బ్యాంకు 50 వేల రూపాయీలతో పని ప్రారంభించినది. నేడు దాదాపు 12 లక్షల రూపాయీల అప్పుల వ్యాపారము సాగించు చున్నది.

యీాదిగువ పట్టికలో అప్పుల క్రమాభివృద్ధి చూపబడినది.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

## Statement No. VIII.

## The Alamuru co-operative Rural Bank Ltd., Alamuru.

### Loans issued during the year Classified according to purpose.

| S. No. | Purpose. | Number of loans issued | Amount. |
|---|---|---|---|
| | | | RS. |
| 1. | Domestic requirements | 487 | 70,772 |
| 2. | Cultivation expenses. | 382 | 1,79,493 |
| 3. | For clearing petty loans. | 153 | 1,54,265 |
| 4. | Petty Trade. | 128 | 1,46,984 |
| 5. | Construction of & Repairs to houses. | 54 | 50,877 |
| 6. | Purchase of land. | 60 | 95,789 |
| 7. | Medical Aid. | 1 | 500 |
| 8. | Purchase of cattle | 34 | 10,659 |
| 9. | Artisans appliances. | 9 | 8,265 |
| 10. | For education. | 2 | 460 |
| | Total | 1,310 | 7,18,064 |

## STATEMENT No. VII.

### The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

| Year. | | Amount. |
|---|---|---|
| 1937–38 | .... | 16,835 |
| 1938–39 | .... | 53,255 |
| 39–40 | .... | 75,960 |
| 40–41 | .... | 1,21,037 |
| 41–42 | .... | 1,18,490 |
| 42–43 | .... | 1,54,132 |
| 43–44 | .... | 1,94,548 |
| 44–45 | .... | 2,28,503 |
| 45–46 | .... | 2,81,279 |
| 46–47 | .... | 4,15,169 |
| 47–48 | .... | 5,07,371 |
| 48–49 | .... | 5,31,126 |
| 49–50 | .... | 9,92,925 |

(Progress of loans)

ఈ అప్పులు ఏయే హామీలపై యీయబడినవి. సంవత్సరముల వారీగా తెలుపబడినవి.

# The Alamuru Co operative Rural Bank Ltd., Alamuru.

STATEMENT No. 17

Progress of loans

| వివరములు. | సం॥ 1937–38. నెం. | మొత్తము రు. | సం॥ 38–39 నెం. | మొత్తము రు. | సం॥ 39–40 నెం | మొత్తము రు. |
|---|---|---|---|---|---|---|
| 1. పరిటసరుకులు సస్యపుసరకులు | 19 | 2615 | 60 | 6386 | 62 | 10183 |
| 2. బంగారముపై అప్పులు | 36 | 6758 | 137 | 17243 | 60 | 6992 |
| 3. తనఖా అప్పులు | 20 | 6693 | 119 | 28657 | 332 | 55276 |
| 4. జామీను జాయింటు అప్పులు | ... | ... | ... | ... | 14 | 1044 |
| 5. డిపోజిట్టు సెక్యూరిటీలపై అప్పులు | ... | ... | ... | ... | ... | ... |
| 6. యితర అప్పులు | ... | ... | ... | ... | ... | — |
| 7. పింఛెనన్సు బాండుల సెక్యూరిటీపై అప్పులు | ... | ... | ... | ... | ... | ... |
| మొత్తం— | 75 | 16066 | 316 | 52236 | 468 | 73495 |

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

STATEMENT No. 17.

## Progress of Loans.

| వి వ ర ము లు. | సం॥ 40—41 నెం | సం॥ 40—41 మొత ము రు. | సం॥ 41—42 నెం | సం॥ 41—42 మొత్తము రు. | సం॥ 42—43 నెం | సం॥ 42—43 మొత్తము రు. |
|---|---|---|---|---|---|---|
| 1. పంటసరకులు సస్యపుసరకులు | 66 | 7796 | 44 | 8356 | 27 | 24116 |
| 2. బంగారముపై అప్పులు | 20 | 1994 | ... | ... | ... | ... |
| 3. తనఖా అప్పులు | 528 | 72991 | 580 | 65793 | 466 | 47653 |
| 4. జామీను, జాయింటు అప్పులు | 754 | 13153 | 787 | 18459 | 1087 | 23557 |
| 5. డిపోజిట్టు సెక్యూరిటీలపై అప్పులు | 1 | 150 | 1 | 300 | ... | ... |
| 6. యితర అప్పులు | 1 | 309 | 2 | 350 | 1 | 85 |
| 7. డిపెనస్సు బాండుల సెక్యూరిటీపై అప్పులు | ... | ... | ... | ... | ... | ... |
| మొత్తము | 1370 | 96393 | 1414 | 93458 | 1581 | 95411 |

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

Progress of loans. STATEMENT No. 17.

| వివరములు. | సం॥ 43—44 నెం | మొత్తము రు. | సం॥ 44—45. నెం | మొత్తము రు. |
|---|---|---|---|---|
| 1. పంట సరకులు సస్యపు సరకులు | 21 | 10650 | ... | ... |
| 2. బంగారముపై అప్పులు | ... | ... | 29 | 12100 |
| 3. తనఖా అప్పులు | 372 | 45346 | 238 | 53593 |
| 4. జామిన్లు, జాయింటు అప్పులు | 508 | 43328 | 467 | 89721 |
| 5. డిపాజిట్లు సెక్యూరిటీలపై అప్పులు | ... | ... | ... | ... |
| 6. యితర అప్పులు | ... | ... | ... | ... |
| 7. డిబెంచర్లు బాండుల సెక్యూరిటీపై అప్పులు | 1 | 800 | ... | ... |
| మొత్తము | 902 | 100124 | 734 | 155414 |

The Alamuru Co-operative Rural Bank Ltd.,

Statement No 17.

Progress of loans

| వివరములు | సం॥ 45–46 నెం. | మొత్తము రు. | సం॥ 46–47 నెం. | మొత్తము రు. | సం॥ 47–48 నెం. | మొత్తము రు. |
|---|---|---|---|---|---|---|
| 1. పంటసరుకులు సస్యపుసరకులు | 19 | 9950 | 12 | 8,02 | 20 | 9107 |
| 2. బంగారముపై అప్పులు | ... | ... | 9 | 3675 | 2 | 375 |
| 3. తనఖా అప్పులు | 397 | 101955 | 607 | 137625 | 692 | 220133 |
| 4. జామీను, జాయింటు అప్పులు | 571 | 109394 | 656 | 135679 | 664 | 172848 |
| 5. డిపోజిటు సెక్యూరిటీలపై అప్పులు | 3 | 1800 | 9 | 3100 | 25 | 10875 |
| 6. యితర అప్పులు | ... | ... | ... | ... | 2 | 3800 |
| 7. డిపెనస్సు బాండుల సెక్యూరిటీపై అప్పులు | ... | ... | ... | ... | ... | ... |
| | 990 | 223099 | 1293 | 288081 | 1405 | 417138 |

## Statemeut No 17
## The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

| వి వ ర ము | సం॥ 48–49 నెం. | మొత్తము. రు. | 49–05. నెం. | మొత్తము. రు. |
|---|---|---|---|---|
| 1. పంటసరుకులు సస్యపు సరకులు | 22 | 12097 | 36 | 29998 |
| 2. బంగారముపై అప్పులు | 29 | 11195 | 48 | 17910 |
| 3. తనఖా అప్పులు | 785 | 285351 | 983 | 523383 |
| 4. జామీను జాయింటు అప్పులు | 599 | 173946 | 805 | 286088 |
| 5. డిపోజిటు సెక్యూరిటీలపై అప్పులు | 15 | 13445 | 12 | 17605 |
| 6. యితర అప్పులు | ... | ... | ... | ... |
| 7. డిఫెన్సు బాండుల సెక్యూరిటీలపై అప్పులు | ... | ... | ... | ... |
| మొత్తము | 1450 | 496034 | 1884 | 874984 |

## STATEMENT. No. 15.

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru

Loans issued to landless labourers for purchase of rice, Cloth and Lanka Cultivation, and collections.

| No. | Name of Village. | Number of members. | 39—40 Issued | 39—40 Collected | 40—41 Issued | 40—41 Collected |
|---|---|---|---|---|---|---|
| 1. | Alamuru. | — | .... | .... | 272 | .... |
| 2. | Jonnada. | .... | .... | .... | 3654 | .... |
| 3. | Mulastanam. | .... | .... | .... | 175 | .... |
| 4. | Navabu peta. | .... | .... | .... | 174 | .... |
| 5. | Chintaluru. | .... | ... | .... | 838 | .... |
| 6. | Penikeru. | .... | .... | .... | .... | .... |
| 7. | Kalvacherla. | .... | .... | .... | .... | .... |
| 8. | Pedapella. | .... | .... | .... | .... | .... |
| 9. | Vedurumudi. | .... | .... | .... | 138 | .... |
| 10. | Suryarao peta. | .... | .... | .... | .... | .... |
| 11. | Angara. | .... | .... | .... | .... | .... |
| 12. | West-Khandrika. | .... | .... | .... | .... | .... |
| 13. | Thatapudi. | .... | 295 | ... | 889 | 154 |
| | | | 295 | ... | 6150 | 154 |

## STATEMENT 15.

The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

Loans issued to landless labourers for purchase of rice, Cloth and Lanka Cultivation, and collections.

| No. | Name of village. | 41-42 | | 42-43 | | 43-44 | |
|---|---|---|---|---|---|---|---|
| | | issued | Collected | issued | Collected | issued | collected |
| 1. | Alamuru. | 841 | 189 | 1887 | 876 | 1602 | 1008 |
| 2. | Jonnada. | 1005 | 3450 | 6051 | 1329 | 9653 | 5496 |
| 3. | Mulastanam. | 294 | 152 | 455 | 268 | 210 | 387 |
| 4. | Navabupeta. | 280 | 170 | 997 | 274 | 492 | 467 |
| 5. | Chintaluru. | 1056 | 716 | 957 | 987 | 947 | 901 |
| 6. | Penikeru. | 196 | .... | 471 | 196 | 361 | 468 |
| 7. | Kalvacherla. | .... | ... | 104 | 16 | 147 | 88 |
| 8. | Pedapalla. | .... | ... | 96 | 5 | 148 | 125 |
| 9. | Vedurumudi. | 449 | 35 | 1117 | 341 | 796 | 897 |
| 10. | Suryarao peta. | .... | ... | .... | .... | 104 | 15 |
| 11. | Angara. | .... | .... | .... | .... | ... | .... |
| 12. | West Khandrika. | .... | ... | 897 | .... | 2036 | 812 |
| 13. | Thatapudi. | 1028 | 643 | 6818 | 637 | 4089 | 2535 |
| | | 5149 | 5285 | 19850 | 4929 | 20585 | 14199 |

[44]

STATEMENT. 15.

The Alamuru Co-operative Rural Bank Ltd.,
Loans issued to landless labourers for purchase of rice Cloth and Lanka cultivation and collections.

| No. | Name of vilage | 44-45 | | 45-46 | | 46-47 | |
|---|---|---|---|---|---|---|---|
| | | Issued | Collection | Issued | Collection | Issued | Collection |
| 1. | Alamuru | 1485 | 1593 | 1842 | 2006 | 2879 | 1590 |
| 2. | Jondada | 11842 | 6067 | 9068 | 7411 | 9899 | 6899 |
| 3. | Mulastanam | .... | 189 | 570 | 125 | 2250 | 649 |
| 4. | Navabupeta | 214 | 145 | 680 | 625 | 1094 | 804 |
| 5. | Chintaluru | 945 | 899 | 552 | 687 | 1092 | 409 |
| 6 | Penikeru | 1027 | 958 | 1264 | 984 | 1306 | 1361 |
| 7. | Kalvacherla | 124 | 147 | 320 | 122 | 342 | 322 |
| 8. | Pedapalla | .... | 114 | 218 | 211 | 380 | 367 |
| 9. | Vedurumudi | 492 | 894 | 1901 | 352 | 4844 | 1029 |
| 10. | Suryarao peta | ... | 81 | .... | 8 | .... | .... |
| 11. | Angara | 60 | .... | 3402 | 54 | 5160 | 2147 |
| 12. | West Khandrika | 4910 | 1950 | 2768 | 4257 | 5411 | 2539 |
| 13. | Thatapudi | 4876 | 4245 | 1926 | 5479 | 7780 | 2965 |
| | Total | 25475 | 16582 | 24506 | 22315 | 41935 | 21081 |

STATEMFNT No. 15

The Alamuru Co-operative Rural Bank Ltd.,

Loans issued to landless in labourers for purchase of rice, Cloth and Lanka cultivation, and collections.

| No. | Name of village | 47—48 | | 48—49 | | 49—50 | |
|---|---|---|---|---|---|---|---|
| | | Issued | Collection | Issued | Collection | issued | Coilection |
| 1. | Alamuru | 50 | 26 | 249 | 1439 | 480 | 246 |
| 2. | Jonnada | 3069 | 9876 | 3029 | 3575 | 4270 | 2326 |
| 3. | Mulastanam | 4300 | 2049 | .... | 5856 | 17900 | 5483 |
| 4. | Navabupeta | .... | 989 | 1660 | 1845 | 11558 | 896 |
| 5. | Chintaluru | 920 | 816 | .... | 1890 | .... | .... |
| 6. | Penikeru | 1731 | 1177 | 11 10 | 1975 | 1630 | 1044 |
| 7. | Kalvacherla | 404 | 339 | 320 | 407 | 430 | 320 |
| 8. | Pedapalla | 2709 | 2527 | 2760 | 1886 | 4921 | 1547 |
| 9, | Vedurumudi | 4774 | 3215 | 2330 | 2592 | 3080 | 6986 |
| 10. | Suryarao peta | 1082 | ... | .... | 574 | 950 | 498 |
| 11. | Angara. | 6742 | 4102 | 3680 | 5215 | 6760 | 5526 |
| 12. | West Kandhrika | 4570 | 4975 | 2980 | 3965 | 5266 | 3234 |
| 13. | Thatapudi | 982 | 2549 | 1914 | 5256 | 4807 | 6250 |
| | Tctal | 31333 | 32640 | 20032 | 36375 | 62052 | 34356 |

## STATEMENT 15.

### The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

### Loans issued to landless labourers for purchase of rice, Cloth and Lank Cultivation, and collections.

| No. | Name of village. | 50–51 Issued | 50–51 Collection | Total Issued | Total Collection | Outstanding as on 30—9—50 |
|---|---|---|---|---|---|---|
| 1. | Alamuru | .... | 2250 | 11587 | 11223 | 364 |
| 2. | Jonnada | .... | 1625 | 61040 | 48054 | 12986 |
| 3. | Mulastanam | .... | 6786 | 26154 | 21944 | 4210 |
| 4. | Navabupeta | .... | 304 | 17149 | 6519 | 10630 |
| 5. | Chintaluru | .... | ... | 7305 | 7305 | .... |
| 6. | Penikeru | 580 | 1256 | 9676 | 8719 | 957 |
| 7. | Kalvacherla | 320 | 423 | 2511 | 2177 | 334 |
| 8. | Pedapalla | .... | 3416 | 11227 | 10198 | 1029 |
| 9. | Vedurumudi | 1220 | 2004 | 20641 | 18345 | 2296 |
| 10. | Suryarao peta | .... | 378 | 2136 | 1554 | 582 |
| 11. | Angara | .... | 5278 | 25804 | 22322 | 3482 |
| 12. | West Khandrika | .... | 5153 | 28838 | 26885 | 1963 |
| 13. | Thatapudi | 3550 | 969 | 38964 | 41576 | 7388 |
| | | 5670 | 29842 | 263032 | 216821 | 46211 |

## ఆలమూరు సకలార్థసహకార సంఘము.

1949_50 సంవత్సరాంతమునకు నిల్చియున్న అప్పుల తాలూకు వివరములు 8 వస్టేటుమెంటులో నుదహరింప బడినవి. ఏయే ప్రయోజనములకు యెన్ని అప్పులు ఎంత మొత్తములు కీయబడిన వివరములు యీస్టేటుమెంటులో పొందు పరుపబడినవి. ఇందు మూలమున బ్యాంకు వ్యాపారము వివిధ వృత్తుల వారిలో ఎట్లు అభివృద్ధి గాంచినది ద్యోతకమగును.

బ్యాంకులో వ్యక్తి ఋణాధికారము రు 3000 కు మించిలేదు. ఎంత ఆస్థిపరునకైనను యీఋణాధికారముదాటి అప్పీయబడదు. రిజిష్ట్రారువారి సర్క్యులర్ ప్రకారము జామీను అప్పులు, తనఖా అప్పులు, వస్తువులు హామీ అప్పులు, నిలువుసస్యము, పంట భూములపై అప్పులు, రు5000/రూపాయిలు మించి యీయరాదని వుత్తరువులు జారీచేయబడినవి.

బొంబాయి రాష్ట్రములో వ్యక్తి ఋణాధికారము గ్రామ సంఘములు అప్పిచ్చే సెంట్రల్ బ్యాంకు వారు నిర్ణయించు కొందురు. సంఘ నిబంధనలలో వ్యక్తి ఋణాధికారము నిర్ణయింప బడదు. ఆస్థినిబట్టి వ్యక్తి ఋణా

ధికారము నిర్ణయించుహక్కు సెంట్రిల్ బ్యాంకు వారి దేను. మన రాష్ట్రములో అట్లుగాక రిజిష్ట్రారువారిచే సంఘ సభ్యుల వ్యక్తి ఋణాధికారము అందరికి యొక్క మారే నిభంధనలలో నిర్ణీతమై యుండును. ఇందు మూలమున అనర్హులగు వారికి, పంచాయితీల మొగమాట మున్నచో, తీర్చుకొను అవకాశము లేకపోయినప్పటికి యెక్కువ అప్పు మొత్తము మంజూరు చేయుటకవకాశము కలదు. అర్హులైన వారికి అప్పు తీర్చు అవకాశమున్నను వారికి వ్యక్తిఋణాధికారము ఖచ్చితముగా నిర్ణయింపబడు టచే వారికి హెచ్చు ఋణము నిచ్చుట కవకాశములేదు. బ్యాంకు ధనస్తోమతునుబట్టి, వ్యాపారాభివృద్ధి చేసుకొను టకు, బ్యాంకు పాలక మండలి వారికి ఋణములిచ్చుటకు అధికార ముండవలెను. భూ॥త॥బ్యాంకులలో వ్యక్తి ఋణా ధికారము రు15000/- వరకున్నది. విస్తారము పెట్టుబడు లకు ధనము కావలసిన యీ రోజులలో సరకు హామీపై నను పంటలుహామీపై నను తనఖా పై నను 5 మొదలు 10 వేల వరకు వ్యక్తులకు అప్పులిచ్చుటకు బ్యాంకులకు అధి కారముండవలయును. అయితే తగిన హామీ లేనిదే యీ హెచ్చు ఋణాధికారము వ్యక్తులకు యీయరాదు. తగిన హామీ తీసుకొని హెచ్చుఋణాధికారము సభ్యు

లకు కలుగుజేసిన-చో బినామీ అప్పుల వ్యాపారము తగ్గింప వీలున్నది. ప్రభుత్వము వారు యీ విషయమై నిబంధనలు సవరింప వలయును. ఇంకను శృంఖలా బద్ధము చేసిన వ్యాపారము సరికట్టుటయే కాక, అపమార్గముల అప్పులు తీయుటకు దోహదమొసగును.

పల్లెటూళ్ళలో రైతులకు విస్తారము సకాలములో వ్యవసాయ పెట్టుబడులకు ధనము కావలెను. ముఖ్యముగా మంద మహాకత్తులకు, వ్రాచ్చలకు, కోతలకు, పంటల నూర్చుటకు అదునుకు రైతునకు చేతులో డబ్బు లేని-చో ఎంత వడ్డీకైనను డబ్బు తెచ్చుకొని పంటబరాతము పెట్టవలసి వచ్చును. ఈ తరుణములోనే రైతు వడ్డీ వ్యాపారస్తుల చేతి చిక్కును. మనరాష్ట్రములో సాలీనామా వ్యవసాయ పెట్టుబడులకు 60 కోట్ల రూపాయలు వ్యయ మగునని మదరాసు బ్యాంకింగు యంక్వైరీ కమిటీ వారు స్థిరపరచిరి. దాదాపు 50 సంవత్సరముల నుంచి సహకారోద్యమము రాష్ట్రములో వ్యాపించి పరపతి వ్యాపారము సాగించు చున్నారు. సాలీనామా పట్టుమని పదికోట్లైన సహకార బ్యాంకులుఅదునుకు అప్పులీయుటలేదు. పరప్రభుత్వ పాలనలో ప్రభువ్వము

వారికిగైతుపట్ల అభిమానము విశ్వాసములేకపోవచ్చును. ప్రజా ప్రభుత్వములోనైన రైతునకు సకాలములో పెట్టుబడికి డబ్బు యిచ్చుటకు సహకార బ్యాంకులకు తగిన ధనస్తోమత కలుగజేయ వలెను. లేదా ప్రభుత్వము వారు నేరుగానైనను డబ్బీయ వలయును. జాయింటు స్టాకు బ్యాంకులు రైతులకు డబ్బుయీయావు. చిల్లర రైతులకు జాయింటు స్టాకు బ్యాంకులు అందుబాటులో నుండవు. ఇక వడ్డీ వ్యాపారస్తులే గత్యంతరము. ప్రభుత్వమువారు షాహుకారు వడ్డీరేటు 6% మించి అప్పుపత్రములో వుండకూడదని నిషేదించినను అసలీ పాయిదాలు ముందుగనే కట్టుకొని రైతువద్దనుంచి షాహుకార్లు అప్పు పత్రములు వ్రాయించుకొనుచున్నారు.

సహకార బ్యాంకులు రైతులకు సకాలములో అప్పులీయ లేకున్నవి. ఈవిషమ పరిస్థితులనుంచి రైతును లేవనెత్త వలెనంటే ప్రభుత్వమువారు సకలార్ధ సహకార సంఘములను విరివిగా వ్యాప్తి చేయించి ధనస్తోమతు కలుగజేయవలెను. ఇప్పుడు గ్రామ సహకార బ్యాంకులకు యిచ్చే అప్పుల విధానమంతా ద్రావిడ ప్రాణాయామములాగున యున్నది. సభ్యుల దరఖాస్తులు సంఘమునకు చేరుకోవలెను. సంఘ దరఖాస్తు

సెంట్రల్ బ్యాంకుకు చేరాలి. తగిన ధనస్తోమతు లేని సెంట్రల్‌బ్యాంకులు రాష్ట్ర బ్యాంకువారు ధనము సరఫరా చేయాలి. ఈఅవాంతరములన్నియు గడిస్తేనేకాని రైతుకు డబ్బు చేతులలో పడలదు. ఈలోగా పుణ్యకాలం కొంతా తీరిపోవుతుంది. ఇందుకు ఒక్కటే గత్యంతరము. సకలార్థ సంఘములు సభ్యుడుగాచేరినప్రతి రైతునకు యెంతో (Cash Credit) కొంతకాతా ఋణము సంవత్సరములో మంజూరు అయివుండాలి. రైతునకు డబ్బు కావలసినపుడు అడిగినదే తడవుగా పెట్టెలోనిది తీసుకొన్నట్లు బట్వాడా కావాలి. ఇట్టి యేర్పాట్లు స్థిరాస్థి శాశ్వత తనఖా దస్తావేజులపై సులభముగా అమలుజరప వీలున్నది. ఈపద్ధతినే ఈ ఆలమూరు కో ఆపరేటివు రూరల్ బ్యాంకువారు ఆదర్శకములో పెట్టి అమలు జరుపుచున్నారు. పది సంవత్సరముల కృషి ఫలితముగ రైతునకు సకాలములో ఆయా అవసరములకు అప్పులు బట్వాడా చేయగలుగుచున్నారు. సెంట్రల్ బ్యాంకు అధికారులు బ్యాంకు నిర్మాణ నిర్వహణ సౌష్టవము బరిశీలించి సకాలములో (Cash Credit) అప్పుల మొత్తములను కాల విలంబనము లేకుండ మంజూరు చేయుచున్నారు. ఇతర ప్రాంతములలో ఇట్టి సౌహార్ధ్రిత సంఘములకు

బ్యాంకులకు యుండి పనిచేసినచో రైతుకడగండ్లు తీర గలవు. సకాలములో అప్పులు పుట్టగలవు.

అప్పులు పుట్టినంత మాత్రమున రైతు బాగు పడడు. ఇంకను యెన్నియో అవాంతరముల గడుప వలసి యున్నది.

నేడు సభ్యునకు అప్పు సంవత్సరము 1కి 100 కి 6-4-0 వడ్డీతో బట్వాడా అగుచున్నది. ఇంత హెచ్చు వడ్డీ రేటుపై రైతు అప్పుచేసి కృషి కొనసాగించిన యిం కను అప్పుల పాలవ వలసినదే కాని మిగులేది యేమియు లేదు. ధరవరులు నేడు హెచ్చుగా నుండుటచే యేదైన పెద్ద రైతునకు కిట్టుపాటున్నదేమో కాని సామాన్య రైతునకు మిగిలేది యేమియు లేదు. రైతు నకు తక్కువ వడ్డీ రేటునకు అప్పు లభించాలి. మద్రాసు రాజధానిలో రైతులు ఋణ పరిశీలన కావించిన శ్రీ. W.R.S. సత్యనాథన్‌గారు యీవిషయమై తగు పరిశీలన కావించి రైతునకు భూమిమీద ఫలసాయము వలన కిట్టుబాటు నూటికి 2 మొదలు 5 రూపాయలకంటె మించ దని అంచనా వేసిరి. నూటికి 2 లేక 5 కంటె లాభము

రాని వ్యవసాయములో రైతు 100 కి 6-4-0 వడ్డీని అప్పుతీసి వ్యవసాయము చేసిన అప్పు యెట్లు తీర్చగలడు?

వ్యవసాయ ఋణ నివేదికలో శ్రీ. W.R.S. సత్యనాథన్‌గారు యీదిగువ రీతిని పేర్కొనిరి.

" Agriculture is an idustry which gives a return of from 2 to 5% in a normal year. To borrow for such an Idustry at even 9% is therefore unsound and obviously such loans cannot be repaid without encroaching upon capital which is the land itself. In order to repay loans agriculturists borrow again and again. So, the standing debt gradually increases till it overhelms the small and medium land holder and deprives him of his land leaving him helpless and destitute. "

వ్యవసాయ పెట్టుబడికే ఋణములలో మునిగినవాడు, తేలేదియెట్లు? ఏటేట యెవరు యీదండుగ వ్యాపారము చేస్తారు? అన్యవృత్తిలేక వ్యవసాయమే జీవనాధారము అగుటచే రైతులు

యీ వృత్తినే అంటిపెట్టుకొని అప్పులు పెరుగుటతో వున్నటే పూర్వార్జితవు ఆస్థిని అమ్ముకుంటూ కాలప్రవాహములో కొట్టుకొని పోవుచున్నారు. ఇందుమూలమున నెన్నియో రైతు కుటుంబాలు నాదారై నశించి కూలి,నాలి చేసుకొను స్థితికి వచ్చుచున్నారు.

రైతునుద్ధరించ వలెనన్న వడ్డీరేటు తగ్గించి డబ్బు సరఫరా చేయుట మూలమున కొంత సదుపాయము కల్గును. 100 కి సంవత్సరం కి 4 రూపాయల మించి వడ్డీరేటుండ గూడదు.

సహకార పరపతి యుద్యమ నిర్మాణములో అంతరువులుగ సంస్థలు నిర్మింప బడినవి. అన్ని క్రిమాను గతముగ దాటినగాని అప్పు సభ్యునకు చేతిలోనికిరాదు. రిజర్వు బ్యాంకువారు రాష్ట్రీయ బ్యాంకునకు సంవత్సరము 1కి 100 కి రు 1-8-0లు చొప్పున వడ్డీకిచ్చుచున్నారు. రాష్ట్రీయ బ్యాంకు వారు ఇంకొక రు1-8-0 లు వడ్డీ తమ సిబ్బందీ ఖర్చులకు నిర్వహణ ఖర్చులకుపెంచి సెంట్రల్ బ్యాంకులకు సాలు 1కి రు100 లు కి రు 3-0-0 లు రూపాయలు చొప్పున

వడ్డీ కిచ్చు చున్నారు. సెంట్రల్ బ్యాంకువారు వారిఖర్చులకు మఱియొక రు 1_8_0 లు వేసుకొని సంఘములకు నూటికి రు4_8_0లు చొప్పున వడ్డీ రేటుతో అప్పిచ్చుచున్నారు. సంఘములు తిరిగి తమ ఖర్చులకు సిబ్బందీ వ్యయములకు రు 1_12_0 లు చేర్చి రు 6_4_0 లు కు రైతునకు వడ్డీకట్టి అప్పులిచ్చుచున్నారు. మూడుచేతుల డబ్బు మారక మూలమున రు 100 లు॥కి రు 1_8_0 లు వడ్డీకిచ్చే ధనము రైతుకు రు 4_12_0లు అదనముగా పెంచబడినది. ఇందు మూలమున వడ్డీరేటు రు 6_4_0 లు అయినది. మధ్య దళారీ వ్యాపారము సహకారుల మందరము గర్హించుచున్నారము. ఎవరి లాభమువారు వేసుకొని సరుకులు అమ్మకం జరుపుటలో అసలుసరకు ఖరీదు రు1/లుఅయితే సరకు కొనుక్కొను వాని చేతులోకి చేరుసరికి నాలుగింతలు అవుతున్నది. ఈ దళారీ వ్యాపారస్థులను తగ్గించాలని మనము సర్వత్ర ఆందోళనము చేయుచున్నాము. మన సహకారోద్యమములో కూడ యీఅంతర్వుల వ్యాపారము తగ్గించుకోవాలి. రిజర్వు బ్యాంకువారు సెంట్రల్ బ్యాంకులకు నేరుగనే అప్పిచ్చిన యెడల ఒక అంతర్వు తగ్గిపోవును. సెంట్రల్

బ్యాంకువారు కూడ రు 1-8-0 లు లాభము చూచు కొనకుండగ రు 0-8-0 లు లాభము చూచుకోవాలి. సంఘములు కూడ ఒక రూపాయి లాభమే వేసు కోవాలి. అప్పుడు సంఘములు సభ్యులకు రు 100 లు కి రు 3½/ ల వడ్డీ కే అప్పులు బట్వాడా చేయవచ్చును. అప్పుడేరైతు హెచ్చు వడ్డీల భారమునుండి తొలగింప బడగలడు. ఇందుకు సహ కారులు ఆందోళనసల్పి ఈ అప్పు బట్వాడా విధాన ములో మార్పు తీసుకొని రావలయును. ఇది సాధ్యము కాని-చో ప్రభుత్వమువారే సహకార సంఘము లను నేరుగా తక్కువ వడ్డీల కిచ్చుటకు తగిన సాధన ముల నన్వేషింప వలసి యున్నది.

పరదేశ ప్రభుత్వములు వ్యవసాయములో రైతు నిష్టపడ కుండగ వడ్డీల నభాలు రైతులకు యిచ్చివ్యవ సాయమును ఫల ప్రదమైన వృత్తిగాచేసి పోషించుచు న్నారు. అట్లు చేయని-చో రైతు హెచ్చు పంటలు పండించుటకు ఆతృతచెందడు. మదరాసు ప్రభుత్వము వారు యీసత్యమును గ్రహించియే రాయలసీమలోని రైతుల దుస్థితిని బాపుటకు సెంట్రల్ బ్యాంకుచే

తక్కువ వడ్డీలకు సంఘముల కిప్పించి ఈ నష్ట పరిహార ముగ సెంట్రల్ బ్యాంకులకు ప్రభుత్వమువారు ముదరా యిచ్చుచున్నారు. ఇది యుత్తమాదర్శకము. ఈ పద్ధతియే మద్రాసు ప్రభుత్వమువారు రాష్ట్రమంతట అమలులో పెట్టి రైతు పురోభివృద్ధికి అధికాహారోత్పత్తికి తగిన దోహద మొసగవలయును. లేనిచో సామాన్యరైతులు నిలువజాలరు. స్వయం పోషకత్వము లేక పరాధీనత బ్రతుకు బ్రతికే పాటకపు జనమును పోషించు బాధ్యత ప్రభుత్వముపై బడును. ఇట్టిపరిస్థితిరాకుండ స్వయం పోషకత్వము చేసుకొన గలిగిన చిన్నరైతులను ప్రభుత్వమువారు నిలబెట్టుట ముఖ్యకర్తవ్యము.

## బ్యాంకు పాలన

బ్యాంకు పరిపాలనము మహాజన సభవారిచే యెన్నుకొనబడిన 7 గురు పాలకమండలి సభ్యులచే నిర్వహింప బడుచున్నది. ఈ సభ్యులు 2 సం॥ల కొక సారి మహాజన సభవారిచే యెన్నుకో బడుదురు. ఈ సభ్యులలో నుంచి ఒక అధ్యక్షుడు ఒక వుపాధ్యక్షుడు ఎన్ను కోబడుదురు. నిబంధనల ప్రకారము బ్యాం

కునకు వేతన కార్యదర్శి నియోగింపబడవలెను. దావాలు వేయుట, సంఘము పై యితరులు వేసిన దావాలకు సమ జాయిషీచెప్పుట, ప్రశిడెంటుదే అధికారము. నిబంధనల ప్రకారము బ్యాంకునకు ప్రత్యేక కోశాధికారి లేదు. అధ్యక్షుడే కోశాధికారి. బ్యాంకు ద్రవ్యమునకు, ఆస్తికి అధ్యక్షుడే పూచీదారుడు. బ్యాంకు ద్రవ్యము ఇనుపపెట్టిలో అధ్యక్ష, కార్యదర్శుల పూచీ పై భద్రపరుపబడియుండును. రెండు తాళములు (Double lock & key) చెరి ఒకరి వద్దవుండును. అధ్యక్షుడు గ్రామాంతరము వెళ్ళినపుడు వుపాధ్యక్షుడు వ్యాపారము చూచును. బ్యాంకులో చెల్లింపబడిన సొమ్మునకు కార్యదర్శియే రశీదుపై సంతకము చేయును. అయితే సెంట్రల్ బ్యాంకు నుంచి వచ్చేఅప్పుకు డిపా జిట్లకు అధ్యక్షుడు లేక వుపాధ్యక్షుడు మరియిద్దరు కార్యనిర్వాహక సభ్యులచే సంతకము చేయబడి యివ్వ బడును. వేతన కార్యదర్శివద్ద రు 2000/ లు రొఖ్ఖము హామీ తీసికొనబడినది. పాలక మండలి సభ్యులు తరుచు సమావేశమై బ్యాంకు వ్యవహారమును పరి శీలించుచుందురు. అధమము వారమునకు 3 పాలక మండలి సమావేశములైనను జరుగును. ఈ సమా

దేశములో అప్పుదరఖాస్తులు మంజూరు చేయబడును. పాలక మండలి సభ్యులు గౌరవోద్యోగులుగా పనిచేయు దురు. ఎట్టి వేతనముగాని గౌరవ వేతనముగాని లేదు. సిట్టింగుఫీజులు లేవు. బ్యాంకు వ్యవహారముపై యితర చోట్లకు వెళ్ళవలసినపుడు ఖర్చులు యీయబడును. పాలక వర్గమువారి ఆమోదమునకు లోబడి అధ్యక్షుడు బ్యాంకు సిబ్బందిని నియోగించును. జీతములుప్రమోష నులు యీయబడును. మహాజన సభవారి శాంక్షు నుపై బ్యాంకు ఆదాయవ్యయములు (Budjet) లో కనబరచిన ప్రకారము పాలక మండలివారు బ్యాంకు నిర్వహణమునకగు ఖర్చులు వ్యయ పరతురు. మహా జనసభవారి అనుమతిలేనిదే పాలక మండలి వారికి ఎట్టి అధికారములేదు. అధ్యక్షుడు పాలక మండలి ఆమో దమును బడసి బ్యాంకు వ్యవహారములు నిర్వహించును.

సకలార్థ సహకార సంఘములు ప్రై సందిన కార్య ములు చక్కబెట్టుటకు అధ్యక్షుడుకాని, పాలకమండలి సభ్యులుకాని చేయలేరు. బ్యాంకుయొక్క యుద్దేశ ములు పరిపాలించుటకు మాత్రమే వారు తోడ్పడ గలరు. సిత్యకార్య వ్యవహార మంతయు వేతనోద్యో

గులే నిర్వహింప వలయును. వేతనోద్యోగులు లేనిదే సకలార్థ సహకార సంఘముల బహుళ వ్యాపారము నిర్వ హించుట సాధ్యముకాదు.

దేవాలయము కనిపెట్టుకొని అర్చకుడు యెట్లు యుండి యాత్రికులకు దేవతా దర్శనమునకు తోడ్పడుతూ పూజా పునస్కారములు కావించు చుండునో, అరీగనే నిర్ణీత వేళల బ్యాంకు వ్యవహారములు సక్రమముగ జరిపించుచు బ్యాంకు పనినిమిత్తము వచ్చిన సభ్యులకు తగిన సమాధానము వేతనకార్యదర్శి యీయవలెను. పలు విధములైన బ్యాంకు కార్యములు నిర్వహించుటకు అర్హు లైన తగిన సిబ్బందీలేనిదే బ్యాంకు వ్యవహారములు నిర్వ ర్తింప బడవు. మొదటినుంచి గ్రామ పరపతి సంఘము లన్నియు గౌరవోద్యోగుల పైననే ఆధారపడు చుండెను. గౌరవోద్యోగులు ప్రతి గ్రామములో తగిన వారుండ వచ్చును. లేక పోవచ్చును. ఎల్లకాలము ఒకరికే గౌరవ ముగా పనిచేయుటకు సాధ్యము కాకపోవచ్చును. వారి పై ప్రజలకు విశ్వాసము లేకపోవచ్చును.

ప్రభుత్వ నిర్వహణమునకు గౌరవ సభ్యులగు శాసన సభ్యులుండిన చాలునా? ప్రజా పరిపాలనమునకు కావలసిన

వివిధ శాఖలకు, వేతనోద్యోగులుండి తీరవలయును. ఈయుద్యోగులు సమర్థత అర్హతలను బట్టియే పరిపాలనా సౌష్టవము కలుగును. ఈ రీతిగనే గ్రామ సహకార బ్యాంకులు నిర్వహణముకు కూడ సక్రమముగ తరిఫీదు నొందిన అర్హులగు బ్యాంకు సిబ్బంది వుండితీర వలయును. గత 40 సంవత్సరములనుంచి గ్రామ సంఘములలో వేతన కార్య దర్శులు, తదితర సిబ్బందిలేక పోవుటమూలమున సంఘము లెదుగుబొదుగులేక నీళ్ళుకారుచున్నవి. ఇంత వరకు పరపతి వ్యాపారము మాత్రమే చేయుచు సంవత్స రమున కొకసారి సెంట్రల్ బ్యాంకునుండి అప్పులుతెచ్చి వసూళ్ళు యిచ్చుచుండుటచే వేతన సిబ్బంది లేకపోయి నను పరపతి యుద్యమము సాగిపోవుచున్నది. నేడట్లు కాదు. గ్రామ సంఘముల వ్యవహారములు అప్పులిచ్చి పుచ్చుకొనుటతో సమాప్తికాదు. సభ్యులకు కావల సిన సరకులు సరఫరా చేయవలయును. సభ్యుల పంట దినుసులను వుత్పత్తి వస్తువులను అమ్మి పెట్టవలయును. సహకార సంఘములు సభ్యుల వివిధ ప్రయోజనముల కొరకు తోడ్పడ వలసి యున్నది. వీటి నన్నిటిని సక్ర మముగ వ్యవహరించుటకు వేతనోద్యోగులు లేనిదే తుదముట్టదు. వేతన సిబ్బందికి డబ్బు యెక్కడనుంచి

వచ్చును? పరపతి వ్యాపారములో డబ్బు యిచ్చి పుచ్చు
కొనుటలో నూటికి రు 1-8-0 లు మించి లాభముం
డదు. ఒక రు 0-8-0 లు ఖర్చులకే అయిపోవును.
ఇక మిగిలేది ఒకరూపాయి. గ్రామ పరపతి సంఘముల
సకటు వ్యాపారము రు 5000 లు మించిలేదు. సాలుకు
రు 50/ లు అదాయము వచ్చే గ్రామ సంఘములు ఏమి
సిబ్బందీని నియమించు కోగలవు. పరపతి వ్యాపార
ములు చేసుకోలేని సంఘములు పరపతేతర వ్యాపార
ములుకూడ నెత్తిని పెట్టుకొని వేతనసిబ్బందీ లేకుండ
నడిపించుకో గలుగుట కల్లమాట. రు 5000/ లు
కాదు సకటున సాలీనా రు 50000 లు వ్యాపా
రము చేసే సంఘములు కూడ వేతనోద్యోగులను
నియమించు కోలేదు. రు 50,000 లు వ్యాపారము
చేసినా సాలునకు ఖర్చులు పోను వడ్డీ సక్రమము
గా వసూలైతే మిగిలేది 100 కి 1 రూపాయి చొప్పున
500/ మాత్రమేను. ఈరోజులలో జమా ఖర్చు
వ్రాయగల్గిన సహకార స్కూలులో తరి ఫీదైన సూప
రువైజర్ కు కనీసము రు50/ లు ఇస్తేనే కాని గుమాస్తాగా
రాడు. ఒక గుమాస్తాకే సాలునకు రు600/ లు కావలసి
యున్నది. ఇక ఇంటి అద్దె, బంట్రోతు కావలసి

యుండను. పల్లెటూళ్ళలోనైనా రు 10/ లు తక్కువ అద్దెకు ఇల్లుదొరకదు. రోజుకు రు 1/ లు అయిన యివ్వక పోతే కూలి వాడుకూడా రాడు. బంట్రోతునకు నెల ఒకటికి 30 రూపాయిలైనా యీయవలెను. ఇంకొక రు 10/ లు చిల్లర తపాలాఖర్చులు ఇతరఖర్చులు, అవును. నెలకు రు 100/ లు ఆఫీసు సిబ్బందీ ఖర్చులకు అయితీ రును. ఈ స్వల్ప సిబ్బందీ పోషించు కొనుటకు అధ మము ఒక లక్షరూపాయలు వ్యాపారమేనా వుండితీ రాలి. లక్ష రూపాయల వ్యాపారముచేస్తే మిగిలేది రు1000లు/. లక్ష రూపాయీలు వ్యాపారను చేసినా స్వంతసిబ్బందికి చాలకపోతే ఇక యీ సకలార్ధ సహ కార సంస్థలను ప్రతి పల్లెటూర పెట్టి సాధించేదెట్లు? "పెండ్లి కుదిరితేనేకాని వెట్టికుదరదు—వెట్టికుదిరితేనే గాని పెండ్లి కుదరదు" అనుసామెత లావున్నది. సిబ్బంది వ్యయమును తగిన డబ్బువుంటేనేగాని ఈ సకలార్ధ సహకార సంఘములు పెట్టిన ప్రయోజనము లేదు.

సకలార్ధసహకార సంఘములు సర్వతోముఖముగ పని చేస్తేనేకాని డబ్బురాదని రిజర్వుబ్యాంకు వారి వాదన. ప్రతి పల్లెటూరిలోను వ్యాపారవృద్ధి సర్వతోముఖమున చేయుటకు సావకాశమేది? ఒక్క పల్లెటూరి మట్టుకు

వ్యాపారము సంఘము ద్వారా చేసి సిబ్బందీ పోషించుకొనుట దుర్లభము. "రిజర్వు బ్యాంకు వారికి ఈ మాత్రం అనుభవము తెలియదా? అయితే దేశములోని పల్లెటూరి వారందరు ఐచ్ఛికముగా కృషి చేసి సంఘసేవ చేయవలయునని వీరి ఆశయము. వీరి హితోపదేశ మార్గములనే అనుసరించి ప్రభుత్వము వారు కూడ అభిప్రాయ పడుచున్నారు. ఇప్పటికైనా రిజర్వు బ్యాంకువారు ప్రభుత్వమువారు అభిప్రాయము మార్చుకొని, సకలార్ధ సహకార సంఘములు బహుళ వ్యాపారము నిర్వహించుటకు, తగిన సిబ్బందీని వేసుకొని పోషించుటకు, అనువైన గ్రామ సమూహములకు యీసంస్థలను విస్తరింప జేయవలెను.

గత 3 సంత్సరములనుంచి మద్రాసు రాష్ట్రములో వివిధ గ్రామములలో సకలార్ధ సహకార సంఘములు స్థాపింప బడినవి. వీటి వ్యాపార బాహుళ్యము, వేతన సిబ్బంది చూచిన ఆశ్చర్యకరముగ నుండును. ఇట్టి పురోభివృద్ధియే ముందు కూడ వీటికి కలిగిన కనుబొమ్మలలోని వెండ్రుకలవలె ఎదుగు బొదుగు లేక నిలిచిపో గలవు.

ఊరూర ఇట్టి సకలార్ధసహకార సంఘములు స్థాపించుటకు ప్రభుత్వమువారు యేటేట గత 2 సంవత్సరముల

నుంచి ఒకలక్షా 25 వేల రూపాయయిలు సెంట్రల్ బ్యాంకుల శిబ్బందీ నిమిత్తము వ్యయపరచు చున్నారు. ఇంకొక సంవత్సరము నాటికి రాష్ట్రమంతట నేటి నిర్మాణము పూర్తియగును. ఇక నిర్వహణ మెట్లు? శిబ్బందీ యేది? ఈ చిన్న సంస్థలు తమంతట తాము శిబ్బందీ వ్యయమును తమ వ్యాపార ధనము నుంచి ఖర్చుపెట్టి పోషించుటకు సమర్థములు కావు. అందుచేత ప్రభుత్వము వారు సహకార డిపార్టుమెంటు వారు తమ ప్రతిష్ట నిలబెట్టు కొనుటకు మరియొక క్రొత్త పతకము వేయు చున్నారు. ఈ పతకములోని విశేషాంశములను యీ మధ్యనే జాయింటు రిజిష్ట్రారుగ పనిచేయుచున్న శ్రీ K. సుబ్రహ్మణ్యం నాయుడుగారు Govt. Telegrafic డిపార్టు మెంటు సహకార సంఘముల యుద్యోగులు జరిపిన సహకార దినోత్సవమున వెల్లడించిరి.

ఈప్రణాళిక ప్రకారము 94 మునిసిపాల్టీలలో ఒక్కొక్క సహకార బ్యాంకు నిర్మాణముచేయ బడును. ఈ రీతిగనే 445 మేజరు పంచాయితీలలో ఒక్కొక్క సహకార బ్యాంకు స్థాపింపబడును. ఈ బ్యాంకుల నిర్వహణము నిమిత్తము తాత్కాలికముగ శక్రెటరీలు, తది

తర సిబ్బందీ నిమిత్తము బ్యాంకు 1కి రూ. 350/— లు విరాళ మీయబడును. మొత్తము 94 మునిసిపాల్టీలు 445 మేజరు పంచాయితీ లలో స్థాపించబడే సహకార బ్యాంకుల సిబ్బందీ నిమిత్తము 18 లక్షలు ప్రభుత్వము వారు ఖర్చు పరచెదరు.

సిబ్బందీ వ్యయము కాకుండ బ్యాంకుల వ్యాపారము నిర్వర్తించుటకు పక్కా భవనములు నిర్మింపబడును. ఒక్కొక్క భవనమునకు రు 20,000/ లు ఎస్టుమేటు చేయబడినది. ఇందులో 10 వేల రూపాయలు భవన నిర్మాణమునకు ప్రభుత్వమువారు పూర్తి విరాళము నొసగెదరు. మరి రు 10,000/ లు వడ్డీలేని అప్పు బ్యాంకునకు యిచ్చెదరు. బ్యాంకులకు ఈ భవన నిర్మాణము విషయమై ప్రభుత్వమువారు 108 లక్షల రూపాయలు వ్యయపరచనై యున్నారు. ఇది మద్రాసు ప్రభుత్వమువారు సహకార వుద్యమ పురోభి వృద్ధికి రాష్ట్రములో ముందు కావింపనై యున్న నూతన ప్రణాళిక. ఈ వ్యయములో సగము కేంద్ర ప్రభుత్వము వారు భరింప వలసినదని రాష్ట్ర ప్రభుత్వమువారు అర్థించిరి. కేంద్ర పభుత్వమువారి సహాయముతో రాష్ట్ర

ప్రభుత్వమువారు అచిరకాలములో యీ ప్రణాళిక పెట్ట
నై యున్నారు. ఈ ప్రణాళిక అమలులో పెట్టుటలో
ప్రభుత్వమువారి ప్రుద్దేశము గ్రామ సీమలలోను, చిన్న
పట్టణములలోను, ప్రజాళి వద్దనున్న అధిక ద్రవ్యమును
బ్యాంకుల ద్వారా ఆకర్షించి యుద్యమమునకు ప్రోత్సవము
కలుగ జేయుట ముఖ్యోద్దేశమై యున్నది. రోజురోజు
నకు క్రొత్త ప్రణాళికలు బయలు వెడలు చున్నవి.
నూతన సంఘములు సృష్టింపబడు చున్నవి. వాటికి
ప్రభుత్వమువారు దోహద మిచ్చుచున్నారు. ఈప్రదేశ
ములో ఇదివరకే స్థాపింపబడి పనిచేయుచున్న సహకార
బ్యాంకులగతి యేమి? మద్రాసురాజధానిలోని ప్రతి మునిసి
పాలిటీలోను ప్రతిమేజరు పంచాయితీలోను సహకార సంస్థ
లు నెలకొల్పబడి పనిచేయుచున్నవి. ఈడబ్బు వాటికిచ్చి
దోహదము చేసిన యెక్కువ ఫలప్రదము కాదా? అవి
యెక్కువ ఫలప్రదమైన కృషి సల్పుట కెంతయేని సావ
కాశముండును. ఈనూతన ప్రయత్నము యెందుకో
యింకను తెలియదు. ప్రభుత్వమువారు సహకార
బ్యాంకుల సింబ్బదీ కొరకు భవనములు కొరకైనను
ఖర్చుపెట్టిన ఎన్నికోట్లైనను కావలసి యుండును. సహ
కార సంస్థలు వ్యాపార సంస్థలు. తమ వ్యాపారాభి వృద్ధి

మూలముననే స్వంత ద్రవ్యము సంపాదించుకొని స్వయం పోషకత్వము కలిగి సిబ్బందిని పోషించుకొని స్వంత భవనము కట్టుకొన వలెను. ప్రభుత్వము వారిపై పరాధీనము కలిగి యుండకూడదు. ప్రభుత్వమువారు కూడ ఉద్యమమును పరభృతము చేయకూడదు. నేడు గ్రామ సహకార సంస్థలు, స్వయం పోషత్వములేక పరాధీనముగా నుండుటకు కారణము ప్రభుత్వమువారు అనవసరముగా జోక్యము కలుగజేసు కొనుట మూలముననేను.

ప్రభుత్వమువారి ఆదిట్టు ఉండవలసినదేను. ప్రభుత్వమువారి పరిశీలన ఆదరణం ముండవలసినదేను. నిర్మాణ నిర్వహణ విషయములో ప్రభుత్వము వారు జోక్యము కలుగ జేసుకొనగూడదు. గ్రామసహకార సంఘములు విస్తీర్ణ ప్రదేశము వృద్ధి చేసినచో యీసంఘములు వాటియంతట అవే తమ వ్యాపారము వృద్ధి చేసుకొనగలవు. సిబ్బందిని పోషించు కొనగలవు. స్వంత భవనములను కట్టుకొన గలవు. వ్యక్తి ఋణాధికారము పెంచుట కవకాశ మీయవలెను. వ్యాపార బాహుళ్యము అధికము చేసుకొనుటకు అవకాశము కలుగ జేయవలెను. నాలుగు లేక ఐదు మైళ్ళ విస్తీర్ణ ప్రదేశ

ములోని గ్రామీణ సమూహములను రూరల్ బ్యాంకు లను ప్రోత్సహించినచో అచిరకాలములో సహకారోద్యమము స్వయం పోషకత్వము పొంద గలదు. అడుగడుగునను ప్రభుత్వ సహాయముతో యుద్యమము పోషింప బడిన పునాదిలేని సౌధ నిర్మాణమువలెనే యుండును.

ప్రభుత్వ సహాయ మెట్టిదియు కోరకయే సిబ్బందీ వ్యయమును స్వంత వ్యాపారము నుంచి ఖర్చుపరచి స్వంతద్రవ్యముతో బ్యాంకు భవనములను నిర్మించు కొని గత 12 సం॥లలో ఆలమూరు రూరల్ బ్యాంకునను మెట్టినిర్మాణ నిర్వహణ సామర్థ్యమును ప్రకటించినది లెక్కల వలన ఋజువగను. గత 10 సం॥లో బ్యాంకువ్యాపారము క్రమముగా రు 50,000 నుంచి రు10 లక్షలకు పెరిగినది. పరపతివ్యాపారము కాకుండ పరపతేతరవ్యాపారము ద్వారా హెచ్చులాభములు గణింప గల్గుచున్నవి. ఈబ్యాంకు వ్యాపార లాభమునుండియే ఉదిగువ పొందుపరచిన వేతన సిబ్బందీని నియమించి బ్యాంకును నిర్వహింప గలుగుచున్నారు.

రెండవ పరికరణము.

1. కార్యదర్శి:- శ్రీ వి. సత్యానందరావుగారు వయస్సు 28సం॥లు B. Sc, M. D., M. S.పరీక్షలలో వుత్తీర్ణులైనారు. M. D. M. S. బిరుదులు హమియోపతి సంబంధించినది. B. Sc, సైన్సు పట్టభద్రులు. రామదాసు కో-ఆపరేటివ్ శిక్షణాలయములో తరిఫీదునొంది పరీక్షయందువుత్తీర్ణులైనారు. బ్యాంకులో 5సం॥లనుంచి పనిచేయుచున్నారు. గ్రేడు రు 50 లు – లగాయితు రు 100 లు ప్రస్తుతము రు 80 లు

2. సహాయకార్యదర్శి :– Ch. V. సుబ్బారావుగారు 44 సం॥లవయస్సు ఎకనామిక్సులో M. A. ప్యాసు యినారు. కాకినాడ College of culture & co-perative పాఠశాలలో తరిఫీదునొందిరి. బ్యాంకు పరపతేతర వ్యాపారమంతయు వీరి యాజమాన్యమున నిర్వహింప బడుచున్నది. జీతము రు 80 లు

3. మేనేజరు:_ యస్. వీరాస్రిజు 32సం॥లు. వయస్సు బ్యాంకుపెట్టిన ప్రారంభము నుండి వీరు సంఘములో

ఆలమూరు సకలార్థసహకార సంఘము.

బ్యాంకు వుద్యోగిగా పని చేయుచున్నారు. స్కూలుఫైనలు చదువుకున్నారు. మద్రాసు సెంట్రల్ కో-ఆపరేటివ్ ఇన్స్టిట్యూట్యూలో సకట్రరీట్రయినింగు అయినది. ప్రస్తుత జీతము:77-8-0

అక్కౌంటెంటు :-

4. టి. యస్. విశ్వనాథ్: వయస్సు 32సం॥లు. మెట్రిక్యులేషను ప్యాసయినారు. క్రైపు లోయరు ప్యాసయ్యెను. రామదాసు కో-ఆపరేటివ్ శిక్షణాలయములో ట్రయినింగు ప్యాసయినారు. ప్రస్తుత జీతము రు 75/- లు.

5. బి. నరసన్న :- వయస్సు 38 సం॥లు ఇంటరుమీడియట్ చదువుకొన్నారు. కాకినాడ Collage of Culture & co-operation తరిఫీదు అయి బ్యాంకులో లెడ్జరు క్లార్కుగా పనిచేయుచున్నారు. జీతము రు 60/- లు.

6. A. అచ్యుత రామయ్య:- వయస్సు 45 సంవత్సరములు; బ్యాంకు పెట్టినప్పటి నుంచి, ఆలమూరు

గ్రామసహకార సంఘమునుంచి తీసికొనబడిన గుమస్తా. 20 సంవత్సరములనుంచి సహకార సంస్థలలో పని చేయుచున్నారు. జీతము నెలకు రు 60/- లు.

7. శ్రీమతి వి. నాగామణి. :— ఈమె వయస్సు 18 సంవత్సరములు. రామదాసు కో॥ఆ॥ ఇన్స్టిట్యూట్యూటులో తరిఫీదైనది. స్కూలుఫైనలు లోపు విద్యాభ్యాసము కలదు. నూతనముగా డిపాజిట్సు క్లార్కుగా నియోగింప బడినది. జీతము నెలకు రు 45/- లు.

8. P. వీరభద్రరావు: వయస్సు 24 సంవత్సరములు. ఇంటరుమిడియట్ చదువుకొన్నారు. బ్యాంకు క్యాషియరుగా పనిచేయుచున్నారు. జీతము నెలకు రు 45/- లు.

పైన పేర్కొన బడిన ఎనమండుగురు సిబ్బందీ బ్యాంకు ఆఫీసులో అనునిత్యమును బ్యాంకు వ్యాపారము నిర్వహించే సిబ్బందీ.

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

వీరుగాక యీ దిగువ చేర్కొనబడినవారు బ్యాంకు విస్తీర్ణ ప్రదేశ గ్రామాదులలో ప్రచారప్రబోధకులు నల్పుదురు. ఆయాగ్రామములలోని సభ్యులకు ఋణములిప్పించుటకు, బకాయీలు వసూలు చేయుటకు పని చేయుదురు. సభ్యుల వద్ద నుంచి పోదుపు బిల్లలు అమ్మకము చేసి డబ్బు వసూలు పరచెదరు. నిలువన్యాపు అప్పులు, అయివేజు అప్పులు, సంఖా అప్పుల ఆస్థి పరిశీలన, చేసి బ్యాంకునకు తమ నివేదికల సర్పించెదరు.

1. శ్రీ పెనుమర్తి వెంకటరామయ్యగారు:—వయస్సు 49 సంవత్సరములు యస్.యస్.యల్.సి ప్యాసుయినారు. Co-operative training అయినారు. గత 28 సంవత్సరములనుంచి కోఆపరేటివ్ సూపరువైజరుగా పనిచేయుచున్నారు. రామచంద్రపురం సెంట్రల్ బ్యాంకులో రుపే సూపరువైజరుగా నియోగింపబడిరి. రూరల్ బ్యాంకు వారి కోరికపై సెంట్రల్ బ్యాంకు వారు వీరు ఆలమూరు బ్యాంకు లోపనిచేయుటకు సహాయ మొనర్చిరి. వీరి జీత భత్యములు రూరల్ బ్యాంకు వారు భరియించు

చున్నారు. వీరి జీత భత్యములు నెలకు రు 100/- లు.

2. ఉప్పెర్ల లక్ష్మీనారాయణగారు. వీరి వయస్సు 43 సంవత్సరములు. రూరల్ బ్యాంకు స్థాపించి నప్పటి నుంచి బ్యాంకు ప్రచారకుడుగాపనిచేయుచున్నారు. బ్యాంకు పెట్టకపూర్వం గ్రామసంఘములో ప్రచారముచేసెను. సంఘ వుద్యమములో 26 సంవత్సరముల అనుభవమున్నది. బ్యాంకు విస్తీర్ణ గ్రామములలో మాజిక్ లాంతరు ప్రదర్శనము కావించి బ్యాంకు యుద్దేశములను బోధించును. బ్యాంకు వారిచే కౌలుకు తీసుకొన బడిన లంక భూముల వ్యవసాయము హరిజనులచే చేయించి వారిలో సహకార భావములు పెంపొందించి కృషి చేయుచుందురు. హరిజనులలో పొదుపు బిళ్ళల కొనుట వ్యాప్తి చేయుచు బ్యాంకు విస్తీర్ణ ప్రదేశములో అప్పులు వసూళ్లు బట్వాడా విషయమై కృషి సల్పు చుందురు. జీతభత్యములు నెలకు రు 70 లు

3. కరో్త్రతు పీరన్న:— వయస్సు 45 సంవత్సరములు. బ్యాంకు పెట్టినప్పటి నుంచి బ్యాంకు విస్తీర్ణ ప్రదే

శములోని వ్యవసాయ కూలీలను బ్యాంకులో సభ్యులుగా చేర్చి వీరలకు బియ్యము, బట్టలు, చిన్న చిన్న అప్పులు బ్యాంకు ద్వారా యిప్పించి వసూలు పరచుచుండును. పొదుపు బిళ్లలు వ్యవసాయ కూలీ సభ్యులలో వ్యాప్తి చేసి ప్రోత్స హించును. జీతము రు 67_8_0. లు

4. కరోత్రితు వీరరాఘువులు. వయస్సు 24 సం॥లు బ్యాంకు విస్తీర్ణ ప్రదేశములో కలక్షన్ ఏజెంటు గాపనిచేయుచున్నాడు. 10 సం॥ల అనుభవము న్నది. జీతభత్యము రు 52/_ లు

5. యస్. వెంకటస్వామి వయస్సు 25సంవత్సరములు. బ్యాంకు విస్తీర్ణ ప్రదేశములో కలక్షను ఏజంటుగా పనిచేయున్నాడు. జీతము రు 45 లు.

పైన పేర్కొనబడిన వారు బ్యాంకు అవుట్ డోరుస్టాఫ్‌గా పనిచేసి బ్యాంకు బకాయీలు వసూలు చేసి సభ్యులతో అనునిత్యము సంబంధము కలిగి వ్యవహరింతురు. వీరికి బ్యాంకువారు సైకిళ్ళుకొని

యిచ్చిరి. అనుదినము వీరు సైకిళ్ళపై ప్రయాణము చేసి పొదుపు బిళ్ళలు అమ్మకము చేయుదురు.

బ్యాంకు వడ్డీవ్యాపారమే కాక బట్టలు, బియ్యము యెరువుల వ్యాపారము చేయుచున్నది. ఈవ్యాపారము చేయుటకు ఒక (Sales Man) కలడు. శ్రీ టి. సూరయ్య బ్యాంకులో Sales గుమస్తాగా పనిచేయుచున్నారు. S. S. L. C. చదువుకున్నారు. వయస్సు 30సం॥ నెలకు జీతము రు 50 లు. ఒక సేల్సు Boy కలడు. నెలకు రు15/ లు జీతము.

పై సిబ్బందీకాక ఆఫీసులో పనిచేయుటకు ఇద్దరు బంట్రోతులు ఒక నైటు వాచరు కలరు.

ఈసిబ్బందీకి యితరు సాదరు ఖర్చులుదాదాపు నెలకు రు 1000 లు ఖర్చగుచున్నది. బ్యాంకు వ్యాపారము వృద్ధియైన కొలది సిబ్బందీ వృద్ధిపొందు చున్నది. ప్రారంభములో ఒకగుమస్తా నెలకు రు 20/ లు మీాదపని చేసెను. క్రమముగా బ్యాంకు వ్యాపారము వృద్ధి యైన కొలది యితర సిబ్బందీ క్రమాను గతముగ వృద్ధి

మైనది. అయిదు మైళ్ళులోపు పంటపండు పంౖడెండు మాగాణి గ్రామాదులకు బ్యాంకు విస్తీర్ణప్రదేశమునకు విస్తరించినందు మూలమున బ్యాంకు వ్యాపారము పది లక్షల రూపాయీాల వరకు యిప్పటికె పెరుగుట కవకాశము గలిగినది. ఇంకను వ్యాపారము వృద్ధిపరచుటకు యెంతయేని అవకాశమున్నది. సిబ్బందిని పరాధీనము లేక స్వయంపోషకత్వము చేసుకొనగలదు. బ్యాంకులో సిబ్బంది కేవలము వేతనము కొరకే పనిచేయయుటలేదు. సకలార్ధ సహకార సంఘాదర్శకములను యధావిధిగ నిర్వహించి ప్రభుత్వమువారు యిచ్చిన యీాసదవకాశమును యుపయోగించుకొని, ఈ సంస్థను ఆదర్శకముగా చూపుటకు భక్తి విశ్వాసములతో సేవ చేయుచున్నారు.

ఈ రూరల్ బ్యాంకు ఆలమూరులో 1938 సంవత్సరములో ప్రత్యేక పరిస్థితులను బట్టి రిజిష్టరు చేయబడినది. అంతకు పూర్వము ఆలమూరు గ్రామములో సహకార సంఘము పరిమితిలేని పూచీ పైన ఒక ఆలమూరు గ్రామమునకు పనిచేయుచున్నది. ఆ సంఘము 1917 Dec 9 తేదీని రిజిష్టరు కాబడినది. సంఘ ప్రధమసమావేశము 8–1–1918 తేదీని జరిగి

నది. 1928 సం॥నాట్కి ఒక దశపాటు మంచి అభి వృద్ధిగా పనిచేసినది. పిమ్మట ఆర్థిక మాంద్యము వలన సంఘ వ్యాపారము పడిపోయినది. 1938 సం॥నాటికి మరియొక దశలో 1 లక్షవ్యాపార ధనముతో పనిచేసిన సంఘము 10 వేల రూపాయీాల లోపు వ్యాపారముకు దిగిపోయి వ్యాపారము స్థంభించినది.

ఈ పరిస్థితులలో 1938 వ సంవత్సరమున ఆల మూరు కో-ఆపరేటివ్ రూరల్ బ్యాంకు అనుపేరుతో సహకారసంఘము నూతన నిర్మాణము చేయ బడినది. 1942 వ సంవత్సరము నాటికి దాదాపు 2 లక్షల రూపాయల వ్యాపారము పెరిగినది. ఆలమూరు గ్రామసం ఘమువారు, రూరల్ బ్యాంకుపాలక మండలి,సమావేశమై రెండు సంస్థలు కలిపి వేయుట కంగీకరించిరి. కో-ఆప రేటివు సొసైటీల ఆక్టు 13వ శక్షను ప్రకారము రెండు సంఘములు సమ్మేళన పరచుటకు ఆమోదించిరి. సదరు తీర్మానముల ప్రకారము డిపార్టుమెంటు వారు కొత్త సం ఘమును రూరలు బ్యాంకును 379 నెంబరుతో రిజిష్టరు చేసిరి.

ఆలమూరు సకలార్ధసహకార సంఘము.

రూరల్ బ్యాంకు ఇదివరలో నెం. 265 రు గా పనిచేసెను. ఈ రెండు సంఘముల సమ్మేళనము వల్ల ఆలమూరు గ్రామ పరపతి సంఘము యొక్క భవనము రూరల్ బ్యాంకునకు సంక్రమించినది. ఈభవనము 1931 సంవత్సరములో కట్టబడినది. 11 సెంట్లు గ్రామ కంఠము ప్రభుత్వమువారు ఈ భవన నిర్మాణ నిమిత్తము యుచితముగ నిచ్చిరి. ఈ భవన నిర్మాణమునకు ఆరోజులలో 7 వేల రూపాయలు వ్యయమైనది. పిమ్మట రూరల్ బ్యాంకువారు ఈ భవనము ప్రక్కనే 10 వేల రూపాయల విలువగల ఒకమేడను 1948 లో కొనిరి. ఈ సంవత్సరములో మూడు రూపాయలకు యొక స్థలమును రు 3500 లుకు మరియొక స్థలమును కొని బ్యాంకుఆవరణను పెంపు చేసిరి. ప్రభుత్వమువారు యీ సంవత్సరము బ్యాంకువారికి ధాన్యపు కొట్లు కట్టు నిమిత్తము 10 వేల రూపాయలు విరాళమిచ్చిరి. ఈ కొట్లు నిర్మాణమునకు రు 26,000/ లు ఎస్టిమేటు వేయబడినది. బ్యాంకు వారింతవరకు యీ కొట్లు నిర్మాణమునకు రు 20,000/ లు వ్యయపరచిరి. ఒకటి రెండు నెలలలో యీ కొట్లునిర్మాణము పూర్తియగును. మొత్తము యీ బ్యాంకునకు నేడు రు 50,000/ లు విలువగల భవ

నములు యిందుకు సంబందించిన ఖాళీస్థలములు కలవు. బ్యాంకు పరపతి, పరపతేతర వ్యాపారము అవిచ్ఛిన్నముగా సాగించు కొనుటకు బ్యాంకునకు నేడు స్థిరగృహావసతి యేర్పాటైనది. ఇట్టి స్థిరవసతి యేర్పరచు కొనుటకు బ్యాంకునకు వ్యాపారభివృద్ధివలననే కలిగినది. చిన్న సంఘములకు స్వంత భవనములు సంపాదించు కొను స్థోమతు యుండదు. స్వంత భవనములేనిదే వ్యాపారము సాగదు. డిపాజిట్లుదారులకు సొమ్ము దాచుకొనుటకు నమ్మకముండదు. వ్యాపార సంస్థలు ప్రభుత్వమువారి నాశ్రయించి అడుగడుగునకు భిక్షము పెట్టుమని అర్థించుట గౌరవము కాదు. ప్రభుత్వమువారుకూడ సహకార సంస్థలు ప్రజాక్షేమము కొరకు పనిచేయు చున్నవే అయినను తమ వశములో నుంచుకొని అధికారము చలాయించుటకు డబ్బు యిచ్చి పరాధీనము చేయ రాదు. సహకారులు, యీ సంస్థల స్వాతంత్ర్యము పోగొట్టుకొనకుండ, స్వయంపోషకత్వము కలుగుటకు కృషి సలుప వలెను. గత 40సంవత్సరముల నుంచి బాగుగ పనిచేసిన సెంట్రల్ బ్యాంకులు, అర్బను బ్యాంకులు బిల్డింగు ఫండ్సు యేర్పాటు చేసుకొని స్వంత భవనములు సంపాదించుకొనినవి. ఇదే రీతిని గ్రామ సహకార సం

స్థలు కూడ స్వయంపోష కత్వము కలిగి స్వంత భవనము సంపాదించుకొన వలెను.

## రూరల్‌బ్యాంకు లాభములు

బ్యాంకు నిబంధనల ప్రకారము ప్రతియేటను 1/3వంతు క్షేమనిధికి జమ కట్ట బడవలయును. సాధారణముగా పరిమితిగల పూచీ సంఘములలో 1/4 వంతు నికరలాభము క్షేమనిధికి జమ కట్టబడును. పరిమితి లేని పూచీ సంఘములలో నికరలాభములో చెరి సగము క్షేమనిధికి జమకట్టబడును. అయితే రూరల్‌బ్యాంకు స్వంతద్రవ్య మభివృద్ధి పరచుటకు నికర లాభములో 1/4 వంతు కాక నికరలాభములో 1/3 వంతు ద్రవ్యము క్షేమనిధికి చేర్చబడుచున్నది. ఈ క్షేమనిధి సంఘమునకు స్థిరాస్థి. ఈ డబ్బు పంచుకొని పట్టుకొని పోవుట కెవరికి అధికారములేదు. పరిమితిగల పూచీ సంఘములలో క్షేమ నిధి యెంత యెక్కువగా నుంచిన డిపాజిటర్ల కంత విశ్వాసము. బ్యాంకునకు నికరలాభము, ఆయా సంవత్సరము లలో ఎంత వచ్చినది యిందు స్టేటుమెంటు పొందు పరిచబడినది.

స్టేటుమెంటు నెం. 10 వ

ఆలమూరు కో-ఆపరేటీవు రూరల్ బ్యాంకు లిమిటెడ్.,
ఆ ల మూ రు.

సంవత్సరం వారీగా వచ్చిన లాభములను తెలుపు పట్టిక.

| సంవత్సరం. | | లాభము. |
|---|---|---|
| | | Rs, As. Ps. |
| 1937_38 | ... | 67_3_6 |
| 38_39 | ... | 651_4_9 |
| 39_40 | ... | 549_12_0 |
| 40_41 | ... | 1,564_4_0 |
| 41_42 | ... | 1,573_1_0 |
| 42_43 | ... | 3,305_4_0 |
| 43_44 | ... | 59_3_0 |
| 44_45 | ... | 1,039_14_0 |
| 45_46 | ... | 5,159_8_0 |
| 46_47 | ... | 5,104_0_0 |
| 47_48 | ... | 12,123_11_0 |
| 48_49 | ... | 10,736_15_0 |
| 49_50 | ... | 17,089_8_0 |
| | ... | |

ఆలమూరుసకలార్థ సహకార సంఘము.

ఈ స్టేటుమెంటు ప్రకారము ప్రతి సంవత్సరము నికరలాభములో నుంచి 1/3 వంతు క్షేమనిధికి జమకట్టబడు చున్నది. అయితే నేడు ఈ సంఘము తాలూకు రిజర్వుఫండు రు 46,058 లు రామచంద్రపురం సెంట్రల్ బ్యాంకులో సిలువవేయబడినది. ఇంత హెచ్చు రిజర్వుఫండు పెరుగుటకు రెండు కారణములు.

1. ఆలమూరు సహకార పరపతి సంఘము తాలూకు రిజర్వు ఫండు 1942 సంవత్సరములో రూరల్ బ్యాంకులో కలసిపోయినది.

2. మరియు ది11-6-50 తేదీని, ఆలమూరు వుత్పత్తి కొనుగోలు దార్ల క్రయ విక్రియ సంఘము రూరల్ బ్యాంకుతో కలిపి వేయబడినది.

ఆయాసంస్థల క్షేమనిధి వివరింపబడినది.

| | |
|---|---|
| ఆలమూరు సహకార సంఘము | రు 15,562-10-0లు |
| ఆలమూరు వుత్పత్తి కొనుగోలు క్రయ విక్రయసంఘము | రు 6,386- 2-0 లు |
| రూరల్ బ్యాంకు | రు 24109-9-0 లు |
| | రు 46058-5-0 లు |

1949 - 50 సంవత్సరముల తాలూకు రూరల్ బ్యాంకు క్షేమనిధి రు 5696-8-0 లు మొత్తము కలిపిన రూరల్ బ్యాంకు క్షేమనిధి రు 51,754-13-0లు వుండును. ఇందులో రు 2400/ లు నేషనల్ సేవింగ్సుసర్టిఫికేట్లు కొనబడినవి. రు 44058-5-0 లు సెంట్రల్ బ్యాంకులో బ్యాంకు కాతాను నిల్వవేయ బడినది. ఇదికాక రు 26,998-12-0 లు యితర రిజర్వులు వివిధ ప్రయోజనముల కొరకు కేటాయించ బడినది. ఇవికూడ లాభములో నుంచి తీసినదేను. ఈ మొత్తములన్ని పారుబాకీల నిధి క్రింద యేర్పాటు చేయబడినవి. ఈసొమ్మంతయు బ్యాంకు వ్యాపారధనములో సమ్మిళితమై యున్నది. లెఖ్ఖలలో ప్రత్యేకముగా కేటాయింపబడి యున్నను సెంట్రల్ బ్యాంకులో ప్రత్యేకముగా నిల్వ వేయలేదు. ఈ ప్రతేక నిధులు సెంట్రబ్యాంకు లోనే నిల్వవేయ వలసినదిగా డిపార్టుమెంటువారి ఆదేశము. సెంట్రల్ బ్యాంకువారి ఉద్దేశము. అయితే సెంట్రల్ బ్యాంకులు ఈ రిజర్వు డిపాజిట్లపై నూటికి రు 3/ లు మాత్రమే వడ్డీ యిచ్చుచున్నారు. వారి వద్ద అప్పు తీసుకొన్న రు 100 లు 1కి రు4/ లు వడ్డీకిచ్చు చున్నారు. నిబంధనల ప్రకారము చెల్లింప వలసిన

క్షేమనిధి సెంట్రల్ బ్యాంకులో చెల్లించి వేయబడినది. యితరనిధులుకూడ సెంట్రలు బ్యాంకులో చెల్లించుట వలన సంఘమునకు క్షేమకరమేను. అవాంతరము వచ్చినపుడు క్షేమనిధులు సంఘములకు నదులకు చెలియల కట్టలవలె కాపాడును. ప్రత్యేకముగ కేటాయింపబడిన నిధులుకూడ సెంట్రల్ బ్యాంకులో చెల్లించవలసివచ్చిన వడ్డీ నష్టమగుమ. సభ్యులకు అప్పులిచ్చిన రు 6-4-0 లు వడ్డీవచ్చును. సెంట్రల్ బ్యాంకులో నిల్వయుంచిన రు 100 లు 1కి రు 3 లు మాత్రమే వడ్డీ వచ్చును. స్థిరాస్థి తనఖాపై యీడబ్బు సంఘ వ్యాపారములోనే వుంచుట సంఘమునకు క్షేమకరము. రిజర్వుపండు కదుపుటకు యెవరికి అధికారము లేదు. అయితే ప్రత్యేక నిధులు మహాజన సభవారి ఆమోదముతో బ్యాంకు వివిధ ప్రయోజనముల కొరకు తాత్కాలికముగా వినియోగింప వచ్చును. అందుచే ఇతరనిధుల మొత్తము సెంట్రల్ బ్యాంకులో నిలువ వేయలేదు.

బ్యాంకు యొక్క క్షేమనిధి తదితర నిధులు మొత్తము 1950 సంవత్సరాంతమునకు రు 73057-1-0లుయుండును. ఈ సంవత్సరము ఆడిట్టు ప్రకారము వచ్చెడి నికర లాభము

రు. 17000/–లు. ఇందులో 1/3 వంతు రు. 5,666 లు. క్షేమనిధికి చేర్చవలసినది. ఈ సంవత్సరము నిధులు రు. 2000 లు ఉండును. ఈ సంవత్సరములో రు. 8 ,000 వరకు సంఘమునకు క్షేమనిధి, పారు బాకీల నిధులు యుం డును. ఈ సకలార్థ సహకార సంఘము ప్రథమ దశలో యింత స్వంత ధనమును సమకూర్చుకొనుటకు ముఖ్య హేతువులు, వ్యాపార బాహుళ్యము, మిత వ్యయము, యితర స్థానిక సహకార సంస్థల కలయిక.

1938 సం॥రం మొదలు 1950 వరకు దేశములో ఆర్థిక మాంధ్యము పోయి డబ్బు విస్తారము చలామణి యగుచుండుటచే సహకార బ్యాంకుల వ్యాపారము విస్తారము పెరిగి పోవుచున్నది. రెండవ యుద్ధానంత రము పంటల ధరవరలు పెరిగినవి. భూమి క్రియములు హెచ్చినవి. మరల ఆర్థిక వేత్తలు రాబోవు పది సంవ త్సరములలో ఆర్థిక మాంద్యము ప్రపంచమునంతట ముట్టి వేయునని జ్యోతిషము చెప్పుచున్నారు. ఈ తరుణములో సహకారులు సభ్యులకు గుణ పాఠము చెప్పవలసి యున్నది. 1918 సంవత్సరము నుంచి 1930 వరకు ప్రథమ యుద్ధానంతరము కాలమాన స్థితి యంతయు

నేటి రీతిగనే యుండెను. అప్పుడు రైతులు హెచ్చు తున్న ధరవరలు చూచుకొని భూములు హెచ్చు క్రయముకు కొనిరి. 1930 నుంచి 1940 వరకు ధరవరలు పడిపోవుటచే నీరు తీసివేసిన చెరువులో చేపలవలె తేలి పోయిరి. కొన్న భూముల కంటె రెట్టింపుభూములు అమ్ముకుంటేనే గాని ఋణములు తీరలేదు. నేటి కాల వ్యత్యాసము కూడ యీలాగే వున్నది. రైతులు భూములు కొనుటకు నేడు యెగబడుచున్నారు. ఆర్ధిక మాంద్యము రోజులలో వేయి రూపాయుల కమ్మోడి మాగాణి భూములు నేడు రు. 5000 లకు కొంటు న్నారు. మరల ఆర్ధిక మాంద్యము చుట్టు ముట్టవేసిన పూర్వపు గతియే రైతులకు పట్టును. సహకార సంఘములలో చేరిన సభ్యులు రెండవ ఐరోపా ఘోర సంగ్రామానంతరమున కల్గిన యనుభవములు జ్ఞప్తియందుంచుకొని హెచ్చు ధరలకు భూములుకొని ఋణములు కాకుండ చూచుకో వలెను. సకలార్ధ సహకార సంఘములు యీ తరుణములో స్వలాభము కొరకు పరపతి వ్యాపారము వృద్ధి చేసుకొ నుటయే లక్ష్యముపెట్టుకొనకూడదు. రైతులను ఋణ ములు చేసి భూములు కొనుట, యిండ్లు కట్టుట, వివా

హోదులు చేయుటకు మాన్పించ వలెను. లేనిచో మరల ఆర్థిక మాంద్యములో పడి కొట్టుకొని పోయెదరు. బ్యాంకుల వాయిదాలు సకాలములో చెల్లనిచో మరల సంఘముల వ్యాపారము స్థంబించిపోవును.

ఈ అవాంతరములు గడపుటకే రిజర్వుబ్యాంకు వారు సంఘములు కేవలము పరపతి వ్యాపారముతో సంతృప్తి పడక పరపతేతర వ్యాపారము వృద్ధి చేసి సంఘములు ఆర్థిక పోషణములగుటకు వివిధప్రయోజనముల కొరకు సకలార్థ సహకార సంఘములు గా మార్చుట వుద్దేశమైయున్నది. ఆర్థిక మాంద్యము వచ్చినపుడు రైతునకు సహకార సంఘములు బహుళ ప్రయోజనము కొరకు తోడ్పడ వలసియున్నది. తక్కువధరలకు రైతుకు కావలసిన సరకులను సమిష్టి క్రయ విక్రియ ములద్వారా సరఫరా చేయవలసి వున్నది. ఈ కొనుగోలు వ్యాపారము ద్వారా సంఘము లాభము తీసుకొనవచ్చును. గృహ పరిశ్రమలు వృద్ధిచేయించ వచ్చును. సమిష్టి వ్యవసాయము కృషిచేసి ఆదర్శకముగా అమలులో పెట్టవచ్చును. పశుగణమును వృద్ధి చేయించవచ్చును. పాడిపంటలు పెంపొందించ వచ్చును.

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

సకలార్ధ సహకార సంఘములు జరిపేబహుళ వ్యాపార మిది. ఇందు మూలమున సభ్యులఆర్ధిక పురోభివృద్ధితో పాటు సంఘ అభ్యున్నతి కూడ గలుగును. సకలార్ధ సహకార సంఘములు ఈ పరపతేతర వ్యాపారమునకు పూనుకొని, సభ్యుల సర్వతో ముఖాభివృద్ధికి తోడ్పడ వలెను. ఈరాబోవు ఆర్ధిక మాంద్యముల నుండి ప్రజలను సంరక్షించుటకు మహాత్ముని నిర్మాణ కార్యక్రమమును అమలులో పెట్టి దేశాభ్యుదయమున కెంతయేని తోడ్పడుటకు యీ సంఘమునకు మహదవకాశము కలదు.

మూడవ పరిశిష్టము? 

మూడ వ ప్రకరణము

# పరపతేతర వ్యాపారము

1. సమిష్టివ్యవసాయము:— ఆలమూరు రూరల్ బ్యాంకు వారు పరపతి వ్యాపారముతోపాటు పరపతేతర వ్యాపారము కూడ బ్యాంకు ప్రారంభించిన నాటినుంచి కొన సాగించుచున్నారు. పరపతేతర వ్యాపారము, పరపతి వ్యాపారము వలె చేయుట శులభ సాధ్యముకాదు. వడ్డీ వ్యాపారము జాగరూకతతో చేసిన నష్టము రాదు. తనఖాలు హామీలు వుండును. పరపతేతర వ్యాపారమట్లుకాదు. సంఘము తరపున వస్తువులు టోకున కొనవలసియుండును. చిల్లరిని అమ్మవలసి యుండును. ఈ వ్యాపారము నిర్వహించుటకు నమ్మకమైన సిబ్బందీ యుండవలెను. పాలకమండలి సభ్యులు కాని, సిబ్బందీగాని మొగమాటమునకు దిగిన అపారనష్టము సంఘ మొత్తమునకు కల్గును. ఇట్టి యొదుదుడుకులు రాకుండ తగువివక్షతతో పరపతేతర వ్యాపారము కొనసాగించ వలసియుండును. నిబంధనల ప్రకారము సమిష్టి క్రయ, విక్రయములు

సంఘము సభ్యుల తరఫున చేయ వలసియున్నది. అనగా ఇండెంటు పద్ధతిని సభ్యుల కోరికపై కావలసిన వస్తువులకు ముందుగా దరఖాస్తు తీసుకొని, కావలసిన ఆయా వస్తువులను బట్వాడా చేయ వలసియున్నది. ఈ పద్ధతి సంఘములవలంభించి చేసిన చాలా ప్రశస్తముగనే యుండును. కాగితముమీద యీ ప్రణాళికలు బహుచక్కగా కనబడునేకాని ఆచరణలో అమలులో పెట్టు సరికి దుస్సాధ్యము, అసాధ్యమగును. ముందు అందరి సభ్యుల అక్కరలు వాకబుచేసి కనుక్కొని వారి అభీష్టప్రకారము సరకులు కొని తెచ్చుటకు కొంత కాలము పట్టును. ఈ లోపుగ సరకులు కావలసిన వారు కొంత మంది అక్కర లేదనవచ్చును. సరకులు నచ్చకపోవచ్చును. తెచ్చిన సరకులలో తరుగు, విరుగు, వీటి లాభ నష్టములను సభ్యులు కట్టుకొనక పోవచ్చును.

ఇండెంటు వ్యాపార పద్ధతి కాగితముపై చాలా బాగా కనపడినను నిబంధనలలో యిమడ్చబడినను, కార్యవిధానములో విజయ వంతముకాదు. సహకారోద్యమములో విశేషానుభవము గల మద్రాసు జాయింటు

రిజిష్ట్రారగు శ్రీ. కె. సుబ్రహ్మణ్యం నాయుడుగారు మద్రాసులో జరిగిన 15 వ రిజిష్ట్రారుల కాన్ఫరెన్సులో యీదిగువ యభిప్రాయమును వెలిబుచ్చిరి.

"We are asked to carry on the indent system in village credits societies. This is not simply possible. It is not possible to obtain indents from every member, consolidate the indents, place orders, purchase the goods and then distribute them to the members concerned. This is simply impossible to work. If you want that any society undertake this work, it can work only on a proprietary basis not on indent system. Indent system in Madras has been a difinite failure. Indeed, if you concede that you should work on proprietary basis, it leads to the position to which Sir Pheroge Kharegat has rightly drawn our attention, *Viz* combination of Banking and credit with trading.

It is an elementary principle that Banking and trading should be kept

separated. We, in Madras, have had a fairly large member of Rural Co-operative Stores. What is their position fifty percent of these co-operative stores have not been a business success even though they are run on a proprietary basis. It is said that if the indent system is introduced, the societies can work well. As I have stated it cannot work"

అంచనా (ఇండెంటు) పద్ధతి మద్రాసులో విఫలమైనదని ప్రభుత్వమువారు ఒప్పుకొన్నారు. ఇక సంఘద్రవ్యములోనుంచి నేరుగాకొనే గత్యంతరముతప్ప వేరులేదు. సంఘ ద్రవ్యముతో అనుభవములేని పంచాయితీదార్లు వర్తకము సాగిస్తే అసలునకే మోసము వస్తుంది. Govt of India Agriculturl Department కార్యదర్శియగు Caraget గారు బ్యాంకులు వర్తక వ్యాపార వ్యవహారములతో సంబంధము కలిగి యుండ కూడదని యీదిగువ వాక్యములలో వ్యక్తపరచిరి.

"Banking & trade should not be combined n one society."

అయితే ఇక సకలార్థ సహకార సంఘముల వ్యాపారముజరిగేదెట్లు? ఇవి అనుభవము మీదనే తేల్చుకోవాలి. స్థానిక పరిస్థితులనుబట్టి క్రియ విక్రియ వ్యాపారములను స్థిరపరచుకోవాలి. సంఘ ధన స్తోమతునుబట్టి యీవ్యాపారము కొనసాగించాలి. గ్రామాదులలో బియ్యము, బట్ట, అందరికీ కావలసినదేను. ఏ కొలది మందియో గ్రామములో సంవత్సరముకు కావలసిన సామగ్రి నిలువ వేసుకొనుటకు శక్తి సామర్థ్యము కల్గియుందురు. సాటకపు జనమునకు, సామాన్య గృహస్తునకు బియ్యము సంవత్సరము పొడుగున కొనుక్కొన వలసినదేను. బియ్యము వ్యాపారము కాసులుబేరము వంటిది. అధిక లాభాలురావు. అధిక నష్టములురావు. సంఘసభ్యుల సదుపాయమునకు సకలార్థ సహకార సంఘములు నమ్మకమైన ఆసామీ యొకగుమస్తాను వేసుకొని బియ్యపుకొట్టు గ్రామములో నిర్వహింప వచ్చును. ఈ రీతిగనే బట్టలు దుకాణముకూడ పెట్టి సంవత్సరము పొడుగున సభ్యులకు కావలసిన బట్టలు క్రియ విక్రియము కావింప వచ్చును. బట్టల కొట్టు, బియ్యపు కొట్టు, యొకే గుమస్తా పని చేయవచ్చును. ఒడుదుడుకు వ్యాపారములేదు. కావలసిన సరకు తెచ్చి విడుదల అయినవెంటనే

ఆదర్శ్రివ్యముతో మరల సరకుకొని నిల్వవేయ వచ్చును. ఈబట్టల వ్యాపారము, బియ్యము, వ్యాపారము సంఘ షేరుధనము మించి వుండకూడదు. పరిమితిలేని పూచీ పద్ధతినే గ్రామసకలార్థ సహకార సంఘములు పని చేయుచున్నందున షేరుధనము మించి ఈ పరపతేతర వ్యాపారములో చేయకూడదు. షేరుధనము మట్టుకే యీ వ్యాపారము కట్టుబాటు చేసుకొన్న యీవ్యాపారములోనష్టము వచ్చినను షేరుధనమే పోవునుగాని సభ్యులకు నష్టము తగులదు.

ఈ సిద్ధాంతము నాదర్శకముగా నుంచుకొని మొదటినుంచి ఆలమూరు రూరల్ బ్యాంకులో బట్టల కొట్టు, బియ్యపు, కొట్టు నిర్వహించుచున్నారు. బట్టల కొట్టునకు రు 10,000/ లు బియ్యపుకొట్టునకు మరియొక రు 10,000/లు పెట్టుబడి పెట్టుటకు మహాజన సభవారు కార్యనిర్వాహక వర్గమువారికి అధికారమిచ్చిరి.

సంఘము తరపున బట్టలకొట్టు నిర్వహించుటలో ఒక ప్రణాళిక అమలులో పెట్టబడినది. సాధారణము గాకూలి నాలి చేసుకొని జీవనముచేసే ప్రజాసామాన్య

మునకు అనగా వ్యవసాయ కూలీలకు సంవత్సరము పొడుగున పనివుండదు. సాధారణముగా వూడ్పుల రోజులలో రెండు నెలలు, కోతలరోజులలో రెండు నెలలు, తదితర వ్యవసాయ మరమ్మతు రోజులలో, 4 మాసములు నాగా లేకుండ పనివుంటుంది. అనగా సంవత్సరములో 8మాసములు ఏదో ఒక పనిపాటలుచేసుకొని గ్రామములో జీవనము చేసుకొనగలరు. మరినాల్గు మాసములకు యేమియు వ్యవసాయ కూలి జనమునకు పని వుండదు. ఈ యెద్దడి రోజులు సాధారణముగా వూడ్పు లయినతరువాత కోతల వరకు 3 మాసములు, నూర్పులైన తరువాత మ_దమాసాకత్తులగువరకు ఒక నెల పనివుండదు. ఈ 4 మాసములు కూలీలు వ్యవసాయదారుల వద్ద హెచ్చు వడ్డీకి బరాతములు వాడుకొని తక్కువకూలి పనిచేయుటకు ఒప్పందమయ్యేదరు. ప్రపంచములో అంతట బానిసత్వము తొలంగింపబడినను ఆర్థిక దాస్యము మాత్రము యింకను తొలగలేదు.

పనిలేని ఈ నాల్గు మాసములలోను వ్యవసాయ కూలీలకు బ్యాంకు వారు స్వల్ప వాయిదా అప్పులు యిచ్చి యీ అప్పులు ధన రూపకముగా యివ్వక

ధాన్యము రూపకముగను, బియ్యము రూపముగను యిచ్చుచున్నారు. పంటల రోజులలో రైతుల వద్ద ధాన్యము కొని నిలువవేసి యెద్దడి రోజులలో యీ ధాన్యమును పాటకపు జనమునకు ఖరీదు కట్టి అప్పు క్రింద ధాన్యము కొల్చుచున్నారు. బియ్యము కావలసిన వారికి బియ్యము; ధాన్యము కావలసిన వారికి ధాన్యము సభ్యులకు ఏక మొత్తముున కొని యెవరికి అవసరమైన సరకు వారికి ఇచ్చుచున్నారు. మొత్తముగా కొనుట మూలమున కిఫాయితీగా పంటల రోజులలోసరకు దొరకు చున్నది. కూలీలకు పనిలేని కాలములో యీ ధాన్యము కొనుట మూలమున వారలు బ్యాంకులోచేరి యీ అప్పులు తీసికొని వూడ్పులు కోతల రోజులలోరొఖ రూపమున తీర్చి వేయుచున్నారు. యేటేటను ఇట్లు జరుపుట మూలమున బీదసాదలు సంఘములో సభ్యులుగా చేరి పనిపాటలుగల రోజులలో బ్యాంకువారు అమ్మోడి తిప్పు లేబిల్లుకొని డబ్బు కొద్ది కొద్దిగా నిల్వవేసుకొని సంవత్సరాంతముకు పూర్తి బాకీ తీర్చివేయ గల్గుచున్నారు. ఒకేసారి ఋణమంతయు తీర్చుటకు వీరలవద్ద పట్టుమని రు. 10 లైనను యుండవు. కాన అను దినము సంపాదించెడి రొక్కములో నుంచి బ్యాంకులో కొంత

నిల్వవేసుకొనుట మూలమున కూలివాండ్రు సులభముగ తీర్చగలుగుచున్నారు. యీఅప్పులు దఫా దఫాలుగా రైతులు వ్యవసాయ పెట్టుబడులకు సంఘము నుంచి అప్పులు తీయుదురు. వారు అప్పుల తీసి యీదవ్యమును పంట పండించుటకు వినియోగించెదరు. గాన యీ పంట సంఘమునకు(First charge) మొదటిహామీ. రైతుల దగ్గరపంటల కాలములో సంఘము వారు ధాన్యముతీసు కొని బ్యాంకుస్వంతగాదులలో నిల్వవేసుకొనుటమూలమున కూలీలకుకావలసినప్పుడు ధాన్యము వెతుక్కోనక్కర లేక సరిపోవు చున్నది. అయితే కంట్రోళ్లు వచ్చిన తరువాత యిట్లుధాన్యము నిలువవేయు అవకాశము లేకయున్నది. అందుచే లైసెన్సు తీసుకొని బ్యాంకు వారు బియ్యమునే అమ్ముచున్నారు. అయితే యీ సాలున ఆ బియ్యము అమ్మకము కూడ మాను కొన వలసివచ్చినది.

ఇదివరలో సహకార ఉత్పత్తి కొనుగోలు సంఘములు గ్రామ సహకార సంఘములకు బియ్యము సరఫరా చేసెడివి. వారు లైసెన్సు దార్లకు కంట్రోలు శేట్లకు బియ్యము సరఫరా చేసెడివారు. ప్రభుత్వమువారు ఉత్పత్తి కొనుగోలు సంఘముల ధాన్యము వ్యాపారము

తీసివేసిరి. మిల్లుదార్లే చిల్లర దుకాణ దారులకు బియ్యము సరఫరా చేయుచున్నారు. మిల్లర్లు కంట్రోలు రేట్లకు సహకార సంఘములకు అమ్మలేక పోవుచున్నారు. వారు కంట్రోలు ధరలకంటె యెక్కువధర పెడితేగాని రైతులవద్ద ధాన్యము దొరుకుటలేదు. వారికి కూడ ప్రివేటు ఖర్చులు యెక్కువైనాయి. ఇదివరలో సహకార సంఘములు వ్యవహరించి నపుడు శివాలయం దస్తావేజుల వలె ముడుపులు చెల్లించుకో నక్కరలేక పోయెడిది. ఇపుడు మిల్లర్లు ఆలాగున మడికట్టుకొనుటకు వీలులేదు. అందుచే కంట్రోలు రేటుకంటె హెచ్చురేట్లు బస్తాలపై వసూలుచేయు చున్నారు. ఇదంతా రహస్య వ్యాపారము హెచ్చురేట్లుయిస్తే తక్షణంబట్వాడా అవుతాయి. వీటి అంతరార్థము అందరికి తెలిసినదేను. ఈ దొంగ వ్యాపారములో తప్పు లెక్కలు వ్రాయవలెను. బ్యాంకులు యిట్టి లెఖలు వ్రాయజాలవు. అందుచే యీ వ్యాపారము కట్టివేయడమైనది. యిందు మూలమున పాటకపు జనము చాలా అవస్థల పాలగుచున్నారు. ప్రజా సామాన్యము నీదురవస్థలనుంచి తప్పించాలంటే కంట్రోళ్ళుపోతేనే తప్ప వేరు గత్యంతరము లేదు. ఇందుకనే గత సంత్సరములో అనంతపురంలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ సహ

కార మహాసభలో కంట్రోల్సు తీసివేయ వలసినదని సహకారుల తీర్మానపరచి ప్రభుత్వమువారికి మొరుక పరచారు. అయితే యీ మొర అరణ్య రోదనమే అయినది.

## 2. బట్టల కొట్టు

ఆలమూరు రూరల్ బ్యాంకులో సభ్యులకు బట్టలు సరఫరా చేయుటకు (క్లాత్ డిపో) బట్టల కొట్టు నిర్వహింప బడుచున్నది. ఇందుకు మహాజన సభవారి ఆమోదముతో రు 10,000/ లు లకు బట్టలుకొని క్రయ విక్రయము చేయుచున్నారు. సాధారణముగా పాటకపు జనము యేటేట దసరా పండుగులకు, సంక్రాంతి పండుగకు బట్టలు కొనికట్టుకొనుచుందురు. మాఘాది పంచకములో పెండ్లిండ్లకు, పేరంటకములకు, గృహస్తులు బట్టలు విస్తారము వాడెదరు. బీదలకు, ధనవంతులకు పనికివచ్చు బట్ట నిల్వచేసి ఆయా కాలములో విరివిగా బ్యాంకువారు అమ్మకము చేయుచున్నారు. పెద్దగృహస్తులువాడకమునకు బెంగుళూరు, సేలం, కోయంబత్తూరు పట్టు ధోవతులు, చీరలు నిల్వ చేయబడుచున్నవి. సామాన్యులు వాడుకొనుటకు వివిధ ప్రాంతములలో చేనేత వస్త్రములుకొని విక్రయింప బడుచున్నవి.

తక్కువ ధరలకు పాటకపు జనము వాడుకొందుకు స్థానిక ఆలమూరు కో-ఆపరేటివ్ సొసైటీలో తయారైన పంచలు కండువాలు, చీరలు, దుప్పట్లు, తుండ్లు, మొత్తముగకొని అందుబాటులో పెట్టబడుచున్నవి. సాధారణముగా పాటకపుజనము, బీదసాదలు ఒక్కసారి డబ్బు పెట్టి బట్టలు కొనుటకు స్తోమతు వుండదు. సాధారణముగా అరువుబట్టల వర్తకులవద్ద వీరు బట్టలు వాడెదరు. ఈ హెచ్చువడ్డీలకు బట్టల వాడకము మాన్పించుటకు బ్యాంకులో బీదసాదలు బట్టలు కొనుక్కొనుటకు అప్పు లీయబడు చున్నవి. సంక్రాంతి, దసరా రాబోవుముందు వ్యవసాయ కూలీలు వారి కుటుంబమునకు కావలసినబట్టల బ్యాంకుబట్టల కొట్టులో వాడుకొని యీబట్టలకగు ఖరీదు రూరల్ బ్యాంకులో అప్పుల పూర్వకముగా శాంక్షను చేయబడును. ఈ అప్పులు వీరు సంవత్సరము పొడు గున త్రిప్పులేబిల్లు అమ్మకం ద్వారా నిల్వవేసుకొని అప్పు తీర్చివేయుదురు. ఈ తీరుగా ప్రతి సాలున దాదాపు రు 5,0000లు బట్టలు అమ్మకము చేయబడు చున్నవి. నేడు సంఘములో దాదాపు 1000/ స్త్రీలు సభ్యగా కలరు. ఇంతమంది స్త్రీలు సభ్యులుగా చేరుట బట్టల వాడకము కొరకేను. దసరా పండుగు

లకు సంక్రాంతికి చీరల క్రోకలు, రవికలు, పిల్లలకు కావల సిన పరికిణీలు, కొనుక్కొని యీ బట్టల రూపకముగా తీసిన అప్పులను సంవత్సరములో తీర్చివేయుదురు. ఇట్టి సదుపాయము రూరల్ బ్యాంకులో అప్పులిచ్చి తీర్చి వేయుట వలన బీదసాదల కూటికి గుడ్డకు లోపము లేకుండ, సకాలములో అప్పులు, సరకు సరఫరా, అగు చున్నవి. బియ్యపు వ్యాపారము వలెనే బట్టల వ్యాపా రముకూడ కాసుల బేరమువంటిది. విశేష నష్టముకు సంఘము పాలుగా నక్కరలేదు. అవసరమును బట్టి ఆయా కాలములో నిల్వచేసుకొని విడుదల చేసిన, సంఘమునకు నష్టము రాకుండ కాపాడుకొనవచ్చును. రూరల్ బ్యాంకు వారు బట్టల వ్యాపారముకు లైసెన్సు పొందియున్నారు.

ఈ రీతిగనే రైతులకు యెరువులు సరఫరా చేయుటకు లైసెన్సు పొందబడినది. అయితే వ్యవ సాయ డిపార్టుమెంటు వారు యింత కాలము వరకు రైతులకు నేరుగానే సరఫరా చేయుచున్నారు. ఇప్పుడు వీని సరఫరా సహకార మార్కెటింగు సంఘములకు వప్పగించ బడినది. అందుచే రూరల్ బ్యాంకు వారు యెరువుల డిపో తగ్గించి వైచిరి.

## 3 సమిష్టి వ్యవసాయము.

రూరల్ బ్యాంకు వారు పరపతేతర వ్యాపారములో బియ్యపు కొట్టు, బట్టల కొట్టు, యెరువులకొట్టు పెట్టి పరపతేతర వ్యాపారము సాగించుచున్నారు. అవాంతరమువల్ల వీటిని సక్రమముగ నిర్వహించుటకు అవకాశము లేకపోవుచున్నది. బట్టలకొట్టు యథావిధిగ సాగుచున్నది. ఇతర పరపతేతర వ్యాపారముల వేటిని సంఘము నేరుగా వ్యవహరించుట లేదు. అయితే సభ్యులు పరపతేతర వ్యాపారము చేసుకొనుటకు దోహద మొసగబడుచున్నది. నష్టము వచ్చిన సంఘమునకు సంబంధము లేదు. నష్టప్రదమైనవ్యాపారములు నేటితోను సంబంధము కలుగజేసుకొనుటలేదు. ఇతర పరపతేతర వ్యాపారములు బ్యాంకు ఏజంటుగా వ్యవహరించి కొనసాగించుచున్నది. అందులో నొకటి ఖద్దరు బట్టల వ్యాపారము. తుని ప్రాంతములో ఖద్దరు విస్తారముగా ఉత్పత్తి చేయబడు చున్నది. ఖాదీ వుత్పత్తిలో శ్రీ టి. తమ్మాజీరావు గారు బ్యాంకు పెట్టినప్పటి నుంచి వడుకు నూలుబట్టలు బ్యాంకునకు 2,3 వేల రూపాయల విలువగలవి, యెప్పుడు నిల్వ

యుంచి అమ్మకము మీద రు6-4-0లు కమీషను యిచ్చు చున్నారు. బ్యాంకువారు ఖద్దరు వ్యాపారమునకు రు 1000/ లు— పెట్టుబడి పెట్టిరి.

బ్యాంకు వారు పేరంటిపల్లి స్వామీజీ వారితో కలప, వెదురు, వంటచెరుకు వ్యాపారము ఆలమూరులో నిర్వహించుటకు ఒడంబడిక చేసుకొనిరి. శ్రీ స్వామీజీ వారు పేరంటపల్లిలో నుండి, కోయల వుద్ధరణార్థము ఐచ్ఛిక సేవ యొనర్చు చున్నారు. స్వామీజీ వారు ప్రభుత్వము వారి వద్ద అడవులు కొని కోయవాండ్రచే కొట్టించి ఆ కలపను రాజమండ్రిలో వారి స్వంత డిపోలో అమ్మకము చేయించుచున్నారు. ఈ అడివి సరకు ముఖ్యముగా యిండ్లు కట్టుకొనుటకు టేకు బాదులు, వాసములు, వెదురు, విస్తారముగా సరఫరా అగుచుండును. వారికి పెట్టుబడికి డబ్బు అవసరము. గోదావరి సెంట్రల్ స్టోర్సువారు యీ కలప వర్తకముకు 4 లక్షలు పెట్టుబడి పెట్టిరి. ఈ మొత్తము నంతను వారు డిపో ద్వారా తీర్చివేసిరి. ఆలమూరు డెల్టా గ్రామము. వంట చెరుకుకు చాల యిబ్బంది కలదు. గృహ నిర్మాణముకు కావలసిన టేకు కలప, వాసములు

వెదురు అంతయు యీ ప్రాంతపు ప్రజలు రాజమండ్రి కలప అడితీ నుంచి కొని తెచ్చుకొందురు. వంట చెరకు కావలసిన, రాజమండ్రి, కాకినాడ పుల్లల అడితీ నుంచి రావలసినదేను. ఈ గ్రామములోని సభ్యులకు యితరులకు గృహ నిర్మాణమునకు కావలసిన కలప, చెరుకు, అరటి, తోటలకు కావలసినవెదురు, వాసము, ఇండ్లలో వాడుకొనుటకు వంటచెరకు, నిలువ యుంచుటకు ఆలమూరులో ఒక డిపో రూరల్ బ్యాంకు వారి యాజమాన్యమున నిర్వహించుటకు శ్రీ స్వామీజీ వారు అంగీకరించిరి. అమ్మకముపై 100 కి రు 3/-లు కమీషను ఇచ్చుటకు శ్రీ స్వామీజీ అంగీకరించి రు 50,000/- లు కలపను ఆలమూరు డిపోలో వుంచుటకు అంగీకరించిరి. రు 10,000 లు కిమ్మతుచేయు 2 రహదారి పడవలను స్వామీజీ వారు రూరల్ బ్యాంకు వర్దిలో నుంచిరి. ఈ కలప వ్యాపారమునకు స్వామీజీ వారి స్వంత బాధ్యత మీదను, డిపోలోని సరకు, పడవల బాధ్యత మీదను, రాజమండ్రి డిపోలో వుండే సరకు బాధ్యత మీదను, రు 30,000/- లు యీ వ్యాపారము నిమిత్తము పెట్టుబడి పెట్టబడి యున్నది. 3 సంవత్సరముల నుంచి కలప,

వెదురు వంట చెరకు వ్యాపారము సాగుచున్నది. ఏ శేటను వడ్డీ పెట్టుబడి మొత్తముకు జమకట్ట బడుచున్నది. అసలులో రు 15,000 లు జమకట్టబడినది. ఇంకను యీ వ్యాపారము మీద రు 15,000 లు పెట్టుబడి నిల్వ యున్నది. ఆలమూరు గ్రామములో గృహ నిర్మాణ సహకార సంఘము 2 సంవత్సరముల క్రితము రిజిష్టరు కాబడినది. 20 సభ్యులకు ఒక్కొక్కరికి రు 5000లు కిమ్మతుగల లక్ష విలువగల 20 యిళ్ళు కట్టుటకు నిర్ణ యించబడినది. వీనికి కావలసిన బాజులు, వెదురు సరఫరా చేయుటకు శ్రీ స్వామీజీ వారు అంగీకరించిరి. ఈ సంవత్సరము ఇండ్లకు కావలసిన భూమి మెరక చేసి గృహ నిర్మాణముకు పూనుకొనుటకు ప్రయ త్నము జరుగుచున్నది. సహకార గృహ నిర్మాణసంస్థ పని ప్రారంభించిన తోడనే కావలసిన సరకు డిపోలో సంపాందించుటకు వుద్దేశమై యున్నది.

శ్రీ స్వామీజీవారు కోయవాండ్రి పురోభివృద్ధికి అమోఘ సేవ యొనర్చు చున్నారు. అడవులు కొట్టు టలో యీ కోయీలకు పరికరములు సరఫరా చేసి న్యాయమైన కూలియిచ్చి వారికి ఆహార పదార్థములు

సరఫరా చేయుచున్నారు. వైద్య సహాయములకు ఆస్పత్రి నిర్వహించు చున్నారు. రాజమండ్రిలో దానవాయి పేటలో రు 50,000/ లు కిమ్మత్తుగల గృహము సంపాదించి కోయల బాలబాలికలకు విద్యాభ్యాసము చేయించు చున్నారు. అడవులుపాడి యీఆటవిక కలప అమ్మకముజేసి, యీ వ్యాపారముమీద వచ్చెడి లాభముగా కోయజాతి పురోభివృద్ధికి కృషి సలుపుచున్నారు. వీరి సంకల్పము డెల్టా గ్రామాదులలో వుత్పత్తి అయ్యే బియ్యము తదితర ఆహార పదార్థములను, బట్టలు, కోయలకు సరఫరా చేసి వారు అడవులలో పండించు, చింతపండు, కుంకుళ్ళు, కలప, వెదురు యీ ప్రాంతములకు సరఫరా చేయుటయైయున్నది. సహకార పద్ధతులపై యీ వ్యాపారము సాగవలెనని వీరి సంకల్పము. మన్యపు ప్రాంతములలో కూడ వీరు ఆటవికులకు సహకార సంఘముల స్థాపించు చున్నారు. రూరల్ బ్యాంకు పరపతేతర వ్యాపారము వృద్ధిపరచుటకు, అటవీ సంపదను యీ ప్రాంతములో తీసుకొని సభ్యులకు చవుక ధరలకు గృహనిర్మాణముకు కలప, అరటి, చెరకు తోటలకు, వెదురు, నిత్యకృత్యము యిండ్లలో వాడకముకు, చింత

పండు, తేనె, కుంకుళ్ళు, వంటచెరకు, మొదలగు సరకులు నిల్వచేసి, అమ్మకము చేయుట ముఖ్యోద్దేశమై యున్నది. ఈ వ్యాపారము అత్యధికముగా కొనసాగుటకు కంట్రోళ్ళు పోవలయును. ఇచ్చటి ధాన్యము, బియ్యము అక్కడకు సరఫరా అయినగాని అక్కడి సరకులు యిచ్చటకు తెచ్చుకొనుటకు అవకాశములేదు. డబ్బు వ్యాపారమే కాకుండగా (Barter) పద్ధతి అనగా సరకులు ఇచ్చి పుచ్చుకొను వ్యాపారము యీ ఆటవికులతో సంబంధము పెట్టుకొనిన యీ బ్యాంకు పరపతేతర వ్యాపారమభివృద్ధి నొందుట కెంతేని అవకాశ మున్నది. దేశకాల పరిస్థితులు ముందెట్లు మారనున్నవో తెలుసుకొనుట దుర్లభము. మంచి వాతావరణములలో బ్యాంకు పరపతేతర వ్యాపారము కలప, వంటచెరకు డిపోలద్వారా, విశేషము కాగలదు.

శ్రీ పేరంటపల్లి స్వామీజీవారు ఆలమూరులో కలప, వంటచెరకు డిపోను వృద్ధి పొందుటకు సంఘ బహుళ వ్యాపారము వృద్ధి పరచుటకు, తోడ్పడుటకు అంగీకరించిరి. కాలమాన పరిస్థితులు బాగున్నచో గృహ నిర్మాణ వసతి ప్రయత్నము విరివిగా యేర్పాటు చేయబడును.

## సమిష్టి వ్యవసాయము

రూరల్ బ్యాంకు ప్రారంభము అనగా 1938 సం॥రం నుంచి సమిష్టి వ్యవసాయము హరిజన సభ్యుల ఆర్థికోన్నతికి కృషి సల్పుటకు ప్రయత్నములు చేయబడినవి. తూర్పుగోదావరిజిల్లా కలెక్టరుగారు ప్రత్యేకముగ ప్రభుత్వము వారిచ్చిన వుత్తర్వుపై య 96_10 ట్లు తాతపూడి గ్రామములో రు1200_/ లకు 3 సంవత్సరములు కౌలునకు యిచ్చిరి. తాతపూడి గ్రామములోనే య 163_18 సెంట్లు, 1939_40 సంవత్సరములో రు 650 లకు ఏకసాలుకవులు నిచ్చిరి. 1942_43 నుంచి య 83_82 సెంట్ల 'ఏ' క్లాసు లంక రు1500/ లకు 20 ఏండ్ల షరతు మీాద, యీా గ్రామము లోనే మరియొక లంక కవులునకు యిచ్చిరి. య 92_60 సెంట్ల 'సి' క్లాసు లంక రు 4500/ లకు 3 సంవత్సరములు కౌలుకు తీసుకొనబడినది. వ్యవసాయము చేయబడినది. య 537_10 సెంట్లు ఇందుపై బ్యాంకువారు రు13,409_2_8 ప్రభుత్వము వార్కి లంక సిస్తుక్రింద చెల్లించిరి, ఈవివరములను తెలుపు స్టేటుమెంటు యీాదిగువ నీయబడినది.

## The Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru.

### LANKA CULTITATION.

| | Name of lanka | Acreage | Period for which given | Annual rental | Class of lank |
|---|---|---|---|---|---|
| | | | Faslies | | Years |
| 1. | Rellugedda Seema Chintapampu | Ac. 96-10 | 1349–51 | Rs. 1200/- | 39-40; 40-41 & 41-42 'B' Class |
| 2. | Kotha Perugu lanka | 163–18 | 1349 | 650/- | 1939-40'C' Class |
| 3. | Ravichettupamru Part of Padamati Voota lanka | 83–82 | 1352–56 | 1500/- | 1942-43to46-47 'A' Class |
| 4. | do | 83–82 | 1357–61 | 1500/- | 1947-48to51-52 'A' Class |
| 5. | 134 North East to 127 South-west 134 127 | 52–06 | 1356only | 4500/- | 1946-47'C' Class |
| 6. | do " | 40–60 Reduced to 17–61 | 1357 | 2029/9/4 | 1947-48'C' Class |
| 7. | do | 17–61 | 1358 | 2029-9-4 | 1948-49'C' Class |
| | Total | 537-19 | | 13,409-2-8 | |

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

ఈసాలునకు య 83-82 సెంట్లు లంకతప్ప మిగతా లంకల కవుళ్ళన్నియు సమాప్తి యైనవి. ప్రభుత్వము వారికి క్రొత్త లంకలు అమర్కముకు యివ్వవలసిదిగా దరఖాస్తు చేసిరి. మరి 168 యకరములు పరతు ఆఖరై నది. యీ లంక రూరల్ బ్యాంకునకు కౌలు యిప్పించ వలసినదిగా ప్రభుత్వము వార్కి దరఖాస్తు పెట్టబడినది. ఇంకను వుత్తరువులు రాలేదు.

ఈ లంక భూములు ఆలమూరు గ్రామమునకు ఒక మైలు దూరములో నదీ గర్భములో నున్నవి. ఎచేటను గోదావరి నది వరద రోజులలో పొంగి ప్రవహించి నపుడు యీ లంక లన్నియు జలమయమై మునిగి పోవును. నదిలోని వరద తగ్గిపోవుటతోనే లంకలు మరల తేలును. వరద కాలములో నది పొంగినపుడు నదీ ప్రవాహముతో ఒండ్రుమట్టి కొట్టుకొని వచ్చును. ఈ ఒండ్రు మట్టి లంకలలో వేయుట మూలమున లంకలు సారవంతములుగా నుండి మంచి పంటలు పండును. ఇందులో కొన్ని లంకలు శాశ్వత లంకలు. అనగా నదీ గర్భమున స్థిరపడి పోయినవి. వీటిని 'ఎ' క్లాసు లంకలందురు. మరి కొన్ని లంకలు పూర్తిగా స్థిరపడక

విస్తారము వరద వచ్చినపుడు కొన్ని లంకలు నదీ ప్రవా హమున కొట్టుకొని పోవును. కొన్ని అదృశ్యమై పోవును. కొంతకాలము నుంచి కొట్టుకొని పోకుండ నిల్వయున్న వాటిని 'బి' క్లాసు అందురు. కొత్తగా నదీ గర్భమున యేర్పడు లంకలు కొట్టుకొని పోవునవి 'సి' క్లాసు లంకలందురు. ఈ లంకలలో పండెడు పంటలు మంచి బలిష్టముగ నుండును. ఎరువు వేయ నక్కరలేదు. యేటేట కొట్టికొని వచ్చే ఒండ్రు మట్టే యెరువు. వీనిలో సమస్త పంటలు పండును. బుడమ చోడి, నువ్వు, మృగశిరా ప్రవేశమైన తోడనే జూన్ నెలలో జల్లెదరు. సెప్టెంబరు నాటికి నదిలో వరదలు రాకపోతే యీ పంటలు దక్కును. లేనిచో గోదా వరీ తల్లి యీ పంటలన్నిటిని కడుపున పెట్టుకుంటుంది. సెప్టెంబరు అక్టోబరు నెలలలో వరద మూలమున చక్కటి వండ్రు మట్టి గోదావరీ తల్లి వేసివెడుతుంది. గోదావరి వరదలు తీయుటతోనే రైతులు దుక్కులు దున్నుట ప్రారంభింతురు. మెరక లంకలలో చెరకు, అరటి, కొబ్బరి తోటలు కూడా వేయుదురు. సాధార ణముగా లంకలలో జొన్న, కంది, ప్రత్తి, ఆముదము, కాయ ధాన్యములు, పెసర, మినుము, బొబ్బర్లు, విస్తార

ముగ పండును. పల్లపు లంకలలో పుగాకు పండింతురు. లంకల భాగ్యమంతా యీ పుగాకులోనే వున్నది. ఒండ్రుమట్టి గోదావరి తల్లిలంకలలో వేసిపోవుటవల్ల ప్రశస్తమైన పుగాకు వుత్పత్తియగును. వేసవిలో రైతులు లంకలలో దోసకాయలు, దుంపలు, పుచ్చకాయలు, నానా విధములైన కూరగాయలు పండింతురు. కాలమానం బాగున్న లంక వ్యవసాయములో ఎంత ఆదాయమైనా రైతుతీయగలడు. అయితే లంక వ్యవసాయము జూదము వంటిది. పంట నిలువునా వుండగా ఒక్కసారిగా గోదావరీ తల్లి వుత్తుంగ తరంగాలతో పొంగి ప్రవహించి పంటంతా పొట్టను పెట్టుకుంటుంది. రైతు శ్రమంతా సముద్రము పాలగును. ఏటేట ప్రథమ పంటకు యీ లాటి గతే పడుతుంది. ఎప్పుడో వరదలు రానపుడు ప్రథమ పంట, బుడమ, చోడి, నువ్వు పుష్కలంగా దొరకును. ఇక రెండవ పంట జొన్న, కంది, అడపా తడపా వర్షము పడితే చక్కగా పండును. అధిక వర్షములు కురిసినచో యీ పంటలు నాశనమగును. పొగాకు పంటకూడ మంచుపట్టి వర్షము కురియకుండా నున్నచో వేసవికాలములో మంచి పుగాకగును. వర్షములధికముగా నున్నచో మడ్డి తేరిపోయి పాడగును. రైతులు ఈకష్ట

నిష్ఠురములకు సిద్ధపడియే లంక వ్యవసాయమునకు దిగుదురు. జూదములోవలెనే లాభము పొందుదురు. దివాలా కూడ తీయుదురు.

ఈలంకలన్ని నదీగర్భములో నుండుట మూలమున వీటి హక్కు భుక్తములు ప్రభుత్వము వారివి. ప్రభుత్వమువారు యీ లంకలను అమర్కమునకు వేలము వేయుదురు. శాశ్వతపు లంకలు 20 సంవత్సరములకు, మధ్య తరగతిని 3 లేక 5 సంవత్సరములకు, ఏటేట కొట్టుకుపోయే లంకలు ఒక సంవత్సరముకు, వేలముపాట పెట్టెదరు. ఈ వేలముపాటలో డెల్టా రైతులు ఒళ్ళు తెలియకుండా యెగబడి, వేలము పాటలో పాటలుపాడి కౌవుళ్ళకు ప్రభుత్వము వారివద్ద తీసుకొందురు. ఇట్లు పోటాపోటీ యెందుకన లంకలలో మంచి పశువేతకు గడ్డిపట్టును. ఈలంకలలో పచ్చగడ్డి మేసిన దూడలు పుష్టిగా పెరుగుటయేకాక ఆవులు, గేదెలు, మంచిపాలు యిచ్చును. మంచి ఒండ్రు మట్టిమీద పచ్చగడ్డి పశు మేతకు ప్రశస్తమైనది. మరియు యీలంకలో పుగాకు, వివిధ రకములైన పంటలు పండును. ఈ పంటకాసించియే విస్తారము పెట్టుబడిపెట్టి ధనస్థోమతుగల రైతాం

గము హెచ్చురేట్లకు లంకలుపాడి తిరిగి అమర్కంచేసి నాదారు రైతులకు హెచ్చుశిస్తు కట్టి మంచిలాభము గడింతురు.

ఇందుకొరకే గవర్నమెంటువారు యీ లంకలను యేటేటను వేలమువేసి, వేలము పాటలలో రైతులను తహసిల్‌దార్లు, రెవిన్యూ ఉద్యోగస్తులు వృసాదుచేసి పాటపెరిగేటట్లు మద్దత్తుచేసి, లంకలను అంటకట్టెదరు. ఈ పద్ధతి చాలా అక్రమమైనది. పరదేశ ప్రభుత్వము వారు హెచ్చుశిస్తు రాబట్టుటకు యీ విధానము అవలంభించిరి. వారికి రైతుల బాగోగులతో సంభంధములేదు. కష్టనష్టములుతో సంబంధములేదు. ప్రభుత్వోద్యోగులు అధికారుల ప్రాపకము మన్ననలు బడయుటకు యీ వేలముపాట ద్రవ్యమును వ్యవసాయీకులవద్ద పంట జప్తుచేసి, నానా విధము లయిన అవమానములకు లోనుచేసి, డబ్బంతయు వసూలు పరచెడివారు. ఈవిధానమే కాంగ్రెసు ప్రభుత్వము అమలులోనికి వచ్చినప్పటికి, నేటికిని సాగుచున్నది.

గోదావరీ మండలములో 20,000 వేల యకరములు లంకభూము లున్నవి. ఇందు మూలమున ప్రభుత్వ

మువార్కి 10, లేక 12 లక్షల రూపాయలు సాలీనామా ఆదాయము వచ్చును. సాధారణముగా పడుగాయి లంక లను గవర్నమెంటువారు రు5లు మొదలు రు10/లు వర కు రేటుకట్టి సెటిల్‌మెంటు కాలములో రైతులకు పట్టాలు యిచ్చివేసినారు. వీటికి సెటిల్‌మెంటు లంకలనిపేరు. గోదావరి గట్టునకు లోపలిలంకలు యీలాగున సిస్తుకట్టి సెటిల్‌మెంటు కాలములో యిచ్చివేసినదేను. నదీగర్భమున నుద్భవించిన లంకలను ప్రభుత్వము వారు శిస్తుకట్టి యీయకుండ లాభమునకు యేటేట వేలము వేయు చున్నారు. ప్రభుత్వమువారు 20,000 యకరములను అదు బాదు భూములకు కట్టిన రేటుప్రకారము పదిరూపాయల కు అమర్చించేస్తే 2 లక్షలు రూపాయీలు సిస్తు వచ్చును. అయితే ప్రభుత్వమువారే లాభముకొరకు తమభూములను యేటేట వేలములోపెట్టి (Rackrenting) హెచ్చుశిస్తును గుంజుచున్నారు. ఈనాందారులు, భూకాంమందులు, స్వల్పకాలపు కవుళ్ళకు భూములు అమర్చించేసి రైతులను అక్రిమముగా తొలగించు చున్నారని ప్రభుత్వమువారే నేరము లెంచుచున్నారు. ప్రభుత్వమువారే లంకలుప్రటేట వేలంపాటపెట్టి యీ తప్పుపనినే చేయుచున్నారు. గోదా వరి, కృష్ణా, కావేరి, నదుల గర్భములో నెన్నియో సార

వంతమైన లంకభూములు ప్రభుత్వమువారి అధీనమున నున్నవి. ఈ భూములన్నిటిని సమిష్టి వ్యవసాయము నకు ప్రభుత్వమువారు భూములులేని కూలీలచే వ్యవ సాయము చేయుటకు శాశ్వతకౌళ్ళకు నీయవలయును. ఇదివరలో పడుగ్గై లంకలకు కట్టినశిస్తు మించి కట్ట రాదు. కాంగ్రెసు ప్రభుత్వము వారిట్టి ఆదర్శకము చూపించ వలసియున్నది. ప్రభుత్వమువారు లంక భూములను యేటేట వేలము పాటకు పెట్టక సకలార్థ సహకార సంఘములకు శాశ్వత కౌళ్ళకిచ్చిన, సంఘము లీభూములను భూమిలేని వ్యవసాయ కూలీలచే సమిష్టి వ్యవసాయము చేయించ కలవు. ఈసమిష్టి వ్యవ సాయము వలన వచ్చెడి లాభమును యీ కూలీలకు సమానముగా పంచిపెట్ట బడును. ఇట్లు చేసినచో భూమిలేని వ్యవసాయ కూలీలకు తగిన వృపాది కల్పించి ఆర్థిక దుస్థితినుంచి బాపవచ్చును.

వ్యవసాయము సక్రమముగా జరిగించుటకు 3 ప్రధాన పరికరము లుండవలెను. అందు ఒకటి భూమి. రెండు పెట్టుబడికిడబ్బు. మూడు వ్యవసా యము చేయు పనివాండ్రు. భూమి ప్రభుత్వమువారు

సకలార్థ సహకార సంఘములకు యిచ్చుటకు అవకాశ మున్నది. ప్రభుత్వమువారు తలుచుకొన్నచో, స్వంత వ్యవసాయముచేయుని, భూకామందుల భూమిని, నిర్ణీతమైన సిస్తుకు, ప్రభుత్వమువారు సకలార్థ సహకార సంఘముల కిప్పించవచ్చును. వ్యవసాయ పెట్టుబడికి డబ్బుబ్యాంకు సరఫరా చేయగలదు. స్వంత డిపాజిట్లు సంపాదించలేని సహకార సంస్థలకు సెంట్రల్ బ్యాంకులు తక్కువ వడ్డీకే, వ్యవసాయ పెట్టుబడికి అప్పివ్వ వచ్చును. భూమి పెట్టుబడి వున్నచో, గ్రామాదులలో వ్యవసాయము చేసే జనాభాకు కొదువలేదు. జనసంఖ్య పెరిగిపోవుచున్నది. భూమి పెరుగుట లేదు. అధిక ఆహారోత్పత్తి వృద్ధి చేయుటకు ప్రభుత్వమువారు తగిన విధానము యేర్పాటు చేయవలెను. ఉన్నభూమిలోనే యెక్కువ పంట పండించేటట్లు సర్వ విధముల కృషి సలుప వలెను. భూమిలేని వ్యసాయ కూలీలకు సకలార్థ సహకార సంఘములద్వారా భూమి, డబ్బును, సరఫరాచేస్తే, వీరు అధికోత్సాహముతో యెక్కువ పంట పండింతురు. ఇందుమూలమున వీరలు కడుపునిండ తిండితిని కష్టపడి పనిచేసి ఎక్కువ పంట పండించి యితర వృత్తులపై ఆధారపడే జనాభానుపోషించ కలుగుదురు.

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

ఈ ఉద్దేశముతోనే ఆలమూరు సహకార సంఘములో మొదటినుంచి యీసంఘములో చేరిన హరిజనులకు సమిష్టి వ్యవసాయం వప్పగింప బడినది. తాతపూడి గ్రామములో 200 మంది హరిజన కుటుంబములలో 60 మంది హరిజన కుటుంబములకు లంక వ్యవసాయము వప్పగింప బడినది. పదిమంది కలసి ఒక కమతము కట్టుదురు. ఈ కమతమునకు ఒక పెద్ద యుండును. ఈ కమత పెద్ద చెప్పినట్లు మిగత 9 మంది కలసి వ్యవసాయము చేసుకోవలెను. కమతముకు పెట్టుబడికి డబ్బు బ్యాంకు వారిచ్చెదరు. బ్యాంకువారు పెట్టుబడి పెట్టిన లంకల వివరము లీదిగువ పట్టికలో పొందుపరుప బడినవి.

Lankas Financed by the Alamuru Co-operative Rural Bank Ltd., Alamuru. For Co-operative farming

| S. No, | Village, | Survy Number, | Extent. | Class. | Fasli, | Rental. |
|---|---|---|---|---|---|---|
| 1. | తాతపూడి. | 132 | 16'_17 | 'ఎ' క్లాసు | 1359 | రు. 2,270 |
| 2. | " | 131 | 83_82* | 'ఎ' క్లాసు | " | 1,500 |
| 3. | " | 130 | 58_47 | 'ఎ' క్లాసు | " | 900 |
| 4. | " | 128 | 59_27 | 'ఎ' క్లాసు | " | 1,200 |
| 5. | " | 129 | 96_10 " | 'బి' క్లాసు | " | 3,225 |
| 6. | " | 133 | 9_39 | 'బి' క్లాసు | " | 2,850 |
| 7. | " | 133 | 24_80 " | 'బి' క్లాసు | " | 2,550 |
| 8. | " | 125-1 బిట్ | 27_84 | 'సి' క్లాసు | " | 210 |
| 9. | " | 133 | 38_40 | 'సి' క్లాసు | " | 6,650 |
| 10. | " | 134 | 17_61 | 'సి' క్లాసు | " | 2,625 |

| S. No. | Village; | Survy Number. | Extent. | Class. | Fasli. | Rental: |
|---|---|---|---|---|---|---|
| 11. | ‖ | 125 2. బిట్ | 41_15 | 'సి' క్లాసు | 1359 | రు. 800 |
| 12. | ‖ | 125 3. బిట్ | 41_61 | 'సి' క్లాసు | ‖ | 1,200 |
| | | మొత్తం. | 659_63 | | | 25,980 |

| S. No. | Village; | Survy Number. | Extent. | Class. | Fasli. | Rental: |
|---|---|---|---|---|---|---|
| 1. | ఆలమూరు. | 497/1 | 128_61 | 'సి' క్లాసు | | |
| 2. | ‖ | 497/2 | 41_00 | 'సి' క్లాసు | | |
| 3. | ‖ | 497/1 & 496/1 | 16_80 | 'సి' క్లాసు | | |
| 4. | ‖ | 497/2 & 496/2 | 22_00 | 'సి' క్లాసు | | |
| 5. | ‖ | 428/1 | 1_54 | 'సి' క్లాసు (ఆలమూరు ఎఫ్.ఎల్. | | |
| 6. | ‖ | | 6_36 | 'సి' క్లాసు 'డిటో' (సి. ఎస్ | | |
| 7. | ‖ ఇసుక లంకలు | | 17_08 | 'సి' క్లాసు | | |

JONNADA.

4 'B' Class Lankas and
11 'C' Class Lankas 421—39 Rs, 37,519—4—0

Total Number of lankas ... 15
Harijan lankas extent 196—07 Rental 3,929/4
New lankas under formation and not
yet brought under plough Ac, 140—82

* Lease to Alamuru Co-operative Rural Bank,
" Lease to Bollanka F. L, C. S under public auction

### ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

ఈడబ్బుతో విత్తనములు, దుక్కిటెడ్లు, వ్యవసాయ పరికరములు సమిష్టిగా బ్యాంకువారు కొని కమతం యజమాని కీయబడును. కమతపు యజమాని పేటిని సంరక్షించుచు కమతపు భూమిసేద్యము చేసి తక్కిన మందితో వ్యవసాయము కలసి చేయుట వలన వచ్చిన పంటను సమిష్టి క్రియ విక్రయములు జరిపించి యిందు మూలమున వచ్చులాభము కమతపు దార్లందరకు పంచిపెట్టును. తాతపూడి గ్రామములో ప్రభుత్వము వారివద్దనుంచి తీసుకొన్న పైలంకలు కమతములకు 60 కుటుంబములకు పంచిపెట్టబడా చున్నది. ఈ రీతిగనే ఆలమూరు గ్రామములో 32 యకరముల భూమి ప్రభుత్వము వారివద్ద నుంచి కౌలుకు తీసుకొని హరిజనులు వ్యవసాయము చేయుచున్నారు. జన్నాడ గ్రామములో 227 యకరముల లంకభూమిని జన్నాడ హరిజనులు సమిష్టి వ్యవసాయము కావించు చున్నారు. మూలస్థానగ్రామంలో 182 యకరముల లంకభూమి 15 కమతములు సమిష్టి వ్యవసాయం చేయుచున్నారు. ఈ కమతముల వారందరికి ఆలమూరు బ్యాంకువారే పెట్టుబడి పెట్టుచున్నారు. హరిజనులకు లంక వ్యవసాయమునకు యివ్వబడిన, అప్పుల వివరములు యీ దిగువ స్టేటుమెంటులో పేర్కొన బడినవి.

ఆ॥కో॥ఆ॥ రూరల్ బ్యాంకువారు హరిజనులకు యిచ్చిన అప్పులు వసూళ్ళు తెలియజేయు స్టేటుమెంటు.

తాతపూడి

| సంవత్సరము | | యిచ్చినది | సంవత్సరము | వసూళ్ళు | నిల్వ |
|---|---|---|---|---|---|
| 39_40 | | 295/- | 39_40 | 295/- | ,, |
| 40_41 | | 899/- | 40_41 | 899/- | ,, |
| 42_43 | | 480/- | 43_44 | 480/- | ,, |
| | పశువులనుకొనటకు | 222/- | 43_44 | 222/- | ,, |
| | | 625/- | 44_45 | 625/- | , |
| | | 400/- | ,, | 400/- | ,, |
| 43_44 | | 751/- | ,, | 751/- | ,, |

(2)

| | | | | |
|---|---|---|---|---|
| 44_45 | పశువులకు800 | | | |
| | 900 | 45_46 | 1700 | ,, |
| | 2500 | 46_47 | 2500 | ,, |
| | 200 | ,, | 200 | ,, |
| | 720 | ,, | 720 | ,, |
| | 1050 | ,, | 1050 | ,, |
| 46_47 | ఇండ్లహా మీాపై } 5690 | 47_48 | 4193 | 1497 |
| నవాబుపేట 48-49. | 1250 | 48-49 | 471 | 779 |
| | 3672 | ,, | 147 | 3525 |
| | 1200 | ,, | 507 | 693 |
| | 2800 | ,, | — | 2800 |
| | 8922 | | 1125 | 7797 |

(3)

| | | | | |
|---|---|---|---|---|
| మూలస్థానం | | (హరిజానులకు) | | |
| 46_47 | 1950 | 46_47 | 1950 | నిల్ |
| మూలస్థానం ఆదిమాంద్రులకు | | | | |
| 49_50 | 9820 | 49_50 | 6938 | 2892 |
| జొన్నాడ | | | | |
| 40_41 | 2040 | 40_41 | 2040 | నిల్ |
| | 1320 | 41_42 | 1320 | ,, |
| | 3360 | | | |
| 41_42 Cattle | 900 | 42_43 | 900 | ,, |
| 42_43 | 2710 | ,, | 2710 | ,, |
| 43_44 Cattle | 3600 | 43_44 | 3600 | ,, |
| 44_45 | 2500 | 44_45 | 2500 | ,, |

(4)

| | | | | |
|---|---|---|---|---|
| | 12700 | ,, | 6500 | ,, |
| 46_47 | 1110 | 47_48 | 1110 | ,, |
| | 1350 | 48_49 | 727 | 523 |
| 47_48 | 3069 | 47_48 | 1218 | 1851 |
| 48_49 | 712 | 48_49 | 7 | 705 |
| 49_50 | 3693 | 49_50 | 1229 | 2464 |
| | | (ఇండ్లహామీపై) | | |
| 45_46 | 7255 | 45_46 | 7255 | — |
| 46_47 | 8265 | 47_48 | 3212 | 5053 |
| 48_49 | 2137 | 48_49 | 84 | 2053 |

ఏటేట లంకభూముల దున్నుటకు 50, 60 కాళ్ళ యెడ్ల జతలు కొనబడును. వ్యవసాయము పూర్తియైన వెంటనే తిరిగి సంతలో యెడ్లు అమ్మకము చేయబడును. సమిష్టి వ్యవసాయములోని పంటలు బ్యాంకువారు సమిష్టిగా అమ్మి లాభములు సరిగా పంచుదురు. లంకలలో వ్యవసాయము చేసే రోజులలో కమతముల వారీగా కుటుంబములు కుటుంబము 1కి మనిషి చొప్పున వచ్చి వ్యవసాయములో పాల్గొనెదరు. ఈదినములలో వీరు ఉచితముగా సేవసేయ వలసినదేను. ఎవరు యెన్ని రోజులు వచ్చి లంకలో వ్యసాయము చేసినది కుటుంబము వారీగా లెక్కవేయ బడును. సంవత్సరాంతమున పంట అమ్మకము తరువాత బ్యాంకు అప్పు, సర్కారు సిస్తుపోను లాభము కమతములోని పనివాండ్రకు సమానముగా పంచ బడును. సాలీనా యీలంక వ్యవసాయ పెట్టుబడులకు దాదాపు 50 వేల రూపాయ లుండును. ఏయే సంవత్సరములలో యీ వ్యవసాయ కూలీల పోషణార్థము బట్ట, బియ్యము, వ్యసాయ పెట్టుబడులకు యెంత డబ్బు యిచ్చి వసూలు చేయబనది, యిందుతో జతపరచిన లెక్కల వలన గ్రాహ్యము కాగలదు. మొత్తము రు2,63,000/- లు పెట్టుబడి పెట్టబడినది. రు46,000/-లు

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

ఈ సంవత్సరము బకాయి రావలసి యున్నది. ఈడబ్బు పంటలు అమ్మక మైనతరువాత వసూలగును.

ఈ లంకల వ్యవసాయము హరిజనుకు ఆర్థిక ఉపపత్తి కలుగ జేయుటయేకాక సాంఘిక ఔన్నత్యము కూడ కలుగజేసినది. 10 కాళ్ళ యెడ్లకమతము కట్టి యీకూలీలు వ్యవసాయము చేయుట మూలమున అదు బాదు స్వంత భూకామందులు కూడ వీరి సహాయమును ఆర్థించు చున్నారు. వ్యవసాయపు అదును రోజులలో దుక్కి వారల యెడ్లను తోలుకొనివెళ్ళి పని చేయించు కొని మరల వీరలకు పనికి కావలసినపుడు వారి యెడ్లను తోలుచున్నారు. ఇందు మూలమున హరిజనులకు, సవర్ణులకు అన్యోన్య మైత్రి పరస్పర సహాయము పెంపొందు చున్నది. హరిజనులు స్వంతముగా కమత ములు కట్టుట మూలమున లంకలలో ఉత్పత్తి అయ్యే కూరగాయలు, పండ్లు, ఫలములు, పంటలు తామనుభ వించుట మూలమున కడుపునిండ తిండి దొరకి ఆరో గ్యము వృద్ధి యగుచున్నది. అంతేకాక యీ హరి జనులు లంకలలో ఆవులను, గేదెలను, చక్కగా మేపుచు

న్నారు. మంచిగడ్డి లంకలలో లభించుట మూలమున పశు గణము బాగుగా వీరివద్ద వృద్ధి యగుచున్నది. రైతుల వద్ద వట్టిపోయిన ఆవులను లంకలలో మేపి ఆదాయము చేసుకొను చున్నారు. స్వంతముగా పాడి పశువులను పెంచుకొని పాడి, పంట అనుభవించు చున్నారు. ఇది వరలో యీలంకలలోనే వీరు కూలి నాలి చేసుకొని బ్రతికేవారు. పాడి, పంట, యజమానులది. పశువు లను కాచి పెంచి పోషించినా గుక్కెడి పాలు త్రాగే హక్కు వీరికుండేదికాదు. ఇప్పుడు వీరు లంకలలో స్వంత కమతములు పెట్టి బ్యాంకు పెట్టుబడితో వ్యవ సాయముచేసి సకాలములో శిస్తు కట్టుకొని పాడిపంట యథేచ్ఛగా అనుభవించు చున్నారు. ప్రభుత్వము వారు యీ లంకలు ఆలమూరు సకలార్ధ సహకార సంఘమునకు యిచ్చినందున వీరి కీసదుపాయము కలిగి నది. జన్నాడ, మూలస్థానము, నవాబుపేట, తాతపూడి, వ్యవసాయకూలీల సంఘములకు ప్రభుత్వమువారు లంకలు నేరుగా నిచ్చుచున్నారు. అయితే భూములు ప్రభుత్వము వారు యిచ్చినా యీసంఘములుకు పెట్టుబడికి డబ్బులేదు. అందుచే ఆలమూరు సహకార సంఘమువారే యీ గ్రామ ములోని వ్యవసాయ పనివాండ్ర సహకారసంఘ సభ్యులను

బ్యాంకులో సభ్యులుగా చేర్చుకొని కమతము పెట్టుబడికి డబ్బు సరఫరా చేయుచున్నారు. ఇందు మూలమున వ్యవసాయము సాగి వీరల ఆర్ధిక, నైతిక, సాంఘిక, పురోభి వృద్ధికి చాల తోడ్పడు చున్నది. 3 సంవత్సరముల క్రితము నేడు సహకార రిజిష్ట్రారుగా పనిచేయుచున్న శ్రీ.J. C. Rayan గారు హరిజనుల చేయుచున్న లంక వ్యవసాయము స్వయముగా లంకలలోకి వచ్చి చూచి ఆనందించిరి. ఈ హరిజన సభ్యులు పోషించు పశుగణము చూచి ఆశ్చర్యము నొందిరి. సహకార పాల సరఫరా సంఘమొకటి పెట్టి పాలు ప్రక్కనున్న పట్టణములకు పంప గూడదా యని వారు వారిని ప్రశ్నించగా వారలలో పెద్దలు చక్కటి సమాధాన మిచ్చిరి. "బాబూ ఇన్నాళ్ళు పెట్టుబడి దార్లు, పెత్తనదార్లు, యీపాడి నంతా అనుభవించినారు. ఈపాలను మేము అనుభ వించెదమేకాని అమ్ముకోము." అని సమాధాన మిచ్చిరి. మద్యపాన నిషేధ చట్ట మమలు లోనికివచ్చుట మూలమున ఈ ప్రాంతపు హరి జనులు అపారముగా లాభము పొందుచున్నారు. త్రాగుడు పోయినది. అందు మూలమున యాకుటుంబ ములలో ఆదాయము హెచ్చినది. లంక వ్యవసా యము మూలమున కల్లు త్రాగుడు పోయి, పాల

త్రాగుడు హెచ్చినది. ఇందుమూలమున ఆదాయాభి వృద్ధితో పాటు ఆరోగ్యము వీరలలో వృద్ధి పొందినది.

సమిష్టి వ్యసాయము మూలముననే, ఈవ్యవసాయ కూలీలబివృద్ధి చెందగలరు. వ్యష్టి వ్యవసాయము వలన ఇంత లాభము వీరలకు కలుగదు. సమిష్టి వ్యవసాయము వలన సమిష్టి బాధ్యతతో వీరలకు పెట్టుబడికి డబ్బు బ్యాంకు సరఫరా చేయుచున్నది. అందరు కలసి వ్యవ సాయము చేయుట వలన ఏకమత్తమున కాకమతము లంక మొత్తముమీద కాపలా వేసుకొని లంక వ్యవసావమునకు నష్టము రాకుండగ చేసుకొను చున్నారు. ఎవరికమతము వారు కట్టుకొని ఎవరిముంత వారు తెచ్చుకొంటే శ్రమే కాని ఫలముండదు. ప్రభుత్వమువారు వీరల నుద్ధ రించుటకు తలకొక 10 యకరములు భూమి ఇస్తే 4 సంవత్సరములలో అమ్ముకొని మరల యధాస్థితిలోనికి వత్తురు. సమిష్టిగా సంఘమునకు భూము లిచ్చిన ఈ లంకలలో భూములు పోగొట్టు కొనకుండ కమత ములు కట్టుకొని సమిష్టిగా వ్యవసాయముచేసి ఆదాయము వృద్ధి చేసుకొన గలరు. ఇది 10 సంవత్సరముల సమిష్టి వ్యవసాయానుభవము వలన బ్యాంకు ద్వారాబుజు

పైనది. ప్రభుత్వమువారు కోటిరూపాయలు హరిజనుల పురోభివృద్ధికై ఖర్చుపరచు ప్రణాళికలు వేయుచున్నారు. ఇవికాగితముమీద ఉన్నవేకాని కార్యరూపము దాల్చుట లేదు. కాంగ్రెసు ప్రభుత్వమువారు హరిజనోద్ధరణకు దానధర్మములు చేయుట వలన నిసుమంతయేని ప్రయోజనములేదు. ప్రభుత్వమువారి చేతులలోని లంకలను సహకారసంఘముల ద్వారా సమిష్టి వ్యవసాయము నకు వప్పగించిన అచిర కాలములో హరిజనోద్ధరణ చక్కగా చేయవచ్చును. అస్పృశతా నివారణ దానంతటఅదే సమసి పోవును. హరిజనులలోను సవర్ణులలోను అన్యోన్యమైత్రి పరస్పర సహాయము పెంపొందింప వచ్చును. మహాత్ముడు కలలుగనిన హరిజనోద్ధరణ నిర్మాణ కార్యక్రమము అమలులో పెట్టుటకు ఈ సకలార్థ సహకార సంస్థలు ఎంతయేని తోడ్పడగలవు.

అన్ని గ్రామాదులలో ప్రభుత్వము వారికి భూము లుండక పోవచ్చును. ప్రతిగామ్రమము లోను వ్యవసాయము చేయని భూస్వాము లుందురు. వీరు అన్య గ్రామములలో వివిధ వృత్తులలో నుండవచ్చును. వీరల భూములు సకలార్థ సహకార సంఘములకు నిర్ణీత

మైన రేట్లకు కవుళ్ళు యిచ్చిన వీటిని వ్యవసాయ కూలీలకు అమర్కాముచేసి శిస్తులు రాబట్టి భూస్వాములకు మక్తాలు సక్రమముగా యింప్పించ గలవు. (Rack renting) హెచ్చు మక్తాలు లేకుండ దీర్ఘ కాలపు కౌళ్ళకు సకలార్ధ సహాకార సంఘములు వ్యావసాయ కూలీలకు యీా భూములను అమర్కాంచేసి భూస్వాములకు మక్తాలు యిప్పించ వచ్చును. వ్యావసాయ కూలీలకు పనిపాటలు కల్పించ వచ్చును. వారి ఆర్ధిక పరిస్తితి చక్కాజేయ వచ్చును. భూస్వామికి, కవులు దారుకు, సంఘర్షణ లేకుండ సకలార్ధ సహాకార సంఘము తోడ్పడ వచ్చును. వ్యవసాయ కూలీలకు తృప్తి కలుగజేయ వచ్చును. ఇట్లు చేయుట వలన గ్రామ సీమలలో విప్లవము చెలరేగకుండ శాంతిసుఖ సంపదలు, వ్యాప్తి చేయవచ్చును. సకలార్ధ సహాకార సంఘములు యీా కృషి సలుపుటకు ప్రభుత్వమువారు భూస్వాములు, తగు చేయూత నొసగ వలసి యున్నది. భూసంస్కారణ విధానము, శాంతి వాతావరణమున సహాకార పద్ధతులపై కావింప బడిన, దేశములో విప్లవమునకు తావుండదు. అలజడి అవకాశ ముండదు. శాంతి, సుఖ సంపదలు వర్ధిల్లును.

## ఆలమూరు సకలార్ధ సహకార సంఘము.

సమిష్టి వ్యవసాయము ప్రభుత్వము వారిచ్చిన లంకల ద్వారా ఆలమూరు పరిసర ప్రాంతములలో పది సంవత్సరముల నుంచి నిర్వహించుట మూలమున హరిజనులలో నూతన చైతన్యము కలిగినది. స్వయం కృషి చేసుకొని తమ సంఘము నుద్ధరించు కొనవలె నను నాసక్తి వీరలలో బాగాకల్గినది. తమ యిండ్లను వీధులను మాలపల్లెలను పరిశుభ్రముగ నుంచుకొన ఆయత్తపడు చున్నారు. శుచి శుభ్రతల కలవడుం చున్నారు. తమ పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించు కొనుటకు శ్రద్ధ తీసుకొను చున్నారు. లేబరు పాఠ శాలలు, రిజల్టు స్కూలులు యీ పల్లెలలో వృద్ధియగు చున్నవి. ప్రాథమిక పాఠశాల లోనే గాక మాధ్యమిక, హైస్కూళ్ళలో కూడ హరిజనులు చాలమంది నేడు విద్యా బుద్ధులు కరచు చున్నారు. దురభ్యాసమును దురల్వాటులను, దూబరా ఖర్చులను మానుకొను చున్నారు. సమిష్టి వ్యవసాయము వలన లాభముతో రు 2000/ లు వెచ్చించి తాతపూడి గ్రామములోని హరిజనులు రామమందిరమును కట్టుకొనిరి. మూల స్థానము గ్రామములోని హరిజనులు రు 7000/ లు వెచ్చించి రామమందిరము ప్రతిష్టాపన చేసుకొనిరి.

అంగర గ్రామములోని మాలలు రు 5000/ లు వెచ్చించి రామాలయము కట్టుకొనిరి. జన్నాడ గ్రామములో మాదిగలు రు 4000/ లు పెట్టి కట్టుకొనుచున్నారు. ఈ మందిర నిర్మాణముల కగు ఖర్చు ఒకరిని యాచించకుండ తమ స్వకాయ కష్టముతో కట్టుకొని సమిష్టిగా వచ్చెడి లాభము లోనుంచి కలప యినుప సామాను కొనుక్కొని యీ కట్టడములను సమిష్టి ప్రయోజనముల కొరకు నిర్మాణము చేసుకొనుచున్నారు.

ఈ రామమందిరములలో ఏరు ఏకాదశికి, పౌర్ణమికి, శుక్రవారము, పండుగ దినములలో భజనలు సల్పుదురు. సాయంకాలము వ్యవసాయ పని పాటలు ముగించిన తరువాత విశ్రాంతిగ యీ మందిరములు వద్దచేరి తమ సమిష్టి వ్యవహారముల పరిష్కరించుకొందురు. పత్రికలు చదివించుకొందురు. పిల్లలకు పెద్దలకు రాత్రులు వయోజన పాఠశాలగా వుపయోగపడుచున్నది. ఈ మందిరముల వద్ద తమ కుల తగువులను పరిష్కారము చేసుకొని సంఘ కట్టుబాట్లను చేసుకొనుచున్నారు. ఈ మందరములను, సమిష్టివ్యవ

సాయమును, స్వయముగా పరిశీలించుటకు భూసంస్క-రణ, సుబ్రహ్మణ్యం కమిటీ సభ్యులు 26_10_50 తేదీన విచ్చేసి యీదిగువ అభిప్రాయమును వ్యక్త పరచిరి.

## NOTE.

The land revenue reforms committee visited the Alamuru, Jonnada, and Mulastanam lankas on the 26 th October 1950 where the field labourer's, Co-op-societies are cultivating the lands with the credit and marketing facilities provided by the Alamuru Co-operative Rural Bank Ltd. The members of the committee were much impressed by what they saw and the success of the operations is in no small measure due to the zeal and enthusiasm and organising skill of Sri N. Satyanarayana, the President of the Alamuru Co-operative Rural Bank Ltd., ably assisted by the office bearers of the bank and the office bearers of the field labourer's Co-operative societies.

(sd.) S. K. Kaiwar,
Secretary, L. R. R. Committee,
MADRAS.
31—10—1950.

## మూడవ ప్రకరణము.

వ్యవసాయ కూలీల సహకార సంఘములు నేడు విరివిగా వ్యాప్తి యగుచున్నవి. అయితే హరిజనులు యీ సంఘములకై ఆతురత పడుటకు కారణము ప్రభుత్వమువారి సంఘములకు లంక భూములను వేలము పాటలేకుండ కవుళ్లకు యిచ్చుచున్నారు కనుకనే! ఎవరూ పాడని లంకలు వీరికి హెచ్చురేట్లకు కట్టి నేడు కవుళ్లకు యీ సంఘములకు అంట కట్టుచున్నారు. ప్రభుత్వము వారికి లాభము చేయవలెనను వుద్దేశముతోనే యీ అక్రమ విధానము ప్రభుత్వోద్యోగులు జరిపించుచున్నారు. గాని హరిజనుల సాంఘిక, ఆర్థిక, నైతిక, పురోభివృద్ధి లక్ష్యములో నుంచుకొని కృషి సల్పుటలేదు. పడుగాయి లంకలు య1కి 5 మొదలు 10లోపు రూపాయీల శిస్తులో వున్నవి. ప్రభుత్వోద్యోగులు (రెవెన్యూ) యీ వ్యవసాయ కూలీలకు య1కి రు 50,100 రు500లు లంకలుకట్టికూడా యిచ్చి కఠినముగా శిస్తులు వసూలు చేయుచున్నారు. ఈ ఫీల్డులేబరు కో॥ఆ॥సంఘ యజమానులు చదువు సంధ్యలులేని హరిజనులు. ఏ ఇన్స్పెక్టరు గారినో పట్టుకొని లంకల తహసిల్దారు వారి ప్రాపకము సంపాదించుకొని సంఘములకు నేడు భూములు హెచ్చురేట్లకు కవుళ్లువ్రాసి వ్యవసాయము చేయుచున్నారు. ఎన్నితిప్పలో పడి

సంఘములకు భూమి సంపాదించుకున్నా యీ సంఘ ములకు పెట్టుబడి పెట్టుటకు డబ్బులేదు. పూర్వము క్రిష్టియన్ సెంట్రల్ బ్యాంకువారు యీ సంఘము లకు అప్పులిచ్చేవారు. ఆబ్యాంకు 10 సంవత్సరముల క్రితం ఎత్తివైచిరి. నేటి సంఘములు స్థానిక సెంట్రల్ బ్యాంకుల పరము చేసిరి. ఈ సంఘములు వసతిలేని భూమిపై స్థాపించ బడినను ఈ సంఘ సభ్యులకు స్థిరాస్థి వసతులు తక్కువ. తోటయూరు కొంపలు. ఇవి ఏటేట అగ్నిహోత్రునికి ఆహుతియగును. ఇట్టి పరి స్థితులలో సెంట్రల్ బ్యాంకువారు పెట్టుబడి యేలాగున పెడతారు? గ్రామములోనుండు పెద్దరైతులే రు 1–9–0 కో 3–2–0 కో ధర్మవడ్డీకిచ్చి పండిన పంటలో వట్టీతో కూడ సభాలు కోరుదురు. ఈ అధిక లాభాముల సరికట్టు నిమిత్తం రూరల్ బ్యాంకువారు తాతపూడి, జన్నాడ, మూలస్థానం, నవాబుపేట గ్రామ ములోని F. L. C. S. సభ్యులను, రూరల్ బ్యాంకులో సభ్యులుగా చేర్చుకొని, లంకపెట్టుబడికి అనగా విత్తనము లకు, ఎడ్లకు, మంద మహాకత్తులకు, పెట్టుబడిపెట్టి సమిష్టి వ్యవసాయం చేయించుచున్నారు. పంటను సమిష్టిగా విక్ర యముచేసి పెట్టుబడి పోను మిగిలినది ఈసభ్యులకు సమా

నముగాపంచి పెడుతున్నారు. భూమి ప్రభుత్వమువారిస్తే బ్యాంకు పెట్టుబడి పెడుతూయున్నది. కూలీలు గ్రామములో విస్తార మున్నారు. కనుక వీరు లంకలో శ్రమపడి పనిచేసుకొన్నచో తగిన లాభము కనిపించు చున్నది. ఈ రోజులలో వ్యవసాయం ఫలప్రదముగా నున్నది. ఇందుకు కారణము హెచ్చు ధరలేను. సాధారణముగా రెండు పరపతి సంఘములలో సభ్యులుగచేరి అప్పులు తీయరాదు. మదరాసు సహకార సంఘముల ఆక్టు 20 వ రూలు ప్రకారం రెండు పరపతి సంఘములలో ఒకడు సభ్యుడుగా చేరకూడదు. అయితే లంకలుకౌలుకు పుచ్చుకొనుటకు మాత్రమే ఈఫీల్డు లేబరు కో-ఆపరేటివు సొసయిటీలు నామకా మాత్రమున పని చేయుచున్నవి. అప్పులిచ్చి పుచ్చుకొను వ్యాపార మంతయు ఈసభ్యులు రూరల్ బ్యాంకులోనే వ్యవహారము నిర్వహించు చున్నారు. సెంట్రల్ బ్యాంకువారు ఈ సంఘములకు అప్పులిచ్చుటలేదు. లంకపెట్టుబడులకు, బియ్యం, బట్ట, కొనుక్కొనుటకు తదితర స్వల్ప ఉపయోగములకు రూరల్ బ్యాంకువారే ఈ సభ్యులకు అప్పులిచ్చు చున్నారు. రిజిష్ట్రారువారు ఆమోదము ఇందు విషయము ముందుగా తీసుకొనబడినది.

ఆలమూరుసకలార్థ సహకార సంఘము.

తాతపూడి గ్రామములో (F. L. C. S.) ప్రభుత్వమువారివద్ద గత సాలున లంక కౌలుకు తీసుకొన్నారు. అఖండ గాలివాన వలన పంటలు చెడిపోయినవి. ఈ సంఘ సభ్యులు సర్కారు కిస్తీ చెల్లింపలేకపోయిరి. సర్కారు వుద్యోగస్తులు లంకంతా జప్తు చేసు కుంటే కూడ లంకలో పంటయేమిా కనబడలేదు. లంకకాపు నిమిత్తము ఖర్చులు మాత్రము తడిపిమోపెడు కట్టారు. లంకశిస్తుకాపలా ఖర్చులుమొత్తం రు4000/ వరకు అయినవి. స్థానికోద్యోగులు డబ్బు రాదని శిస్తు కొట్టివేయ వలెనని శిఫార్సుచేసిరి. కలెక్టరుగారు దయ దాక్షిణ్యములు చూపి యీ బీదవాళ్ళ కొంప గోడి అమ్మితే యీ బీదవాళ్ళ కొప్పేకాని దక్కేదేమిాలేదని ప్రభుత్వము వారికి నివేదించిరి. అయితే రివిన్యూబోర్డు వారు వ్యవసాయ కూలీలసంఘము పరిమితిలేని పూచీపైన యేర్పడినది కాన సంఘసభ్యుల యావదాస్తి వేలము పెట్టమన్నారు. పరిమితిలేని పూచీ బాధ్యత సంఘము లెత్తివేసినపుడే అమలులో పెట్టెదమని ప్రభుత్వమువారు హామిా యిచ్చిరి. రెవెన్యూ బోర్డువారి చర్యబట్టి చూచిన పరిమితిలేని పూచీ బీదల గొంతుకకు వురితాడులాగున చుట్టుకొంటూ యున్నది. ఇందుకు

గత్యంతరము లేదా ? రెవెన్యూ బోర్డువారు సంఘము నెత్తివేయ కుండగనే పరిమితిలేని పూచీ వ్యక్తి సభ్యులపై ప్రయోగించుటకు అధికార మెక్కడవున్నది? పరిమితిలేని పూచీ అధికారమును ఈ నోరులేని హారిజన సంఘములపై రుద్దుట అనుచితము. ఈవిషయమై విజయరాఘవాచారి కమిటీవారు స్పష్టముగా (Unlimited liability) ఎప్పుడు అమలులో పెట్టవలెనో స్పష్టీకరించిరి. 1931 సం॥లో పాట్నా హైకోర్టు Full bench తీర్మానము ప్రకారము సంఘము అమలులో నుండగా పరిమితిలేనిపూచీ పద్ధతి సభ్యులపై అమలు జరుపకూడదని తీర్పుయిచ్చిరి. 1932 సం॥రం మద్రాసు కో॥ ఆ॥ సొ॥ ఆక్టు IV సెక్షను ప్రకారము సంఘము నెత్తి వేసినప్పుడే సభ్యులపై సమిష్టిగాను వ్యష్టిగాను పరిమితిలేనిపూచీ అమలులో పెట్టవలయును

4· "Societies, which may be registered subject to the provision of this Act, a society which has as its objects the promotion of the ecnomic interests of its members in accordance with Co-operative principles, or a society, established with the object of facilitating the operations

of such a society, may be registered under this Act with or without limited liability:

Provided that unless the provincial government by general or special order otherwise directs.—

(i) The liability of a society of which a member is a registered society shall be limited ; and

(ii) The liability of a society of which the primary object is the creation of funds to be lent to its members, and of which the majority of the members are agriculturists, and of which no member is a registered society, shall be unlimited and the members of such a society shall, on its liquidation, be jointly and severally liable for and in respect of all its obligations."

సంఘము వ్యవహరించుచుండగా పరిమితిలేని పూచి సభ్యులపై అమలు జరుపకూడదని పై శాసనరీత్యా చట్టము స్పష్టీకరించుచున్నది.

బ్యాంకు గాదులు :— సభ్యులకు కావలసిన ధాన్యము, అపరములు తదితర సరకులు నిల్వ చేయుటకు బ్యాంకు ఇదివరలో గాదులను అద్దెకు తీసుకొని తమ వర్ద్దిలో నుంచుకొని వ్యాపారము చేయుచు మరియు సభ్యులకు పంట సరకుల హామీపై అప్పులిచ్చునపుడు సభ్యుల స్వంత గాదులలో కాని బ్యాంకు వారు చూపించెడు గాదులలో గాని సరకు నిలవ చేసుకొని సరకు హామీపై సభ్యులు అప్పులు తీసుకొను చున్నారు. రయితుల ఇండ్లలో గాదులు ఉన్నను, బ్యాంకు సీలు తాళముల వేసుకొని అప్పునిచ్చుచున్నను, ఈ గాదులలో తగినంతభద్రత కనబడుట లేదు. పరాధీనముగనే యున్నది. ఈ కొరత తీర్చుటకు బ్యాంకు స్వంత గాదులు నిర్మాణము చేయుటకు బ్యాంకు పాలక మండలివారు యీ సంవత్సరం స్థిరపరచిరి. రు. 20,000 ఎస్టిమేటు తయారుచేసి రిజిష్ట్రారు వారికి పంపియుండిరి. ఈ మొత్తములో పదివేల రూపాయలు విరాళము ఇచ్చుటకు ప్రభుత్వము వారు ది 1—2—50 తేదీ గల జి. ఓ. 422 లో అంగీకరించి ఉత్తరువులు జారీచేసి యుండిరి. సదరు ఎస్టిమేటు ప్రకారం బ్యాంకు గాదులు తయారైనవి. ఎస్టిమేట్లో కొంచెము మార్పుచేయ

వలసి వచ్చినది. గాది కొట్లకు ముందు వరండా అదనముగా నిర్మాణము చేయవలసి వచ్చినది. ఇందుకుగాను రు. 26,000 లకు రివైజు ఎస్టిమేటు తయారు చేయబడి రిజిష్ట్రారు వారి ఆమోదము పొందబడినది.

ఈ గోడవున్ను నిర్మాణమునకు ప్రోత్సహించి సర్వ విధముల సహాయ పడుచున్న జాయంటు రిజిష్ట్రారు రావు సాహేబ్ శ్రీ ఎ. పళనియప్ప మొదలియార్ బి. ఎ. గారికి బ్యాంకు వారు ఎంతయు కృతఘ్నులు. వీరు ది. 26—8—49 తేదీని యీ గ్రామం విచ్చేసి బ్యాంకును సందర్శించి గాదుల కట్టుబడికి ప్రోత్సాహమొసంగి యుండిరి. అచిర కాలములోనే గోడవున్ను కట్టుబడి పూర్తి అయినది. మదరాసు ప్రభుత్వ ప్రధానా మాత్యులు శ్రీ పి. ఎస్. కుమారస్వామి రాజా గారు ది. 1–12–50 తేదీని ఈగాదులను బహిర్గతము చేసిరి.

| | | అ. | అం. | |
|---|---|---|---|---|
| గాదుల పొడవు | — | 73 | 6 | గోడలు సహా |
| వెడల్పు | — | 12 | 0 | |
| వరండా వెడల్పు | — | 11 | 0 | |

మూడవ ప్రకరణము.

6 గదులు ఒక్కొక్కగది పొ॥ 10_0 ఘనపటముగులు
వెడల్పు —— 12_0 14400.
ఎత్తు —— 12_0

ఒక్కొక్క గదిలో పట్టే ధాన్యం 340 బస్తాలు.

గాదుల చుట్టు ఎలక పట్టకుండా ఉండే నిమిత్తం వెలుగుగా ఉండుటకు కాళీ సందు ఏర్పాటు చేయబడినది. గాదులపైన వరండా పైన ఏక స్లాబు వేయబడినది. గాది కొట్లవద్దకు బండ్లు వచ్చుటకు మోటారు లారీ వచ్చుటకు ఏగుమతీ దిగుమతులకు సౌకర్యము ఏర్పాటు చేయబడినది. వరాండాలో దంపుళ్ళు పెట్టించి దంపుడుబియ్యం తయారు చేయుటకు సంకల్పింప బడినది. ఇది వరలో బ్యాంకు ప్రారంభములో దంపుడు బియ్యం దంపించి అమ్మకం చేసెడివారు. కంట్రోళ్ళువచ్చిన తర్వాత ఇట్టి అవకాశము లేకపోయినది. ఇంకముందు మర బియ్యం తినుట మాన్పించిన సభ్యులకు పరిశుభ్రమైన దంపుడు బియ్యంవ్యాప్తి చేయుటకు ఈ గాదులవల్ల దంపుడు బియ్యం పరిశ్రమ ఏర్పాటు చేయబడుచున్నది. ఇందు మూలముగా దంపులు దంపే పాటకపు స్త్రీలకు వృత్తి కల్పించుట యే కాక ఆరో

గ్యాభివృద్ధికి దంపుడు బియ్యం వ్యాప్తి చేయుటకు అవకాశము కలుగును. డాక్టరు అక్రాయిడుగారు ఆహారశాఖా పరిశోధకుడు ఇక్కడ ప్రజలు తినే ఆహార పదార్థములను పలుగురు పరిశోధకులచేత పరిశోధన చేయించిరి. వారిపరిశోధనా ఫలితములను కిర పత్రము ప్రకటించిరి. మిల్లు బియ్యం తినే వారి కంటె దంపుడు బియ్యం తినే వారియొక్కయు ( boiled rice) ఎవరి ఇంటిలో వారు ఉప్పుడుబియ్యం తయారు చేసుకుని తినేవారి యొక్కయు ఆరోగ్యము శ్రేష్టముగా ఉన్నది. తమ పరిశోధనా పత్రికటిపలో వ్రాసియుండిరి. ఆరోగ్యాభివృద్ధికి దంపుడు బియ్యం పరిశ్రమ వృద్ధి పొందించుట బ్యాంకు వారి ఆశయమై యున్నది.

గ్రామాభివృద్ధి ప్రణాళిక అమలులో పెట్టుట:— బ్యాంకు ఉద్దేశములలో పఠనమందిరను, గ్రంథాలయము తెరచుట, వయోజన విద్యాభి వృద్ధికి రాత్రిపాఠశాలలు నిర్వహించుట, మాజికులాంతరు ప్రదర్శనములు చేయుట, రేడియో ఏర్పాటు చేయుట, ముఖ్యములై యున్నవి. పై ఆశయములను నెరవేర్చుటకు బ్యాంకు భవనములో పుస్తక భాండాగారము పఠన మందిరము

ఏర్పాటు చేయబడినది. బ్యాంకు సాముదాయ నిధిలో నుంచి ఈదిగువ పత్రికలు పఠన మందిరమునకు తెప్పించబడుచున్నది.

1 హిందూ పత్రిక
2 ఇండియన్ రిపబ్లిక్
3 ఆంధ్ర పత్రిక
4 క్రిష్ణా పత్రిక
5 ఇండియన్ కోఆపరేటివ్ రివియ్యూ
6 మద్రాస్ జరనల్ ఆఫ్ కో ఆపరేషన్
7 సహకారము
8 ఇండియన్ జరనల్ ఆఫ్ ఎగ్రికల్చర ఎకనామిక్
9 రూరల్ ఇండియా
10 ఇండియన్ జరనల్ ఆప్ సోషల్ వర్కు
11 ఇండియన్ ఫారమింగు
12 ఆంధ్రప్రభ
13 విజయ ప్రభ
14 పాడి పంటలు
15 త్రివేణి
16 కళ్యాణ కల్పతరువు

ఈ పఠన మందిరము ఎల్లరకు ఉచితము

పుస్తక భాండాగారము బ్యాంకువారు నిర్వహించుచున్నారు. ఇదివరలో బ్యాంకు సాముదాయ ప్రయోజన నిధిలోనుంచి రు 1000 లు ఆలమూరు కో-ఆపరేటివు యూనియన్ వారిచే నెలకొల్పబడి, ఆలమూరు భూమి తనఖా బ్యాంకువారి అధ్వర్యమున నిర్వహింపబడుచున్న పుస్తక భాండాగారమునకు దపదభాలుగా విరాళ మీయబడినది. ఆలమూరు భూమి తనఖా బ్యాంకువారు యీ భాండాగార నిర్వహణము రూరల్ బ్యాంకుకు వప్పగించుటకు అంగీకరించిరి. నేడీ భాండాగారము రూరల్ బ్యాంకు భవనములో నిర్వహింప బడుచున్నది. ఈ భాండాగారములో అర్థశాస్త్రము, వ్యవసాయ శాస్త్రము, సహకారోద్యమము, బ్యాంకింగ్, బుక్ కీపింగ్, కరెన్సి, మొదలగు వివిధశాస్త్ర గ్రంథములు ప్రభుత్వ నివేదికలు సుమారు 1250 గ్రంథము లున్నవి. వీటి విలువ పదివేల రూపాయలుండును. ఈ గ్రంథములు సహకార విద్యార్థులు, అర్థశాస్త్ర పరిశోధన విద్యార్థులు, వివిధ ప్రాంతముల నుంచి వచ్చి ఉపయోగించు కొనుచున్నారు. తెలుగు గ్రంథములు, పురాణములు, నాటకములు, నవలలు, ప్రభంధములు, విమర్శనా గ్రంథములు, భాండాగారము

నకు చేర్చబడినవి. వయోజన విద్యకు రాత్రి పాఠశాల నిర్వహింప బడుచున్నది. రు 500_0_0 లు కిమ్మత్తు గల ఫిలిప్సు రేడియో శెట్టు బ్యాంకు భవనములో ప్రతిష్టాపన చేయబడినది. ఇవి అనుదినము సాయంకాలము 6 గంటలు మొదలు 8 గంటల వరకు తెరువడడును. మాజికులాంతరు ప్రదర్శనములు హరిజన వాడలలో బ్యాంకు ప్రచారకుల ద్వారా ప్రదర్శింప బడుచున్నది. త్రాగుడు మాన్పుట సహకార స్టోరు మోమెంటు, మొదలగు విషయములు స్లయిడ్సు ద్వారా పాటకపు జనమునకు చూపించి ప్రబోధము కావింప బడుచున్నది. ఆలమూరు గ్రామ సహకార సంఘముల, ఆలమూరు గ్రామ పంచాయితీల, పనులు మదరాసు రాష్ట్రీయ యూనియన్ వారు స్లయిడ్సు తయారు చేయించిరి. అవి ప్రచారమునకు తేబడుచున్నవి.

గ్రామోద్ధరణ ప్రణాళిక అమలులో పెట్టుటకు సాముదాయ ప్రయోజన నిధియే గాక గ్రామస్తుల వద్ద నుంచి విరాళములు కూడా వసూలు చేయబడుచున్నది. రు. 7000 లు సాముదాయ ప్రయోజన నిధి సమకూర్చ బడినది. రు. 3000 లు గ్రామస్తులు ఈ నిధికి విరా

శేము నొసగిరి. ఏటేటను ఈ నిధి నుండి విద్యార్థులకు వేతనము లీయబడుచున్నవి. ఆలమూరు మాధ్యమిక పాఠశాల హైస్కూలుగా మార్చుటకు వేయి రూపాయలు భవన నిధికి విరాళమీయబడినది. రెండు వేల రూపాయలు ఆలమూరులోని చెరువుగట్ల మరమ్మతు, గట్లు పెంపు చేయుటకు వినియోగింప బడెను. జన్నాడ (cattle breeding society) వారికి ఆంబోతును కొనుటకు రు. 500 లు విరాళమీయబడినది.

బ్యాంకు తరఫున బీద జనులకు వైద్యసహాయం నిమిత్తం ఉచిత హోమియో వైద్యాలయము నిర్వహింప బడుచున్నది. ఇది పాటకపు జనమునకు అత్యంత ఉపయోగకారిగా నున్నది. ఈ ఉచిత వైద్య సేవ రోగులకు మందు ఇచ్చుట బ్యాంకు కార్యదర్శి గారగు శ్రీ వి. యస్. రావు గారిచే నిర్వహింపబడు చున్నది. వీరు హోమియో వైద్య శాస్త్రమునందు ప్రవీణులు. పట్టభద్రులు. హోమియోలో. ఎమ్. డి. ఎమ్. ఎస్. పరీక్షయందు ఉత్తీర్ణులు. అనుదినము సగటున 50 మంది వైద్య సహాయము పొందుచున్నారు. హోమియో వైద్య ప్రచారమునకు తగు విజ్ఞానము సంపాదించుటకు

రు. 1000 లు విలువ గల హోమియో గ్రంథములు సాముదాయ ప్రయోజన నిధి నుంచి కొని పుస్తక భాండాగారమునకు చేర్చబడెను.

ఈ బ్యాంకు పని ప్రారంభించి ది.1—2—1951 నాటికి ఒక పుష్కరము దాటుచున్నది. బాలారిష్ట రోగములు లేకుండగా బాల్యదశ గండములు దప్పి ఇంతవరకు బ్యాంకు దినదినాభి వృద్ధి కాంచి అభ్యున్నతి చెందుచున్నది. బాల్యదశ దాటి శైశవ ప్రాయము వచ్చుచున్నది. కాంగ్రెస్సు ప్రథమ మంత్రివర్గ హయాములో శ్రీ వి. వి. గిరిగారు ఈ రూరల్ బ్యాంకు స్థాపనకు ప్రత్యేక అనుమతినిచ్చిరి. రాష్ట్రీయ రిజిష్ట్రారగు శ్రీ టి. ఆస్టిన్ దొరగారు రిజిష్టరు చేయుటకు ఆమోదించిరి. శ్రీ ప్రకాశం పంతులు గారు మాజీ రివిన్యూ మంత్రిగా నుండు కాలములో గారు ఈ బ్యాంకునకు ప్రారంభోత్సవము జరిపిరి. శ్రీ గోటేటి జోగిరాజు పంతులు గారు శ్రీ శివరావు గ్రామోద్ధరణ నిధిని రు. 10,000 లు ప్రథమ డిపాజిట్టుగా ఇచ్చి ఈ బ్యాంకును ప్రోత్సహించిరి. రామచంద్రపురం సెంట్రల్ బ్యాంకు అధ్యక్షులగు శ్రీ బిక్కిని

ఆలమూరు సకలార్థ సహకార సంఘము.

వెంకట రత్నం చౌదరి గారు బ్యాంకు ప్రారంభము నుంచి నేటివరకు అడిగినదే తడవుగా క్యాషు క్రెడిటున్న బ్యాంకు పత్రముల హామీపై అప్పులను మంజూరు చేసి ఈ సంఘముపట్ల తమ ఆదరాభిమానములను వ్యక్త పరచు చున్నారు. డిపార్టుమెంటు ఉద్యోగులు సర్వ విధముల చేయూత నొసగు చున్నారు. ముఖ్యముగా రాష్ట్రీయ రిజిష్ట్రారగు శ్రీ .జె సి. రయన్ గారికి ఈ బ్యాంకు వారెంతయు ఋణస్తులు, కృతఘ్నులు. రెండు సంవత్సరముల క్రితం వీరు బ్యాంకు ఏరియాలోని హరిజన వాడలలో తిరిగి లంకలలో చేయు సమిష్టి వ్యవసాయమును స్వయముగా సందర్శించి తమ అభి మానమును వ్యక్త పరచిరి. శ్రీ రయన్ గారికి సకలార్థ సహకార సంఘముల విషయమై పూర్ణాభిమానము కలదు. అయితే వీరికి ఈ సంఘములు పరిమితి లేని పూచీ పద్ధతిని ఉండవలెనని సంఘ విస్తీర్ణ ప్రదేశము ఒక్క గ్రామమే ఉండవలెనని దృఢ విశ్వాశము కల వారు. ఈ పద్ధతినే వీరు రాష్ట్రమంతట వ్యాప్తి చేయు చున్నారు. ప్రభుత్వము వారుకూడ వీరి అభి ప్రాయ ప్రకారమే దోహద మొసగుచున్నారు. ఆలమూరు రూరల్ బ్యాంకు నిర్మాణము వీరి అభిప్రా

యములకు వ్యతిరేకము. ఒకగ్రామమునకే యీ బ్యాంకు వర్తించక 12 గ్రామ సమూహములకు వర్తించుచున్నది. పరిమితిలేని పూచీ పద్ధతిని గాక పరిమితిగల పూచీ పద్ధతిపైన నిర్వహింప బడుచున్నది. ఈ విషయముల అభిప్రాయ భేదమెట్లున్నను కేవలము ఆదర్శకముగా ఈ రూరల్ బ్యాంకు పని చేయుచున్నందున (Experimental) గా దృష్టాంతర రీత్యా ఈ సంస్థ వర్ధిల్ల చేయుటకు సానుభూతితో సర్వ విధముల తోడ్పడు చున్నారు. తమ అభిప్రాయమునకు వ్యతిరేకమని ఆటంకములు అవరోధములు కల్పించుట లేదు. సమయము వచ్చినపుడెల్ల చేయూత నొసగి తోడ్పడు చున్నారు. ఆలమూరు ఉత్పత్తి కొనుగోలు సహకార సంఘము మార్కెటింగు సొసయిటీగా మార్చివేయ వలసినదిగా ప్రభుత్వపు ఉత్తరువులు జారీ అయినవి. ఆలమూరు ఉత్పత్తి కొనుగోలుసంఘమువారు గ్రామములో మరియొక సహకార మార్కెటింగు సంఘము ఉండుటచేత ఆలమూరు కో-ఆపరేటివు రూరల్ బ్యాంకుతో కలిపి వేయుటకు ఏకగ్రీవముగా తీర్మానించిరి. ఇందుకు ఆలమూరు రూరల్ బ్యాంకు వారు కూడా అనుమతించిరి. అయితే రెంటికిని విస్తీర్ణ ప్రదేశములు వేరు.

రిజిష్ట్రారుగారి ఆమోదము లేనిదే మదరాసు కో-ఆపరే టివ్ ఆక్టు 13 వ సెక్షన్ ప్రకారం రెండు సంఘములు కలిపి వేయుటకు వీలులేదు. 13 వ సెక్షన్ ప్రకారం 2 సంఘములను కలిపి వేయుటలో ఎన్నియో తికమక లున్నవి. ఈ అవాంతరములన్నియు గడుచుటకు అధ మము 6 మాసములకాలము గడువు కావలసియున్నది. ఆక్టు 13 వ సెక్షన్ ప్రయోగించి 2 సంఘములు కలిపి వేయడం తాము డిపార్టుమెంటులో పని చేస్నినాటి నుంచి ఎక్కడో చాల సకృతుగా అమలులో పెట్ట బడినదేగాని ఈ సెక్షన్ ప్రయోగము ఇంతవరకు యథే చ్ఛగా జరుపబడలేదని తమ సందేహమును వెలిబుచ్చి 2 సంఘములను కల్పుటకు శ్రీ రయన్‌గారు ప్రతి ఘటించిరి. అయితే యిదివరకే 1941 సం॥రములో ఆలమూరు సహకార సంఘము రూరల్ బ్యాంకు ఈ 13 వ సెక్షనునే అమలులో పెట్టి రెండు సంఘములు ఏకము చేయబడినదని పాత దృష్టాంతరము చూపింప బడినది. వెంటనే శ్రీ రయన్‌గారు ఉత్సాహముతో ఆలమూరు రూరల్ బ్యాంకు అభివృద్ధి ఆశించుచూ తాము ఆలమూరు ఉత్పత్తి కొనుగోలు సహకార సంఘమును రూరల్ బ్యాంకును కలిపి వేయుటకు



మదరాసు రాష్ట్ర సహకార సంఘముల రిజిష్ట్రారగు

J. C. రయన్ గారు.

ఆమోదించిరి. 13 వ సెక్షన్‌లో చేయవలస్ని కర్మకాండ అంతయు నిర్విఘ్నముగా తంతు జరిగిపోయినది. ది 11_6_50 తేదీని ఏక సంఘముగా రిజష్టరైనది. ఇందు మూలమున రూరల్ బ్యాంకునకు ఆర్థికోపపత్తి హెచ్చయినది. రు 6000లు క్షేమనిధి వృద్ధిఅయినది. రు20,000 ఇతర నిధులు చేర్చబడినవి. రు 10,000 లువిలువగల మోటారు, బ్యాంకు అధీనమైనది. శ్రీ రయన్‌గారు ఈ సంఘముల సమ్మేళనమునకు వ్యతిరేకులు అయినచో రూరల్ బ్యాంకునకు ఈనూతన ఆర్థిక ఉపపత్తి కలుగదు. ఆలమూరు గ్రామ పరపతి సంఘము, ఆలమూరు రూరల్ బ్యాంకు, వుత్పత్తికొనుగోలుదార్ల సంఘము ఈ 3 సంఘముల ధనప్రవాహము సమ్మేళితమై ఏక ప్రవాహమై ఒక్క వాహినిగా ప్రవహించుచున్నవి. గంగ, యమున సరస్వతి పావనోదకములు ప్రయాగ వద్ద కలసి ఒక్క వాహిని గాప్రవహించి పునీతము చేసినట్లుగనే యీ మూడు సంఘముల ధన ప్రవాహములు ఏకమై బహుళమై సంతత ప్రవాహముగా సాగి పోయి కర్షక కార్మికులకు, ధనవంతులకు దరిద్రులకు, అజ్ఞానులకు, విజ్ఞానులకు కూడలి స్థానమై ప్రజల ఆర్థిక, నైతిక, సాంఘిక, రాజకీయ, విద్య, పారిశ్రామిక, వ్యవసాయ పురోభివృద్ధులకు చేయూత నొసగి చిర కాలము వర్ధిల్లుగాక!



చెన్నరాష్ట్ర ప్రధానామాత్యులు గౌరవనీయులు అగు

శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారు.

## అనుబంధము

ఆలమూరు కో ఆపరేటివు రూరల్ బ్యాంకు లిమిటెడ్, వారిచే నూతనముగా నిర్మింప బడిన ధాన్యాగార గృహ ప్రవేశ మహోత్సవ సందర్భమునను, వినతి పత్రములకు జవాబుగను చెన్నరాష్ట్ర ప్రధానామాత్యులు గౌరవ నీయులు శ్రీ. పూసపాటి కుమారస్వామి రాజావారొసగిన ఉపన్యాసము. ది 1-12-1950.

సభ్యులారా!!

ఆలమూరు కో ఆపరేటివు రూరల్ బ్యాంకు వారిచే నిర్మింప బడిన నూతన ధాన్యాగారముల గృహ ప్రవేశ మొనర్చుటకు నేను ఇక్కడకు విచ్చేసిన సందర్భములో మీరు నాకొసగిన వివిధ సన్మాన వినతి పత్రములకు నా హృదయ పూర్వక వందనములు. ఆలమూరులోని వివిధ సంస్థలైన పంచాయితీ బోర్డు, కో ఆపరేటివు యూనియను, కో ఆపరేటివు మార్కెటింగు సొసైటీ, కో ఆపరేటివు రూరల్ బ్యాంకు, ఆలమూరు గ్రామ కాంగ్రెసు కమిటీలు నాకొసగిన సుహృద్భావ పూర్వకమైన సన్మానములకు నేనెంతయు గర్వించు చున్నాను.

ఆలమూరు నాకు చిరపరిచితము. ఆలమూరు ప్రఖ్యాతి లోకవిదితము. ఒకమారుమూల గ్రామమైనప్పటికీ, మానవాభ్యుదయమున కొనరించుచున్న

వివిధ సేవల ప్రసక్తిలో ఆలమూరు మన రాష్ట్రమంత టికి సుపరిచితము. సహకారోద్యమములో నేమి, పుస్తక భాండాగారోద్యములోనేమి, గ్రామాభ్యుదయ నిర్మాణోద్యమములోనేమి ఆలమూరు, ఇట్టి ఉద్యమ ములు కొనసాగించుచున్న ఇతర ప్రాంతములకంటె మిన్నయై ప్రత్యేకతను సంపాదించినది. ప్రజారోగ్యము, విద్యా వ్యాప్తి, ప్రజల సాంఘిక ఆర్థికాభివృద్ధి మొదలైన సాంఘిక సేవ కార్యక్రమములో ఆలమూరు ఒక ప్రత్యే కతను బడయ గలిగినది. సహకారోద్యమ వ్యాప్తికి ఆలమూరు చేసిన కృషి సుప్రసిద్ధము. ఆరితేరిన సహ కారోద్యమ వాసులకు, సేవాతత్పరులైన పెద్దమనుష్యు లకు నిలయమైన హేతువుచేత ఆలమూరు అన్నివిధముల అభ్యున్నతి గాంచగలిగినది. నేటి ఆలమూరు అభ్యు న్నతి అంతయు ఆ పెద్దలయొక్క అవిరామ కృషి ఫలిత మని వేరే చెప్పనక్కరలేదు. ప్రజల ఆర్థికాభ్యున్నతి కేవలము సహకారోద్యమ మార్గముననే సాధ్యమనెడి భావము ఆలమూరులో జ్యోతక మగుచున్నది.

దేశ ఆర్థిక విషయములలో సహకారోద్యమము నకు ఎంతేని ప్రాముఖ్యము గలదు. సాంఘికాభి వృద్ధితో కూడ వ్యక్తి జీవితమును పెంపొందించును. కో ఆపరేషన్ అనే పదమునకే ఆశయ, ప్రజ్ఞాసాధ నోప

కరణములయొక్క సమైక్యతతో బహు జనోపయోగము లను సాధించుటయని అర్థము. వ్యక్తుల కూటమిచేత స్థాపించబడిన సహకార సంఘము. ఆకూటమియొక్క క్షేమము కాంక్షించుటయేగాక, ఋజువర్తనము స్వయం సహాయము, ఐకమత్యము మొదలైన వ్యక్తిగత యోగ్యతలను అభివృద్ధి పరచును. అట్టి సంఘము తన మెంబర్లలో పాటుపడి పనిచేయుట, మితవ్యయము, పరస్పర సహాయము మొదలైన యోగ్యతలను అలవర్చి చక్కని వ్యాపారము సాగించగలదు. వ్యక్తులకూటమిచే స్థాపింప బడిన యీ ప్రజాసంస్థ, ప్రతిఒక్కరు అందరుకును, అందరు ప్రతిఒక్కనికి, అనగా ప్రతివ్యక్తి సంఘ క్షేమ మునకు, సంఘము ప్రతిఒకవ్యక్తి క్షేమమునకు అనే భావము వ్యక్తీకరించుచు, క్రమశః గొప్పవైన ప్రజా సంస్థలను నిర్వహించుటకు అర్హమైన యోగ్యతలను సంపాదించుచు తుదకు ప్రజాప్రభుత్వ భారమును నిర్వ హించుటకు తగిన సమర్థతను చేకూర్చును. సామ్యవాద ప్రజాస్వామ్యమే ఆశయముగాగల మన దేశమునకు స్వామ్యము, ప్రజానిర్వహణమే ఆదర్శములుగా గలిగిన సహకార సంఘములు ఆపరమార్థసిద్ధికి ఎంతేని తోడ్పడ గలవు. బహు ముఖములుగా అభివృద్ధి నొందుచున్న వ్యక్తిత్వముపోయి సమిష్టి కృషికి దారి తీయుచున్న మన ప్రస్తుత సాంఘికావస్థలో సహకార సంఘములు

చాల ప్రముఖపాత్ర నిర్వహించు చున్నవై యున్నవి. పరిమితాదాయము కలిగిన వ్యక్తులకు ఆశ్రయమిచ్చి వారిని పెట్టుబడిదారీ వర్గము పోటీనుంచి రక్షణయొసగు నవై యున్నవి. వ్యక్తిపరముగా ఒక్కరు సాధింపలేని కార్యములు సహకార మార్గముల సమిష్టి కృషివలన సాధింపనగును.

మానవ జీవితమునందును, కార్యకలాపములలోను సహకారోద్యమము దినదినాభివృద్ధి నొందుచున్నది. సహకారోద్యమము క్రిందకురాని మన అవసరములు ఊహింప శక్యముకాదు. ధనము కూడబెట్టుట, ఋణవిముక్తి, వస్తువులను కొనుట, బిడ్డలయొక్క విద్యా వివాహములకు ఏర్పాటు చేసుకొనుట, గృహనిర్మాణము, జీవితభీమా, వ్యవసాయము, తదితర పరిశ్రమలు ఇంకా ఇతరమైన ఎన్నో విషయములు ఈవరకే సహకారోద్యమము లోనికి గొనిరాబడినవి. అందుచేత సహకారోద్యమము వ్యవసాయము మొదలైన మనప్రత్యేకపరిశ్రమలలో ఈవరకే ప్రముఖపాత్ర వహించినది. ఇంకను వహింపనున్నది. సహకారోద్యమము మధ్యదళారీలను తొలగించి ఉత్పత్తిదార్లకు, పారిశ్రామికులకు, వినియోగదార్లకు, సన్నిహిత సంబంధము కల్పించి ఆదాయము చేకూర్చును.

ప్రభుత్వము సహకారోద్యమ మునకు అన్నివిధ ముల సహాయ మొనర్చుటకు సంసిద్ధము. ప్రస్తుత స్థితికి తగినట్టుగా సొసైటీల అవసరముల వెంబడి సహకారోద్యమ సంబంధమైన శాసనములు చేయుట, ఆచరణలో ఉన్న సంఘములకు తణిఖీ, సలహాల నొసంగుటకు, చక్కని మార్గముల నడిపించుటకు, నూతన సంఘములు స్థాపించుటకు, కో-ఆపరేటివు డిపార్టుమెంటును విస్తరింప జేయుట మొదలగునవి సహకారోద్యమ వ్యాప్తికి ప్రభుత్వము చూపుచున్న శ్రద్ధాశక్తులకు నిదర్శనములు. వాస్తవముగా జాతి పునర్నిర్మాణమునకు, అభివృద్ధికి, సహకారోద్యమము ఒక ముఖ్య సాధనముగ పరిగణింప బడుచున్నది. సహకారోద్యమములో పనిచేయుచున్న వారెల్లరు దేశసేవా పరాయణులని చెప్పుట ఎంత మాత్రము అతిశయోక్తి కానేరదు. వీరు దేశోన్నతిని కాంక్షించిన దేశభక్తులు దేశౌన్నత్యములో అంతర్భాగమైన గ్రామ పునర్జీవనము వీరి కృషిపై ఆధారపడి యున్నది.

శైశవ దశయందున్న మన ప్రజాస్వామ్యములో సర్వత్రా అభివృద్ధి నొందుటకు సహకార సంస్థలు చేయు కృషి అల్పమైనదిగాదు. రాజకీయ స్వాతంత్ర్యసిద్ధితో రాష్ట్రములో ఆర్థికాభివృద్ధి పెంపొందించు

బాధ్యత అందును విశేషించి గ్రామ ఆర్థికాభి వృద్ధి బాధ్యత రాష్ట్ర ప్రభుత్వమున కెంతేని గలదు. పెరుగుచున్న జనాభా యొక్క అవసరములకు సరిపడునట్లుగా ఉత్పత్తి అభివృద్ధి నొందవలెను. ఉత్పత్త్యనంతరము న్యాయమైన పంపకము జరుగ వలెను. సక్రమమైన, న్యాయ సమ్మతమైన హద్దులను అతిక్రమించి వినిమయదార్లకు బాధాకరమైన విధమున లాభములు గడింప ప్రయత్నించు వర్తక సరళి యొక్క మార్గములను అరికట్టవలెను. అట్లు కాని నాడు వ్యక్తి లాభములు మితిమీరిపోయి దేశారిష్టముగ పరిణమించును. కావున ఇట్టి ఆశయములన్నియు ఫలప్రదమగుటకు సహకారోద్యమము తప్ప వేరు మార్గము లేదు.

హెచ్చుమంది ఉత్పత్తిదార్లు అయిన మన వార్లు ఉత్పత్తిచేయు వస్తువులకు హెచ్చు ప్రతిఫలము చేకూర్చుటకు ఆలమూరు కో-ఆపరేటివ్ మార్కెట్ బ్యాంకు చాల సమర్థతతో కృషి చేయుచున్నందుకు నాకు చాల సంతోషము కలిగినది. మార్కెట్టు స్థితిగతులు తెలుసుకొని, హెచ్చు ప్రతి ఫలము పొందగలుగుటకు కావలసిన వ్యవహారికము లేకపోవుట వల్లను, వారు ఉత్పత్తిచేయు సరుకులను నిల్వచేసుకొనుటకు అవసరమైన గోదాములు లేకపోవుట వల్లను గ్రామీణులు చాల

ఇబ్బందుల పాలగు చున్నారు. కావున ఇట్టి ఇబ్బం దులు తన మెంబర్లకు తొలగించుటయే బ్యాంకు ప్రధా నోద్దేశమై యున్నది. బ్యాంకు ఇచ్చే పంట హామీ అప్పులు అంత తృప్తికరముగా లేకపోవుటకు ఉత్పత్తి దారులైన బ్యాంకు మెంబర్లు తమ సరకులను ప్రయివేటు గాదులలో నిల్వచేయుట, బ్యాంకుకు స్వంత గాదులు లేకపోవుట, అని నేనుఅభిప్రాయ పడుచున్నాను. మరియు గాదులు లేకపోవుటవల్ల మెంబర్లు తమ సరకులను తక్కువ ధరలకు అమ్మి నష్టముల పాలగుచున్నారని కూడ నేను అభిప్రాయ పడుచున్నాను. ఈ లోటును భర్తీచేసుకొనుటకే బ్యాంకు గాదులు నిర్మాణమునకు పూను కొన్నది. మరియు పంట కాలములో ధాన్యా దులుకొని నిల్వ పోసి అకాలములో అనగా పనులు లేక రాబడిలేని కాలములో పేదవారైన మెంబర్లకు సదరు సరకు పంచిపెట్టవలెనన్న బ్యాంకుకు గాదులు ఎంతేని అవసరము. నూతనముగా నిర్మింపబడిన యీ గాదులు బ్యాంకు మెంబర్లకు ఎంతేని తోడ్పడగలవని నేను ఖచ్చితముగా చెప్పగలను. ప్రభుత్వము వారిచ్చిన రు 10,000/- లు ఉచిత విరాళముతో బ్యాంకువారు గాదుల నిర్మాణమునకు పూనుకొని పూర్తిచేసిన యీ గాదులను చూచుట నాకెంతో ఆనందముకలిగినది.

సభ్యులారా!

ఈ గ్రామము యొక్క పరిశ్రమ, వ్యాపారాభివృద్ధికి తోడ్పడిన సహకార సంస్థలేకాక ఈ గ్రామము ఇంకను ప్రాముఖ్యములోనికి వచ్చుటకు మరి యొకముఖ్య విషయము కూడగలదు అది యేదనగా మీా గ్రామము వద్ద పావన గోదావరినది ఉత్తర దక్షిణ కట్టల మీాదుగా నిర్మింపబోయే రహదారీ వంతెన. ఈ రహదారీ వంతెన నిర్మాణముతో ఆలమూరు ప్రాముఖ్యము హెచ్చుటయేగాక మంచి భవిష్యత్తు నంద గలుగుటకు కూడ అవకాశము కలదు.

సభ్యులారా! మీారు నాకు చూపిన యీగౌరవమునకు మరి యొకసారి వందనము లర్పించుచున్నాను. ఇంతటితో ఆలమూరు రూరల్ బ్యాంకుచే నూతనముగా నిర్మింపబడిన గాదులకు గృహప్రవేశ మొనర్చుచున్నాను.

శ్రీ కృష్ణదే... ...లయము
స... ... ప్ర.

శ్రీ భారతీ ముద్రణాలయము, ఆలమూరు.
తూ. గో. జిల్లా.

విజయవాడ.
C/o మృత్యుంజయ ఫార్మసి
గాంధినగరం.

శ్రీ నరసింహదేవర సత్యనారాయణ గార్కి—
నమస్కార పూర్వకముగా విన్నవించునది

అభిప్రాయార్థం మీ గ్రంధాన్ని నాకు ఎందుకు పంపినారో అని మొదట ఆశ్చర్య పడ్డాను. ఎందువల్లనంటే సహకార సంఘములలో నే నెన్నడు వ్రేలు పెట్టినవాణ్ణికాను. వాటినిగూర్చినాకు బొత్తిగా తెలియదు.

గ్రంధం తీరా చదివిన పిమ్మట తెలిసింది. మీరెందుకు పంపిందీ గ్రంధం చదవటం మొదలు పెట్టితే తుది దాకా నాకు ఏదో ఆఖ్యాయిక చదువుతున్నట్లు అనిపించింది. మన దేశంలో సహకారోద్యమ బీజాలు చల్లింది మొదలు నేటివరకు ఎట్టి పరిణామాలు చెందిందీ కనులకు గట్టి నట్లు తెలిసి వచ్చింది. అంతేకాదు. ఈ యుద్యమ ప్రయోజనాలు. అందలి గుణ దోషాలు. దాని పరమార్ధము. ఇవన్నీ బోధించటంలో విద్యార్థినివలె నన్ను ఒక్కొక్క మెట్టే ఎక్కించారు. మన సంఘ నిర్మాణాన్ని ఈ ఉద్యమం ఎలా మార్చగలదో మీరు స్పష్టం చేసినారు. ఈ యుద్యమం మంచి మార్గాన నడిచి. బలపడితే మన కో-ఆపరేటివు కామన్ వెల్తుకు చక్కని పునాదు లేర్పడి సర్వజనులకు సౌఖ్యం లభించగలదని విశదం చేసినారు మీరీ గ్రంధంలో.

సహకారోద్యమ పండితులకు గాక నావంటి పామరుల కోసమే మీరు దీనిని రచించిరని చెప్పవచ్చును. చిరతరమైన మీ సహకారోద్యమానుభవం ఇలా ఫలించి. ఇంతటి ఉద్గ్రంధంగా బయల్పడి. ఆంధ్ర ప్రజలకు మహోపకారం చేసింది. మీ కృషి ఫలవంతమగుగాక!

ఉంటాను.
కాటూరి వెంకటేశ్వరరావు

# పరిచయము మొదలగు వానిలోని తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| iii | 12 | ఉత్కృష్టమును | ఉత్కృష్టమగు |
| X | 23 | దేహేంద్రియా | దేహేంద్రియ |
| | | ధన బుద్ధులైన | ధనలుబ్ధులైన |
| | 13 | గుడికట్టి | గుడికట్టు |
| XV | 4 | షుణ్ణంగా | క్షుణ్ణముగా |
| XXi | 4 | లేఖినుండు | లేఖినినుండి |
| | 5 | గంద్రము | గ్రంధము |
| | 18 | నెట్లుభి | నెట్లభి |
| XXii | 4 | సహకారాభి | సహకారభి |
| | 6 | యనభవ | యనుభవ |
| xxxiii | 19 | కారస్తులు | కాపురస్తులు |
| | 21 | నారాయణమూర్తి శాస్త్రి | నారాయణ శాస్త్రి |
| 3 | 5 | వ్వాపార | వ్యాపార |
| | 9 | వ్యాత్యాసము | వ్యత్యాసము |
| 5 | 4 | గల్గుటకు ధనికు | గల్గుటకు కారణమౌ ధనికు |
| 8 | 13 | శాంఖ | శంఖ |
| 10 | 16 | ఇగ్లాండు | ఇంగ్లాండు |
| 11 | 10 | సోనియటె | సోవియట్ |
| 12 | 2 | వ్వాప్తి | వ్యాప్తి |
| 14 | 3 | క్షేమ | క్షమ |
| 22 | 16 | యదార్ధము | యథార్థము |
| 23 | 2 | విస్థారము | విస్తారము |
| .. | .. | వ్యవ | వ్యావ |
| 27 | 1 | రీజెష్ట్రార్ల | రిజిష్ట్రార్ల |
| 37 | 15 | స్థభించి | స్తంభించి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 12 | కట్లు | కట్టు |
| 41 | 21 | గౌరువో | గౌరవో |
| 45 | 19 | కట్టు | కట్టి |
| 61 | 17 | జ్యోకం | జోక్యం |
| 62 | 2 | సుబ్రమహ్మణ్యం | సుబ్రహ్మణ్యం |
| | 8 | సంఘంలిట్లు | సంఘములిల్లు |
| | 11 | యభీష్ఠతము | యభీష్టము |
| 63 | 21 | కావలసిన | కావలసినవి |
| 64 | 5 | సమిష్ఠి | సమష్టి |
| | 14 | సాముదాయక | సాముదాయిక |
| 65 | 17 | స్తాపించక | స్థాపించక |
| 69 | 13 | ఇట్టు | ఇట్లు |
| 70 | 10 | ఎడు | ఏడు |
| 72 | 1 | బలిష్ట | బలిష్ఠ |
| | 4 | మంచ | మంచి |
| | 11 | దృడ | దృఢ |
| 73 | 3 | వృద్ధిల్ల | వర్ధిల్ల |
| 75 | 10 | రంగుల సంపుటి లోకరణ | రంగుల సంపుటీకరణ |
| 78 | 18 | అదర్శమే | ఆదర్శమే |
| 81 | 11 | సంఘములు | సంఘముల |
| | 18 | బేధము | భేదము |
| 82 | 4 | మాహాజన | మహాజన |
| | 5 | కులసభ్యుల | కులగుసభ్యుల |
| | ,, | పద బ్రిట్టు | వద బ్రిష్టు |
| | 7 | అయ్న | అయిన |
| | 17 | నధిష్టించి | నధిష్ఠించి |
| 83 | 15 | చేయుటకు | చేయుట |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 85 | 16 | వచ్చినను | వచ్చుసు |
| 85 | 15 | పెట్టు | పెట్టి |
| 89 | 20 | ఇట్లి | ఇట్టి |
| 90 | 1 | వద్దతులలో | పద్ధతులలో |
| | 11 | వక్తి | వ్యక్తి |
| 93 | 17 | యుద్వమము | యుద్యమము |
| | 19 | వురో | పురో |
| 94 | 7 | దబ్బు | దబ్బు |
| | 9 | వియంత్రి | వియంత్ర |
| 101 | 12 | విర్భంధనము | విర్యచనము |
| 102 | 5 | పథ్యము | పద్యము |
| | 9 | కటువిగా | కటువుగా |
| 103 | 2 | జంతుగాన | జంత్రిగాన |
| | 16 | స్వేచ్ఛ | స్వేచ్ఛ |
| | 17 | మేర్పడునా | మేర్పడునా |
| 104 | 7 | సంఘముమల్ల | సంఘమల్ల |
| 107 | 18 | బహు వివిధ | బహు విధ |
| 108 | 18 | భిగించును | బిగించును |
| 113 | 16 | పరిచార ప్రబోధములు | పరిచార పరిబోధములు |
| 119 | 12 | చేయ | చేయు |
| 120 | 4 | ఐచ్చిక | ఐచ్ఛిక |
| | 6 | కని | లేని |
| | 14 | యాదర్శకము | యధికారము |
| 121 | 20 | యుద్యోగుల | యుద్యోగులు |
| 123 | 3 | ఇందుతో | ఇందులో |
| 124 | 12 | యతుంటిత | యకుంఠిత |
| ,, | | పరాయణులు | పరాయణులు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 125 | 18,19,20 | ఇట్టిఫలరహిత ........చున్నది | ఇట్టి ఫలరహిత సేవ నే సహకారోద్యమము ఉద్యమ నిర్వాహకుల నుండి యపేక్షించు చున్నది. |
| 127 | 13 | తరళి | తరలి |
| 128 | 6 | ప్రళయుము | ప్రళయము |
| 129 | 6 | ఇష్థ | ఇష్ట |
| | 14 | సాంపాదించి | సంపాదించి |
| 131 | 4 | వ్వా | వ్యా |
| | 15 | యవరు | ఎవరు |
| 133 | 4 | యెట్ల | యెట్లు |
| 236 | 1 | భానోదయ | భానూదయ |
| | 6 | సూంచిప | సూచింప |
| | 14 | చీకనుటిండియే | చీకటినుండియే |
| 138 | 2 | వేరు | వీరు |
| | 12 | శాశన | శాసన |
| 140 | 16 | డబ్బిచే | డబ్బిచ్చే |
| 144 | 2 | సంఘమాదర్శకములు | సంఘాదర్శకములు |
| 148 | 10 | యొుగ | యుగ |
| 149 | 20 | వ్యవహారములను | వ్యవహారములు |
| 150 | 3 | కలుగజేయు చున్నది | కలుగజేయబడు చున్నది |
| 152 | 1 | ........దములు | మత భేదములు |
| | 10 | యాభిప్రాయముతో | యభిప్రాయముతో |
| | 20 | అద్యక్షుడు | అధ్యక్షుడు |
| 153 | 5 | యనధికార | యనధికారి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 154 | 20 | కొంచము | కొంచెము |
| 158 | 3 | మిఖకు | మిణుకు |
| | 7 | దీర్గ | దీర్ఘ |
| 160 | 10 | సందేసము | సందేశము |
| | 16 | మతు | మతి |
| 161 | 3 | ప్రకటుంచు | ప్రకటించు |
| | 7 | సామ్రాజ్య అదర్శకము | సామ్రాజ్యాదర్శకము |
| 162 | 10 | విర్వా | విర్మా |
| 173 | 12 | దగును | పగును |
| | 18 | వివిక్షిత | వివక్షిత |
| 174 | 6 | కారకక్రమము | కార్యక్రమము |
| | 14 | మాహా | మహా |
| 175 | 5 | నిర్యా | నిర్వా |
| | 13 | ఫలవ్రిధ | ఫలప్రద |
| | 18 | మద్యపొన | మద్యపాన |
| 176 | 8 | నియమమలు | నియమమరులు |
| 177 | 9 | రంగంముగా | రంగముగా |
| | 10 | బాహి | బహి |
| 182 | 10 | మహదువకాశము.... | మహదవకాశము కలదు |
| | 13 | పారిశుద్ద్యము | పారిశుద్ధ్యము |
| 185 | 5 | నిర్వహింప | నిర్వచింప |
| 187 | 2 | యాశక్తి | యాసక్తి |
| 188 | 5 | విదూషి | విదుషి |
| | 8 | నుష్టానము | నుష్ఠానము |
| 189 | 7 | సముదాయము | సముదాయములో |
| | 14 | సానల | స్థానముల |
| 192 | 9 | గురుంచి | గురించి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 195 | 18 | సంఘాలుకృషి చేసి | సంఘములు కృషిచేసిన |
| 196 | 7,8 | లేనవాళ్లు | లేనివాళ్లు |
| 199 | 9 | కోట్ల కొంది | కోట్లకొలది |
| | 13 | పోషకత్వము | పోషకము |
| | 15 | యగములో | యుగములో |
| 200 | 6 | పంచపక్ష | పంచభక్ష్య |
| | 20 | కోటీర్వరులగు | కోటీశ్వరులగు |
| 20 | 3 | మొసిగ | మొసగ |
| .. | .. | యుధ్భోధనము | యుద్బోధనము |
| 202 | 5 | గడిపిన | గడపినది |
| | 11 | మూతన నార్థిక | మూతవార్థిక |
| 203 | 5 | కాగలరు | కాగలదు |
| 207 | 4 | రామచద్రి | రామచంద్ర |
| | 14 | వ్యాప్తించ | వ్యాపించ |
| 208 | 8 | వాప్తి | వ్యాప్తి |
| 211 | 7 | సకారో | సహకారో |
| 212 | 3 | స్వాలాభ | స్వలాభ |
| | 8 | హెచ్చినది | హెచ్చినవి |
| 215 | 5 | స్థంభించి | స్తంభించి |
| 217 | 7 | పటిష్టవంతము | పటిష్ఠతమము |
| | 15 | శంఖారవము | శంఖారావము |
| 257 | 3 | చేయచున్నవి | చేయుచున్నవి |
| 265 | 11 | పటిష్ట | పటిష్ఠ |
| 267 | 9 | పిదా | |
| 293 | 14 | ధారళ | ధారాళ |
| 303 | 15 | మహూపకార | మహోపకార |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 310 | 13 | సభ్యుడు | సభ్యునివల్ల |
| 313 | 13 | తీర్చనచో | తీర్చనిచో |
| | 14 | పెల్లెటూళ్ల | పల్లెటూళ్ల |
| | 16 | తీయుటకు | తీర్చుటకు |
| | 18 | వీరు | వీరికి |
| 315 | 11 | నిర్దిష్టిమైన | నిర్దుష్టమైన |
| | 16 | సఖము | సగము |
| 319 | 10 | అదిక | అధిక |
| 320 | 12 | ఘాయిష్ట | ఘాయిష్ఠ |
| 344 | 9 | అస్థిపరు | అస్తిపరు |
| 345 | 4 | నిభందన | నిబంధన |
| 346 | 19 | ప్రిభ్వ్యము | ప్రభుత్వము |
| 353 | 14 | నిష్టపడ | నష్టపడ |
| 376 | 11 | మూడు రూపాయల | మూడు వేల రూపాయలు |
| 381 | 14 | సెంట్ర బ్యాంకు | సెంట్రల్ బ్యాంకు |
| 386 | 6 | సౌంర | సంర |
| 387 | 7 | శులభ | సులభ |
| 400 | 1 | సమిష్టి వ్యవసాయము | సమష్టి వ్యవసాయము |
| 405 | 14 | వివేషము | విశేషము |
| 426 | 4 | హరిజనుకు | హరిజనులకు |
| 430 | 16 | గ్రామమము | గ్రామము |
| 442 | 8 | కృతఘ్నులు | కృతజ్ఞులు |
| 450 | 8 | కృతఘ్నులు | కృతజ్ఞులు |